## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సరము ౬౦ ౧౯౭౩ - జూన్ : ప్రమాదీచ - జ్యేష్ఠము సంచిక ౧౩

## విషయసూచిక

1231 పోస్టు బాక్సు : 635

## మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో 6 రూపాయలు; సింహళములో 8 రూపాయలు.
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో రూ 5 లు, సింహళములో రూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో రూ 5 లు, సింహళములో రూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను 6¼% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని సాధనాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కృతజ్ఞతలతో ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల: రూ. 7-50**

# ప్రబోధరత్నాకరము

**అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు**

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

**232 పుటలు** మూడవ కూర్పు **వెల: 2-50**

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

శ్రీ రామకృష్ణ గ్రంథ

# శ్రీ శారదాదేవి చరిత్ర

శ్రీరామకృష్ణభగవానుని సతీమణియు, ఆదర్శమాతయు, యోగినియునగు

మహనీయురాలి దివ్యచరిత్ర

రచయిత:

## శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథమిది...అమృతకలశము ... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి...

—ఆంధ్రప్రభ

...నారీలోకమునకే కాక, ఆధునిక వాఙ్మయమునకు ఈ గ్రంథము అమూల్యమైన కానుక; పాఠశాలలలో, కళాశాలలలో పాఠ్యగ్రంథముగా నుండదగిన ఉత్తమ గ్రంథము.

—ఆనందవాణి

246 పుటలు (అయిదవ కూర్పు) వెల: రూ. 2-75

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుఁగున ప్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుఁగుసేత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# ఒక మనవి

పాఠక మహాశయులారా,

ఈ సంచికతో శ్రీరామకృష్ణప్రభకు 29 సంవత్సరాలు నిండుతాయి. ఇన్ని సంవత్సరాలు [illegible] ప్రభ ద్వారా ఆధ్యాత్మికవిజ్ఞానామృతమును ఆంధ్రమహాజనులకు అందజేసే పవిత్ర సేవాకార్యమును మా చేత నిర్వహింపజేస్తూ వచ్చిన సర్వేశ్వరునకు కృపాసాగరునకు జోహారు. రచయితలు చందాదారులు ప్రకటనకర్తల గ్రంథసమీక్షకుల ముద్రణ కార్యాలయాది వారల సహకారానికి మా కృతజ్ఞతాభివందనాలను అర్పిస్తున్నాం.

1973 వ సంవత్సరం జూలై నెల సంచికతో ఈ పత్రికకు ముప్పైయవ సంవత్సరం ప్రారంభమవుతుంది. ఈ ప్రచారకార్యానికి ఇతోధికాభివృద్ధి వ్యాప్తులు అనుగ్రహించవలసిందని భగవంతుని ప్రార్థిస్తున్నాం.

దేశంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు తీవ్రమైన కొరత సంభవించియున్నందువల్ల జూలై సంచికను ప్రత్యేకసంచికగా కాక మామూలుసంచికగానే వెలువరిస్తున్నాము. పరిస్థితులు మేలొందితే సంవత్సరంలోపుగా ప్రత్యేక (పెద్ద) సంచికను అందజేస్తాం. విద్యుచ్ఛక్తి సరఫరా పరిస్థితి కారణంగానే సంచిక అందడానికి ఒకటి రెండు దినాలు జాగైనా సహించవలసిందని చదువరులను ప్రార్థిస్తున్నాం.

అతిముఖ్యమైన జరూరైన ప్రార్థన:-చందాదారుల సంఖ్య హెచ్చాలి. ప్రతి చందాదారు తన చందాను సకాలంలో చెల్లించడంతోబాటు ఒకక్రొత్తచందాదారును చేర్చి, తోడ్పడాలి.

అచ్చుధరలు విపరీతంగా పెరిగిపోయినా, శ్రీరామకృష్ణప్రభ పాతచందా 6 రూపాయలే.

ఇట్లు,
చిద్ఘనానందస్వామి,
సంపాదకుడు.



త్ ఓంకారానందస్వాములవారు

(శ్రీరామకృష్ణ సర్వమత సేవాసంఘముల ఉపాధ్యక్షులు)

వీరు 8-5-1973 న కల్కత్తాయందు మహాసమాధినందిరి.




'అఖిలవిధ శరణాగతుండను, యీ క్షణంబ యతనికృప నీవు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౯ } ౧౯౭౩ - జూన్ : : ప్రమాదీచ - జ్యేష్ఠము { సంచిక ౧౨


## దైవప్రార్థనము

మత్సమః పాతకీ నాస్తి పాపఘ్నీ త్వత్సమా న హి
ఏవం జ్ఞాత్వా మహాదేవి యథా యోగ్యం తథా కురు.

ఓ మహాదేవీ, పాతకులలో నాకు సమానుడు లేడు, పాపములను రూపుమాపు వారిలో నీకు సమానులు లేరు; ఈ విషయ మెఱిగిన నీవు ఎట్లు చేయుట యుక్తమో అట్లు చేయుము.

[శ్రీ శంకరాచార్యులవారు]

త దహం త్వదృతే న నాథవాన్ మదృతే త్వం దయనీయవాన్ న చ
విధినిర్మిత మేత దన్వయం భగవన్ పాలయ, మాస్మ జీహపః.

ఓ భగవానుడా, (నావంటి దయనీయుడు నీకు దుర్లభుడు కావున) నీవు తప్ప నాకు వేఱొక ప్రభువు లేడు; నేను తప్ప (ఇంతటి) దయనీయుడు నీకు మఱొకడు లేడు. ఈ సంబంధము విధినిర్మితము. దీనిని కాపాడుకో, వదలుకోకు.

[శ్రీ యామునాచార్యులవారు]

"దేవునియందు ఎట్టి భక్తి యుండవలె ననగా,—'ఏమి! దేవుని నామమును జపించిన నాకు పాప మింకను అంటుకొని యుండగలదా? పాపము పోయిన పిదపకూడ నే నెట్లు పాపిగ ఉందును? ఎట్లు బంధమున చిక్కి యుందును?' అని చెప్పించునంత సముజ్జ్వలమైన భక్తి ఉండవలెను."

[శ్రీ రామకృష్ణుడు]

# భాగవత కథలు

శ్రీమద్భాగవతానికి ఎన్నో గొప్పలు ఉన్నాయి. వానిలో ఒక్కటి ఇది:—మహోన్నతతత్త్వజ్ఞానమును నీతిసూత్రాలను భాగవతం కలపుతుంది, చక్కని కథలద్వారా ఉదాత్తకథాపురుషుల సూక్తులద్వారా కలపుతుంది. కథ లంటే పిన్నలకూ పెద్దలకూ కూడ మోజు. కాబట్టి ఆధ్యాత్మికబోధలను కథల మూలంగా అందజేయడం శ్రేష్ఠమైన మార్గం.

ఉదాహరణమునకు రుక్మిణీకల్యాణకథాఘట్టమును చూడండి. ఆ కథాసంభవాలు మనలను చకితులనుగ చేస్తాయి. అంతే కాక అందు ఎన్నో గుణపాఠాలు శీలప్రశంసలు సత్యములు పొందుపడి ఉన్నాయి.

విదర్భదేశమును భీష్మకుడను రాజు పాలిస్తూ వచ్చాడు. అతనికి రుక్మి - రుక్మరథ - రుక్మబాహు - రుక్మకేశ - రుక్మనేత్రు లను కుమారు లైదుగురూ, రుక్మిణి యను కుమార్తె ఒకతె ఉండినారు. రుక్మిణి పుట్టి నానాశైశవక్రీడలతో వర్ధిల్లుతున్నప్పుడు, ఆ రాజమందిరం విదియచంద్రరేఖతో కూడిన పడమటిదిక్కులాగా ప్రకాశించిందిట. ఆమె లోకోత్తర సౌందర్యానికి ఎల్లప్రాయం మెఱుగు పెట్టింది. తనతండ్రిగృహమునకు వచ్చిపోవు అతిథిజనుల వలన కృష్ణుని రూపబలగుణాదులు విని ఆయనే తనకు తగిన పతి అని రుక్మిణి అనుకుంది. శ్రీకృష్ణుడున్నూ వారూ వీరూ చెప్పగా రుక్మిణి శీలం లక్షణం గుణం విని, ఆ బాలారత్నమును తన కిల్లాలుగ చేసికోవలసిం దని నిశ్చయించుకున్నాడు. బంధువు లందఱూ రుక్మిణిని కృష్ణున కివ్వా లని అనుకుంటుండగా, రుక్మి అనువాడు, కృష్ణునికి ప్రబలద్వేషి కావున, వారి అభిప్రాయాలను గీటునబుచ్చి రుక్మిణిని చేదిరాజగు శిశుపాలున కిచ్చి వివాహం • చేసేటట్లుగా నిశ్చయించుకొని ఏర్పాట్లు చేయించాడు.

రుక్మిణి తన పెద్దన్న తలంపు నెఱిగి, మనోవ్యధ చెంది, ఆప్తుడైన బ్రాహ్మణు నొకని పిలిచి "ఓ బ్రాహ్మణోత్తమా, నీవు దయచేసి శ్రీకృష్ణునొద్దకు పోయి యిక్కడి వృత్తాంతం తెలియజేయుమా. రుక్మి నిశ్చయాన్ని మార్పొందించు సామర్థ్యం మా తండ్రిగారికి లేదు. కాబట్టి ఆశ్రితసంరక్షకుడైన శ్రీకృష్ణునే ఇక్కడికి రమ్మను" అని ప్రార్థించి, కొన్ని రహస్యములను చెప్పి, పంపించింది.

బ్రాహ్మణుడు ద్వారకానగరానికి పోయి, ప్రతీహారులద్వారా తన రాకను చెప్పి పుచ్చి, శ్రీకృష్ణభవనంలో ప్రవేశించాడు. అక్కడ శ్రీకృష్ణుడు కనకాసనంమీద ఆసీనుడై ఉండినాడు. చూస్తుండంగానే బ్రాహ్మణుడు 'పెండ్లికొడుకవు కమ్ము' అని సాభిప్రాయంగా దీవించాడు. ఈ సందర్భంలో శ్రీకృష్ణుని నడవడి "అతిథిదేవో భవ" అని ఆమ్నాతమైన భారతీయాదర్శప్రవర్తనమే. బ్రహ్మణ్యదేవుడైన శ్రీహరి పీఠం దిగి, బ్రాహ్మణుని ఆసీనుని చేసి, దేవతలు తనకు చేసే రీతిలో తానతనికి పూజలు చేశాడుట. సకలపదార్థసంపన్నమైన అన్నము పెట్టించి భాసురుడైన భూసురుని రెట్టించిన ప్రియంతో నయంతో సమీపించి లోకరక్షణప్రశస్తమైన తన హస్తంతో అతనికి పాదసంవాహనం చేశాడుట

అప్పుడు ఆ బ్రాహ్మణునితో శ్రీకృష్ణుడు పల్కినపల్కులు :—"ఓ బ్రాహ్మణోత్తమా, కలదానితో సంతృప్తిచెందు మనస్సు నీది. నీ ధర్మము అతిసులభం, వృద్ధసమ్మతం. విత్తం ఏ రవంత ప్రాప్తించినా హర్షించు స్వభావం బ్రాహ్మణునిది. బ్రాహ్మణుడు తన ధర్మంలో నిశ్చలుడై ఉంటాడు. ఆ ధర్మమే అతనికి సర్వాభీష్టములను నెఱవేఱుస్తుంటుంది. సంతుష్టి లేకపోతే దేవేంద్రుడైనా నశిస్తాడు, సంతుష్టి

కలిగితే నిర్ధనుడైనా సుఖిస్తాడు. నీవంటి సర్వభూతసుహృత్తములకు, ప్రాప్తలాభముదితమానసులకు, శాంతులకు, సుజనులకు, గర్వహీనులకు నేను పాదాభివందనములు చేస్తుంటాను.'' ఇట్లా శ్రీకృష్ణుడు అతిథిపూజా, బ్రాహ్మణపూజా సముదాచారాలను తన మాటచే నడవడిచే లోకానికి కఱపాడు.

కృష్ణుడు బ్రాహ్మణునితో ఇంకనూ ఈలాగు ప్రసంగించాడు—''ఓ సుబుద్ధీ, నీవు నివసించేది ఏ దేశంలో? మీకు కుశల కలిగించేవా రెవరు? ఏ రాజు రాజ్యంలో ప్రజలు సుఖిస్తారో ఆ రాజు నాకు ప్రియుడు. సాగర దుర్గమైన యీ ద్వారకకు నీవు, పాపం, ఏలాగు వచ్చావు? నేను పరిహాసమాడుట లేదు. నీవు కోరు మేలు ఏదైనను సరే, నేను తప్పక నెఱవేఱుస్తాను.''

లీలాగృహీతశరీరుడైన ఆ పరమేశ్వరుని ఉపచారవాక్యాలకు ఆ బ్రాహ్మణు డెంతగా సంతోషించాడో వర్ణించలేం. వెంటనే అతడు రుక్మిణినిగూర్చిన సకలవివరాలను శ్రీకృష్ణునకు విన్నవించాడు.

రుక్మిణీశ్రీకృష్ణుల వివాహానికి సందేశహారిగా రుక్మిణిచే వరింపబడ్డ ఆ బ్రాహ్మణుడు ధన్యుడు. రుక్మిణి కతడు ఎంత విశ్వాసార్హుడో ఇందువల్ల తెలుస్తున్నది. శ్రీకృష్ణుడు అతనికి చేసిన పూజోపచారాలను బట్టి చూస్తే ఎటువంటి మహోదాత్తతకు బ్రాహ్మణుడు లక్ష్యమో విశదమౌతున్నది. ''హిందువుల ఆస్తిక ధర్మము శ్రీరామకృష్ణుడు'' అనే వ్యాసంలో శ్రీ వివేకానందస్వామి ఈలాగు వ్రాశారు— ''వేదమును సనాతనధర్మమును సనాతనధర్మ ప్రవక్తలైన బ్రాహ్మణులను రక్షించడానికి భగవంతుడు మరల మరల మానవరూపంలో అవతరిస్తుంటా డనే సిద్ధాంతం పురాణములు మున్నగు వానిలో సుప్రతిష్ఠితమై ఉంది.''

సనాతనధర్మం అవిచ్ఛిన్నంగా సాగడానికి ప్రవచనం చాలా అవసరం. ప్రవక్తయైన బ్రాహ్మణుడు ఉదాత్తాధ్యాత్మికజీవితం గడవాలి. అతడు సంఘానికి చేసే ఉదాత్తసేవకు అందఱు అతణ్ణి ఆదరించక తప్పదు. ఆదర్శ బ్రాహ్మణు డేమి చెయ్యాలో, అతనికి ప్రజలు ఎట్లు ఋణపడి ఉండాలో ఈ కాలపు ప్రజలు చక్కగా గ్రహించడం ఎంతైనా అవసరం. ఈ పరిస్థితిని శ్రీ వివేకానందస్వామి చిత్రించినంత చక్కగా ఎవరు చిత్రించ గలుగుతారు? ఆలకించండి ఆయన సూక్తులను—

''మన పూర్వుల ఆదర్శమానవుడు 'బ్రాహ్మణుడు.' అన్ని గ్రంథములలోను బ్రాహ్మణునాదర్శము ప్రధానముగ నున్నది. పారమార్థికసంస్కృతియు వైరాగ్యమును గల బ్రాహ్మణుడు మనకు ఆదర్శం. బ్రాహ్మణుని ఆదర్శం అంటే ఏమి? ఐహికపరత బొత్తిగా లేనట్టియు పారమార్థిక వివేకం సమృద్ధిగ గల్గినట్టియు బ్రాహ్మణత్వమే బ్రాహ్మణాదర్శం. హిందూజాతికి ఆదర్శం అదే...వారు సౌజన్యామృతసింధువులు, ఉదారులు, భగవత్పరులు, వారే మనకు ఆదర్శభూతులైన బ్రాహ్మణులు......భారతదేశంలో ఆదర్శ మానవత్వం బ్రాహ్మణత్వమే. శంకరాచార్యుల వారు ఈ విషయాన్ని అద్భుతమైన రీతిలో తమ గీతాభాష్యప్రారంభంలో పొందుపఱచి ఉన్నారు. శ్రీకృష్ణుడు గీతాచార్యుడుగ వచ్చినందులకు కారణం, బ్రాహ్మణధర్మమును నిలబెట్టుసంకల్పమేనట! అదే ఆయనకు మహాలక్ష్యం. ఈ బ్రాహ్మణుడు, ఈ భగవత్పరుడు, ఈ బ్రహ్మజ్ఞాని, ఈ ఆదర్శమానవుడు, ఈ పరిపూర్ణతాంచితమానవుడు ఉండి తీరాలి, అంతరించి పోకూడదు.''



ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# బుద్ధదేవుడు అతని సందేశము

గౌతమబుద్ధుడు ప్రబోధ మొందినవాడు. చుట్టునున్న లోకము నిద్రలో నున్నప్పుడు ఆయన మేలుకొన్నాడు. లోకము అజ్ఞాన మనెడి విస్మృతిలో నిద్రించుచుండగా, ఆయన, పరమార్థజ్ఞాన మనెడి ప్రబోధము గాంచినాడు. ఆయన శ్రమించినదియు జ్ఞానజ్యోతిని గడించి నదియు తన విముక్తికై కాదు. దుఃఖదావాగ్ని ప్రపంచమును కాల్చుచుండినది, ఆ మంటల నార్పవలె నని ఆయన కోరినాడు. ప్రబోధము గల్గిన వెంటనే బుద్ధుడు, అంతకు ముందు తనచే పెడదారిలో అడుగుపెట్టించుటకై తన మనస్సు నాకర్షింప పాటుపడుచుండిన, మారునితో ఈలా గన్నాడు :—"ఓరి దుర్మార్గుడా, నేను కలుపుచున్న విశుద్ధజీవితము సిద్ధించువఱకు, ప్రజలకందు ప్రీతి హెచ్చువఱకు, అది సర్వమాన వులలోనికిని వ్యాప్తి నొందువఱకు, దాని పరి చయము అనుష్ఠానము అందఱికిని కలుగువఱకు, నేను నిర్వాణమున ప్రవేశింపను." నిరంతర నిర్వాణానందము ననుభవింపగోరుట, అన్ని కామములను మించిన కామము. మారున కది తెలియును, తన తుదియస్త్రముగా అతడు దానిని బుద్ధునిమీద ప్రయోగించినాడు. కాని పోటెక్కిన బుద్ధదేవుని దయాప్రవాహములో ఆ అస్త్రము కొట్టుకొనిపోయినది. మారుడు పూర్తిగా నిర్జితుడైనాడు. లోకమునకు కరు ణాళుడగు సంరక్షకుడు లభించినాడు.

బుద్ధదేవుని జీవితచరిత్రను సదా రంజకముగ చేయు అంశములు పెక్కులు అందున్నవి. ఇతి హాసోచితరూపకోచితప్రగాఢత అందున్నది. సర్వజనులహితమునకై సర్వజనుల సుఖము నకై సాగి సఫలమైన పారమార్థికాన్వేషణ మనెడి నాటకము బుద్ధుని జీవితమున ఆడబడి నది. అగర్భశ్రీమంతుడు రాజకుమారుడు సుందరుడు సర్వవిద్యాకుశలుడు భువనసుందరి యగు నొక రాజపుత్రిని పెండ్లాడి నిరతిశయ భోగములను అనుభవించుచుండి, తటాలున సర్వస్వమును విడనాడి భిక్షువై పర్యటించును. జననమరణసమస్యాపరిష్కారమునకై అతిమా నుషకృషి యొనర్చును, అతనికి జ్ఞానోదయ మగును, ప్రశాంతమార్గమున అతడు ప్రచార మొనర్చును. అతనిప్రేమ విశ్వప్రేమ, అతని కరుణ విశ్వకరుణ. ధర్మప్రచారార్థము సంఘ మును సుస్థిరముగ నెలకొల్పి ఆయన తన యెనుబదియెనిమిదవయేట మహాపరినిర్వాణము నొందెను. ఈ సంభవము లన్నియు మన మన స్సులను ఆదరాద్భుతములతో నింపును. ఆయన జీవితములోను సందేశములోను మూర్తి లోను మనహృదయముల నూపివైచు అనిర్వాచ నీయోదాత్తవిశేష మున్నది, ప్రాక్ప్రతీచీ దేశ ములం దన్నిటను బుద్ధు నుపదేశములందలి జన ప్రీతి సదా క్రొత్తవడుచుండుటలో ఆశ్చర్య మేమియు లేదు.

ప్రసిద్ధములైన ఆయన పేరులే ప్రభావ ప్రఖ్యాపకము లగు సూత్రములు: అతని మొదటిపేరు 'సిద్ధార్థుడు', సర్వార్థములు సిద్ధింప గాంచినవా డని యర్థము. బోధివృక్షము క్రింద జ్ఞానోదయమైనప్పటినుండి అతనికి 'బుద్ధు' డని పే రేర్పడినది. బుద్ధు డనగా ప్రబోధ మొందిన వాడు, జ్ఞానజ్యోతి నధిగమించినవాడు. 'శాక్య సింహు' డనున దతని మఱొక పేరు. అది నిర్భ యతకు ఉదాత్తతకు సూచకము. ఆ గుణముల కలిమి పరమార్థజ్ఞానికి లక్షణము. ఆయన

తన్ను 'తథాగతుఁ' డని పేర్కొనెడివాడు. తథాగతు డనగా సకలసత్యప్రవేశసిద్ధి మహిమలు గలవాడు, తనకు ముందు వచ్చినవారును తనకు పిమ్మట రానున్నవారు నగు లోకగురుపరంపరలో నొకడనువాడు బుద్ధుడు.

అసితుడను కపిలవస్తుజ్యోతిష్కుడు సిద్ధార్థుని జాతకచక్రమును నిర్మించినవాడు. ఆయన చెప్పిన దిది:—ఇతడు నాల్గుభయానకదృశ్యములను జూచినవాడైన పక్షమున, లేదా మానవుల దుఃఖము నెన్నడైనను ఎఱిగెనా, ఇతడు సన్యాసమును పరిత్యాగమును చేసి సమానమైన మతస్థాపకుడై నగును''. ఈ భవిష్యద్వచనము మును తొలగింపవలయు నని శుద్ధోదనమహారాజు ప్రయత్నించియుండి యుండెను.

దుఃఖమనుమాటనే యెఱుగని లేని పరిసరములలో ఆ శిశువు పెరిగి తరుణుడయ్యెను. సుందరి యశోధర ప్రేమ సిద్ధార్థుని సుఖానందములకు సమగ్రత సమకూర్చెను. కాని ఆకస్మికముగ ఒకనాడు లోకములో నున్న జరావ్యాధిమృత్యువుల దృశ్యములు సిద్ధార్థుని కంటబడినవి. విశ్వవ్యాప్తమైయున్న దుఃఖమునుగూర్చిన యెఱుక ప్రగాఢముగ నెలకొని భ్రాంతిని పటాపంచలు చేసెను. తా నుండిన ఆనందారామము కృత్రిమమును బూటకమును, వెలుపలి ప్రపంచము తిరుగుల బడిపోవుచున్నది — అని రాజకుమారుడు గ్రహించెను. దుఃఖకారణమును అన్వేషించి ప్రతిక్రియను కనుగొనుటకై వెడల నెంచిన అతని సుదృఢ నిశ్చయము రాహులుని జన్మముచే సడల లేదు. అతనిని ముందుకు కేవల మన నెట్టుచున్నది దుఃఖమలగు జగజ్జనులమీది ఉత్కంఠయే కాని స్వకీయమవ్యాకులత్వమైన నేమియును కాదు. ఒకనాటి నడిరేయి సిద్ధార్థుడు ఇల్లాలిని, పుత్రుని, రాజభవనమును ప్రభుత్వమును విడనాడి బుద్ధపదవి నొందించు దారిని పట్టెను.

ఈలోకమున తప్ప మఱి వేనియందును నమ్మకములేనివారు ఆధ్యాత్మికతృష్ణగలవారిని భోగభాగ్యములకు వశపఱచి ఉంచుటకతితీవ్ర ప్రయత్నము లొనర్తురు. శుద్ధోదనునివంటివారు, సిద్ధార్థునివంటివారి దృష్టికి లోకములో కష్టములయు దుఃఖములయు జాడయైన కనబడకుండ కప్పియుంతురు. యంత్రశాస్త్రమందలి అభివృద్ధులను, వైద్యమందు క్రొంగ్రొత్తగ కనుగొన్నవానిని, ప్రజలలో నున్న యెక్కువ తక్కువలను రద్దుచేసి సర్వసమానత్వమును సాధించి నప్పటి సత్పరిస్థితులను, వారికి 'నోరూరగ నవ్వులు పుట్టు' వర్ణించి, ఈ జీవితము కేవలము సుఖమయముగ నుండు నని నిరూపింప జూతురు. చూపిన యీ యాసలకు సాధకులు కొందఱు భ్రమించుచు మోసపోవుదురు. కాని మానవ చరిత్రను సవిమర్శముగ పరిశీలించిన వారు, లొంగరు.

మానవుని విధిని నిర్ణయించు శక్తులు అతనికి లోపలను వెలుపలను గలవు. ఆ శక్తులను, ఏ యంత్రవాదశాస్త్రము కాని ప్రజాసామ్యవిధానములుగాని లొంగదీయజాలవు. ఇరువదియైదు శతాబ్దములు గడచినను, మానవులకు బుద్ధుని కాలమున నుండిన సమస్యలే ఈనాడును ఉన్నవి. నేటి ఉదారమహాశయులును బుద్ధుని వలెనే మెలగుదురు. అనాదికాలముగ సాగుచు వచ్చుచున్న పరమార్థాన్వేషణము ఇప్పుడును ఇటుతర్వాతనుకూడ సాగుచుండగలదు.

సిద్ధార్థుడు తన భోగభవనమునుండి వెడలి నప్పటినుండి, అతనిని మరల భోగములవంకకు మరలింప గోరి, మారుడు వెన్నాడుచునే యుండెను. భవనములో నున్నంతకాలము భ్రాంతికాకర్షకములు ఆయనను పరివేష్టించి యుండెను. మఱి యిప్పుడో, ఆయనమనసులో ఏవేవి ముద్రితములై యుండినవో అవి పరాక్ర

మింప యత్నించినవి. అనుభవించిన కొలదియు అనుభవతృష్ణను హెచ్చించునవి కదా భోగములు, వానిని తలంపించి సిద్ధార్థుని మగిడించుటకై మారుడు తీవ్రప్రయత్నములు పెక్కు సంవత్సరముల కాలము సాగించినాడు. కాని సిద్ధార్థుని సంకల్పము చెడ లేదు, సడల లేదు. తుదకు మారుడే తన పరాజయము నిట్లు తెలుపుకొనెను. "ఆ ధన్యాత్ముని నేను ఏడేండ్ల కాలము అడుగడుగునను వెన్నంటితిని, కాని తథాగతునిలో దోషలవమైనను నాకు పట్టు చిక్కలేదు."

గురూపదిష్టక్రమములను పాటించుటలో సిద్ధార్థు డస్ఖలితనిష్ఠ కలవాడు. తర్వాత వాని నతడు త్యజించినను అందుకు కారణము వాని అపర్యాప్తత్వమే కాని అతని శ్రద్ధాలోపము కాదు. ప్రస్తుతము 'బుద్ధగయ' అని ప్రస్తుతింప బడుచున్న ఉరువేలావనములో అతడు 'మధ్యమార్గము'ను కనుగొనెను. భోగపరత ఒక పరమావధి. దేహము నెండగొట్టుకొని చంపుకొనుట ఒక పరమావధి. ఈ విపరీతపరమావధులకు రెంటికిని నడిమిదైన మార్గమును ఆయన కనుగొనెను. బోధివృక్షముక్రింద ఆయన కడసారి కూర్చున్నప్పుడు ఆయన కావించుకొన్న దృఢనిశ్చయ మిది : "ఈ ఆసనమున నా దేహ మెండిపోనీ, చర్మము ఎముకలు కండలు విరిసిపోనీ, అమూల్యమైన ప్రబోధము నధిగమింపనిదే ఈ దేహ మిచ్చటినుండి కదలదు." ఆ నిశ్చయమును చెఱచుటకై మారుడు అతితీవ్రముగా యత్నించెను. ఆ వృత్తాంత మంతయు ఆయన జీవితచరిత్రమున ఆశ్చర్యజనకముగా వర్ణితమైయున్నది. సిద్ధార్థుని సంకల్పము సఫల మయ్యెను. ప్రబోధ ముదయించెను. ఆయన బుద్ధు డయ్యెను. ఆయన జ్ఞానదృష్టికి, మానవుల దుఃఖమును గూర్చినవియు దాని ప్రతిక్రియను గూర్చినవియు అగు చతుస్సత్యములు గోచరించినవి. అనిర్వాచనీయానంద మాయన మనస్సులో నిండిపోయెను. జ్ఞాతవ్య శేష మాయనకిక లేదు.

బుద్ధదేవుని చరిత్రమందలి ప్రకృతాధ్యాయమున పరమార్థాన్వేషకు లందఱును, తెలిసికొనవలసిన ముఖ్య పాఠ మున్నది:—పరమార్థాన్వేషకుడు సదా జాగరూకుడుగను సుదృఢసంకల్పుడుగను ఉండవలయును. ఇవే ఆయన వాక్కులు :— జాగరూకత అమృతత్వము నొందించును. అజాగరూకత మృత్యువు నొందించును. జాగరూకులకు మరణము లేదు; ప్రమత్తులు ఇప్పటికే సంప్రాప్తమరణులు.

భగవద్విషయమున బుద్ధుడు చాలవఱకు మౌనముగా నుండెను. వ్యర్థచర్చలు అక్కఱ లేదని తెలుపుటకే ఆయన మౌనమును వహించినది, కాని ఆ మౌనమునుబట్టి అతడు నాస్తికుడని కొందఱును అజ్ఞేయవాది యని కొందఱును భ్రమించిరి, మానవ సమస్యల విషయమున ఆయనదృక్పథమునకు అవలంబము అనుభవమే కాని శాస్త్రము కాదు. మాలుంక్య పుత్రునితోడి సంభాషణములో బుద్ధదేవు డొక యుపమానమూలమున తనమతమును స్పష్టపఱచెను. విషదిగ్ధమైన బాణ మొకనికి గ్రుచ్చుకొన్నది. వెంటనే చేయవలసిన దేమి? బాణము నూడబెఱికి గాయమునకు విషమునకు ప్రతిక్రియ చేయవలెను. బాణము వేసిన దెవరు, బాణము వచ్చిన దే దిక్కునుండి, వేసిన వాని జాతి యేది, దేశ మేది, అతని మేనివన్నె తెలుపా నలుపా, అతడు పొట్టివాడా పొడుగరియా, బక్కవాడా బలిసినవాడా — ఈ ప్రశ్నలు వీనికి జవాబులు కేవలము అనావశ్యకములు మానవునిగుండెలో దుఃఖ మనెడి విషదిగ్ధబాణము గ్రుచ్చుకొనియున్నది; సరియైన గురువును దరిసి విషమును బాధను తొలగించు

కొనుట అతని యేకైక కర్తవ్యము. బుద్ధదేవుడు మంచినడవడిమీద ఊనిక ఉంచి ప్రజల పారమార్థిక జీవితమును పునఃప్రాణవంతముగ నొనర్చెను.

కోసలదేశమునకు చెందిన బ్రాహ్మణులిద్దఱు బుద్ధదేవునొద్దకు వచ్చి తమ కలహమున మాధ్యస్థ్యము సలుపు మని కోరిరి. బ్రహ్మప్రాప్తికి వివిధగురువులు బోధించిన దారులలో సరియైన దారి ఏది అనుటనుగూర్చినదే వారి కలహము. 'మీలో గాని మీ గురువులలో గాని బ్రహ్మమును జూచినవా రున్నారా'' అని బుద్ధు డడిగెను. లేరు, మహాశయా, అనిరి వారు. ''బ్రహ్మమునందు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదోషములు నిండుగ నున్న వని మీ గురువులలో నెవరైన చెప్పిరా'' అని బుద్ధు డడిగెను. ''చెప్ప లేదు, మహాశయా'' అనుచే వారి జవాబు. ''ఈ హేయముల కన్నిటికిని ప్రత్యనీకము బ్రహ్మస్వరూపము. నేను చేసినట్లుగా మీరును మిమ్ము ముందుగా పవిత్రులనుగా చేసికొండి, పిమ్మట బ్రహ్మస్వరూపము నెఱుగుదురుగాని''

బుద్ధదేవు నభిప్రాయానుసారము ఉన్నతతమలక్ష్యము నిర్వాణము. నిర్వాణము తనకు గలిగినదని ఆయన చెప్పుకొన్నాడు. కాని ఆ యనుభూతిని నిర్వచించువిషయమున ఆయన మౌనము వహించినాడు. ఆ మౌనము కారణముగా కొందఱు అపార్థములు కల్పించిరి, సర్వశూన్యత్వమే నిర్వాణ మనిరి. అనేకపండితులు ఆ యపార్థములను ఖండించి, ఆ యపారముల గ్రహించునెడల బౌద్ధమతపు మొదటికే మోసమగు నని నిరూపించిరి; సర్వమునకును పర్యవసానము శూన్యత్వమే అని ఆయన బోధించి యుండినచో, ఆమతము నొక్కడైనను అనుసరించి యుండబోడు; ఆయన శూన్యత్వమునే సాక్షాత్కరించుకొని యుండనిచో ఆయనకంతటి మానవహృదయరంజకశక్తి కలిగియుండదు; రోజరుమహాశయుడు ప్రచురించిన 'బుద్ధఘోష నీతికథ' లను పుస్తకమునకు తాను వ్రాసిన పీఠికలో ప్రొఫెస్సరు మాక్సుముల్లరుగారు పొందుపఱచిన యీ వాక్యము లిట అనుసంధించుకొనదగినవి :—'మనలను సుదతు శూన్యరూపమున త్రోయు మతము, మతమే కాక పోదా? ఇహమునుండి నిత్యపదవికి అందించు వంతెన యగుటచేతనే ప్రతి మతమునకు సార్థకత. ఒక మతము మనలను ముందుకు కొని చనుచు, నిత్యపదవిగంతవ్యమును దరియుచున్నా మని సంతోషించు సమయమునకు సరిగా అగాధమైన 'అభావ' గర్తమున బడద్రోయునేని, అది 'వంతెన' కాదు, పెట్టిన అడుగును లోనికి లాగివేయు బూటకపుదారి యగును.''

ఆ యనుభూతి అనిర్వచనీయ మగుటే అందుంగూర్చి బుద్ధదేవుని మౌనమునకు కారణము. ఆత్మనిగ్రహముచేతను హృదయవిశుద్ధిచేతను ఆయన ఇంద్రియములచే అందుకొనదగిన అవధులను అతిక్రమించి ఆధ్యాత్మికసమున్నతి నధిరోహించినాడు. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' అని ఆ స్థాయి వాగతీతమును మనోతీతము నని ఆమ్నాతమై యున్నది. ఆస్థాయి నధిష్ఠించిన బ్రహ్మజ్ఞానుల కోవకు చెందినవాడే బుద్ధదేవుడు.

బుద్ధదేవుని సూక్తులు అత్యధికసంఖ్యాకములు గ్రంథస్థములై యున్నవి. అయినను గ్రంథములందు పదిలపఱుపబడక పోయిన తత్సూక్తులు లెక్కకు మిక్కిలిగ నుండి యుండు నని మనము ధారాళముగ నూహించుకొనవచ్చును. అంతే కాదు, ఆయన తన యనుభూతిసర్వస్వమును శిష్యులకు దెల్పియుండడు. 'సుత్తనికాయము'న ఈ విషయము స్పష్ట

పఱుపబడియున్నది. కౌశాంబిసమీపమున శింశుపావనమున నున్నప్పుడు ఆ చెట్టుఆకులను ఒకపిడికెడు చేత పట్టుకొని బుద్ధదేవు డీలా గన్నాడట:—నా చేతులో నున్న ఆకులు పిడికెడు. శింశుపావనమున నున్న ఆకుల మొత్తము ముందిది ఏపాటి? అట్లే సోదరులారా నేను సాక్షాత్కరించుకొని స్వానుభవముచే నెఱిగిన విషయములతో పోల్చి చూచినచో, మీకు నేను తెల్పినది లవలేశమే. ఆ సమస్తమును మీకు నే నేల చెప్పలే దనగా పరిపూర్ణతను గడించుటకు త్యాగవిశుద్ధజీవితము నలవఱచుకొనుటకు మీ కవి ఉపకరింపవు.''

బుద్ధదేవుని చరమసందేశమును మహాసమాధియు 'మహాపరినిబ్బాణసుత్త' గ్రంథమున గుండెను కరగించురీతిలో పొందుపఱుపబడియున్నది. అది సూర్యుడు జగత్తును పగలంతయు వెలుగొందించి దినాంతమున అస్తమించుటను పోలియున్నది. కాలము, కష్టములు, త్రిప్పట—వీనిచే బుద్ధదేవుని సుదృఢదేహము దెబ్బతిన్నది. దేహమును త్యజింప నిశ్చయించుకొని ఆయన తన సంకల్పమును సన్నిహితులకు తెలియజేసెను. శిష్యులు విషాదము నొందిరి వారిలో ముఖ్యుడగు ఆనందుడు వావిచ్చి విలపించెను. గురుదేవుడో, తన శిష్యులం దటువంటి మనోదౌర్బల్యమును ఆమోదింపడు. కాబట్టి ఆయన ఆనందు నిట్లు మందలించెను:—చాలు, ఆనందా, చాలు. వ్యథ చెందకు, ఏడువకు. ఇంతకుముందు ఎన్నియో సార్లు నీకు చెప్పియున్నానే - మన కత్యంతప్రియములును హృదయసన్నిహితములు నగు వస్తువుల యెడబాటు తప్పదు. అది ప్రకృతిధర్మము. నీ సముద్యమమందు ఆర్జవవంతుడవై యుండుము, మహాపాపములనుండి, భోగతృష్ణనుండి, స్వార్థపరతనుండి, భ్రాంతినుండి, అజ్ఞానమునుండి విముక్తుడ వగుదువు.''

తనజీవితము నాద్యంతము తలపోయుచుంబోలె ఆయన శిష్యులకు పట్టుదల సడలనీయక ధర్మమునకై సాహసముతో ఎట్లు పోరాడవలెనో తెలియజెప్పెను:—''కావున ఆనందా. ఈ పరంపర సన్న్యాసులు నా తోడ్పాటుమీద ఆధారపడకూడదు, వెలుపలి యొవరిసాయము మీదను ఆధారపడకూడదు. మీరు మీమీదనే ఆధారపడవలెను, మీకు మీరే దారి చూపుకొను దీపములుగ నుండవలెను.''

బుద్ధదేవుని చరమసందేశము పరమార్థాన్వేషకుల కందఱికిని ప్రబోధకమును ధీరమునగు హెచ్చరిక:—''సోదరులారా, ఇటు చూడుడు. కూడికచే రూపొందిన వస్తువులకు విరిసిపోవుట తప్పదు. సత్యమొక్కటే నిత్యము. మీ విముక్తిని మీరే శ్రద్ధతో సాధించుకొండి.''

అణ్వస్త్రాదిప్రయోగముచే మానవజాతికి సంఘాతవినాశము ఏ క్షణములో దాపురించునో అను భయ మొకవంక ఉన్నది. ద్వేషమును అవిశ్వాసమును మానవుల డెందములలో పోటెక్కుచున్నవి. కలహాకల్లోలములను అరికట్టవలె ననిన, మానవుల హృదయములను శుద్ధపఱచుకొనుట అందుకు మొదటిమెట్టు. ఇందు బుద్ధదేవుడు మన కెంతో తోడ్పడగలడు, కరుణ, విశ్వప్రేమ, నిస్స్వార్థత, ప్రసన్నత—ఇవి బుద్ధుని ప్రధానలక్షణములు. బుద్ధదేవుని దివ్యరూపమును కన్నను ఆయన భవ్యచరితమును విన్నను ప్రజల డెందములలో పూర్వోదాహృతబుద్ధగుణములు ప్రజ్వరిల్ల గలవు. కామక్రోధలోభమోహమదమాత్సర్యాగ్నులు ఆఱిపోగలవు. ప్రస్తుతము ప్రజలకు జరూరుగ కావలసినవి ఈ బుద్ధదేవగణములు.

# వి వే క చూ డా మ ణి

మూలము :
శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

ఘటో ఽయ మితి విజ్ఞాతుం నియమః కో ఽన్వపేక్షతే
వినా ప్రమాణసుష్ఠుత్వం యస్మిన్ సతి పదార్థధీః. 530

చక్కని చూపు ఉండ వలె, ఉన్నచో ఏది ఏ వస్తువో తెలియును. అంతే కాని, ఇది కుండ అని తెలిసికొనుటకు వేఱు నియమము కావలెను? ౫౩౦

అయ మాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వా ప్యపేక్షతే. 531

ఈ యాత్మవస్తువు నిత్యసిద్ధము. గురూపదిష్టమార్గమున మహావాక్యార్థవిచారణ సాగినచో, ఆత్మ తన్ను ఆవిష్కరించుకొనును. అందుకు దేశము, కాలము, శుద్ధి—ఇ వేవియు అక్కఱ లేదు. ౫౩౧

దేవదత్తో ఽహ మి త్యేత ద్విజ్ఞానం నిరపేక్షకమ్
తద్వ ద్బ్రహ్మవిదో ఽప్యస్య బ్ర హ్మాహ మితి వేదనమ్. 532

నేను దేవదత్తుడ నని తెలిసికొనుటకు దేని సాయము నక్కఱ లేదు. అట్లే తాను బ్రహ్మమ నని బ్రహ్మవేత్త తెలిసికొనుటకు దేని సాయము నక్కఱ లేదు. ౫౩౨

భానునేవ జగ త్సర్వం భాసతే యస్య తేజసా
అనాత్మక మస త్తుచ్ఛం కిం ను త స్యావభాసకమ్? 533

ఏ యాత్మతేజముచేత, సూర్యునిచేతం బోలె, ఈ జగత్తు భాసించుచున్నదో, (ఆయాత్మస్వయంప్రకాశమానమైనందున) దానికి, అనాత్మకమును అసత్తును తుచ్ఛము నగు జగత్తు ప్రకాశక మగునా? ౫౩౩

వేదశాస్త్రపురాణాని భూతాని సకలా న్యపి
యే నార్థవన్తి తం కి న్ను విజ్ఞాతారం ప్రకాశయేత్. 534

వేదము లేమి, శాస్త్రము లేమి, పురాణము లేమి, సకలభూతము లేమి దేనిచేత అర్థవంతము లగుచున్నవో, అటువంటి విజ్ఞాతను ప్రకాశింప జేయున దేది కలదు? ౫౩౪

ఏష స్వయం జ్యోతి రన న్తశ క్తి రా త్మాప్రమేయ స్సకలానుభూతిః
య మేవ విజ్ఞాయ విముక్తబన్ధో జయ త్యయం బ్రహ్మవి దు త్తమో త్తమః. 535

ఈ యాత్మ స్వయంజ్యోతి, అప్రమేయము, అనంతశక్తి, ఎల్లరయు అనుభూతిస్వరూపము. ఆ యాత్మ నెఱిగిన బంధవిముక్తునకు ఉత్తమోత్తమునకు బ్రహ్మవేత్తకు జయము. ౫౩౫

న ఖిద్యతే నో విషయైః ప్రమోదతే న సజ్జతే నాపి విరజ్యతే చ
స్వస్మిన్ సదా క్రీడతి నన్దతి స్వయం నిరన్తరానన్దరసేన తృప్తః. 536

బ్రహ్మవేత్త నిరంతరానందరససంతృప్తుడై, సదా ఆత్మయందు క్రీడించుచు ఆనందించుచుండును. అతనికి విషయములపట్ల ఖేదమును లేదు, ప్రమోదమును లేదు, తగులమును లేదు, ద్వేషమును లేదు. ౫౩౬

క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ. 537

ఆకలి నెఱుగక, దేహబాధలను గుర్తింపక బాలు డాటవస్తువులతో ఆడుకొనుచుండును కదా, అట్లే జ్ఞానియు అహంకారమమకారములు లేక సుఖియై ఆత్మయందు రమించుచుండును. ౫౩౭

చిన్తాశూన్య మదైన్యభైక్ష్య మశనం పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితి రభీ ర్నిద్రా శ్మశానే వనే
వస్త్రం క్షాళనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సఞ్చారో నిగమాన్తవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి. 538

జ్ఞానులకు చింతయు దైన్యమును లేక లభించిన భిక్షాన్నమే ఆహారము, నదీజలమే పానము, వారి జీవితము నిరంకుశము, స్వతంత్రము. భయము లేనందున అడవిలోనైనను వల్లకాటిలోనైనను వారికి నిద్ర వచ్చును. వారికి దిక్కులే కప్పడములు, లేదా చెట్టుపట్టయే వస్త్రము, ఉతుకుటయు ఆఱవేయుటయు దానికి లేదు. వారికి భూతలమే పాన్పు, వేదాంతవీథులు సంచారస్థలములు, పరబ్రహ్మము క్రీడాస్థానము. ౫౩౮

విమాన మాలమ్బ్య శరీర మేత ద్భునక్త్యశేషాన్ విషయా నుపస్థితాన్
పరేచ్ఛయా బాలవ దాత్మవేత్తా యో ఽవ్యక్తలిఙ్గో ఽననుషక్తబాహ్యః. 539

ఆత్మజ్ఞానికి వెలుపలిగుర్తులు లేవు, బాహ్యవస్తువులందు తగుల ముండదు, ఈ శరీర మతనికి విమానము (వాహనమాత్రము) బాలునివలె నతడు సకలవిషయములను, తమంతటనైనను అన్యులకోరికచేతనైనను, అందుబాటైనమట్టుకు అనుభవించుచుండును. ౫౩౯

దిగమ్బరో వాపి చ సామ్బరో వా త్వగమ్బరో వాపి చిదమ్బరస్థః
ఉన్మత్తవ ద్వాపి చ బాలవ ద్వా పిశాచవ ద్వాపి చర త్యవన్యామ్. 540

జ్ఞాని సాంబరుడుగనో దిగంబరుడుగనో చర్మాంబరుడుగనో చిదంబరుడుగనో, వెఱ్ఱివానివలెనో బాలునివలెనో పిశాచమువలెనో—భువిని సంచరించుచుండును. ౫౪౦

కామా న్నిష్కామరూపీ సంశ్చర త్యేకచరో మునిః
స్వాత్మనైవ సదా తుష్ట స్స్వయం సర్వాత్మనా స్థితః. 541

సదా ఆత్మయందు సంతుష్టుడై యుండు వాడును, సర్వము స్వాత్మస్వరూప మని గుర్తించినవాడును, నిష్కామరూపియునగు జ్ఞాని, ప్రారబ్ధఫలముగ ప్రాప్తించిన కామముల ననుభవించుచు నొంటరిగ దిరుగుచుండును. ౫౪౧

క్వచి న్మూఢో విద్వాన్ క్వచి దపి మహారాజవిభవః
క్వచి ద్భ్రాన్త స్సౌమ్యః క్వచి దజగరాచారకలితః
క్వచి త్పాత్రీభూతః క్వచి దవమతః క్వా ప్యవిదిత శ్
చర త్యేవం ప్రాజ్ఞ స్సతతపరమానన్దసుఖితః. 542

ప్రాజ్ఞుడు సతతము పరమానందసుఖితుడుగ నుండును. ప్రేక్షకుల కొకప్పుడు మహా రాజవిభవసంపన్నుడుగను, ఒకప్పుడు భ్రాంతుడుగను ఒకప్పుడు సౌమ్యుడుగను ఒకప్పుడు కొండ చిలువవలె కదలకపడియుండువాడుగను ఒకప్పుడు పూజార్హుడుగను, ఒకప్పుడు అవమా నములకు గుఱిగను ఒకప్పు డజ్ఞాతపురుషుడుగను (గననగుచు) చరించుచుండును. ౫౪౨

నిర్ధనో ఽపి సదా తుష్టో ఽప్యసహాయో మహాబలః
నిత్యతృప్తో ఽప్యభుఞ్జానో ఽప్యసమ స్సమదర్శనః. 543

అతడు నిర్ధను డయ్యు సదా సంతుష్టుడు, అసహాయు డయ్యు మహాబలుడు, భుజిం పనివా డయ్యు నిత్యతృప్తుడు, అసము డయ్యు సమదర్శనుడు. ౫౪౩

అపి కుర్వ న్నకుర్వాణ శ్చాభోక్తా ఫలభో గ్యపి
శరీ ర్య ప్యశరీ ర్యేష పరిచ్ఛిన్నో ఽపి సర్వగః. 544

అత డన్ని పనులను జేయుచున్నను చేయనివాడే; ఫలముల ననుభవించుచున్నను అనుభవింపనివాడే, శరీరముతో తాదాత్మ్యము లేనందున, శరీర మున్నను లేనివాడే, పరి చ్ఛిన్నుడైనను సర్వగతుడే. ౫౪౪

అశరీరం సదా స న్త మిమం బ్రహ్మవిదం క్వచిత్
ప్రియాప్రియే న స్పృశత స్తథైవ చ శుభాశుభే. 545

దేహమందు తాదాత్మ్యాభిమానము లేని బ్రహ్మజ్ఞానికి ప్రియాప్రియములు గాని శుభాశుభములు గాని ఎచ్చటను అంటవు. ౫౪౫

స్థూలాదిసమ్బన్ధవతో ఽభిమానిన స్సుఖఞ్చ దుఃఖఞ్చ శుభాశుభే చ
విధ్వస్తబన్ధస్య సదాత్మనో మునేః కుత శ్శుభం వా ప్యశుభం ఫలం వా. 548

స్థూలసూక్ష్మకారణశరీరములతో తాదాత్మ్య మొందు వానికి సుఖదుఃఖములును శుభాశుభములును గలుగుచుండును. తాదాత్మ్యాభిమానబంధమును త్రెంపుకొని సదా బ్రహ్మముగనే యుండు మునికి పుణ్యాపాపములఫలములైన సుఖదుఃఖము లెక్కడివి? ౫౪౮

యోగపాఠబోధిని—10

# రాజయోగము

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

అన్ని యోగములవలెనే రాజయోగ మున్నూ భారతదేశంలో అనాదికాలంగా ఉన్నది. దానిని పరిపూర్ణతాసిద్ధికి రాజమార్గ మని చెప్పవచ్చు. రాజ్యమును రాజు అదుపులో ఉంచుకుంటాడు. మనరాజ్యాన్ని మనమూ అదుపులో ఉంచుకోవాలి. మనరాజ్యం మన మనస్సే. దాన్ని అదుపులో ఉంచుకుంటే సమస్తప్రకృతి మనకు లోబడుతుంది. రాజయోగశాస్త్రానికి అందరికంటె అధికప్రామాణికుడు పతంజలిమహర్షి. సుప్రసిద్ధమైన యోగసూత్రగ్రంథప్రణేత ఆయన. ఈ యోగము సాంఖ్యశాస్త్రముపై నాధారపడినది. సర్వశక్తియగు భగవంతుని ప్రార్థింపవలె ననుట ఆ శాస్త్రంలో లేదు. అయితే ధ్యానానికి ఏకాగ్రతకు దేవుడున్నూ లక్ష్యంగా ఉండవచ్చు అంటాడు పతంజలి. యోగసిద్ధిమార్గాలలో భగవద్ధ్యానమును ఒకటిగా ఆయనచే విహితమై ఉంది. ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే, రాజయోగాన్ని అనుసరించేందుకు దేవునిలో నమ్మకం ఉండ నక్కఱలేదని, దేవుని అంగీకరించవలసిన ఆవశ్యకత లేదని స్పష్టంచేయడానికే.

రాజయోగసారం ఇది:—(1) పరిపూర్ణత జీవునిలో అంతర్గతమై ఉన్నది. (2) చైతన్యం పంకరతిరగడంమూలాన పరిపూర్ణతావిష్కృతి విఘ్నిత మౌతున్నది. (3) పరిపూర్ణత ఆవిష్కృతం కావాలి అంటే చిత్తమును పూర్తిగా అదుపులో ఉంచుకోవడం అవసరం.

పరిపూర్ణత నధిగమించుట కడ్డుతగిలేవి మనఃకల్లోలాలే అని రాజయోగం తెలుపుతుంది. ఆకల్లోలాలకు 'చిత్తవృత్తు'లని పేరు. మనఃపరిణామాలను అదుపులో ఉంచుకొన్న యోగికి అంతఃప్రకృతి వశమై ఉంటుంది. అంతఃప్రకృతియే బాహ్యప్రకృతిగా ఆవిష్కృత మౌతుందనుటకూడ అప్పుడు అతని గుర్తుకు వస్తుంది. ఆంతరమును బాహ్యమును వ్యష్టియు సమష్టియు నగు ప్రకృతి పూర్తిగా అదుపులోనికి రావడానికి విఘ్నం సమకూర్చే మనఃకల్లోలాలు ఆగిపోవడమే రాజయోగంలో పరిపూర్ణతాసిద్ధి. మానసికశక్తులను పూర్తిగా అదుపులో ఉంచుకోవడమే రాజయోగం బోధించే పాఠం. వివిధమనఃపరిణామాలను అదుపులో ఉంచుకోడానికి సాగే ప్రయత్నమే ఇందు ముఖ్యం.

స్థూలరూపాలను అదుపులోనికి తెచ్చుకోవడంతో మనసాధన ప్రారంభం ఔతుంది.

ఒకప్పు డొకయోగిని 'నీ వృత్తి ఏమి' అని ఒకరు ప్రశ్నించారు యోగి చెప్పిన జవాబు "నేను జాతిచేతను వృత్తిచేతను కర్షకుణ్ణి." ప్రాశ్నికులు మరల అడిగారు "నీ కెంత భూమి ఉంది?" యోగి తనదేహాన్నొక్కసారి చూచుకొని "దాదాపు మూడున్నర మూరలు" అనెను.

చూచారా! మానవుడికి గల గొప్ప ఆస్తి ఇదే, ఈ మనస్సు దేహము. అతనికి వ్యవసాయం బాగా తెలిసి ఉంటే, ఏ రంగంలోనైనా సంపాదించగలంత అధికలాభం, ఇందులోను పండించుకోవచ్చు. ఈ మూడున్నర మూరల పొలంలో పాటుపడి యోగి తన పంటను పండించుకొంటాడు. పరిపూర్ణతయే ఆ పంట. అదే

జీవితంలో అత్యధికవిజయం గడించేటట్లు ఈ పొలాన్ని కాపాడుకునే విధానమే యోగకళ. కావున ఈ పొలమును సారవంతముగ నొనర్చుకొను టెట్లో పుష్కలమైన పంటను బడయు టెట్లో బోధించు విద్యయే యోగము. పండించుకొని అనుభవించుటకై ఆ స్థితిని కాపాడుకొనుటను, శుద్ధపఱచుకొనుటను, దున్నుటను, విత్తులు చల్లుటకు సిద్ధపఱచుటను యోగము మనకు నేర్పుచున్నది.

ఏ ప్రయత్నములోనైనను నెగ్గవలెనంటే, సక్రమవిధానానుసరణ మావశ్యకము. రాజయోగమునకూడ అల్లే. లక్ష్యమును ప్రాపింప సహకరించు శిక్షణములు అభ్యాసములు కొన్ని ఉన్నవి. నీవు ఒక యకరా పొలమును సంపాదించితి వనుకో. అప్పుడు నీవు మొట్ట మొదట చేయు పని యేమి? ఆ పొలమున కొక కంచె వేస్తావు. కంచె ఉంటేనే అందులో నీవు పండించు పంటకు భద్రత కలుగుతుంది. నీ హక్కును స్పష్టపఱచి దురాక్రమణ కారులను తరిమి వేస్తావు. రాజయోగసాధనలోకూడ విద్యార్థి తన్ను తాను కాపాడుకొను మార్గముల ననుసరించాలి.

ఒక్క ముఖ్యవిషయం స్పష్టపఱుస్తున్నాను. ఆత్మరక్షణవిధానాలను నీ వెందు కనుసరించాలి? నీ మంచికే, నీ లాభానికే అనుసరించాలి. నిన్ను బలాత్కరించి నీచే ఆ విధానాలను అనుసరింపజేసే అధికారు లెవ్వరూ వెలుపల లేరు. కేవలం స్వేచ్ఛచేతనే గోడలు లేపి నీ సొమ్మును భద్రపఱచుకొంటావు. ఇది చాల ముఖ్యమైన అంశం. యోగంలో నెగ్గేందుకు స్వేచ్ఛచేతనే నీవొక దుర్గం నిర్మించుకున్నావంటే నీ యాధ్యాత్మికశక్తిని ఒకపాటి చూపావు, నీలక్ష్యంవంకకు ఒక్కడుగు ముందుకు సాగావు అన్నమాట ప్రారంభం జరిపావు.

ప్రతిమతంలోను నవలంబించినవారు తల దాల్చవలసిన నియమా లున్నాయి. ఎందుకు ఆ నియమాలను తల దాల్చవలెను, తల దాల్చకపోతే ఏమి అనే ప్రశ్నలకు సమాధానాలు మాత్రం మనకు దొరకవు. అందుచేతనే ఈ కాలంవారు సాధారణంగా అలాటి నియమాలకు ఎదురుతిరుగుతుంటారు. కొన్ని నియమాల ప్రయోజనం వారిమనస్సు కెక్కనప్పటికిని, తాము నిర్బంధించబడుతున్నట్లు తోచినట్లైతే వాళ్ళకు చుఱ్ఱు మంటుంది. కాబట్టి ఆలాటి విధినిషేధాలు ఈ కాలంవారికి బహుతరంగా అప్రియాలు. స్వేచ్ఛతో మనం ఎన్నుకోక, మఱెవరో మనలను నిర్బంధిస్తున్నట్లు తోచినప్పుడు ప్రతిఘటించవలెననే బుద్ధి ఆధునికులకు పుట్టుతుంది. 'నియమములు'

'ఆజ్ఞలు' అంటే అసలు నాకే కిట్టవు. కాని నిజమునకు అవి 'ఆజ్ఞలు' కావు. సిద్ధాంతులు తాము అవలంబించి శ్రేయ మొంది మనకు సంక్రమింపజేస్తున్న 'మానాలు' అవి. ఆలాగు అర్థంచేసుకుంటే, ఎంతటి సూనాధనసులైన వర్త్యలుసైతం, వానిని ఆశతో అంగీకరిస్తారు. పొలానికి చుట్టును సంరక్షకమైన కంచె ఉంటే పైరు ఎదిగి ఫలిస్తుంది. అదేవిధంగా ప్రారంభ దశలలో ఉంటున్న సాధకులకు కట్టుబాట్లు ఉండవలె, ఉంటేనే కాలక్రమాన ఆధ్యాత్మిక పరిపూర్ణత సిద్ధిస్తుంది. అటువంటి కట్టుదిట్ట ములను నిరాదరిస్తే మనం ఏ రంగంలోను నెగ్గజాలనివాళ్ళ మౌతాము.

మనకు ఎట్టిబంధమూ లేదు, పరిమితి లేదు, లోటుపాట్లు లేవు అను గుర్తింపు మనస్సులో స్థిరపడడమే రాజయోగంలో పరిపూర్ణత. ఆ మొలుక విశుద్ధదశలో ఉంటే, అదే బ్రహ్మము. సంకుచితాత్మభావసీమావధుల నతిక్రమించుటే యోగి లక్ష్యము. కాబట్టి, మనస్సును అదు పులో ఉంచుకొనుటకు చేయు ప్రయత్నమే అతనికి ముఖ్యము. ఈ ప్రయత్నమునకు గల్గు విఘ్నము లేవో గుర్తించి వాటికి ప్రతిక్రియ చేయాలి. స్థూలశిక్షణలతో ప్రారంభించాలి. మనస్సును నిగ్రహించే విధానం మీకు తెలి యకపోతే సాత్త్వికభావాలు మీఅనుభవంలో ఉండవు. వాటి అనుభవంలో మీ రుంటారు. ఉద్రేకాలను ఉపశమింపచేసుకోవడం చాలదు, మనస్సును పూర్తి అధీనంలో ఉంచుకోవాలి.

పతంజలి రాజయోగసర్వస్వమును ఎనిమిది మెట్లుగా అమర్చాడు. అందుకనే దానికి అష్టాంగయోగ మను పేరు ఏర్పడింది. ఎనిమిది మెట్లు ఇవి—యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి. మనం కొద్దికొద్దిగా వీటి నన్నిటినిగూర్చి చర్చిస్తాం. చిత్తమునకు గలుగు కల్లోలాలను పతంజలి మొదటి రెండు శీర్షికల క్రింద చేర్చాడు. 'యమం' 'నియమం'. ఈ రెంటిలో ఒక్కొక్క—దానిలో ఐదేసి సాధన లున్నాయి. 'యమము' లోని ఐదు:-(1) అహింస (2) సత్యము (3) అస్తేయము (4) బ్రహ్మ చర్యం (5) అప్రతిగ్రహం. 'నియమము'లోని ఐదు:-(1) విశుద్ధి (2) సంతుష్టి (3) తపశ్చర్య (4) స్వాధ్యాయం (5) ఈశ్వరప్రణిధానం,

ఈ పదిసాధనలు సాధకుని క్రియారంగపు ప్రహరిగోడలోని పది స్తంభాలు అనవచ్చు. నీతికి ఇవి పునాదులు. వీనిమూలముగా పతం జలి పుణ్యాపాపములకు ఆత్మీయమైన ఒక కొల బద్దను ఇసంప్రథమంగా నెలకొల్పాడు. మనః ప్రశాంతతకు సాధకములైన తలంపులు పనులు మంచివి. అందుకు బాధకములైన తలంపులు పనులు చెడ్డవి. పరిపూర్ణతను మనలను చేర్చేది ఏదైనా సరే మంచిదే. పరిపూర్ణతకు మనలను దూరంచేసేది ఏదైనా చెడ్డదే. మంచికి చెడు గుకు యోగి వినియోగించుకొనే కొలబద్ద ఇదే. ఆస్థ గల ప్రతి యోగిసాధకుడున్నూ ఈ సాధనలను అర్థం చేసుకోవలె, మనఃపూర్వ కంగా అనుసరించాలి. ఈ సాధనలను మానితే, ఇక అతని కృషి తూము తెఱచిన తొట్టిలో నీరు పోసే శ్రమంవలె వ్యర్థ మవుతుంది. మన స్సును సంక్షుబ్ధదశలో ఉంచితే ఎంతో శక్తి నష్టమై పోతుంటుంది. కాబట్టి వివేకి ఆలాంటి నష్టాలు కలుగనీయకుండా, ఏకాగ్రత వహించి యోగమార్గంలో ముందంజ వేయడానికి ముం దతడు వహించవలసిన మెలకువ అది.

మొదటి సాధన అహింస. మీరు చెప్పు మాటచేత కాని, మీరు తలంచు తలంపుచేత కాని, మీరు చేయు పనులచేత కాని ఎవరికిని హింస కలుగనీయకుండా మిమ్ము మీరు తర్ఫీదు

చేసికోవాలి, అంతరంగాను బాహ్యంగాను అహింసకు ఎన్నియో వైపు లున్నాయి. హింస చేసినట్లైతే మనస్సుకు సంక్షోభం కలుగుతుంది. చేసిన హింసను స్మరించే కొద్దీ, తటాకంలో చిఱుకెరటాలు లేచినట్లుగా, మనస్సులో అశాంతి తలెత్తుతుంది. ధ్యానమును సాగనీయదు. ఎవరికైనా బాధ కలిగించినా, ద్వేషాసూయలకు లోనైనా, క్రూరంగా అధర్మంగా ప్రవర్తించినా, 'యోగ' హర్మ్యద్వారంలో మీరు ప్రవేశించజాలరు. యోగి, సహజీవులను ప్రేమించాలి, వారియందు సానుభూతి కలిగిఉండాలి. విశ్వమానవసేవే అతని జీవితసారంగా ఉండాలి. అహింసాప్రాముఖ్యం అతిగాఢమైంది. అది అమలు కావలసిన రంగం అతివిశాలమైంది.

నిత్యజీవితంలో అహింసను పాటించుటను గూర్చి శ్రీరామకృష్ణు డొక హాస్యకథ చెప్పాడు. ఒక పచ్చికబయలు ఉంది. అందు గొల్లబాలురు ఆవులను మేపుకొంటుండేవారు. అక్కడే భయంకర విషసర్పం ఒకటి ఉండేది. దానివలని భయంచేత అందఱూ వేయికన్నులతో మెలకువ గల్గి ఉండేవారు. ఒకనా డొక బ్రహ్మచారి ఆ పచ్చికబయలు మీదుగా పోతూండినాడు. గొల్లబాలురు పరుగున అతనిని సమీపించి 'మహాశయా, అటువైపు పోకు. దయచేసి వెనుకకు మరలు, ఆ ప్రాంతంలో ఒక నాగుబాముంది'' అని హెచ్చరించారు. అందుకు ఆయన ''ఉంటే ఏం? నా కేమీ భయం లేదు. నాకు మంత్రము తెలుసు''అని బదులు చెప్పి ముందుకు నడిచాడు. గొల్లపిల్లలకు భయం కాబట్టి, వారు ఆయన వెంబడి పోలేదు. ఇంతలో సర్పం పడగ విప్పుకొని వేగంగా బ్రహ్మచారిని సమీపించింది. వెంటనే అతడు మంత్రం ఉచ్చరించాడు. నాగుపాము వానపామువలెనై అతని పాదములకడ పడి ఉన్నది. బ్రహ్మచారి దానితో ''ఓ నాగో, ఇటు చూడు; ఎందుకు ఇతరులను హింసిస్తూ తిరుగుతావు? ఇటు రా. నీ కొక పుణ్య మంత్రం ఉపదేశిస్తాను దాన్ని జపిస్తూ ఉండు. నీకు దైవభక్తి కలుగుతుంది. ఘాతుకస్వభావం తొలగుతుంది. భగవత్సాక్షాత్కారమూ చేకూరుతుంది' అని మంత్రోపదేశం చేసి ఆధ్యాత్మికజీవితంలోకి ప్రవేశం ఒసగాడు. పాము గురువునకు మ్రొక్కి 'ఆధ్యాత్మికనియమానుష్ఠానం నాకు ఏలా గలవడుతుంది?' అని అడిగింది. ''ఈ మంత్రాన్నే జపిస్తూ ఉండు. ఎవ్వరినీ హింసింపకు, నేను మళ్ళీ ఒక్కసారి వచ్చి నిన్ను చూస్తాను'' అని చెప్పి బ్రహ్మచారి వెడలి పొయ్యాడు. కొన్నాళ్లు గడిచాయి. పాము కరవడం లే దని గొల్లపిల్లవాండ్రు గుర్తించారు. వారు దానిమీద రాళ్ళు రువ్వారు, కాని అది బుస్సు మన లేదు. వానపామువలెనే ఊరకున్నది. ఒకనాడు బాలురలో ఒకడు దానిని సమీపించి తోకవద్ద పట్టుకొని చుట్టి చుట్టి నేల మీద మోది పారవేశాడు. పాము నెత్తురు క్రక్కి ఒళ్లు తెలియక పడిపోయింది. కదలక పడి ఉన్నందున, చచ్చిందని తలచి పిల్లవాండ్రు తమదారిని పొయ్యారు. సగం రాత్రికి పాముకు చైతన్యం కలిగింది, మెల్లగా ఎంతో కష్టంతో దేహాన్ని ఈడ్చుకుంటూ పుట్టలోకి ప్రాకిపోయింది. దాని యెముకలు తునిగాయి. కదలగల శక్తియైనా దానికి లేదు. పెక్కు దినాలు గడిచాయి. పాము, తోలు కప్పిన వట్టి యెమ్ముల గూడుగా రూపొందింది. అప్పు డప్పుడు రాత్రులందు మాత్రం అది ఆహారానికై బయటికి వస్తూ ఉన్నది. పగటివేళలో ఆ బాలురవలని భయంచేత పుట్ట వెడలి రావడమే లేదు. గురువునొద్ద మంత్రోపదేశం పొందినప్పటినుండి అది ఇతరులను హింసించడం మాని వేసింది. మట్టి, చెట్ల

నుండి తమంతట రాలిన ఆకులు, పండ్లు - ఇవే దానికి ఆహారం.

ఇంచుమించు ఒక సంవత్సరం పిమ్మట ఆ బ్రహ్మచారి ఈ దారిని వచ్చి పాము సంగతిని విచారించాడు, అది చచ్చిపోయిం దని గొల్ల పిల్లలు చెప్పారు. కాని అతడు నమ్మలేక పోయ్యాడు. ఉపదిష్టమైన మంత్రఫలం పడ యక పాము చావ దని అతనికి తెలుసు. కాబట్టి అతడు అది ఉన్న చోటును ఏలాగో కనుగొని పోయి, ఇటు అటు చూచి, దానికి తాను పెట్టి ఉండిన పేరుతో పిలిచాడు. సుగుని కంఠం విన గానే అది పుట్టనుండి బయటికి వచ్చి మహాద రంతో అతని ప్రమోల నమస్కరించింది.

బ్రహ్మచారి : ఏమోయీ, ఎట్లు ఉన్నావు?

పాము: క్షేమంగానే ఉన్నాను స్వామీ

బ్రహ్మచారి : మరి ఎందుకు అంత గా కృశించి ఉన్నావు ?

పాము : ప్రడమైన ఓ గురుదేవా, ఎవ్వ రిని గాని హింసింపకు అని మీరు నన్ను ఆజ్ఞా పించారు కదూ. కాబట్టి ఆకులూ పండ్లు - ఇవే జీవనాధారంగా ఉండడంచేత కృశించిఉంటాను.

పాము ధార్మికంగా మార్పొందింది. ఎవ్వరి మీద గాని దానికి కోపం కలగడం లేదు. గొల్ల పిల్లవాండ్రు అలనాడు తన్ను కొనఊపిరితో విడిచిపెట్టిన సంభవాన్ని అది పూర్తిగా మఱచి పోయింది.

బ్రహ్మచారి : "తిండి లేక పోయినంత మాత్రంచేత నీవు ఇంతగా ఎండుకొని పోయి ఉండవు. వేఱు కారణం ఏదో ఉండక తప్పదు. జ్ఞప్తికి తెచ్చుకో" అన్నాడు. పిల్లవాండ్రు తన్ను నేలమీద మోదిన సంగతి అప్పుడు దాని జ్ఞప్తికి వచ్చింది. రాగా ఈలాగు తెలి పింది - 'ఔను, స్వామీ, ఇప్పుడు జ్ఞప్తికి వస్తున్నది. ఒకనాడు పిల్లవాండ్రు నన్ను నేల కేసి చావ మోదారు. పాపం, వారి కేం తెలుసు? నా మనస్సు ఎంతగా మార్పు చెంది ఉన్నదీ వారు గ్రహించ లేదు. నేను ఎవరినిగాని కఱవ నని హింసించ నని వారు ఎట్లు తెలిసికోగలరు?"

బ్రహ్మచారి "ఎంత సిగ్గుచేటు! అంత అవివేకివా నీవు? నిన్ను నీవు కాపాడుకొను దారియైనా తెలి యదా నీకు? నీతో నేను 'కఱవకు' అన్నానే కాని 'బుస్సుమనకు' అని చెప్పానా? బుస్సు మని ఆ బాలురను నీవు ఎందుకు బెదరగొట్ట లేదు?" అని అడిగాడు

కాబట్టి అహింసను చక్కగా అర్థం చేసుకో వాలి. అహింస అంటే కేవలం హననకార్యాలను వదలుకోవడం కాదు. అహింసానుష్ఠానం సౌధ నిర్మాణంలో మొదటి స్తంభం నాటడం వంటిది.

రెండోసాధన 'సత్యమును పాటించడం, సత్యాన్ని అనుసరించడంలో కూడా వివేకమూ గుణదోషనిర్ణయమూ ఉండాలి. కేవలం జరిగిం దాన్ని చెప్పడం సత్యం చెప్పడం కాదు. మన స్వాధ్యాయానుగుణంగా సత్యాన్ని మనం అర్థం చేసుకోవాలి. భయంచేతనూ స్వలాభాపేక్ష చేతనూ, సత్యాన్ని తాఱుమాఱు చేయడం తఱచు జరుగుతూ ఉంటుంది, ఆ ప్రవణతను అణచుకోవాలి. అప్పుడు మనస్సును క్రోధలోభ కల్లోలాలు ఊపవు, మనచేత అసత్యం పలికిం చేవి క్రోధలోభాలే. సత్యం మీ మాటలలో మాత్రం ఉంటే చాలదు, మీ నడవడిలో మీ ఆశయాలలో కూడా ఉండాలి. పరిపూర్ణతను ఏది అధిగమింప జేస్తుందో అదే సత్యం. ప్రతి చేష్టలోనూ సత్యాన్ని అనుసరించండి. నీజీవితం సత్యానికి లక్ష్యం కాదగినట్లుగా దాన్ని సత్యంతో నింపు. ఆలాగు చేస్తే, యోగానికి లక్ష్యమైన పరిపూర్ణతకై చేయు కృషిలో మఱొక మెట్టు ముందుకు సాగినవాడవుతావు.

మూడవసాధన అస్తేయం, ఇతరుల సొత్తును హక్కులను అపహరించకుండా ఉండడం. అస్తేయంకూడా మన మనసులలోనూ నడవడులలోనూ ఉండాలి. స్థూలంగాను భావగతంగాను వైజ్ఞానికంగాను ఆధ్యాత్మికంగాను అస్తేయం ఉండాలి. ఒకరిసొమ్మును మీరు అపహరిస్తే, మీ అంతరాత్మ నొచ్చుకుంటుంది. అప్పుడు ప్రగాఢమైన ధ్యానం మీకు కుదురదు. ఇతరులు మనకు చేసిన మేలును గుర్తించకపోవడంకూడా దొంగతనమే, ఇతరులకు కృతజ్ఞత తెలుపుకోకుండా వారి మాటలను సైతం మీరు వినియోగించుకోకూడదు. శ్రీరామకృష్ణుడు ఎవరి సూక్తిని ఉదాహరించినా, వినయగౌరవములతో వారిని పేర్కొనేవాడు. నిజానికి సకల యోగసాధనలకూ సజీవలక్ష్యం శ్రీరామకృష్ణుడే.

ప్రకీర్ణక వ్యాసావళి

# బుద్ధదేవుని గూర్చిన సంవాదము కాశీపూరు గురుదేవుని సన్నిధానమున

మహేంద్రుడు: [నరేంద్రునితో] [బుద్ధుని సిద్ధాంతము ఏమి?

నరేంద్రుడు: సాధనచే తాను సాక్షాత్కరించుకొన్నదానిని బుద్ధుడు మాటలలో ప్రకటింపజాలకపోయినాడు. కావుననే లోకులు అతనిని నాస్తికుడనిరి.

గురుదేవుడు: [సైగలమూలముగా] నాస్తికుడెట్లు? కానే కాడు. ఆయన తన అంతరనుభూతులను మాటలలో చెప్పలేకపోయెను. అంతే. బుద్ధుడను అను పదమునకర్థ మేమో తెలియునా? చిత్స్వరూపమును ధ్యానించి బోధముతో ఐక్యమొందినాడు, చిత్తుగనే పరిణమించినవాడు.

నరేంద్రుడు: ఔను, మహాశయా, బుద్ధులలో మూడువర్గాలవారున్నారు—బుద్ధులు, అర్హతులు, బోధిసత్త్వులు.

గురుదేవుడు: దేవునకిదియు నొక లీలయే, క్రొత్తలీల! బుద్ధుని నాస్తికుడన నేల? ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొన్నవానికి కొంత అస్తిత్వమును కొంత నాస్తిత్వమును అనుకొనదగిన దశ కలుగును.

నరేంద్రుడు: [మహేంద్రునితో] ఆ దశలో ద్వంద్వము లేకమై పోవును. జలవాయు ప్రాణవాయువుల కలయికచే నీరు పుట్టును. గొట్టముగుండ నీటి నిగురగొట్టుటకును ఆ జలవాయు ప్రాణవాయువులే ఉపయోగపడుపబడును.

ఆ దశలో కర్మాచరణమును నైష్కర్మ్యమును రెండును సాధ్యములే. అనగా సాధకుడు సంగరహితుడై కర్మల నాచరించు ననుట.

శబ్దాదివిషయసక్తులైన లౌకికులు దేనిని గూర్చి చెప్పినను 'ఉన్నది' [అస్తి] అనియే చెప్పుదురు. మాయావాదులు 'ఏదియు లేదు' [నాస్తి] అందురు. ఈ యస్తిత్వనాస్తిత్వముల కతీతమైనది బుద్ధననుభవము.

గురుదేవుడు: అస్తిత్వనాస్తిత్వములు ప్రకృతికి సంబంధించినవి. పరమసత్యము ఆ రెంటికిని మీదిది.

భక్తులు కొన్ని నిమిషముల సేపు మౌనముగ నుండిరి.

గురుదేవుడు : [నరేంద్రునితో] బుద్ధు డేమి బోధించినాడు?

నరేంద్రుడు: దేవుని అస్తిత్వానాస్తిత్వముల మాట నెత్త లేదు బుద్ధుడు, కాని బ్రతికినన్ని నాళ్లు సకలప్రాణులయెడ కారుణ్యము చూపినాడు. డేగ పిట్టపై నుఱికి దాని కబళింప నుండ, పిట్టను కాపాడుటకై బుద్ధుడు తనమేని మాంసమును డేగ కర్పించెను.

డు మౌనముగ నుండెను. బుద్ధునిగూర్చిన సముత్సాహము నరేంద్రునకు హెచ్చుపెరిగినది.

నరేంద్రుడు: ఆహా! ఎంతటి త్యాగము బుద్ధునిది, రాజపుత్రుడుగా జన్మించి, సమస్తమును విడనాడెను. సంపదయే లేని, ఏమియునే లేని వాని త్యాగమున కర్థ మేమి? బుద్ధుడె నిర్వాణము ననుభవించిన పిమ్మట అత డొకసారి స్వనగరమునకువచ్చి భార్యను పుత్రుని రాజకుటుంబములోని యితరులను పెక్కండ్రను సన్న్యసింపు డని ప్రోత్సహించెను. ఎంత గాఢమైన త్యాగ మాయనది! మఱి వ్యాసుని నడవడిని జూడుడు 'అబ్బాయీ, గృహస్థుడవుగనే ఉండి, సాధనచేయు' మనుచు ఆయన తనపుత్రుడైన శుకదేవుని సన్న్యసింప వలదనెను.

శ్రీరామకృష్ణుడు మౌనముగ నుండెను. ఇంతవఱ కొక్కమాటనైనను చెప్పలేదు.

నరేంద్రుడు: శక్తియు గిక్తియు బుద్ధునకు లక్ష్యములేదు. ఆయనకు కావలసినది నిర్వాణమొక్కటే. ఆహా! ఎంతటి వైరాగ్యము ఆయనది! ధ్యానింప బోధివృక్షముక్రింద కూర్చున్నప్పుడు ఆయన 'నిర్వాణమే సిద్ధింపకున్న, నా దేహ మిచ్చటనే ఎండిపోవునుగాక' అని ప్రతిజ్ఞ చేసెను. అంతటి దృఢనిశ్చయము ఆయనది!

నిజముగ దేహమే గొప్పశత్రువు. దానిని శిక్షించుకొనకున్న ఏదైనను సాధ్య మగునా?

శశి : మాంసాహారముచే సత్త్వవృద్ధియగునని ఉపన్యసించువాడవు నీవేగా! మాంసమును తినక తప్ప దంటివే!

నరేంద్రుడు: నేను మాంసాహారినే, సందేహము లేదు. కాని వట్టిఅన్నమును, ఉప్పినను లేని అన్నమును తినియు నేను జీవింపగలను.

కొన్ని నిమిషములైన తర్వాత శ్రీరామకృష్ణుడు మౌనము వీడెను. 'బుద్ధుని తలపైని జుట్టున్నదేమో చూచితివా?' అని సైగమూలముగ నరేంద్రు నడిగెను.

నరేంద్రుడు: జుట్టు లేదు, మహాశయా, ఏదో ఒకవిధమైన కిరీట మున్నట్లున్నది. ఒకదానిపై నొకటిగా చుట్టబడిన రుద్రాక్షమాలలు ఆయనశిరను కప్పి యున్నట్లున్నది.

గురుదేవుడు : ఆయన కన్నులో?

నరేంద్రుడు: అవి ఆయన సమాధిలో ఉన్నాడని తెలుపుచున్నవి.

# దేహము - దేహి

## శ్రీ ఐ. వేంకటరావుగారు

దేహినో ఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తి
ర్ధీర స్తత్ర న ముహ్యతి.

దేహమునందు గౌమారము యౌవనము జరయు నెట్లు ప్రాప్తించు నట్లు దేహికి దేహాంతరము ప్రాప్తించు నని యీబోధ కర్థమును గైకొనుకంటె, నిద్దేహమునందలి దేహికి గౌమారము యౌవనము జరయు ప్రాప్తించుట వలె దేహాంతరము ప్రాప్తించు నని గ్రహించి నచో గౌమారము యౌవనము జరయు దేహాంతరము నొక్కతరగతివై సామ్యము ప్రాప్తిక్రియాపరమగు సత్యము ప్రకాశిల్లును.

ఈపట్టున, గౌమారము యౌవనము జరయు దేహికి జెందు నంట యేపాటి సత్య మని యారంభమునందే సంశయము పుట్టును.

ఒక్కనికే చెందినట్టి కౌమారమునాటి ఛాయాచిత్రమును యౌవనమునాటి ఛాయాచిత్రమును జూపి యాతడే యితం డని చెప్పి నప్పుడు కౌమారరూపమే యౌవనరూపమును, యౌవనరూపమే కౌమారరూపమునుగా గ్రహింపము గదా. రెండురూపములలో నున్నత డొక్కం డని యాశువుగ బోధ గలుగును.

కౌమారయౌవనజరాప్రాప్తియట్లు దేహి దేహాంతర ప్రాప్తియు దేహరంగమునందు ప్రదర్శనమును బొందును.

ఒక్కయుపాధికే జెందిన యింద్రియగోచరముగాని యొకానొక గుణమునకు నయ్యుపాధికి జెంది మన మెఱిగినవైన గుణముల నుపమించిన యెడల విషయము రసవంతమై యాకళింత సులభం బగును.

వర్తమాన దేహమును దేహి విడనాడుటతో దేహాంతరప్రాప్తి ప్రారంభ మగు నది చావను పేర వ్యవహారము నడచునది దేహమున జేతనత గోల్పుచ్చునిది గౌమారాదులు గానబడు నట్లు కంటికి గానబడుచావు యొక్క జాడే.

జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును దేహివే. మెలకువ దేహ మెఱుంగదు, కలత నిదురను దేహ మెఱుగదు, గాఢనిద్ర నెఱుగదు.

అయఃపిండము తప్తమై నిప్పుబంతియైన చొప్పుగా దేహ మాత్మాంశ యావేశించిన పిమ్మట నహంకారతాదాత్మ్యముచే జేతనగల దైనదివలె నగును. దేహము దేహికి దనయభిమతానుభవములకై వరించిన రంగస్థలము. దేహ మీదశయందుగూడ జడమే. చేతనత లేని జడద్రవ్యమూర్తి చచ్చుట యుండదు. అది గావున దేహాంతరప్రాప్తి దేహమునకుగాక దేహి కయినయట్లు కౌమారాదిదశలుగూడ దేహికి జెందినవి యగును.

దేహము సుషుప్తియందు జడము స్తంభించి యుండును. కలం గను నిద్రయందు జడము, కలయం దీ దేహావయవములు బనివినవు. దేహము మెలకువయందుగూడ జడమే. పరాకుగ నున్న వేళ నాజడత్వము దెలియవచ్చును. అప్పుడు చేత నున్న వస్తువు జాఱవిడుచుట సంభవించును. దీనికి ప్రతీకారము దేహము గైకోదు. అప్పుడు నీసన్నిధి గొఱవడి, స్వప్న సుషుప్తులు లేక జాగ్రత యను నవస్థయందున్న దన్న దేహము జడమే యని వెల్లడియైనది. దేహరంగమున జూపట్టు ప్రదర్శనములవలన

నందు చైతన్యవంతుడు వేఱొకడు గల డని తేటపడుచున్నది. అతడే దేహి.

ఎవ్వఁడు భాషించు నెవ్వ డాకర్ణించు నట్టి దేహికి దేహాంతర మేపోలికగా బ్రాప్తించు చున్న దన్నది యిచటి విషయము గాదు. దేహి దేహాంతరమును వేనిని బొందినయట్లు పొందుచున్నదో సామ్యము చెప్పినట్లైన దేహి గుర్తునకు దగులును.

న త్వే వాహం జాతు నాసం
న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః
సర్వే వయ మతఃపరమ్.

ఈ శ్లోకమునకు దేహపరముగ నర్థ మతు కదు. ఏ దేహము చచ్చి మరల కడుపునబడి పుట్టెను? ఈ శ్లోకవిషయము దేహిపరమై చెల్లును. తరువాతిదైన దేహినో ఽస్మిన్ యని యారంభించిన శ్లోకమున నిస్సంశయముగా దేహముగాక న త్వే వాహ మను పైశ్లోకమున ప్రస్తావించిన దేహి సుజ్ఞేయము గావుట సక్రమము.

దేహి కలుగును మఱి లేకపోవును. కలుగు టనగ దేహోపాధిని దాల్చుట, లేకపోవు టనగ దేహి దేహోపాధిని వదలి వెడలి పోవుట. నిత్యజాతము నిత్యమృతము నన్నను దేహిశాశ్వతత్వము దెలుపు నవసరమున గీతలయందే దేహియొక్క జాడ దేహమున కంటె వేఱై యుండుట లెస్సగా స్ఫురించుటకు దేహాంతరప్రాప్తిప్రజ్ఞ మెఱసి యిట్టు లుపమించు టయినది.

యథా నరః జీర్ణాని వాసాంసి విహాయ అపరాణి నవాని గృహ్ణాతి తథా దేహీ జీర్ణాని శరీరాణి విహాయ అన్యాని నవాని సంయాతి తెలిసినవిషయము నుపమానముగ జెప్పి తెలి యని దేహియొక్క జాడ చూపుటయినది. దేహియొక్క శాశ్వతత్వమును బ్రకటపఱచుట యిందలి యాశయము.

అట్లు తెలిసినవిషయము నుపమానముగ జెప్పి తెలియరానివిషయమును దెలియజెప్పిన పద్ధతిగ దెలియనివిషయమైన దేహియొక్క దేహాంతరప్రాప్తికి దెలిసినవిషయమైన దేహి కౌమారయౌవనజరాప్రాప్తి యుపమింపబడి నది. ఈ సూటికి గానిచో వాసాంసి జీర్ణాని యని చదువుశ్లోకమును మించి దేహినో ఽస్మిన్ యని చదువుశ్లోకము చెప్పెడిపాఠవిశేష మేమి?

జన్మమృత్యుజరాదుఃఖమోక్షము దేహి పరమైన విషయముగా గీతలయందే కల ప్రమాణ మిదిగో!

గుణా నేతా నతీత్య త్రీన్
దేహీ, దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై
ర్విముక్తో ఽమృత మశ్నుతే.

దేహ మమృతత్వము నందదు. దేహము భస్మాంతము. దేహి పుట్టుచుం జచ్చుచు నుండు.

"అహం త్వం సర్వే వయం నాసం న జాతు, నభవిష్యామః న చ." ఇట్లు నిత్యుం డైన దేహికి జన్మమృత్యువులవలె జరయు వర్తింపగా కౌమారయౌవనములుగూడ దేహికి వర్తించును.

జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో ఽమృత మశ్నుతే యనుటచే దేహికి దుఃఖమోక్షణమే చెప్పబడిన దన్నచో నింకొక ప్రమాణ మున్నది.

"జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతన్తియే తే బ్రహ్మ త ద్విదుః." ఇట్లు దుఃఖమును వేర్కొనక సూటిగ జరామరణ

మోక్షణము వక్కాణింపబడినది. మరణ మోక్షణము దేహమునకు లేదు. అట్లే జరా మోక్షణమును దానికి గాదు. భస్మాంతవంత మగు దేహ మది తా నుండిన గదా జరా మరణమోక్షణలాభమును బడయును?

కౌమారయౌవనజరాప్రాప్తి యీలాగు దేహిపర మనిన యెడల దేహినః యథా కౌమారం యౌవనం జరా తథా దేహాంతర ప్రాప్తిః యనక దేహినోఽస్మిన్ యథా దేహే యన నేల నన్నచో కౌమారయౌవన జరాప్రాప్తి ప్రాకృతబుద్ధిచోప్పను అస్మిన్ దేహే = దేహమునకు గాక, యీ దేహము నందలి దేహినః = దేహికి నని స్ఫృతి గొల్పుటకు.

కాని దేహో కూడ దలపింప జేయుటచే జాగృతి స్ఫుటమై యయిన దేదో చీకటిలోని వెలుగనుబోలి ప్రకటిల్లును. గుణా నేతా నతీత్య యని చాలింపక దేహసముద్భవాన్ అనుటయు నిట్టిపాటిదే. గుణము లాత్మకు తే వనుస్ఫురణ గలుగుటకు గుణాన్దేహ సముద్భవాన్ అనబడెను.

మఱొక యుదాహరణము—దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య యనుశ్లోకమున సర్వస్య దేహీ అవధ్యః యనిన జాలదా, సర్వస్య దేహే యనుటవలన నంతవంతము లైన దేహములవలెగాక దేహి యవధ్య మని 'వేదన గలుగుటకే. అట్లు కాదేని దేహీ దేహేసర్వస్య యనక దేహీ సర్వస్య యనిన జాలును. హృది సర్వస్య విష్ఠితమ్ అని యట్టి ప్రయోగ మున్నది.

సత్యమై సూక్ష్మమై గుప్తమైన పరవస్తుస్థితిప్రతిపాదనకు గానిదాని నూది బోధ సేయుట విడిచిన మార్గాంతరము లేదు. ఆత్మబోధకు ననాత్మనుగూర్చియే నోరాడును. ఆత్మజ్ఞాన లాభమునకు “నేతి నేతి” దీక్షావాక్యము.

సూక్ష్మమైన దేహి నూహం దెలియుటకు నంతవంతమైన దేహమును దలపింపంబోలును.

---

## భగవంతుఁడే పరమగురువు

**జైత్రశ్రీ**

ఈశ్వర స్సర్వ భూతానానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా
తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత,
తత్ప్రసాదా త్పరాం శాన్తిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

అర్జునా, ఎల్లభూతములకు నియామకుఁడైన యీశ్వరుఁడు ప్రాణుల హృదయములం దున్నవాఁడై జంత్రగాఁడు బొమ్మల నాడించురీతిగ మాయచేత జీవుల భ్రమింపఁజేయుచున్నాఁడు. నీ వా సర్వేశ్వరుని సర్వవిధముల శరణు పొందుము. ఆ జగద్గురుని యనుగ్రహమున నాత్మశాంతిని, అమృతత్వమునుఁ బొంద గలవు. ఇది శ్రీకృష్ణభగవానుని యాదేశము.

“వృథాకంఠక్షోభం వహసి తరసా
తర్కవచసా,
పదాంభోజం శంభో ర్భజ పరమసౌఖ్యం
వ్రజ సుధీ.”

ఓయి, పండితుఁడా, తర్క-శాస్త్రవాక్యములచే వ్యర్థముగ నేల గొంతు చించుకొనెదవు? పరమేశ్వరుని పాదపద్మముల భజింపుము. పరమానందము ననుభవింపుము. ఇది యాదిశంకరుల యభ్యర్థనము.

"ధరణిలోపల నాటాటు తత్త్వములను
నవలనై యున్న తత్త్వంబు నెవ్వఁ డెఱుఁగు
శివుఁడు గురురూపమున వచ్చి చెప్పకున్నఁ"

పరమేశ్వరుఁడు గురురూపమును ధరించి వచ్చి యథార్థము నెఱిఁగింపకున్న నీ భౌతిక వృత్తమున కవ్వలిదైన పరమాత్మ తత్త్వము నెవ్వఁడు దర్శింపఁగలఁడు? ఇది సదానందుల ప్రవచనము.

"సర్వవ్యాపియై, కృపామూర్తియగు సర్వేశ్వరుఁడు తన్ను ప్రేమించు భక్తునియెడ దయఁదలఁచి యతని యోగ్యతను బట్టి గురురూపమున వ్యక్తమగుచుండును. ఆ పరమాత్మరూపుఁడగు గురువు శిష్యుని సరియగు మార్గమున నడిపించుచు నాత్మసాక్షాత్కారము గల్గువఱకు సాయపడును." ఇది మహర్షి రమణుని మహావాక్యము.

ఇట్టి ప్రవచనములఁబట్టి సచ్చిదానంద స్వరూపుఁడగు భగవంతుఁడు సర్వప్రాణుల హృదయకమలమున వెలయుచున్నాఁడనియు, భగవంతుఁడే మనకాశ్రయింపఁదగినవాఁడనియు, భగవత్కృపవినా శుష్క-తర్క-వేదాంతముల నాత్మదర్శన మలభ్య మనియు, భగవంతుఁడే పరమగురు వనియు, నన్యుఁ డెవ్వఁడును యథార్థము నెఱిఁగింప సమర్థుఁడు కాఁజాలఁడనియు, మనము గ్రహింపఁగలము. "స పూర్వేషామపి గురుః కాలే నానవచ్ఛేదాత్." ఈశ్వరుఁడు త్రికాలాబాధితుఁడగుటచే సనాతనాచార్యులకుగూడ గురువై యున్నాఁడన్న పతంజలి వచనమునకు భాష్యమును జెప్పుచు శ్రీ వివేకానందస్వాములవారు "మానవగురువులైనను, దేవగురువులైనను గురువులందఱును దేశకాలబద్ధులే కనుక త్రికాలాబాధితుఁడగు నొక పరమగురువు కలఁడని మన మంగీకరింపక తీరదు. అఖండజ్ఞాన స్వరూపుఁడగు భగవంతుఁడే యట్టి పరమగురువని విశదీకరించియున్నారు. ఆ పరమగురుని గురుత్వ మెట్టిదో విచారింతము. మానవుఁడు సర్వదా సర్వదుఃఖనివృత్తిని బరమానందప్రాప్తి నన్వేషించును. ప్రకృతిబద్ధుఁ డగుటచే వాని యన్వేషణము భార్యాపుత్రాది బాహ్యవిషయములయందు వర్తించుచు సుఖదుఃఖమిశ్రిత వికృతజీవనమును బ్రసాదించును. ప్రాపంచిక విషయములలోఁ దనవాంఛా పరిపూర్తిని బొందలేమిని భ్రమాస్పదమగు నిట్టి జీవిత విలాసమున నసంతృప్తి ప్రబలి యతనిదృష్టి నిరవధికానందనిలయుఁడగు భగవంతుని వైపునకు మరలును.

పూర్వజన్మార్జిత మహాత్ముల ప్రబోధములవలననో యతని కొకనాటికి భగవన్మార్గము గోచరించును. భక్తిభావము దృఢమగుకొలఁది క్రమముగ విషయాదుల నతనికి గల ప్రీతి సడలును. అజ్ఞానపుపొరలు పలుచబడిపోవును. భగవత్ప్రేమ హెచ్చును. భగవంతుని ముఖాముఖిఁ జూడవలె నను వాంఛ ప్రబలును. కాని భగవద్దర్శనము కాదు. దుఃఖము కలుగును. భగవత్కాంతతోపాటే దుఃఖమును బ్రబలమగును. తుదకది యొక దివ్యోన్మాదముగఁ బరిణమించును. అప్పటినుండి భగవత్కృప వానిపైఁ బ్రసరింప నారంభించును. భగవంతుఁడే గురురూపమున భక్తునిఁ బరిపాలింపఁ బ్రసన్నుఁ డగుచుండును.

ఇందులకు భగవంతునివాక్యములే ప్రబల సాక్ష్యములు.

"తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం
యేన మా ముపయాన్తి తే
తేషా మే వానుకమ్పార్థ
మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా."

నిత్యము నాయందాసక్తికలిగి విశ్వాసపూర్వకముగ భజించు భక్తులకు నన్నుఁ బొందు జ్ఞానమార్గమును నేనే చూపుదును. భక్తుల కృతార్థతకొఱకు వారి హృదయములం దున్న నేను ప్రకాశకమైన జ్ఞానదీపమును వెలిగించి యజ్ఞాన మనెడి యంధకారమును నశింపఁ జేయుదును. అనగా గురురూపమున వారిని కృతార్థులఁ జేసెద నని భావము. భక్తునకు భగవదాచార్యకమునఁ బరమపవిత్రత ఘటిల్లును. పవిత్రతవలనఁ జిత్తము చాంచల్యముడిగి సాధనలం దేకైక లక్ష్యముగలది యగును. అప్పటినుండి ధ్యానయోగము ప్రారంభ మగును. ఈ స్థితియందు జ్ఞానస్వరూపిణియగు కుండలనీశక్తి మేల్కాని యూర్ధ్వనాడీగమనమును ధారాళముగ సాగించును. తఱచు భక్తునకు దివ్యానుభూతులు కలుగుచుండును. ఈ దివ్యానుభూతులు భ్రమరకీటన్యాయమున సాగివచ్చు భగవంతుని భక్తుని గురుశిష్యసంబంధమును సూచించుచుండును. శ్రీరామకృష్ణ పరమహంసకు పంచవటిలో నొకనాఁడు ధ్యానసమయమున గలిగిన దివ్యానుభూతినిగూర్చి వా రేమి సెల విచ్చిరో గమనింతము. "ఈ శరీరమునుండి చింతనిప్పుల వంటి ఎఱ్ఱని కన్నులు గల యొక నల్లని మనుష్యుఁడు బయటకు వచ్చి తప్పఁ ద్రావినట్లు తూలుచు నాయెదుటఁ దిరుగ నారంభించెను. మఱికొంత సేపటికి శాంతాకారుఁడై కాషాయ వస్త్రములు ధరించి చేతిలోఁ ద్రిశూలము పట్టుకొని యున్న మనుష్యుఁ డొకఁడు నాలోనుండి వచ్చెను. ఈ సన్న్యాసి మొదటివానిని తన త్రిశూలముతోఁ జంపివేసెను. ఆఱునెలలనుండి నన్నుఁ బీడించుచున్న యొకలిమంట లీదృశ్యము కనఁబడిన కొలఁదినాళ్లలోఁ బోయి నవి." ఆ త్రిశూలధారియగు దివ్యసన్న్యాసియే భగవంతుఁడు. దీనిఁబట్టి భగవంతుఁడు బాహ్యాభ్యంతరముల గురురూపమున ప్రత్యక్షమై సాధకుని యజ్ఞానరూపపాపపురుషుని బరిహరించి జ్ఞానమార్గమున సుశిక్షితుని గావించునని నిర్ధారణమగుచున్నది. ఈశిక్షణమున బాహ్యమునుండి భక్తుని మనస్సు నంతర్ముఖము గావించుటయు నంతరమునుండి దాని నాత్మ సాన్నిధ్యమున కాకర్షించి మాలిమి గావించుకొనుటయు నతి ప్రసిద్ధములు. ఇట్లు సుశిక్షితుఁడైన భక్తుని ధ్యానస్థితి పరిపూర్ణముగ వచ్చునప్పు డతనికిఁ దన్మయత సిద్ధించును. తన్మయతయందు భగవంతుఁడు భక్తునకు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములను చతుర్విధ ముక్త్యనుభూతులను బ్రసాదించును. తన్మయ మనసెట్టిదో గమనించి భగవంతుఁ డెందు భక్తునకా యనుభూతుల నెట్లు గలిగించునో విచారింతము.

మనస్సు రూపరహితమైనది. ఏవిషయమున నది వ్యాపించునో యా విషయాకారమును బొందును. మన స్సేవిషయాకారమును బొందునో యా విషయానుభూతి మనకు కలుగును. లేనిచో నా యనుభూతి గలుగదు. మన మన స్సెక్కడికో పోయినప్పుడు మనయెదుట నున్న భగవన్మూర్తి మనకు గోచరింపదు.

మనస్సు తిరిగి వచ్చి నేత్రేంద్రియముద్వారా బహిర్గతమై యా భగవన్మూర్తియందు వ్యాపించినప్పుడా మనస్సు తన్మయ మగును. అనగా తద్రూప మగును. అప్పుడు భగవద్రూపము గోచరించును. ఇట్లే ధ్యానస్థితియం దితరములనుండి పరావృత్తమైన మనస్సు ధ్యేయార్థమును బొంది జపాపుష్పసాన్నిధ్యము గల స్ఫటికమణివలెఁ దన్మయమగును. మనస్సు తన్మయ మగునేని మనమును దన్మయుల మగుదుము. కారణము మనస్సునకు వలెనే మనకు (ఆత్మకు) నెట్టి యాకారమును లేదు. మన స్సే యాకారమును బొందిన మనము నట్టి యాకారమును బొందుదుము. మన స్సే యాకారము నందకున్న మనకు నెట్టి యాకృతియు నుండదు. సుషుప్తియే యిందులకుఁ దార్కాణము. ''యచ్చితః తన్మయో భవతి గుహ్య మేతత్సనాతనమ్.'' చిత్తము శివునియందు వ్యాపించిన శివాకారమును బొందును. చిత్తమునకు శివాకార మేర్పడిన మనకును శివాకార మేర్పడును. దీనినే శ్రీ నారదమహర్షి భక్తిసూత్రములందు 'తన్మయతాసక్తి' యని నుడివి. దీనినే గీతయందు భగవానుఁ డనన్యయోగ మని పేర్కొనిరి. ''మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ.'' అనన్యయోగముచే నగు భక్తియే అవ్యభిచారిణీభక్తి. ఇది యే యేకత్వరూపమైన సమాధియోగమునుండి చలింపని భక్తి. శ్రీ వివేకానందస్వామివారు తన్మయత్వమునుగూర్చి ''అఖండప్రేమజ్యోతి సాన్నిధ్యములోఁ దాను తద్రూపమై ప్రేమ, ప్రియవస్తువు, ప్రేమికుఁడు నను మూఁడు నొక్కటియే యన్న భావ ముదయించి తన్మయత్వము జెందు ట''ని వివరించియున్నారు. అనగా ధ్యానము, ధ్యేయము, ధ్యాత యను త్రిపుటి నశించి కేవలస్థితి సిద్ధించు టని భావము.

తన్మయతాసక్తి, తాదాత్మ్యాసక్తి, తత్పరత, తద్రూపత, అనన్యత లనునవి పర్యాయ పదములు. తన్మయత సిద్ధించిన భక్తునకు భగవంతుఁ డతిసన్నిహితుఁ డగును. ఈ దశకు వచ్చునప్పటికే భక్తుని ధ్యానయోగము సంయమస్థితికి వచ్చును. ''త్రయ మేకత్ర సంయమః'' ధారణధ్యానసమాధుల సామ్యావస్థ సంయమ మని భావము. సూచిక అయస్కాంతమునందు వలె భక్తుని మనోవృత్తి లక్ష్యార్థమును బొంది స్థిరపడుచుండును. అయస్కాంతస్పర్శచే నినుమున కయస్కాంతలక్షణము నుంత సిద్ధించినట్లు భగవల్లక్ష్యమును స్పృశించిన చిత్తమునకుఁ దల్లక్షణమగు దివ్యజ్ఞాన మొకింత కలుగును. సంకల్పమాత్రమున భక్తునకు భగవల్లోకదర్శనము కలుగును. తద్విలాసములు కన్నులఁగట్టిన ట్లగుచుండును. ఇట్టి దివ్యానుభూతియే సాలోక్యానుభూతి. పోతన్నగారీ యనుభూతియందే ''అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదాపల'' నన్న పద్యము ననువదించిరి. ఇఁక సామీప్యానుభూతి యన ''సంకీర్త్యమానః శీఘ్రమే వావిర్భవతి, అనుభావయతి చ భక్తాన్.'' అని నారద భక్తిసూత్రములు. కీర్తించిన వెంటనే భగవంతుఁడు ప్రత్యక్షమై భక్తుల నానందపరవశులఁ జేయును. శ్రీరామకృష్ణుఁ డాత్మార్పణ నిష్ఠతో నోతల్లీ, యనఁగనే జగజ్జనని సాక్షాత్కరించి మందహాసమున నాయన నాశీర్వదించెడిది. భక్తుఁడు భగవంతునితోడను భగవంతుఁడు భక్తునితోడను బరస్పర మీదశయందు సంభాషించుకొనుట గమనింపఁదగినది. భగవత్సౌందర్యదర్శనమున నతఁడు కామినీకాంచనముఖ్యజగత్సౌందర్యముల కతీతుఁ డగును. భక్తి పరమభావమును బొందును. ''పునర్విశేష

భీరుశ్వాం పరమా భక్తి రుచ్యతే.'' భగవద్వియోగభయమే పరమాభక్తి. ఇందు భక్తుఁడు భగవత్సాన్నిధ్యము నెడఁబాయఁ జాలఁడు. క్రమముగ నతఁడీ సాన్నిధ్యానుభూతి నతిక్రమించి భగవత్సాన్నిధ్యబలమున సూర్య సన్నిధిని సూర్యకాంతమణివలె సారూప్యానుభూతినిఁ బొందును. జయవిజయు లిట్టి సిద్ధినిఁ బడసి శంఖచక్రగదాదిచిహ్నములనొప్పి విష్ణురూపులై విలసిల్లిరి. హనుమవ్యాఖ్యానమున శ్రీరామకృష్ణుఁ డిట్టి యనుభూతి నందెను. భక్తుఁ డీదశను బొందునంత సంయమసిద్ధి పరిపూర్తి నంది ధారణధ్యానములు సమాధియందు లయించును. అనగా ధారణధ్యానములు లోపించి సమాధిమాత్రమే భాసించును. పతంజలి ''తజ్జయాత్ ప్రజ్ఞాలోకః'' అని సంయమసిద్ధివలన జ్ఞానోదయలాభము నభివర్ణించియున్నాఁడు. భక్తునిచిత్తము సర్వజ్ఞత్వమునఁ బ్రకాశించును. ఈ స్థూలప్రపంచము భగవంతుని స్థూలదేహముగను, అపంచీకృత పంచభూతాత్మకమగు హిరణ్యగర్భతత్త్వమాయన సూక్ష్మదేహముగను, అవ్యాకృతమగు నీశ్వరతత్త్వ మాయన కారణదేహముగను, దోచుటయేగాక తన స్థూలదేహ మాయన స్థూలదేహముగను, దన సూక్ష్మదేహ మాయన సూక్ష్మదేహముగను, దన కారణదేహ మాయన కారణదేహముగను, దా నాయనగను నున్నట్లు విచిత్రమగు నద్వైతభావ ముదయించును. ఇట్టి యనన్యభావమే సాయుజ్యముక్తి. దీని ప్రసాదించుటకే భగవంతుఁడు భక్తునియెదుట నాచార్యరూపమునఁ బ్రత్యక్ష మగును. ''బ్రహ్మైవాచార్యరూపేణావతిష్ఠతే'' అని శ్రుతి చాటుచున్నది. ఈశ్వరుఁడు దక్షిణామూర్తియై వచ్చి సనకాదులకు జ్ఞానోపదేశ మొనర్చుటయే యిందులకు నిదర్శనము. భక్తుఁడు తాను మానవుఁడ నని కొనుచు భగవంతునిఁగూడ నట్లే దివ్యమానవాకృతిలో భావించి యట్టి భగవంతునితో సంబంధ మేర్పఱచుకొనును. ఈ సంబంధము బంధహేతు వగును. దీనిని బరిష్కరించుటకీశ్వరుఁడు గురురూపమునఁ బ్రత్యక్షమై యతని సరియగు మార్గమునకుఁ ద్రిప్పి యాప్రతిబంధకమును దొలఁగించి యాత్మసాక్షాత్కారము గల్గు పర్యంతము సాహాయ్యపడును. ఇందులకీ క్రిందివిషయము గమనార్హము. శ్రీరామకృష్ణున కపరోక్షానుభూతినిఁ గలిగింప గురువద్వైతసిద్ధాంతమును శాస్త్రప్రమాణములతో నుపపాదించుచు నామరూపాత్మకజగత్తు నతిక్రమించి నిర్వికల్పమగు నాత్మతత్త్వమున నిమగ్నుఁడవు కమ్మని బోధించెను. కాని రామకృష్ణునకు శ్రీలోకేశ్వరీరూపము సత్యముగఁ దోఁచుచు నతని యద్వైతసిద్ధికిఁ బ్రతిబంధక మయ్యెను. తన కట్టి సిద్ధి కలుగ దని నిరుత్సాహపడు శిష్యునిఁ బ్రోత్సహించి వికల్పస్థితినుండి నిర్వికల్పస్థితికిఁ బ్రబోధించుచు నట నున్న గాజుపెంకు నతనిఫాలమునఁ గ్రుచ్చి గురు విట దృష్టి నిలుపు మనెను. రామకృష్ణుఁ డట్లొనర్చి ప్రతిబంధకమై తోఁచు నాలోకేశ్వరీరూపమును జ్ఞానఖడ్గమున విదళించి నిర్వికల్పసమాధినిమగ్నుఁడై యాత్మసాక్షాత్కారమును బడసెను. భగవంతుఁడు మానవగురురూపమునఁ బ్రసన్నుఁడై స్వాశ్రితులను మోక్షప్రతిబంధములనుండి యుద్ధరించు ననుట కింతకంటె నిదర్శన మేమి కావలెను? ఇట గురు వన స్థూలదేహ మని కాదు. హృదయస్థుఁడై తోఁచు పురుషుఁ డని భావము. ఆత్మసాక్షా

త్కారమును బొందిన యొకశిష్యుఁడు గురువుతో నిట్లనుచున్నాఁడు. "అసంఖ్యాకమైన జన్మలకు గుఱియైన నాహృదయాంతరాళములలో నున్న యేకైకసత్యవస్తువు మీరే యని యిప్పుడు గ్రహించితిని. తాము మానవరూపము ధరించి నాయెదుటఁ బ్రత్యక్షమై నా యజ్ఞానమును సమూలముగఁ దొలఁగించినారు." దీనినిబట్టి స్వస్వరూపజ్ఞానమును బడసిన సిద్ధపురుషుఁడే గురురూపమున నున్నది భగవంతుఁ డని గ్రహింపఁ గల దని తేలుచున్నది. ముముక్షువు దురదృష్టవశమున నట్లు గ్రహింపకున్న నతనిప్రయత్నము నిష్ఫలమగు నను తలంపున శాస్త్రము "గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః" గురువు బ్రహ్మ, గురువు విష్ణువు, గురువు మహేశ్వరుఁడు, గురువు కేవల నిర్గుణనిర్విశేష పరబ్రహ్మ మని భగవద్భావము నుపదేశించుచున్నది. త్రిముఖములు షడ్భుజములు గలిగి మాలాకమండలు డమరు త్రిశూల శంఖచక్రధారియై అవధూతరూపమునఁ బ్రకాశించు దత్తాత్రేయయావతార మీ ప్రమాణవచనమునకు దృష్టాంతము.

గురురూపమున నిట్లు స్వాశ్రితభక్తజనుల ననుగ్రహించి స్వస్వరూపజ్ఞానప్రాప్తి పర్యంతము గురుత్వము వహించుచున్న పరమేశ్వరుఁడే మనకు శరణ్యము. ఆ కరుణామయుఁడు భక్తమణి నుద్దేశించి "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే." నాయందు మనస్సు నిలిపి భక్తితో నన్ను భజింపుము. నాకు నమస్కరింపుము. నీ వట్లు చేసితివేని నన్నే పొందఁగలవు. నీవు నాకు ప్రియుఁడవు. నీకు సత్యమును జెప్పితి నని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు. ఈ ప్రతిజ్ఞావాక్యమును వ్యాఖ్యానించుచు శంకరభగవత్పాదులు "ఏవం భగవతః సత్యప్రతిజ్ఞత్వం బుద్ధ్వా భగవద్భక్తేః అవశ్యం భావి మోక్షఫలం అవధార్య భగవచ్ఛరణైకపరాయణో భవేత్" భగవంతుని ప్రతిజ్ఞ సత్యమైన దనెడి సంగతి తెలిసికొని భగవద్భక్తుఁడు మోక్షమనెడి ఫల మవశ్యము కలుగు నని నిర్ధారణ చేసికొని భగవచ్ఛరణాగతి పరమలక్ష్యముగఁ గలవాఁడు కావలె నని వివరించిరి. కావున భగవచ్ఛరణాగతి మన కర్తవ్యము. అదియే యిహపరపరమసుఖాస్పదము. భగవంతుఁడే పరమగురువు.

"జగదీశ్వరు డెవడో అతడు ఒక్కొక్కరికిని బోధించును. ఈ జగత్తును సృజించినవాడును, సూర్యచంద్రులను ప్రజలను జంతువులను తక్కిన సకల ప్రాణులను సృజించినవాడును, వానికి జీవనాధారములను అమర్చినవాడును, బిడ్డల కందరికి తల్లిదండ్రులనొసగి ఆ బిడ్డలను పోషించుటకు వలసిన ప్రేమను ఆ తల్లిదండ్రులకు కలిగించినవాడును ఎవడో అతడు బోధించును. ఇన్నింటిని చేసిన సర్వేశ్వరుడు తన్నారాధించు మార్గమును ప్రజలకు చూపడా? వారికి బోధింప వలసిన అక్కఱ ఉన్నచో, అతడే గురువు అగును."

—శ్రీరామకృష్ణుడు.

# పరిప్రశ్నము

## [జిజ్ఞాసువుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానందస్వాముల జవాబు]

ప్రశ్న : "పూర్వము ఎవడు రాముడుగ ఉండెనో, ఎవడు కృష్ణుడుగ ఉండెనో అతడే ఇప్పుడు ఈ దేహమున రామకృష్ణుడుగ ఉన్నాడు, కాని మీ వేదాంతార్థమున కాదు" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారట. ఇది మన కర్థ మగు టెట్లు?

జవాబు : (గతసంచికతరువాయి) పూర్వము ఎవడు రాముడుగ ఉండెనో, ఎవడు కృష్ణుడుగ ఉండెనో అతడే రామకృష్ణుడుగ నున్నాడు అనునది గురుదేవుని వాక్యమున పూర్వభాగం. హిందూమత సంప్రదాయంలో ఎదిగిన వానికి పై వాక్యంలో భక్తిసంబద్ధములైన గూఢార్థాలు పెక్కులు స్ఫురిస్తాయి. హిందువులు భజించు అవతారాలలో అన్నిటికంటె ముఖ్యమైనవి రామావతారమున్నూ కృష్ణావతారమున్నూ. ఆధునిక చరిత్రకారుని దృక్పథంలో రాముడున్నూ కృష్ణుడున్నూ చారిత్రక యుగానికి మునుపటివారు. కాబట్టి చాలమంది హిందువులు రాముని కృష్ణుని చరితములను గూర్చి చెప్పేటప్పుడు వాని నిజాన్ని గూర్చి సంకోచం చెందుతారు, 'పంచతంత్రి' 'ఈసబు' కట్టుకథలను కథ లని పేర్కొన్నట్లుగా, ఆ యితిహాసపురాణాలను కూడ కథ లని పేర్కొంటారు. ఆ రాముడను నేనే ఆ కృష్ణుడను నేనే అని చెప్పుకోవడం మూలాన ఆ రెండు అవతారాలును చారిత్రకసత్యాలే అని గురుదేవుడు స్థిరపరుస్తున్నాడు. వారి చారిత్రికాంశములు ఇప్పటి ఇతిహాసాలరూపంలో కవులసూక్తుల ద్వారా మనకు అందునప్పుడు కొంత పెంపకం కొంత అతిశయోక్తి ఉండవచ్చు. గ్రంథశైలి చరిత్రగ్రంథాలశైలి కానంత మాత్రంచేత అవి నవలలు మున్నగువానివలె కేవలం కల్పితకథలని తలంచకూడదు. శ్రీరాముడూ శ్రీకృష్ణుడూ మహాపురుషులు, వారిలో రూపొందిన ఆదర్శములను శక్తిని ఇతిహాసాలు మనకు అందజేస్తున్నాయి. జాతిసమష్టి చిత్తంమీద ఆ మహాపురుషుల కుండే ప్రభావం ఈ యితిహాస గ్రంథాలలో రూపొందింది.

ఈ ఆశయం అంగీకరించిన ట్లైతే, శ్రీరామ చరితము శ్రీకృష్ణచరితము శ్రీరామకృష్ణ చరితము అనేవి ఒక్కపుస్తకంలోని మూడు అధ్యాయాలు అవుతాయి. శ్రీరామకృష్ణుడు శ్రీరాముని శ్రీకృష్ణుని ధ్యానించి, దాస్య-వాత్సల్య-మాధుర్యభావాలలో సాధన సాగించాడు. ఆ అవతారమూర్తులు ఆయనకు ప్రత్యక్షం అయ్యారు, ఆయనలో ఐక్యం చెందారు. ఈ సాధనానుభవాలవల్ల ఆ అవతారమూర్తుల యథార్థత్వమును, వారితోడి శ్రీరామకృష్ణుని ఐక్యమును నిరూపితము లైనవి.

ఈ మూడు అవతారమూర్తులను పరిశీలించినప్పుడు, ప్రతిమూర్తికిన్ని గల ఒకప్రత్యేకతను వారి ప్రత్యేకతలు పరస్పరము పూరకములు అనుటయు మనం గుర్తిస్తాం. ఆదర్శమానవత్వం గుండ దివ్యతను చూపినవాడు శ్రీరాముడు. పౌరుషము సత్యపరత ధర్మము మున్నగు సకల కల్యాణగుణాలకున్నూ శ్రీరాము డాదర్శం. "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్"—ఇత్యాదిగా సకల శుభగుణ సంపన్ను డగు ఆదర్శపురుషుడు ప్రస్తుతం ప్రపంచంలో ఎవడు అని వాల్మీకి నారదుని ప్రశ్నించాడు. శ్రీరాముడే అట్టి ఆదర్శపురుషుడు అని చెప్పి నారదమునీంద్రుడు ఇట్లు ప్రస్తుతించాడు :— "నీవు కీర్తించిన గుణములు అనేకములు, దుర్లభములు. ఆ గుణములు గల నరుని తెలిసికొని

చెబుతున్నాను, విను. ఇక్ష్వాకువంశప్రభవుడు రాము డను పేర విఖ్యాతుడు, నియతాత్ముడు, మహావీర్యుడు, ద్యుతిమంతుడు, ధృతిమంతుడు, వశి, బుద్ధిమంతుడు, నీతిమంతుడు, వాగ్మి, శ్రీమంతుడు, శత్రునిబర్హణుడు, విపులాంసుడు, మహాబాహువు, కంబుగ్రీవుడు, మహాహనువు, మహోరస్కుడు, మహేష్వాసుడు, గూఢజత్రుడు, అరిందముడు, ఆజానుబాహువు, సుశిరుడు, సులలాటుడు, సువిక్రముడు, సముడు, సమవిభక్తాంగుడు, స్నిగ్ధవర్ణుడు, ప్రతాపవంతుడు, పీనవక్షుడు, విశాలాక్షుడు, లక్ష్మీవంతుడు, శుభలక్షణుడు, ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, జనహితరతుడు, యశస్వి, జ్ఞానసంపన్నుడు, శుచి, వశ్యుడు, సమాధిమంతుడు, ప్రజాపతిసముడు, ధాత, రిపునిషూదనుడు, జీవలోకరక్షకుడు, ధర్మపరిరక్షకుడు, స్వధర్మరక్షకుడు, స్వజనరక్షకుడు, వేదవేదాంగతత్త్వజ్ఞుడు, ధనుర్వేదనిష్ఠుడు, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుడు, స్మృతిమంతుడు, ప్రతిభావంతుడు, సర్వలోకప్రియుడు, సాధువు, అదీనాత్ముడు, విచక్షణుడు, నదులచే సముద్రమువలె సాధువులచే సదా అధిగతుడు, ఆర్యుడు, సర్వసముడు, సోముని వలె సదైకప్రియదర్శనుడును, సర్వగుణోపేతుడు, కౌసల్యానందవర్ధనుడు, సముద్రగంభీరుడు, హిమవత్పర్వతధీరుడు, విష్ణుసదృశవీర్యుడు, క్రోధమున కాలాగ్నిసదృశుడు, క్షమయందు పృథివీసమానుడు, త్యాగమందు కుబేరునివంటివాడు సత్యమునందు అపర ధర్మదేవత.''

దివ్యతలో మఱొకవైపు శ్రీకృష్ణునిలో అగపడుతుంది. ఆదర్శమానవత్వంగుండా కనిపించే దివ్యత కా దతనిది; ఎటువంటి పరిసరములచేత గాని పరిస్థితులచేత కాని వికృతి నొందని దివ్యత శ్రీకృష్ణునిది. 'నదినదాదిప్రవాహములచే నింపబడుతున్నప్పటికిని తనహద్దు మీఱనిదై సముద్రమెట్లు తనలోనికి వచ్చు జలములన్నిటిని గ్రహించుచు కొంచెమైనను వికృతినొందకుండునో, అట్లే శబ్దాదిసమస్తవిషయములను గ్రహిస్తున్నప్పటికి కొంచెమైనను వికృతి నొందక యుండు యోగి శాంతినిబొందును''. ఇది భగవద్గీతలో శ్రీకృష్ణుడే చెప్పిన వాక్యం. ఇందుకు లక్ష్యం ఆయనచరిత్రమే. శత్రువు లతనిని అత్యంత భయద్వేషాలతో దరిశారు. కాళీయసర్పం తన కోఱలవిషంతో ఆయన్ను సత్కరించింది. యశోదానందులు ఆయన్ను తమ వాత్సల్యానికి లక్ష్యంగా చేసికొన్నారు. గోపికలు ఆయన్ను, ప్రియుని సంశ్లేషానికై తహతహపడు ప్రియురాండ్ర తృష్ణతో సమీపించారు. భక్తియుక్తులగు ప్రజలు ప్రభువు నాశ్రయించినట్లు వృష్ణులు ఆయన్ను ఆశ్రయించారు. ఇందులో ఒక్కొక్కరిని వారివైఖరి కనుగుణంగా చేరదీసి తన పావనశక్తిచే అందరిని ఏకరీతిగా శ్రీకృష్ణుడు పరిణతి నొందించాడు. శ్రీకృష్ణుని తండ్రిగానో ప్రభువుగానో శిశువుగానో సఖునిగానో భర్తనుగానో కాముకునిగానో పరమశత్రువుగానో—ఎట్లైనా భావించవచ్చు. ఆ భావంలో ఉద్దామధ్యానగరిష్ఠత ఎవరికి కుదురుతుందో వారు యోగులును వేదాంతులును అగు మహర్షులు చెందు పరమపదమునే చెందుతారు. మానవులు శ్రీకృష్ణుడు ఉపదేశించిన భక్తిమార్గమును తన నడవడిలో ఆయన చూపిన నిస్సంగత్వమును అనుసరించాలి, ఆయన చేసిన పనులను అనుకరించకూడదు. ఈలోకంలో మంచిని చెడుగును కూడా గ్రహించే అగ్నివంటివాడు శ్రీకృష్ణుడు. ఆయన ప్రతిపని లోకమున కొక విశిష్టశ్రేయమును

సాధించేందుకు చేశాడు కాని, తన పనుల నితరులు అనుకరించేందుకు ఉద్దేశించలేదు. విశ్వశ్రేయముకై శివుడు విషమును త్రాగినాడు. ఆగరళ మాయనకు కంఠాభరణమై ఉంది. సామాన్యమానవుడు ఆ విషంలో ఒక చుక్కను నోట వేసికొన్న చస్తాడు. ఆ విషపానంవలె శ్రీకృష్ణుని చేష్టితములను అనుకరణసాధ్యములు కావు. చేతనలు అనుసరించవలసింది శ్రీకృష్ణుని 'ఉపదేశము'ను, శ్రీరాముని 'అనుష్ఠానము'ను.

శ్రీరామకృష్ణుడొక విశిష్టావతారం: ఆయన ఉపదేశాలూ శిరోధార్యాలే, ఆయన నడవడియూ జగదనుసార్యమే. ఆదర్శసన్న్యాసియు ఆయనే, ఆదర్శ గృహస్థూ ఆయనే. ఇట్టి విశిష్టతలు మూర్తీభూతములైన జీవితపువిలువలను బట్టి, ఆయన అందరికీ ఆదర్శం అయ్యాడు. దాస్యవాత్సల్యాది సకలభావాలను తన అనుష్ఠానంలో చూపి ఆయన నిరూపించాడు, హిందు పారమార్థికసంప్రదాయంలో శ్రీకృష్ణుని స్థానం నిరవధికాతిశయం. ఆ పూర్ణావతారుని ఈనాటి మానవతతిని కలిపే కొలికిపూస శ్రీరామకృష్ణుడు. వైరాగ్యంలోనూ భగవత్తృష్ణలోనూ శ్రీరామకృష్ణుడు వెలయించిన 'మానా' సాటి లేనిది. అందులో ఒక లవాంశం చాలు మానవుని జీవితాన్ని ధన్యమొనర్చడానికి.

ఆయనకు 'శ్రీరామకృష్ణు' డనే పేరు పెట్టిందెవరో ఎవ్వరికీ సరిగా తెలియదు. వేదములు అపౌరుషేయములు కాబట్టి వాని ఆవిర్భావం దివ్యం. అట్లే 'శ్రీరామకృష్ణ' నామమును. మనసు తెలిసి, మానవులెవరూ పెట్టింది కాదు. ఈయనకు ప్రాచీనావతారము లన్నిటితో సంబంధం కలుప సంకల్పించిన లోకజననియే శ్రీరామకృష్ణనామమును ఎన్నుకొన్న దని ఎంచవలె. హిందువులకు ఆదర్శమైన దివ్యావతారాల స్వరూపం సరిగా అర్థం కావాలంటే ఆలాంటి సంబంధం నెలకొల్పబడవలె. శ్రీరామ-శ్రీకృష్ణ-శ్రీరామకృష్ణుల విలువలను వేఱు వేఱుగా చెప్పాలంటే ఇట్లు చెప్పవచ్చు:- శ్రీరాముడు వీరవతంసుడైన ధార్మికప్రభువు. శ్రీకృష్ణుడు 'గహనశీలుడు'. శ్రీరామకృష్ణుడు తపస్వి, భక్తిపరాయణుడు. ఐతే ఆదర్శమానవుడైన శ్రీరాముడున్నూ, రాజనిర్మాతయు గోపికావల్లభుడును అయిన శ్రీకృష్ణుడును తపస్వియైన శ్రీరామకృష్ణుడును ఒక్కరే అన్నప్పుడు మాత్రం జిజ్ఞాసువుల కిది అగాధదివ్యమర్మం! కాబట్టి 'ఎవడు పూర్వము రాముడో, కృష్ణుడో, అతడే ఈ దేహమున రామకృష్ణుడు' అనెడి శ్రీరామకృష్ణసూక్తి, భారతీయభగవచ్ఛాస్త్రాభివృద్ధిలో ఒక గొప్పమెట్టును సూచిస్తుంది.

ధ్యాన మది యెంతో, భక్తి దానంతె గలుగు,
భక్తి యది యెంతో, ప్రాప్తియుం బరంగునంతె,
సర్వమూలము చూవె విశ్వాస మిలను
అమ్మకాళి పాదములను అమృతసరసి
నోలలాడుచు నాహృది యొప్పనేని,
పూజ యేల? నివేదనలో పుణ్య
లన్నియును నేల నాకింక నరసి చూడ?

శ్రీరామకృష్ణసూక్తిసుధ. పు. ౬౮.

# శ్రీమదోంకారానందస్వాముల మహాసమాధి

ణ్ణసంస్థకు ఉపాధ్యక్షులలో ఒకరైన శ్రీమదోంకారానందస్వాములు తమ డెబ్బైయేడవసంవత్సరమున కంకూర్గచ్చి యోగోద్యానకేంద్రంలో 1973-వ సంవత్సరం మే నెల 8-వ తేది మంగళవారంనాడు మధ్యాహ్నానంతరం 4 గంటల 50 నిమిషాలకు మహాసమాధి నొందారనుట భక్తులకు మిత్రులకు అందరికీ అత్యంతవిషాదవార్త. మే 8-వ నాడే వారి దేహమును బేలూరు మఠాని చేర్చారు, దహనసంస్కారం మఱునాడు జరిగింది.

గీర్వాణసారస్వతంలోను శాస్త్రవాఙ్మయంలోను వారి అగాధపాండిత్యం సుప్రసిద్ధం. వారు 1919-వ సంవత్సరంలో భువనేశ్వర మఠంలో చేరారు. ఆధ్యాత్మికజీవితంలోనికి ప్రవేశం మాతృశ్రీశారదాదేవినుండియే పడయుగాంచిన ధన్యాత్ములు వారు. సర్వమఠాధ్యక్షుల పరంపరలో రెండవవారగు శ్రీ శివానందస్వాముల (మహాపురుష మహారాజుల) వారు వారికి 1923 లో సన్న్యాసదీక్ష ఒసగినారు. బేలూరుమఠంలో మేనేజరుగా చిరకాలం ఉండి, వారు 1944లో వారణాసిలో అద్వైతాశ్రమయాజమాన్యమును వహించారు. 1951-వ సంవత్సరంనుండి వారు కంకూర్గచ్చియోగోద్యానానికి అధ్యక్షులుగా ఉండినారు. 1929 లో వారు శ్రీరామకృష్ణమఠ ధర్మకర్తలలో ఒకరుగను శ్రీరామకృష్ణమిషను పాలకపరిషత్తులో ఒకసభ్యులుగను ఎన్నుకోబడ్డారు. 22-2-1966-వ తేదినాడు శ్రీరామకృష్ణసంస్థలో గల ఉపాధ్యక్షపదవులు రెంటిలో ఒకదానిని వారు అధిష్ఠించారు. ఏకాగ్ర భక్తితో వారు సంఘసేవ చేశారు. వారి మహోజ్జ్వలవైరాగ్యమున్నూ మహోన్నతాధ్యాత్మికసిద్ధులున్నూ యువసన్న్యాసులకూ ఆధ్యాత్మికజీవితంలో క్రొత్తగ అడుగిడినవారికీ నిరంతరోత్సాహప్రదములుగా ఉండేవి.

గురుదేవుని శ్రీచరణసన్నిధిలో వారు పరమవిశ్రాంతి పడయుదురు గాక.

# వార్తలు - విశేషాలు

## శ్రీ చైతన్యజయంతి

మదరాసు శ్రీ రామకృష్ణ మఠంలో 18-3-1973 తేదినాడు శ్రీ చైతన్య జయంతి కొనియాడబడింది.

విష్ణుసహస్రనామానుసంధానంతో ఉత్సవం ప్రారంభ మైంది.

ప్రొఫెస్సరు సి. ఎస్. రామకృష్ణన్ గారు సదస్యులకు స్వాగతవందనసమర్పణం కావించారు.

తర్వాత అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్యం గారు శ్రీచైతన్య మహాప్రభుని జీవితోపదేశాలనుగూర్చి తమిళంలో ప్రసంగించారు, రకరకములైన వారు శ్రీచైతన్యుని సంపర్కప్రభావంచేత ఏలాగు మార్పొందారో, ఆయన సంకీర్తన సందేశాలు ప్రజల హృదయాలను ఎట్లు అమోఘరీతిలో మరులుగొల్పాయో వివరించి, శ్రీసుబ్రహ్మణ్యంగారు, చైతన్యదేవుని యాత్రలను నిరంతర మహానుభావానుభూతిని ప్రస్తుతించారు.

ప్రొఫెస్సరు కె. శేషాద్రిగారు ఆంగ్లంలో ఉపన్యసిస్తూ, చైతన్యదేవుని ప్రేమశక్తిని అనుగ్రహప్రభావమును విశదీకరించారు, శుష్కసాధనలకంటె సమగ్రశరణాగతికి ప్రాముఖ్యం హెచ్చు అనెడి శ్రీచైతన్యుని సిద్ధాంతమును తేటపరిచారు.

సభాధ్యక్ష్యం వహించిన శ్రీ విమలానంద స్వాములవారు శ్రీకృష్ణసంకీర్తన మహిమను, నిర్విరామ జపస్మరణముల పరమ ప్రయోజనమును నొక్కి వక్కాణించారు.

## మద్రాసు మైలాపూరు శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాల

### 1971-72 వ సంవత్సర నివేదిక

ఈసంవత్సరంలో అలోపతిక్, హోమియోపతిక్ శాఖలు రెంటిలో కలిసి వైద్యసాహాయ్యం పొందినవారి సంఖ్య 1,56,504. నేత్రవ్యాధితో బాధపడే పేదలకు ఈవైద్యశాలలోని నేత్రశాఖ వరప్రసాదంగా పనివడింది. చికిత్సపొందినవారి సంఖ్య 14,754. ఆధునిక పరికరసంపన్నమైన శ్రోత్ర - ఘ్రాణ - కంఠ శాఖలో వైద్యసాహాయ్యం పొందినవారి సంఖ్య 10,121. ఎక్స్రేశాఖలో 377 రోగులు ఆదరింపబడ్డారు. శిశువైద్యశాఖలో కొన్ని ప్రత్యేక చికిత్సలు కావింపబడ్డాయి. దంత వైద్యశాఖ సకలపరికరసంపన్నం. అందు చికిత్స చేయించుకొన్నవారిసంఖ్య 7,456. పరిశోధనాలయంలో 591 వేర్వేఱు దినుసులు పరిశోధింపబడ్డాయి.

రోగబాధితులగు ప్రజలకు ఈలాంటి వైద్యసేవ సమకూర్చడం ఎంతో ధనసాధ్యం కాబట్టి ఉదారమహాజనులున్నూ ప్రభుత్వం వారున్నూ విరాళా లిచ్చి సహకరించాలి.

# గ్రంథపరిచయం

## శ్రీరామనామ మాహాత్మ్యము

కీర్తిశేషులైన శ్రీ ఎల్. వేంకటస్వామి నాయుడుగారియెడను వారిసతీమణియైన శ్రీమతి జానకమ్మగారి యెడను భక్తిపూర్వకంగాను వారి జ్ఞాపకచిహ్నంగాను వారి సంతానంచే భక్తులఉపయోగార్థం శ్రీకోనతల్లి ఆశీస్సులతో ముద్రిత ప్రకటితమైనది ఈ పుస్తకం. ఇందు రామనామం అనే మకుటంతో అమృత మధురములైన 302 పాదాల 'వృషభగతి-రగడ'లో రామనామమాహాత్మ్యం ప్రస్తుతమైనది. ఆదియందు చేర్చబడ్డ ధ్యానశ్లోకాలు అంతమందు చేర్చబడ్డ మంగళశ్లోకాలు ఆ మాధుర్యానికి ఉపబృంహకములుగ ఉన్నాయి. ఈ పుస్తకం కావలసినవారు "శ్రీ ఎల్. వేణుగోపాల్ 1-10-129 అశోకనగర్, ముషీరాబాదుపోస్టు, హైదరాబాదు 20" అనే చిరునామాకు వ్రాసి ఉచితంగా తెప్పించుకోవచ్చు.

## భగవదాశ్రయము

### (ఖండకావ్య సంపుటి)

రచయిత : చక్రవర్తుల పద్మనాభశాస్త్రి. ప్రకాశకులు: అనంతపద్మనాభ ప్రచురణలు, కాటవరం, రాజమండ్రి తాలూకా. పుటలు 41, వెల రూ. 1-00.

ఈ ఖండకావ్యసంపుటిలో గద్యపద్యములు కలిసి మొత్తము 220 ఉన్నవి. ఇవి భగవదాశ్రయప్రభావాన్ని తెలుపుతూ తత్త్వార్థ బోధకములైన కథలు రెండు, శ్రీకృష్ణసందేశము, యోజనగంధి, కలిపురుషుడు — అనే శీర్షికల క్రింద అమరిఉన్నవి. ఇందు పద్య పాద సంఖ్యా నియమం తరచు అతిక్రాంతమైనా. పద్యరచనాభ్యాసం అభినివేశంతో సాగింపబడింది. బ్రహ్మశ్రీ ఆకొండి వేంకటశాస్త్రిగారు తమ అభిప్రాయంలో తెల్పిన రీతిగా — ఈ రచయితగారి పద్యరచన భవిష్యత్కాలంలో మెరుగుదేల వచ్చు.

ప్రభాకర్

---

రామకృష్ణ మిషను

## త్రిపురలో వరదబాధితులకై సాహాయ్యకార్యక్రమం

## విన్నపం

ఇటీవల త్రిపురలో వరదలవల్ల వాటిల్లిన ధనునష్టం మహాజనులందరూ ఎరిగిందే. ఎందరో ప్రాణాలను కోల్పోయ్యారు. వేలాది ప్రజలు సర్వస్వం పోగొట్టుకొని నిలువ నీడ లేనివా రయ్యారు. వరదలచే విధ్వస్తములైన ప్రాంతాలలో ప్రజలకు అన్నం - వస్త్రం - తలకు నీడ ఔషధములు మొదలగునవి జరూరుగా సరఫరా చేయవలసిఉన్నది.

బాంగ్లాదేశకష్టనివారణ, గుజరాతమహారాష్ట్రప్రాంతాలలో వరుపుకాటకాలచే పీడితులైన ప్రజలకు సాహాయ్యకార్యక్రమం అనెడి దుర్వహబాధ్యతలను నిర్వహిస్తున్న రామకృష్ణమిషనువారు త్రిపురలో వరదబాధితులకు ఆదుకోవలసిన జరూరావశ్యకతయు ఏర్పడింది.

ఈ సాహాయ్యసేవాకార్యక్రమాన్ని మేము చురుకుగా నెరవేర్చగలందులకై మాకు తోడ్పడవలసిందని ఉదారమహాజనులను ప్రార్థిస్తున్నాం. విరాళాలను వస్తురూపంగా గాని రొక్కరూపంగా గాని ఈ క్రింది కేంద్రాలకు అందజేస్తే కృతజ్ఞతతో స్వీకరించి రసీదు అందజేస్తాం.

1. రామకృష్ణమిషను, బేలూరుమఠము, 711-202 హౌరా, పశ్చిమబెంగాలు.
2. అద్వైతాశ్రమం, 5 డేహిఎన్టాలిరోడ్డు, కల్కత్తా 700-014
3. ఉద్బోధనఆఫీసు, ఉద్బోధన లేన్, కల్కత్తా 700-003
4. రామకృష్ణమిషను, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్, గోల్పార్కు, కల్కత్తా 700-029
5. రామకృష్ణమిషన సేవాప్రతిష్ఠానం, 99 శరత్బోసు రోడ్డు, కల్కత్తా 700-026

బేలూరు మఠం
మే 26, 1974

గంభీరానందస్వామి
జెనరల్ సెక్రెటరి




# ఇరువది తొమ్మిదవ సంపుటము

౧౯౭౨ జూలై పరీధావి ఆషాఢము మొదలు ౧౯౭౩ జూన్ ప్రమాదీచ జ్యేష్ఠము వరకు


సంపాదకులు :

శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ నేలటూరి భక్తవత్సలము, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్.






శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

సాలుచందా రూ. 5. విడిసంచిక 50 పైసలు.

# అకారాది విషయానుక్రమణిక

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ


సంపుటము ౩౦ ౧౯౭౩ - జూలై : ప్రమాదీచ - ఆషాఢము సంచిక ౧


## విషయసూచిక

ఫోన్: 71231 పోస్టు బాక్సు: 635

మా మాసపత్రికలు

## వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయకంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో 6 రూపాయలు; సింహళములో 8 రూపాయలు. ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

## శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయకంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో ర్వూ 5 లు, సింహళములో ర్వూ 7 లు.

## శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును పెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో ర్వూ 5 లు, సింహళములో ర్వూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను 6¼% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతీ కేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఈ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు:

**మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4**

అనే విలాసానికి వ్రాయండి.

## శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (అల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

## ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకులవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4



'అఖిలవిభు శరణొందుము, యా శ్రణంబ యతనిక్రప నీకు నరుధూలి కంపు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 30 } ౧౯౭౩ - జూలై :: ప్రమాదీచ - ఆషాఢము { సంచిక ౧


శ్రీః

## కనకధారాస్తవము

శ్రీ శంకరభగవత్పాదులు

శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదశఙ్కరం లోకశఙ్కరమ్.

శ్రుతులకును స్మృతులకును కరుణకును ఆలయమైనవారును లోకశంకరులును (=లోకమునకు సుఖమును గలుగజేయువారును) అగు శ్రీ శంకరభగవత్పాదులకు ప్రణమిల్లు చున్నాను.

అఙ్గం హరేః పులకభూషణ మాశ్రయన్తీ భృఙ్గాఙ్గనేవ ముకుళాభరణం తమాలమ్
అఙ్గీకృతాఖిలవిభూతి రపాఙ్గలీలా మాఙ్గల్య దాస్తు మమ మఙ్గళదేవతాయాః. 1

| | |
|---|---|
| ముకుళ+ఆభరణమ్ | మొగ్గలచే అందగించునదైన |
| తమాలమ్ ఆశ్రయన్తీ | చీకటిచెట్టు నాశ్రయించిన |
| భృఙ్గ+అఙ్గనా+ఇవ | భ్రమరివలె |
| పులకభూషణమ్ | రోమాంచముచే అందగించుచున్న |
| హరేః అఙ్గమ్ | విష్ణుదేవుని మేనిని (వక్షఃపీఠమును) |
| ఆశ్రయన్తీ | ఆశ్రయించియున్నదియు |
| అఙ్గీకృత | తనవశమం దుంచుకోబడిన |
| అఖిలవిభూతిః | సకలైశ్వర్యములు కలదియు అగు |
| మఙ్గళదేవతాయాః | లక్ష్మీదేవియొక్క— |
| అపాఙ్గలీలా | కడకంటిచూపు |
| మమ | నాకు |
| మాఙ్గల్యదా అస్తు | మంగళప్రదము కావుత |

వైకుంఠుడు : మహాశయా, మేము లౌకికులము. మా కేదేని హితము నానతిండు.

శ్రీరామకృష్ణుడు : మొదట దేవు నెఱుంగవలెను, పిమ్మట లోకమున మీ విధులను నిర్వర్తించుకోవలెను. ఒక చేతితో భగవంతుని చరణారవిందముల నవలంబింపుము. రెండవ చేతితో నీ కర్తవ్యములను నిర్వహించుచుండుము.

వైకుంఠుడు : జగత్తు మిథ్యయేనా ?

శ్రీరామకృష్ణుడు : ఔను. భగవంతుని సాక్షాత్కారము గలుగనంతవఱకును జగత్తు మిథ్యయే. అజ్ఞానముచే మానవుడు దేవుని విస్మరించి, సదా 'నేను' 'నాది' అని వాగుచుండును. మాయాజాలములో తగుల్కొని అతడు, కామినీకాంచన వ్యామోహమునకు లోనై, నానాటికి మఱింత అధోగతి పాలగుచుండును. విముక్తిమార్గ మున్నను, ఆ మార్గ మతనికి కనిపింపదు. అతని యెఱుకను మాయ అంతగా అపహరించు నన్నమాట. ఈ పాట విను—

ఆమహామాయమహిమచే అంతభ్రాంతి
జగము నావరింప, సరసిజాసనుం, డ
ల కమలానాథుఁడును – వెఱ్ఱులగుదు రనగ,
నరుల కుండునె యోసపా టరసి చూడ!

జగము ఎంత అశాశ్వతమైనదియు స్వానుభవమున మీ రంద ఱెఱుఁగుదురు. ఈ రీతిగ కనుడు—ఈ లోకములో పుట్టినవా రెందఱు? గిట్టినవా రెందఱు? ప్రాణులు పుట్టుచున్నారు, చచ్చుచున్నారు. ఈ క్షణమున ఉన్న జగము మఱుక్షణమున ఉండుటలేదు. అది అనిత్యము. నీవు మరణించునేటి తడవు, ఎవ రెవరిని నీవు స్వజన మని భావించుచున్నావో, వా రిక నీకుండరు. కొంద ఱున్నారు. వారికి సన్నిహిత బంధువులు ఎవరునే లేరు. ఐనను మనుమని విడువలేని కారణముగా వారు కాశికి పోరు, ఆధ్యాత్మిక జీవితము గడపరు. 'అయ్యో, హాతుగతి ఏమి కాను' అందురు.

మొదట సన్నని దారి నిడుదురు, వెన్క-
వలను పఱతురు, దారి దాపలనె యున్న,
లోపలికె పోవు చేపలు, వెలికి రావు
నిర్గమనమార్గ మున్నను నిలుచు పట్టు
పురుగు కాయలో కటకటా మరణ మొంద!

ఇటువంటి జగత్తు అనిత్యము, బూటకము.

పొరుగువాడు : మహాశయా, ఒకచేతితో భగవంతుని శ్రీచరణములను రెండవ చేతితో జగమును ఏల అవలంబింపవలెను? జగము అనిత్య మగునేని చేయి చాచి దాని నవలంబించు టెందుకు?

శ్రీరామకృష్ణుడు : భగవంతుని సాక్షాత్కరించుకొన్న పిమ్మట జగత్తులో నివసించువానికి జగత్తు అనిత్యము కాదు. మఱొక పాట విను—

సాగు నెఱుఁగవు కద మానసంబ, కాన
బీడువడియెను నీదు జీవితపుఁబొలము;
ఉచితరీతిని కృషి చేసి యుంటి వేని,
పంట కోకొల్లలుగఁ బండి వఱలుఁగాదె!
పైరులకు భద్రపఱుపఁగవలయునేని,
కాళినామముచేఁ జుట్టు కంచె నిడుము,
కంచెలందు దుర్భేద్య మా కంచె, దాని
దండపాణియు డాయంగ దద్దఱిల్లు.

వింటివా పాటను ?

పైరులకు భద్రపఱుపఁగ వలయునేని,

కాళినామముచే జుట్టు కంచె నిడుము. నిన్ను దేవుని కర్పించుకొనుము, సర్వమును సాధింపగల్గుదువు.

కంచెలందు దుర్భేద్య మా కంచె, దాని
దండపాణియు డాయంగ దద్దఱిల్లు.

ఔను. అది అతిదృఢమైన కంచె. దేవుని సాక్షాత్కరించుకొంటివేని, నీ కిక జగత్తు మిథ్య కాదు. దేవుని సాక్షాత్కరించుకొన్నవాడు, దేవుడే ఈ జగముగను ఇందలి సకల జీవులుగను రూపొందియుండుట నెఱుగును. నీవు అన్నమును నీ బిడ్డకు పెట్టుచున్నప్పుడు, దేవునకు నివేదించుచున్నట్లే నీకు అనుభూతి కలుగవలెను. నీ తండ్రిని దేవుని ప్రత్యక్షరూపముగను, నీ తల్లిని లోకజనని ప్రత్యక్షరూపముగను అధ్యవసించి లోకజననీజనకులకు సేవచేసినట్లుగా వారికి సేవ చేయవలెను. భగవంతుని సాక్షాత్కరించుకొని పిమ్మట జగములో ప్రవేశించినవాడు సాధారణముగా భార్యతో భౌతిక సంబంధము నుంచుకోడు. ఇద్దఱును భక్తులు. దేవునిగూర్చిన ప్రసంగములందే మోజు గలిగి ఆధ్యాత్మిక సంభాషణలందే వారు తమ కాలమును గడపుదురు. భగవంతుని యితర భక్తులకును వారు సేవ చేయుదురు. ఏలయన సకల జీవులుగను రూపొందినది భగవంతుడే అని వారెఱుగుదురు. ఆ జ్ఞానములో వా రొరులకు సేవ చేయుటకే తమ జీవితముల నంకితమొనర్తురు.

## వివేకానంద సింహగర్జనము

సత్య మౌనా కాదా అని పరీక్షించుట కొక్కటే విధానము. సత్యము మిమ్ము బలవంతులనుగా చేయును, అంధవిశ్వాసములకు లొంగనివారినిగా చేయును. అంధవిశ్వాసమునకు లోబడనీక మి మ్ముద్ధరించుట వేదాంతి కర్తవ్యము. ఈ జగము, ఈ దేహము, మనస్సు—ఇవి సైతము గ్రుడ్డినమ్మకములే. ఎంతటి నిరవధికములైన ఆత్మలు మీరు! మీరు మినుకు మినుకుమను చుక్కలను గని వంచితు లగుటయా! అది సిగ్గుచేటైన పరిస్థితి. మీరు దివ్యులరు. మినుకు మినుకుమను చుక్కలను ఉప్పతిల్లచేసినవారు మీరు.

ఒకప్పుడు నేను హిమాలయములందు పర్యటించుచుంటిని. మేము పోవలసిన సుదీర్ఘ మార్గము మా కెదుట నుండెను. మేమా బుక్కాపకీరులము, వాహనములు ఎక్కడ నుండి వచ్చును? కావున అంతదూరమును మేము పాదచారులమై పోవలసినదే. మానడుమ నొక పండుముసలివా డుండెను. దారి యెగుడుదిగుళ్ళతో నూర్లకొలదిమైళ్ళ నిడివి గలిగి యుండెను. ఆ వృద్ధసన్న్యాసి దానిని చూచి ''అయ్యో! దీనిని దాటి చను టెట్లు? ఇక నేను నడవ జాలను, నా గుండె పగులునే'' అన్నాడు. ఆయనతో నేను ''వంగి నీ పాదములను చూచుకో'' అన్నాను ''ఈ కాళ్ళ క్రింద ఉన్నది. నీవు దాటివచ్చిన దారి. నీయెదుట నున్న దారియు అదే. మఱుక్షణమున అదియు నీ పాదములక్రిందికి వచ్చును.'' ఎంతెంతసమున్నతములైన వైనను మీ త్రొక్కిళ్ళకు లోనగును. ఏలయన మీరు దివ్యతారలు. ఇవన్నియు మీ కాళ్ళక్రిందివే. మీరు కోరినచో పిడికిట జవురుకొని నక్షత్రములను మ్రింగివేయగలరు. అట్టిది మీ యథార్థస్వరూపము! బలవంతులరై ఉండుడు, అంధవిశ్వాసాలను త్రోసిరాజనుడు, బంధరహితులరై యుండుడు.

# మీగడ తఱకలు

ప్రాచీనభారతదేశచరిత్రలో ఎందరో మహిళామణులు మహోజ్జ్వలంగా వెలుగొందారు. వీర్యం, సాహసం, గుణదోషనిర్ణయస్వాతంత్ర్యం, చిక్కులనుండి విడుపొందే చాకచక్యం, సంకల్పదార్ఢ్యం, నిశ్చలభక్తి, నిస్స్వార్థత మున్నగు శుభగుణాలతో వారు శోభిల్లారు, మేము అబలలం కాము, ప్రబలలం అనిపించేటట్లు మెలగారు.

దురదృష్టవశమున పొసగిన కొన్ని పరిస్థితులవల్ల ఇటీవలికాలంలో భారతీయమహిళల తేజం మందగించింది. భారతదేశంలో సేవాకార్యానికి సోదరిని నివేదితను పూంచుతూ ఆమెతో శ్రీ వివేకానందస్వామి ఈలాగు వాక్రుచ్చారు:''దాచుకోకుండా చెబుతున్నాను. భారతదేశసేవాకార్యంలో నీకు గొప్ప భవిష్యత్తు ఉందని నా నమ్మకం. భారతీయులకై, ముఖ్యంగా భారతీయమహిళలకై పాటుపడడానికి ప్రస్తుతం కావలసింది మగవాడు కాదు, మగువ, సింహాంగన అనదగిన మగువ! గొప్పమహిళలను భారతదేశం ప్రస్తుతం తాను ఉప్పతిల్ల జేయజాలదు, అన్యదేశాల నుండి ఎరవు తెచ్చుకోవలసిందే. నీ చదువు, నీ ఋజుత, నీ విశుద్ధి, ప్రగాఢమైన నీ ప్రేమ, నీ సంకల్పబలం, అన్నిటికంటె హెచ్చుగా నీ కెల్టిక్కు జాతి వీటినిబట్టి చూస్తే ప్రస్తుతం మాకు కావలసిన మహిళవు సాక్షాత్తుగా నీవే.''

స్వామిజి అప్పటి పరిస్థితిని మాత్రం నివేదితతో చెప్పారే కాని భారతదేశంలో ఉత్తమ నారీమణులు ఎప్పుడునే పుట్టరనడం ఆయన అభిప్రాయం కాదు. త్రికాలవేత్త అయిన స్వామిజి, ప్రియుడును సోదరశిష్యుడు నగు శ్రీ శివానందస్వామికి ఒక జాబులో ఈలాగు వ్రాశారు. ''ఆ మహాద్భుతశక్తిని భారతదేశంలో పునరుజ్జీవింపచేసేందుకే అమ్మ (మాతృశ్రీ శారదాదేవి) అవతరించింది. ఆమెను బీజంగా చేసికొని 'గార్గి' 'మైత్రేయి' వంటి మహిళలు ఈ లోకంలో మళ్ళీ అవతరిస్తారు.''

శ్రీకృష్ణుడు పెండ్లాడిన రుక్మిణి, భారతీయమహిళ లందఱు అనుకరింపదగిన ఆదర్శమహిళ. ఆలాగే వారు ఆమెను అనుకరిస్తున్నారు కూడ. శ్రీకృష్ణుని భర్తగా ఆమె పడయ గాంచిన రీతినుండి మహిళ లందఱూ నేర్చుకోవలసిన పాఠా లున్నాయి. ఆమె శ్రీకృష్ణుని వరించింది. కాని ఆ ప్రేమ సఫలం కావడానికి దారి నిష్కంటకంగా లేదు. అన్న ఆమెను చేదిరాజగు శిశుపాలునికి భార్యనుగా చేయ గోరినాడు. కాని ఈమెను భార్యగా బడయదగిన సమర్థత శిశుపాలునికి లేదు. ఇటువంటి చిక్కు పరిస్థితులలో ఆమె ధీరనాయికగా ప్రవర్తించింది. విశ్వాసార్హుడైన ఒక బ్రాహ్మణుని తనకు తోడ్పఱచుకొంది. ఆతనిచే ద్వారకలో నున్న శ్రీకృష్ణునకు రహస్యసందేశం చెప్పిపుచ్చింది. శ్రీమద్భాగవతపురాణంలో ఇది చాల సుప్రసిద్ధమైన ఘట్టం. ఉదాత్తాశయసంభృతములైన పద్యాలు అవి. అందులో ప్రార్థన ఉంది, నిశ్చయం ఉంది, పారమార్థికనిగూఢార్థం ఉంది. వ్యాసమునీంద్రరచితశ్లోకములును బమ్మెరపోతనామాత్యరచితపద్యములును మాధుర్యంలో వానికి ఇవి గాని వీనికి అవి కాని తీసిపోవు. కాబట్టి ఆంధ్రమహాజనులకు హృదయసన్నిహితమైన పోతరాజపద్యధారను రవంత అనుభవింతాం.

సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబుల సోఁక
 దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల
 కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ లేప్రొద్దుఁ జేసిన
 భువనోన్నత్వంబుఁ బొందఁ గలుగు
నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తితోఁ
 దలఁచిన బంధసంతతులు వాయు

గీ. నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది, నీయాన నాన లేదు
కరుణఁ జూడుము కంసారి, ఖలవిదారి,
శ్రీయుతాకార, మానినీచిత్తచోర.

శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గులవి
 ద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణా
 సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమా
 కాంతాలలామంబు? రా
జన్యానేకపసింహ, నావలన నే
 జన్మించెనే మోహముల్?

ఉ. శ్రీయుతమూర్తి, యో పురుష
సింహమ, సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున,
మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని నైన నన్ను వడిఁ
దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ;
డా యధమాధముం డెఱుఁగఁ
డద్భుతమైన భవత్ప్రతాపమున్.

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసే
 వల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగ
 త్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్, వసుదేవనందనుఁడు నా
 చిత్తేశుఁ డౌఁగాక, ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ
 జేదీశముఖ్యాధముల్.

ఉ. అంకిలి సెప్ప లేదు, చతు
రంగబలంబులతోడ నెల్లి యో
పంకజనాభ, నీవు శిశు
పాలజరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షసవి
వాహమునన్ భవదీయశౌర్యమే
యంకువ చేసి, కృష్ణ, పురు
షోత్తమ, చేకొని పొమ్ము, వచ్చెదన్.

సీ. లోపలిసౌధంబులోన వర్తింపంగఁ
 దేవచ్చునే నిన్నుఁ, దెత్తునేని
కావలివారలఁ గలబంధువులఁ జంపి
 కాని తేరా దని కమలనయన
భావించెదేని యుపాయంబు సెప్పెద
 నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ
 బెండ్లికి మునుపడఁ బెండ్లికూతు

గీ. నెలమి మావారు పంపుదు, రేను నట్ల
పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ, నీవు నా సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత.

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై
 గౌరీశుమర్యాద నె
వ్వనిపాదాంబుజతోయమందు మునుఁగన్
 వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసిల్లనేని, వ్రతచ
 ర్యన్ నూఱుజన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్,
 నిక్కంబు, ప్రాణేశ్వరా.

"కృష్ణా, వినినవారి దేహతాపములను బోగొట్టు గుణములు గలవాడవు నీవు. నీ సుందరాకారమును చూడ్డంచేతనే కన్నులకు సమగ్రసార్థకత గలుగుతుంది. సేవించినవారిని భువనమున కంతటికి ఉన్నతమైన పదవి నందించు ప్రభావం నీచరణముల కుంది. స్మరించినవారిని సకలబంధములనుండి విడు పొందించు మహిమ నీ నామమునకు గలదు. అటువంటి నీయందు నామనస్సు మగ్న మైంది, సిగ్గును విడనాడునంతగా మగ్న మైంది. మగు వల మనములను ప్రముచ్చిలించు సుందరా కారము గలవాడా, కంసాదిదుష్టశిక్షకుడా, నన్ను దయతో చూడుమా. సకలసుగుణశోభి తుడవును మనోహరరూపుడవును అగు నిన్ను జూచి మోహించుచున్నది నే నొక్క-తెనేనా? నిన్ను కోరని కన్య లుండరు. శ్రీమహాలక్ష్మి సైతము నీకై యుబలాటపడలేదా? నేనో. నీపదాంబుజధ్యాయినిని. నీయద్భుతప్రతాపము నెఱుగని అధమాధముడున్నూ మూఢాంధుడు నైన శిశుపాలుడు నన్ను గొనిపోదా మని కోరుతున్నాడు. ఇది ఏలాగుం దంటే, సింహ మునకు చెందవలసిన సొమ్ముకై నక్క- ఆశ పడిన ట్లుంది. నేను పూర్వజన్మంలో సర్వేశ్వరు డగు శ్రీమహావిష్ణువునకు ప్రీతికరంగా దాన ధర్మాలూ దేవగురుద్విజన్మబుధసేవలూ చేసి ఉంటే, శ్రీకృష్ణుడే నాకు భర్త అవు తాడు. అధములైన శిశుపాలాదులు యుద్ధంలో పరాజితులై పోతారు. ఓ పంకజనాభా, కృష్ణా పురుషోత్తమా, కాదు కూడదు అనుట పౌస గదు. రేపు నీవు చతురంగబలములతో వచ్చి శిశుపాలజరాసంధాదులను జయించి, నీశౌర్య మునే శుల్క-ముగ చేసి రాక్షసవివాహవిధా నంలో నన్ను తీసికొనిపో, వస్తాను. అంతః పురంలో ఉన్న నన్ను తీసుకుపోవాలంటే, కావలివాండ్రను బంధువులను చంపవలసి వస్తుందని వెనుదీస్తావేమో! ఉపాయం చెబు తాను విను. పెండ్లికి ముందు కులదేవతకు మ్రొక్కించడానికిగాను పెండ్లికూతును పంపే ఆచారం మాకుంది. కాబట్టి నేను పార్వతికి మ్రొక్కేందుకై సముచితపరివారంతో ఊరి బయటికి వస్తాను. అప్పుడు నీవు సులభంగా నన్ను తీసుకుపోవచ్చు. పరమేశ్వరునివంటి ఘనులు తమ అజ్ఞానతమస్సును పోగొట్టుకునేం దుకై నీ పాదాంబుజతోయమందు మునుగ గోరుతుంటారు. అటువంటి నీదయ నాపై ప్రస రింపక పోతే, నేను నూఱుజన్మము లైనను నిన్నే స్మరిస్తూ ప్రాణాలు వదలుతాను."

ఈ రుక్మిణీసందేశాన్ని అందించి బ్రాహ్మ ణుడు శ్రీకృష్ణునితో 'ఇక నీచిత్తం' అన్నాడు. ఇంతటి హృదయపూర్వకమైన ప్రార్థన శ్రీకృష్ణుని త్వరగొల్పక పోతుందా? శ్రీకృష్ణుడు రుక్మిణిచెప్పిన సలహాను అనుస రించి సర్వమును నిర్వహించి ఆమెను తన పట్టపుదేవిగా చేసుకున్నాడు.

వివాహాలు దైవనిర్ణీతాలు అంటారు. ఇక లోకసంరక్షకులయు వారి ప్రియురాండ్రయు వివాహాల సంగతి చెప్పాలా? వారిజీవితాలలో ప్రతిసంభవమున్నూ దైవికమైన ప్రణాళికను అనుసరించే ఉంటుంది. సీతారాములు—రుక్మిణీ కృష్ణుల— శారదా శ్రీరామకృష్ణుల జోడింపు యాదృచ్ఛికసంబంధం కాదు.

చాల చిక్కు- పరిస్థితులలో రుక్మిణి ధైర్యంతో సహయస్ఫూర్తితో మెలగి హృదయాభీష్టం నెఱవేర్చుకుంది. సత్యవంతుని సావిత్రియు, నలుని దమయంతియు, పరమశివుని పర్వతరాజ తనయయు బడయ గాంచిన ప్రకారమున్నూ

ఇటువంటివే. ఆ మహిళామతల్లుల కోవకు చేరిందే మాతృ(శ్రీ) శారదాదేవియు.

శారదా(శ్రీ)రామకృష్ణుల వివాహానికి సంబంధించిన ఒకటి రెండు సంభవాలు గమనార్హాలు.—ఆమె తనంతట ఆయన్ను వరించింది. ఆయన తనంతట ఆమెను వరించాడు. నిస్సమానవిశుద్ధియందున్నూ, ఆధ్యాత్మిక ప్రవణతయందును ఆమె ఉమాదేవిని బోలినది. వైరాగ్యమందును తపస్తీవ్రతయందును ఆయన మహాదేవుని వంటివాడు. జయరాంబాటిలో భానుపిసి అను పల్లెవనిత ఒకతె ఉంటూ వచ్చింది. శారదమ్మ పసిపిల్లగా ఉండేటప్పుడే నిజమున కామె ఎవరో (శ్రీరామకృష్ణు డెవరో, భానుపిసి కనుగొన గలిగింది. పార్వతీపరమేశ్వరులే శారదా(శ్రీ)రామకృష్ణు లని ఆమె గుర్తించింది. ఏలా గుర్తించిందో ఎవ్వరూ చెప్పలేరు. ఆ దినాలలో ఆమె మాటను ఎవ్వరూ లక్ష్యపెట్ట లేదు. కాని ఇప్పుడో మన కామె మాట ఎంతయూ శిరోధార్యమే.

చిన్న శారదా, అందాలు చిందు నీవు
వెఱ్ఱి దెసమొల భర్తను వెదకికొంటె?

అని భానుపిసి అంటూ ఉండేది. శారద చాల పసిపిల్లగా ఉన్నప్పుడే ఒకసారి ఆమెను పొరుగు గ్రామానికి ఎత్తుకొనిపోవడం జరిగింది. అక్కడ గొప్ప సంకీర్తనం జరుగుతున్నది. అది ముగిసింది. తన ఒడిలో శారదమ్మను కూర్చోబెట్టుకొని ఉండిన ఒక మహిళ వేడుకకై "ఇక్కడ ఇంతమంది ఉన్నారు కదా, వీరిలో ఎవరిని నీవు పెండ్లాడుతావు" అని శారదమ్మ నడిగింది. పెండ్లి అంటే ఏమిటో తెలియని వయస్సు శారదకు, ఆమె తన చిన్నచేతిని చాచి ఎదుటి వరుసలో కూర్చున్న ఒక యువకుని చూపింది. అత్యాశ్చర్యమే మంటే ఆ యువకుడు ఎవరో కాదు, శ్రీరామకృష్ణపరమహంసగా రూపొందనున్న గదాధరుడే. ఆయన తన మేనత్త దౌహిత్రుడగు హృదయరామునింటికి వచ్చి ఉండినాడు. అక్కడే ఈ సంకీర్తన జరిగింది. ఈ సంభవమున కెటువంటి ప్రాముఖ్యమున్నూ లేదని త్రోసివేయ వచ్చునా? శారదకు గల భావికాలజ్ఞానమును సూచిస్తూ ఎంతో ప్రాముఖ్యం గల సంభవ మని గ్రహించ వచ్చునా? ఎవరు చెప్పగలరు?

తర్వాత కొన్ని సంవత్సరాలకు (శ్రీ)రామకృష్ణునకు వెఱ్ఱి పట్టిం దని భ్రమించి ఆయన తల్లియు అన్నయు 'పెండ్లి చేస్తే పిచ్చి కుదురుతుం' దను ఊహతో కన్యను అన్వేషించ సాగారు. వారి ప్రయత్నం ఫలించింది కాదు. వారు చెప్పకున్నా, విషయాన్ని స్వయంగా గ్రహించిన (శ్రీ)రామకృష్ణుడు "పొండి, జయరామ్బాటిలో రామచంద్రముఖర్జిగారింట ఉంది నాకు భార్య కానున్న బాలిక" అని వారికి తెలియజెప్పాడు. శారదమ్మ తండ్రియే రామచంద్రుడు.

శా. నిన్నుం గొ నమ్మినరీతి నమ్మ నొరులన్, నీకన్న నా కెన్న లే
రన్నల్ తమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు, నా
యన్నా, యెన్నఁడు నన్ను సంసృతివిషాదాంబోధి దాఁటించి య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొ కదే, (శ్రీ)కాళహస్తీశ్వరా!

మహాకవి ధూర్జటి.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# హృదయ విశుద్ధి ప్రభావము

చైనాదేశములో చెప్పుకొను కథలలో ఒక దాని నిట ప్రస్తావించుచున్నాము. అది ఇప్పటి కిని ఎప్పటికిని మానవులు జ్ఞప్తిలో ఉంచుకో దగిన కథ—

కన్ఫ్యూసియస్సునకు సేకుంగ్ అను ఒక శిష్యు డుండినాడు. ఒక ముసలి తోటవా డొకచో అగడ్తను త్రవ్వి, బావినుండి నీరు చేది తెచ్చి అందులో పోసి దానిని నింపుటకు చాల శ్రమపడుచుండినాడు. అతనితో సేకుంగు "ఎందు, కయ్యా, యింత శ్రమ ? చిన్నయంత్ర మును (పంపును) ఉపయోగించిన జలసేకర ణము ఇంతకంటె సులభముగా సమృద్ధిగా నెఱవేఱునే" అనె నట. ఆ వృద్ధవనపాలకుడు మందహాసముతో ఇట్లు బదులు చెప్పెను: "టక్కులతో కూడిన పనిముట్లను ఉపయో గించువారు తమ వ్యవహారములలో వంచకు లుగ ఉందు రని, వారిలో ఋజుతయు విశు ద్ధియు ఉండ దని, వారికి శాంతి ఉండ దని, టావో (దైవము) వారిగుండ పనివడ దని మా గురువుగారు మాకు చెప్పినారు."

సేకుంగును అతనిశిష్యులును చాలదూరము నడచిపోయిరి. సుదీర్ఘకాల మాలోచించి అతడు శిష్యులతో ఇట్లనెను — కన్ఫ్యూసియస్సు చెప్పగా నేను విన్న విషయ మిది. "ఏ ప్రణా ళిక అయినను ఆచరణ సాధ్యమా అనుటను పరిశీలింపవలెను. అల్పశ్రమతో అనల్పఫలము లను సాధింపవలయును. ఇతనిని బోలినవారు అట్లు కాదు...పరిపూర్ణత తనలో ఉన్నను, తన గంతవ్యము నెఱుగక ఇతడు జీవితమును గడపుచున్నాడు.

యంత్రములు వల దని ఎవడైన చెప్పిన, అతని మాట కీనాటి లోకము చెవి యొగ్గదు. కాని మనకథలో ప్రస్తుతుడైన మానవుడు, తన మాటలు ప్రజలు వినకున్న, విషాదము చెందువాడు కాడు.

ఒకప్పుడు రష్యా ముఖ్యమంత్రి క్రుశ్చేవు ఇండొనీషియాకు పోయియుండెను. ఆ దేశా ధ్యక్షుడు సుకార్నో తమ దేశమందలి ఉత్త మోత్తమ శిల్పమునకు లక్ష్యములయిన వస్తు వులను ఆయనకు బహూకరించెను. కాని సుకార్నో చిన్న బుచ్చుకొనునట్లుగా మోటుగా క్రుశ్చేవు ఇట్లనెను: "ఇవేవియు నా కొక లక్ష్యములోనివి కావు. నానాటి కెక్కువగా మాకు కావలసినవి యంత్రములు". ఆయన మోటుగా చెప్పిన మాటనే ఇతరులు నాజూ కుగా చెప్పుచుందురు. అందఱు కోరునది యంత్రములనే.

అభివృద్ధి చెందియున్న దేశములలోను చెందుచున్న దేశములలోను ప్రాచ్యదేశముల లోను ప్రతీచీదేశములలోను ప్రపంచమంతటను నేడు వినవచ్చుచున్న ఘోష ఇదే. ఆస్తికధర్మ మును గుఱించియు పరలోకమును గుఱించియు, పునర్జన్మమును గూర్చియు ప్రజలు గొంతు చించుకొను భారతదేశములోకూడ "యంత్ర ములు కావలెను, నానాటికి మఱిన్నిగా యంత్రములు కావలెను", అనెడి ఆ ఘోషయే వినవచ్చుచున్నది. విజ్ఞానశాస్త్రము అనెడి పురో హితుడు ఆరాధనకార్యాలు నిర్వహించెడి 'యంత్రము' అను గుడిలోనే ఈనాడు అన్ని వర్గాలవారు అన్ని వర్ణాలవారు అన్ని దేశాల వారు అన్ని మతాలవారు ఐకమత్యముతో

సమావేశ మగుచున్నారు. ఇట్టిది ఈ కాలసము త్సాహము. కాని నిత్యతత్త్వసముత్సాహ మనునదియు ఒకటి కలదు. ఊర్ధ్వలోకము లలో మనకంటె పైతరగతి జీవు లున్నా రను కొనుడు. వారు మనలను జూచి ఏ మనుకొం దురో రవంత ఆలోచించి చూడుడు. మనము పనిముట్లను సదా తయారు చేయు చుండు పనికి మాలినవార మని వా రనుకోవచ్చును. మాన వుడు చంద్రమండలము నధిరోహించి ...... వచ్చు. కాని తనమనస్సును అదుపులో ఉంచు కొన లేక, తన సోదరునితో పొందిక గలిగి మన లేక యుండు మానవుడు అంతరిక్షమున ఎంత వ్యాపించినను ఏమి లాభము? అశాంతి సంక్షుభితులగుండ టావో పని వడ దని చెప్పిన చైనీయవృద్ధుడు వివేకి. నాగరకత హెచ్చు కొలది, అశాంతియు హెచ్చుచునే పోవునేని, మనకును మనసంఘమునకును గంతవ్య మేది?

పరిస్థితిని మనము చక్కగా పరిశీలింపవలె. మేలుకో, కీడుకో, మనము యంత్రములను బాగుగ మరిగియున్నాము. టావో (దైవము) ఉన్నాడో లేడో నిజ మెఱుగము. ఆయన మన గుండ పనివడుటకై యంత్రములను వదులుకొ మ్మన్న మానవులు వదలుకో బోరు. అశాంతి సంక్షుభితు లగుటచే దైవశక్తి (టావో) పని వడుటకు వీరు సమర్థద్వారములు కాకపోయి నచో జీవితము వ్యర్థ మగును. ఇట్టి పరిస్థితు లలో మానవులకు కర్తవ్య మేమి? ఈ ప్రశ్నకు జవాబు నాలోచించునప్పుడు నాలుగు విషయ ములను మనము జ్ఞప్తిలో ఉంచుకోవలయును (1) యంత్రయుగమునకు మునుపటి పరిస్థితిని ఇప్పుడు కొనితెచ్చుట శక్యము కాదు (2) ఇప్పటి పరిస్థితి ఇట్లే ఉండను ఉండదు. (3) చలనము తప్పనిసరి అయినను తా నేవం కకు నడవవలెనో నిశ్చయించుకొను వీలు మానవున కున్నది. (4) శరవేగమున బోవు చుండు మోటారుబండిని తటాలున ఆపిన ఏ మగునో అటువంటి యనుభూతి కలుగనీయని రీతిలో మానవుని సమస్యలకు పరిష్కారములు ఏర్పడవలెను.

యంత్రములను ఈసడించిన వనపాలకుని ధోరణిలో—మన సమస్యల నిట్లు ప్రతిపాదింప వచ్చు — (1) ఆధునిక మానవుని పనిము ట్లన్నియు టక్కులతో కూడినవి. (2) అతని నడవడిలో టక్కరితన మున్నది. (3) అనగా వంచకత్వ మతని డెందములోనే ఉన్నది. (4) కావున అతడు దుర్భరములైన మాలిన్య ములు కకావికలని అనివార్యముగా సృజించు కొన్నాడు. (5) ఆంతరమయిన కాలుష్యము చేతను బాహ్యమైన కకావికలచేతను ఇంతకు ము న్నెన్నడును లేని అశాంతి మానవునకు కలిగినది. (6) అన్నిటికంటె సత్యము నెఱు గుట మానవుని కత్యంతావశ్యకమై యుండ, అశాంతిచేత అతనికి పరమార్థము నెఱుగు సమర్థత నశించినది.

మన 'నాగరకత' దేవాసురులు సాగించిన సముద్రమథనమును బోలి యున్నది. నాగర కత యనెడి మథనమువలన మానవజీవితసాగ రము నుండి అమృతమును విషమును కూడ ఉత్పత్తిల్లినవి. ఈవిషము అమృతమును చెఱచు నదిగా మాత్రమే కాక మానవుల జీవితమునకే విపత్కరముగ నున్నది. ఈ విషమును మ్రింగ గల అతిలోకమైన శక్తిని ప్రాదుర్భవింప జేయుట ప్రస్తుత మెంతైనను ఆవశ్యకము.

దేవాసురుల సముద్రమథనకథలో, విశ్వము మీది అపారకరుణచే పరమశివుడు హాలాహల మును మ్రింగెను. పిమ్మట మథనము చక్కగా సాగి జగన్మంగళములు సిద్ధించినవి. ఆనాటి

నుండి ఆ విషముకలిమిచే శివునికంఠము నీలముగ నున్నది. లోకోద్ధరణమునకు ఈనాడును నీలకంఠులగు మగవారును మహిళలును ఆవిర్భవింపవలెను.

విషగ్రసనసమర్థమగు ఆ శక్తి ఎక్కడి నుండి వచ్చును? మానవునుండియే రావలెను. ఆ శక్తికి ఆకరము మానవునిలోనే ఉన్నది, ప్రతిమానవునిలోను ఉన్నది. మానవజాతి నశింపక వర్ధిల్లవలె ననిన, ఆ శక్తిని ఆవిష్కరించుకొను విధానమును మానవుడు నేర్వవలయును. ఇది అందఱి అక్కఱ. ఆ శక్తికి 'ఆత్మశక్తి' అని పేరు. దానిని వెలువరింపగలది చిత్తశుద్ధి. ప్రతిమానవుడును తన్ను తాను విశుద్ధు నొనర్చుకోవలెను. ఆలా గొనర్చుకొన నటువంటివారు ఎందఱు పూనుకొన్నను లోకమును మేలొందింప జాలరు. వ్యష్టిమాలిన్యము నుండి పుట్టు సమస్యలను సమష్టిమాలిన్యము పరిష్కరింపజాలదు. ఒక్కొక్కడు తన్ను తాను విశుద్ధు నొనర్చుకొన్నచో సంఘవిశుద్ధి తనంతట సిద్ధించును. అ దొక్కటే మనకు ప్రస్తుతమున్న ఆసపాటు.

మానవునిలో జడపదార్థము నున్నది ఆత్మపదార్థము నున్నది. విశుద్ధి సిద్ధించినకొలది జడపదార్థమునుండి ఆత్మపదార్థము విడు పొందుచుండును. మానవుడు భౌతికశక్తులను వశపఱచుకొన్నాడు. యంత్రశక్తిని అపారముగ పెంపొందించుకొన్నాడు. కాని యీ శక్తు లెంత పెంపొందినను మానవునకు ముక్తిని చేకూర్ప జాలవు. ఆత్మకు విముక్తిని చేకూర్ప గలది ఆత్మశక్తి ఒక్కటే అని శ్రీ వివేకానందస్వామి వాక్రుచ్చినారు. విశుద్ధిని చేకూర్చుకొనుట యన (1) కోర్కెలను దులుపుకొనుటే. ఇరువదియైదుశతాబ్దములకు మునుపు బుద్ధదేవుడు లోకమునకు ఈ హితమునే కఱపియున్నాడు. విశుద్ధిని చేకూర్చుట యన (2) ఆత్మశక్తికి వాహనస్థానీయములైన సుగుణములను అలవఱచుకొనుట. ఏ సుగుణమలవడిన ఏశక్తి వచ్చు ననుటను యోగసూత్రములలో పతంజలి తెల్పియున్నాడు. ఆయన ప్రతిపాదనల నించుక పరికింతము—

(1) అహింసాప్రతిష్ఠాయాం
తత్సన్నిధే వైరత్యాగః. II-35

అహింసయందు నెలకొనియుండువాని సాన్నిధ్యమున (ఇతరుల) వైరము తొలగును. అహింసాధర్మమున సుస్థిరుడై యుండువాని సాన్నిధ్యమున స్వభావముచే క్రూరములైన సింహవ్యాఘ్రాదిజంతువులు సైతము శాంతము గలిగి వర్తించును. అట్టి యోగి యెదుట పులియు మేకపిల్లయు గలిసి యాటలాడుకొనును. ఈ స్థితిని బొందినప్పుడు మాత్రమే యోగి అహింసయందు సుస్థిరు డని గ్రహింపనగును. జగత్పావనమగు కణ్వాశ్రమమున ఆయన సాన్నిధ్యమహిమ మహాభారతమం దిట్లు వర్ణింపబడినది—

శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును, గరికర
శీతలచ్ఛాయ దచ్ఛీకరాంబు
కణముల చల్లని గా డ్పాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును,
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొందు సహజ
వైరివర్గంబులయు సహవాస మప్డు
సూచి, మునిశక్తి కెంతయుఁ జోద్యమందె.

(2) సత్యప్రతిష్ఠాయాం
క్రియాఫలాశ్రయత్వమ్. II-36

సత్యమునందు నెలకొనియుండుటచే యోగి (తనకొఱకును ఇతరులకొఱకును గూడ) కర్మములను జేయకయే కర్మఫలములను బొందునట్టి శక్తి సంపన్నుడగును.

సత్యశక్తి నీయందు నెలకొనియున్న యెడల కలలోగూడ కల్లలాడవు. మనోవాక్కాయ కర్మములందు సత్యవంతుడవై యుందువు. నీవేమి పలికినను సత్యమై తీరును. 'ధన్యుడవగు' మని నీ వొకనిని జూచి పలికినంతనే ఆతడు ధన్యుడగును. రోగిని జూచి నీ వారోగ్యము కలుగుగాక అని వచించినంతనే యతడు స్వస్థుడగును. ఈ విషయమును ఉత్తరరామచరిత్రనాటకమున మహాకవి భవభూతి ఈ క్రింది సుభాషితమున పొందుపఱచెను.

మూ॥ "ఋషీణాం పునరాద్యానాం
వాచమర్థో ఽనుధావతి"

అను॥ వాక్కు వెంబడి నర్థంబు పఱచి వచ్చు
నాద్యులయినట్టి పరమమహర్షులకును

'సీతాయా శ్చరితం మహత్' అను సార్థక ప్రసిద్ధి గనిన రామాయణములో సీత, తన సత్యమును, తన విశుద్ధిని అగ్నిలో ప్రవేశించి వెలువడి నిరూపించె ననుట జగత్ప్రసిద్ధము. అక్కడ నిరూపితమైనది ఆమె సత్యము ఆమె విశుద్ధి మాత్రమే కాదు. శ్రీరామచంద్రుని సత్యమును విశుద్ధియుకూడ. ఆనిరూపణమునకై సీత తన ప్రాణమును త్యజింపబూనినది, ఇకను శ్రీరామచంద్రుడో, తనకు ప్రాణాధికమైన సీతను త్యజింపబూనినాడు.

(3) బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం
వీర్యలాభః. II-38

బ్రహ్మచర్యప్రతిష్ఠచే వీర్యలాభము కలుగును.

బ్రహ్మచర్యమువలన బ్రహ్మాండమైన సంకల్పశక్తియు అద్భుతమైన కార్యశూరత్వమును గలుగును. బ్రహ్మచర్యము లేనిదే ఎట్టి యాధ్యాత్మికశక్తియు గలుగజాలదు. ఇంద్రియ నిగ్రహముచే మానవకోటిపై అద్భుతమైన వశీకరణశక్తి లభించును. ఆధ్యాత్మికమార్గదర్శకులు ప్రబలజితేంద్రియులై యున్నారు. బ్రహ్మచర్యము వారిని మహత్తరవీర్యవంతులనుగా జేయుచున్నది. కావున యోగి తప్పక జితేంద్రియుడై యుండవలెను. బ్రహ్మచర్యముచే వీర్యమును నిలవరము చేసికొన్నచో అది ఆధ్యాత్మికశక్తిగ రూపొందును. మనలో అనేకులము వీర్యశక్తి నెఱిగియున్నామే కాని ఆధ్యాత్మికశక్తి యన నెట్టిదో ఎఱుగము. పిన్నలలో నేరములు సల్పు ప్రవణతలను ఎన్నుచుందుము కాని ఆ ప్రవణతలు పెద్దలలో లేకుండినచో పిన్నల కెక్కడినుండి వచ్చి యుండును? తల్లిదండ్రులు విశుద్ధజీవితములను గడపినచో అట్టిజీవితమునే పిల్లలును అలవఱచుకొందురు.

"హృదయవిశుద్ధి భగవత్సాక్షాత్కారప్రాపక" మని జీసుక్రీస్తు సూత్రించెను. ఆ సూత్రమునకు శ్రీ వివేకానందస్వాముల భాష్యము: "ఆ ఒక్కవాక్యములో అన్నిమతముల సారము ఇమిడియున్నది......తక్కిన ప్రమాణగ్రంథము లన్నియు వినష్టములైనను ఆ వాక్య మొక్కటి జగము నుద్ధరింపగలదు. ఆత్మశుద్ధి గలుగువఱకు భగవత్సాక్షాత్కారము కలుగనే కలుగదు. ఈ ఆచారాలు, ఈ

కర్మలు, ఈ ప్రార్థనలు, ఈ యాత్రలు, ఈ గ్రంథాలు, ఈ గంటలు, ఈ దీపపువత్తులు, ఈ పురోహితులు ఇవన్నియు మనలను ఆయ త్నపఱచుకొనుటకే. అవి మన ఆత్మయందలి కల్మషములను పోగొట్టును. ఆత్మ విశుద్ధి గలిగినప్పుడు ఆ ఆత్మ విశుద్ధినిధానమైన భగవంతుని జేర నుబలాటపడును.

భగవత్ప్రేమాగ్నిచే విశుద్ధులైన మహనీయులగుండ భగవచ్ఛక్తి లోకమున ప్రసరించును. దినమంతయు పాటువడనిదే ఉదర పోషణకు వేఱు గతి లేని పాలుయోగి క్రైస్తవ మతము నెట్లు విశ్వవ్యాప్తముగ జేయగలిగెను? ఈ ప్రశ్నకు జవాబును ఆయనే చెప్పియున్నాడు... "నేను కాదు, నాలో నున్న క్రైస్తుదేవుడు" విశుద్ధమైన ఆయన డెంద మున నెలకొని క్రైస్తుదేవుడే సర్వమును నిర్వహించె ననుట.

శ్రీ వివేకానందస్వామియు అట్లే, తొమ్మి దేండ్ల కాలములో ఆత్మమోక్షజగద్ధితము లనెడి లక్ష్యద్వయమునకు సాధకముగా శ్రీరామ కృష్ణసంస్థను నెలకొల్పి దానిని విశ్వవ్యాప్త మొనర్చిన యద్భుతము వాచామగోచరము. ఈ శక్తి ఆయన కెచ్చటినుండి వచ్చినది? శ్రీరామకృష్ణునొద్దనుండి స్వామిజీలోనికి సంక్రమించిన దందురా? నిజమే. ఆ అమోఘానంత శక్తిని ఆయన ఎట్లు భరింపగలిగినాడు-తాను రూపుదాల్చిన పవిత్రత యగుటచే భరింప గలిగినాడు. అట్టిది హృదయవిశుద్ధి ప్రభావము.

వైదిక విజ్ఞానకోశము

# వివేకచూడామణి

మూలము: శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత: అన్నమాచార్య

తమసా గ్రస్తవ ద్భానా దగ్రస్తోఽపి రవి ర్జనైః
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్త్యా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్. 547

రాహువు సూర్యుని మ్రింగకున్నను మ్రింగినట్లుగా జనులకు కనిపించును. వారు వస్తు లక్షణము నెఱుగక, భ్రాంతి చెంది, రాహువు సూర్యుని మ్రింగె నని చెప్పుచుందురు. ౫౪౭

తద్వ ద్దేహాదిబన్ధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమమ్
పశ్యన్తి దేహివ న్మూఢా శ్శరీరాభాసదర్శనాత్. 548

అట్లే దేహాదిబంధమునుండి విముక్తుడైన బ్రహ్మజ్ఞానికి ఆభాసమాత్రముగా మున్నందున, మూఢులదృష్టి కతడు దేహవంతుడుంబోలె కనబడుచుండును. ౫౪౮

అహి ర్నిర్ల్వయనీం వాయం ముక్త్వా దేహం తు తిష్ఠతి
ఇత స్తత శ్చాల్యమానో యత్కిఞ్చి త్ప్రాణవాయునా. 549

పాము కుబుసము నూడ్చి వేసికొన్నట్లుగా, జ్ఞాని దేహము (తోడితాదాత్మ్యము)ను వదలుకొనును. గాలిలో కుబుసము ఇక్కడి కక్కడికి కొట్టుకొనిపోయినట్లుగా, జ్ఞాని దేహము, ప్రాణవాయుప్రేరితమై (ప్రారబ్ధకర్మఫలానుభూతికై) ఇక్కడి కక్కడికి త్రిప్పట చెందుచుండును. ౫౪౯

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నతస్థలమ్
దైవేన నీయతే దేహో యథాకాలోపభుక్తిషు. 550

నదీప్రవాహము(నబడిన) కొయ్యను ఆ ప్రవాహవేగము పల్లములలోనికిని మిట్టల మీదికిని చేర్చునట్లుగా, ఏయే దేశకాలములలో ఏయేకర్మఫలముల ననుభవింపవలయునో ఆయాకర్మఫలముల ననుభవించుటకై దేహమును దైవము అక్కడక్కడికి అప్పటప్పటికి చేర్చుచుండును. ౫౫౦

ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభి స్సంసారివ చ్చరతి భుక్తిషు ముక్తదేహః
సిద్ధ స్స్వయం వసతి సాక్షివ దత్ర తూష్ణీం చక్రస్యమూల మివ
కల్పవికల్పశూన్యః. 551

చక్రము తిరుగుచున్నను ఇరుసు తిరుగదు కదా. అట్లే దేహముతోడి తాదాత్మ్యమును వదలుకొనిన జ్ఞానసిద్ధుని దేహము సంసారుల (దేహముల)వలెనే ప్రారబ్ధకర్మపరికల్పితములైన వాసనలచే ఆ కర్మఫలానుభవనిమిత్తము త్రిప్పట చెందుచుండును. కాని దేహములోని ఆత్మ కేవలము సాక్షిగా ఊరకుండును. ౫౫౧

నైవేన్ద్రియాణి విషయేషు నియుఙ్క్తఏష నైవాపయుఙ్క్త ఉపదర్శనలక్షణస్థః
నైవ క్రియాఫలమ పీష దవేక్షతే స స్వానన్దసాన్ద్రరసపానసుమత్తచిత్తః. 552

అతడు ఇంద్రియవిషయముల ననుభవింపు డని ఇంద్రియముల నాజ్ఞాపింపను ఆజ్ఞాపింపడు, అనుభవింపనీయక లాగిపట్టను పట్టడు. తా నాచరించు కర్మల ఫలము నించుకయు కోరడు. స్వానందసాంద్రరసపానమత్తచిత్తుడై కేవలము ఉపద్రష్ట(=సాక్షి)గా నుండును. ౫౫౨

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా య స్తిష్ఠే త్కేవలాత్మనా
శివ ఏవ స్వయం సాక్షా దయం బ్రహ్మవిదుత్తమః. 553

[పాము అని అనుకొనబడినది నిజమునకు త్రాడే అని గ్రహించినట్లు, జగత్తు అని అనుకొనబడుచున్నది బ్రహ్మమే అని గ్రహించి] లక్ష్యము(=బ్రహ్మము) అలక్ష్యము(=జగత్తు) అను భేదభావము విడిచి బ్రహ్మముగానే యుండు ఉత్తమబ్రహ్మజ్ఞాని సాక్షాత్తుగా శివుడే. ౫౫౩

జీవ న్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః
ఉపాధినాశాద్ బ్రహ్మైవ స న్బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్. 554

బ్రహ్మమే అయిన బ్రహ్మవిత్తముడు ఉపాధినాశముచే నిర్ద్వయమగు బ్రహ్మమందే లయించును. దేహము పడిపోకున్నను అతడు కృతార్థుడే, సదా ముక్తుడే. ౫౫౪

శైలూషో వేషసద్భావాభావయో శ్చ యథా పుమాన్
త థైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠ స్సదా బ్రహ్మైవ నాపరః. 555

నటవృత్తియం దున్న మానవుడు వేషమును వేసికొన్నప్పుడును, తీసివేసినప్పుడును తాను తానే. అట్లే ఉత్తమబ్రహ్మజ్ఞానియు తాను సదా బ్రహ్మమే అగును, వేఱేదియు కాడు. ౫౫౫

యత్ర క్వాపి విశీర్ణం స త్పర్ణ మివ తరో ర్వపుః పతతాత్
బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ తచ్చిదగ్నినా దగ్ధమ్. 556

బ్రహ్మీభూతుడగు యతీంద్రుని దేహము, మునుపే జ్ఞానాగ్నిచే దగ్ధమై యున్నట్టిది, చెట్టునుండి పండుటాకు రాలినట్లుగా ఎక్కడ పడిపోయినను పోవును గాక. ౫౫౬

సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః పూర్ణాద్వయానన్దమయాత్మనా సదా
న దేశకాలాద్యుచితప్రతీక్షా త్వఙ్మాంసవిట్పిణ్డవిసర్జనాయ. 557

పూర్ణమును అద్వయమును ఆనందమయము నగు ఆత్మను పరమాత్మయందు ఐక్యమొందించుకొన్న మునీంద్రుడు త్వఙ్మాంసమలమూత్రపాత్రమగు తన దేహమును విడనాడుటకు దేశకాలప్రతీక్ష అక్కఱ లేదు. ఎక్కడైనను ఎప్పుడైనను దేహమును విడనాడ వచ్చును. ౫౫౭

దేహస్య మోక్షో నో మోక్షో న దణ్డస్య కమణ్డలోః
అవిద్యాహృదయగ్రన్థిమోక్షో మోక్షో యత స్తతః. 558

ఏల యన, అవిద్యాహృదయగ్రంథి (= ముడి) వీడుటే మోక్ష మగును కాని, దండమునో కమండలువునో దేహమునో విడనాడుట మోక్షము కాదు. ౫౫౮

కుల్యాయా మథ నద్యాం వా శివక్షేత్రేఽపి చత్వరే
పర్ణం పతతిచే త్తేన తరోః కిం ను శుభాశుభమ్. 559

చెట్టునుండి రాలెడి ఆకు కాలువలో బడిన నేమి? నదిలో బడిన నేమి? శివక్షేత్రమున బడిన నేమి? ముంగిట బడిన నేమి? అందువలన ఆ చెట్టునకు గలుగు శుభమును లేదు, అశుభమును లేదు. ౫౫౯

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవ ద్దేహేన్ద్రియప్రాణధియాం వినాశః
నైవాత్మన స్స్వస్య సదాత్మక స్యానన్దాకృతే ర్వృక్షవ దస్తి చైషః. 560

ఆకులు పువ్వులు పండ్లు రాలినను చెట్టు చెక్కు చెదర కుండును. అట్లే దేహము ఇంద్రియములు ప్రాణము బుద్ధి అనునవి నశించినను సచ్చిదానందమగు ఆత్మకు సెగి లేదు. చెట్టువలె ఇదియు తిరముగ నుండును. ౫౬౦

ప్రజ్ఞాన ఘన ఇత్యాత్మలక్షణం సత్యసూచకమ్
అనూద్యౌపాధికస్యైవ కథయన్తి వినాశనమ్. 561

'ప్రజ్ఞాన ఘన' ఇత్యాదిగా, సత్యసూచకముగా ఆత్మలక్షణమును దెల్పు శ్రుతులు 'ఉపాధులు మాత్రమే నశించు'' నని చెప్పుచున్నవి. ౫౬౧

అవినాశీ వా అరే ఽయ మా త్మేతి శ్రుతి రాత్మనః
బ్రవీ త్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు. 562

వికారములు నశించునే కాని ఆత్మ నశింపదు, ఆత్మ అవినాశి— అని ''అవినాశీ వా అరే అయం ఆత్మా'' అనెడి శ్రుతి చెప్పుచున్నది. ౫౬౨

పాషాణవృక్షతృణధాన్యకటజగ్రాద్యా దగ్ధా భవన్తి హి మృ దేవ యథాతథైవ
దేహేన్ద్రియాసు మన ఆది సమస్తదృశ్యం జ్ఞానాగ్నిదగ్ధ ముపయాతి
పరాత్మభావమ్. 563

మట్టినుండి ఉత్పత్తిల్లిన రాళ్ళు చెట్లు గడ్డి ధాన్యము పొట్టు మున్నగునవి కాలిపోయి నప్పుడు మట్టిగనే రూపొందునట్లు, ఆత్మయందు భ్రాంతికల్పితములగు దేహము ఇంద్రియములు మనస్సు మున్నగున వన్నియు జ్ఞానాగ్నిచే దగ్ధములైనప్పుడు ఆత్మయందే పర్యవసించు చున్నవి. ౫౬౩

యోగపాఠబోధిని—11

# రాజయోగము

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

(గతసంచిక తరువాయి)

తర్వాతి సాధన బ్రహ్మచర్యం. బ్రహ్మచర్యం అంటే ఊర్ధ్వరేతస్కత, వీర్యస్ఖలన నిరోధం. (బ్రహ్మమందు సంచరించడం అని శబ్దార్థం.) ఏ రంగంలో చక్కగా పాటుబడ గోరినా, వీర్యమును నిలువరం చేసికోవాలి. విశేషించి యోగసాధకునకు బ్రహ్మచర్యం చాల ముఖ్యం. అందువల్ల గలిగే లాభాలు శారీరకములు మానసికములు ఆధ్యాత్మికములు అని ముత్రివిధాలు. కామాభిలాషకు అడుగున అమరత్వాభిలాష ఉంది. కాబట్టి ఆ వీర్యాన్ని కామోపభోగంవంకనుండి మరల్చి మార్గం

మార్చితే, మహోన్నతమైన అమరత్వసిద్ధికి సాధకం ఔతుంది.

మానవుల అంతఃకరణప్రబోధాలు ఎప్పుడూ మంచివిగా ఉండవు. అయినా జాగ్రత్తగా ఉండండి; ఎదురుతిరగడం కూడదు. మితిమీరడం ఎంత చెడ్డదో ఎదురుతిరగడమున్నూ ఇంచుమించు అంత చెడ్డదే. ఏవో కొన్నిటిని మానుకొన్నంతమాత్రంచేత నీవు అతిమాత్ర పవిత్రుడవైనట్లుగా భావించకు. యోగవిద్యను అర్థించే వ్యక్తి తన్ను పురుషునిగా గాని స్త్రీనిగా గాని భావించక కేవలం మానవ వ్యక్తిగా మాత్రం భావించుకోవడం నేర్చుకోవాలి. స్త్రీత్వపురుషత్వస్మృతి ఏమాత్రం ఉన్నా పరస్పరసంచలనం కలిగి తీరుతుంది. సంచలనస్వరూపం మానసికంకానీ, శారీరకంకానీ మనస్సులో కలవరపాటు కలిగిస్తుంది. వీర్యం నిలువరం చేసుకుంటే బుద్ధిబలమును తక్కిన అన్నిశక్తులకు చెప్పుకొదగిన అభివృద్ధియు చేకూరుతాయి. యోగాభ్యాసానికి అతిమాత్ర బలిష్ఠమైన దేహం, సుదృఢములైన నరములు కామలోభసంక్షుబ్ధం కాని తీక్ష్ణమైన మనస్సును ఉండాలి. కాబట్టి యోగవిద్యార్థి స్త్రీత్వపురుషత్వాలజ్ఞప్తిని దులిపివేసుకోవాలి. అదే బ్రహ్మచర్యం అంటే.

యోగికి సంరక్షకమైన ప్రహరిగోడలోని అయిదవ స్తంభం అపరిగ్రహం — దానాలు గ్రహించకుండడం. దీన్ని సరిగ్గా అర్థం చేసుకోవడం అవసరం. మీకు దానా లిచ్చిన వారు మీవల్ల ప్రతిఫలం నిరీక్షిస్తా రనుకోండి, మీ స్వేచ్ఛను మీరు నిలుపుకోగలం అనుకుంటున్నారా? వారిమీద పక్షపాతం చూపక ధర్మపక్షపాతం మీరు చూపగలరా? "వారు మనకు అప్పుడప్పుడు అది ఇది యిచ్చినవారు కదా" అనే కృతజ్ఞస్మృతి మనస్సును సదా కలవరపరుస్తుంటుంది. కానుకలుకూడ ఒక్కొక్కప్పుడు లంచా లవుతాయి. కాబట్టి వివేకం కలిగి ఉండాలి. ఈసూత్రం పాటించండి. కానుక ఇస్తున్నవాడికి ప్రేమే తప్ప, వేఱు ప్రతిఫలాపేక్ష లేకుండేటట్లు చూచుకోండి. అది వారు కేవలం అప్రార్థితంగా తమంతట ఇస్తున్న కానుకగా ఉండేటట్లు చూడండి. దానం పుచ్చుకునేవాడు ఏమీ కోరగూడదు. ఏవస్తువుమీద మనకు తీవ్రాశ ఉందో దాన్ని కానుకగా పుచ్చుకుంటే, ఇచ్చిన వాళ్ళకు మనం బద్ధులమై ఉండవలసివస్తుంది. ఆ వస్తువు మీద మనకు ఆశ లేక, దాతలు అప్రార్థితంగా కేవలం ప్రేమచేత తమంతట ఇచ్చిన కానుకైతే, దాన్ని పుచ్చుకొన్నందువల్ల దానిసత్వం గానీ, చిక్కు గాని కలుగదు.

ఇచ్చుకోలు పుచ్చుకోలు లేక పోతే ఈ ప్రపంచం ఎడారే. ఐనా, ఆధ్యాత్మికశక్తిని కాచుకోండి. పిసినారి వాడికి డబ్బుమీద ఉన్న ప్రీతివంటి ప్రీతి మీకు ఆధ్యాత్మికశక్తిమీద ఉండాలి. ఎందుచేత కానీ, ఆధ్యాత్మికశక్తిని తఱిగిపోనీక చూచుకోండి. ఇతరులకు మనం బద్ధపడి ఉండవలసినట్లుగా వాళ్ళవద్ద కానుకలు పుచ్చుకొన్నామంటే, ఆధ్యాత్మికశక్తి చెడుతుంది. ఇబ్బందులలో చిక్కుకోడానికంటె, ముందు జాగ్రత్త కలిగి ఉండడం మేలు. అటువంటి సందర్భాలను నాజూకైన రీతిలో తప్పించుకోండి. దాతకు ప్రతిగ్రహీతకు మధ్య సూక్ష్మమైన పరివర్తనం సాగిపోతుంది. కాబట్టి వివేకరహితంగా బహుమానాలు పుచ్చుకోకుండా మెలకువ కలిగి ఉండాలి. కానుకల సమర్పణస్వీకారాలు జరిగే సందర్భాలలో వివేకం అనే నేత్రాన్ని సదా తెఱిచి ఉంచుకోండి. గలభా చేయకండి, గ్రుడ్డిగా

నమ్మకండి, వివేకాన్ని సదా అవలంబించి ఉండండి.

మునుపు ఒక యోగి ఉండేవాడు. అతడు చాలా సంవత్సరాలు సాధన చేశాడు. పరివ్రాజకుడుగా తిరుగుతుండిన దినాలలో ఒక రాత్రి అతడొక ధనవంతుని ఇంట విశ్రమించి అతని ఆతిథ్యం స్వీకరించాడు. గదిలో ఒక వెలపొడుగు వస్తువుమీద ఆ యోగిదృష్టి ప్రసరించింది. చూచినకొద్దీ అతనికి ఆ వస్తువుమీద మరులు హెచ్చింది. మనస్సును అదుపులో ఉంచుకోలేకపోయ్యాడు ఆ వస్తువును సంచిలో వేసుకొని వెలుపలికి వెడలిపోయ్యాడు. కాసేపటికి ఈలాగు తలపోసుకున్నాడు: "నేను చేసిన పని ఏమిటి? దొంగతనం కదూ" వెంటనే అతడు ధనికునింటికి తిరిగి వచ్చి, వస్తువు నిచ్చి "ఏదో ఒళ్లు తెలియక ప్రవర్తించాను, మన్నించండి" అని ప్రార్థించాడు. ఆ ధనవంతుడొక బొబ్బనవ్వు నవ్వి "తాము నాకు అతిథిగా ఇక్కడే ఉండండి" అని కోరాడు. నిరాకరించి యోగి వెడలిపొయ్యాడు.

ఆ సమీపంలోనే మరొక యోగి ఉండినాడు. ఆ యోగితో ఈ యోగి జరిగిందంతా చెప్పాడు. ఆయన ఇంచుకైనా ఆశ్చర్యపడక ఈలా గన్నాడు. "సోదరా, అందుకు కారణం నాకు తెలుసు. ఆ సంపన్నుని ఆతిథ్యం నీ మనశ్శరీరాలను కలుషితాలనుగా చేసింది. అతడు ధనాన్ని అపమార్గాలలో సంపాదించాడు. అమాయకుల చెమటోడించి నెత్తురు చిందించి సంపాదించిందే అతనివద్ద ఉన్న ప్రతిపైసాయు. అతని అన్నం తిన్నందువల్ల ఈ దొంగబుద్ధి నీలోనికి సంక్రమించింది. నీచేత దొంగతనం చేయించింది."

ఇతరులవద్దనుండి దానాలు ఉపకారాలు ఆతిథ్యమూ స్వీకరించేటప్పుడు ప్రతివాడూ చాల జాగ్రత్తగా ఉండాలి. వాని ప్రభావం అతని మనస్సుమీద అతిసూక్ష్మమార్గంలో ప్రసరిస్తుంది.

ఆఱవసాధన శౌచం. శౌచం అంటే బాహ్యశుద్ధి, ఆంతరశుద్ధి, శరీరశుద్ధి, మనశ్శుద్ధి. శరీరశుద్ధినిగూర్చి చాలవఱకు మీకు తెలుసు. కాబట్టి దాన్నిగురించి నేను చెప్పను. కాని ఒకముఖ్యవిషయం ఉంది. విశుద్ధి లోపలినుంచి వెలుపలికి ప్రసరించేటట్లు అలవఱచుకోవాలి. విశుద్ధి అంటే లోకులను వంచించి వాళ్ళ కళ్ళల్లో దుమ్ముచల్లే వేషం కాదు. పైకి విశుద్ధివేషం ఎంత వేసినా, లోపల మాలిన్యం ఉంటే, బాగదు. వంచన అనే కళను అభ్యసించకండి. మనస్సు పరిశుద్ధంగా ఉంటే దేహం కుసుమూకూడ పరిశుద్ధాలుగా ఉంటాయి. పనులు ఒకపద్ధతిలో ఒకక్రమంలో నిర్వర్తితము లవుతుంటాయి. కాబట్టి విశుద్ధమైన మనస్సును జీవితపువాడుకలను పెంపొందించుకోండి.

మనస్సు విశుద్ధంగా ఉండాలంటే ఇతరుల గుణాలు మాత్రమే అందు పొత్తుకోవాలి, దోషాలు అంటకూడదు. ఒకప్పుడు ఒక మనుష్యుడు మురికినీటిగుంటలో పడ్డాడు. చుట్టుపట్ల వారందఱూ పరుగున వచ్చి తమ ముక్కులను అతనికేసి రుద్దారు. మురికి అంతా వాళ్ళ ముక్కులకు అంటుకొన్నది. తుడవబడ్డట్లుగా అతడు విశుద్ధుడయ్యాడు! ఈర్ష్య అసూయ అనుమానం అనేవి మనస్సులో మురికి నేర్పఱుస్తాయి అని జ్ఞప్తి ఉంచుకోండి. వ్యర్థాలాపాలుకూడ మనస్సును కలుషితం చేస్తాయి. చెలిసంచారాన్ని మానేటట్లుగాను కలతలకు లోనుకాకుండేటట్లుగాను, మనం మనస్సును తర్ఫీదుచేయాలి. లోపలి సంకల్పశుద్ధియు ఆశయశుద్ధియునే వెలుపలిశుద్ధికుండ ఆవి

ష్కృతము లౌతాయి. విశుద్ధిపరత ఇంచు మించు భగవత్పరతే అంటారు, ఔను మన శ్శుద్ధి. మనశ్శుద్ధి అనగా నిస్సంగత్వాము వల వఱచుకొనుటే. వస్తువుల సంగం ఉండినట్లైతే మనస్సు కళంకితం కాకపోదు.

ఏడవ సాధన సంతోషం. మనస్సంతుష్టి లేక, ఏమంచినైనా సాధించినవా డుంటే, నాకు చూపండి. సదా అసంతుష్టుడుగా ఉండే వాడు, ఏ రంగంలోను ఏలాటిపురోగతిని సాధింపజాలడు. సంతుష్టి ఏర్పడితే ఇక పురో గతి ఉండ దని కొంద అనుకుంటారు. కాని ఎంతెంతో సాధించినవారు, వేత్తేమైనా అయితే కావచ్చు కాని, అసంతుష్టులుమాత్రం కా రనడం నేను కనుగొన్నాను. అసంతుష్టులు సాధారణంగా సోమరులుగా ఉంటారు, ఎందుకూ పూనుకోరు. వారు ఏ ప్రయోజనంకోసమూ ఏమీ సాధించరు. సంతుష్టి ఏర్పడితే ఉద్యమం నశిస్తుం దనుకోవద్దు. అసంతుష్టి మానవుంకి బంధం. వివేకమార్గంలో సంతుష్టిని పెంపొం దించుకోవాలి.

సంతుష్టి అంటే ఏమి? సంతుష్టి అనున దొక మనఃపరిస్థితియే కాని మన అందుబాటులో ఉండే సంపత్సమృద్ధులు కావు. అసంతుష్టి అంటే మనస్సంక్షుబ్ధదశ. ఈ దశలో మనస్సు పైభాగంలో కెరటాలు హెచ్చుగా పుట్టు తుంటాయి. అసంతుష్టిని కలిగించుకొని జీవిత సంక్షోభం చెందకండి. ఇప్పటి మీ పరిస్థితికి సంతృప్తులై సంతోషించండి, ఈ మెట్టునుండి నిర్మాణం సాగనివ్వండి. సంతుష్టి లేని మనస్సుకు శాంతియు సమస్థితియు ఉండదు, యోగంలో పరిపూర్ణత సిద్ధించదు.

ఎనిమిదవ సాధన తపము. తపస్సు అను మాట విన్నంతనే అనేకులు గడగడలాడి పోతారు. తపస్సు అంటే వస్త్రం లేకుండడం, చర్మములు కప్పుకోవడం, సంస్కారహీనము లైన మార్గాలలో జీవితం గడపడం అని వా ళ్ళనుకుంటారు. తపస్సుకు అర్థం ఇదే ఐతే, లోకములోని ఊరుద్రిమ్మరు లందఱూ యోగి వతంసులౌతారు! ద్వంద్వములవల్ల పొంగు క్రుంగులకు లోనుగాక ఏకరీతిజీవనికిని అలవఱచు కోవడమే తపస్సు. మేలుకీళ్లు, రోగారోగ్యాలు, నిందాస్తుతులు, సంయోగవియోగాలు మొద లైన ద్వంద్వానుభూతుల ఓర్చుకోగల శక్తిని గడించడమే తపస్సుకు ప్రయోజనం. జీవితంలో శాంతి కావాలంటే, నానాపుటిరుపైపులను స్వీకరించ గలిగి ఉండాలి. ద్వంద్వములంపలి సంగంచేత నే మనఃప్రశాంతి విచ్ఛిన్నమౌతుంది. అప్పు డితరులు మీమీద పువ్వులు చల్లినా, చెప్పులు రువ్వినా, మీ కొక్కటే.

ఏరంగంలో ఏమి సాధించగోరినా, నిస్సం గత్వం కొంత అలవఱుకోక తప్పదు. మీరు సంఘసేవ చేయ పూనుకుంటూ రనుకోండి. కాటకంచేత వఱదలచేత అంటువ్యాధులచేత బాధపడుతుండే ప్రజలకు సాహాయ్యం చేయ వలసిన ఆవశ్యకత మీకు కలిగిం దనుకోండి. వేళ తప్పకుండా మీకు భోజనమూ విశ్రాంతి అమరాలి అనుకుంటే, ఆ సాహాయ్య కార్య క్రమాన్ని మీరు విజయవంతంగా నిర్వహించ గలుగుతారా? నిర్వహించగలుగవలె నంటే సొంత సౌకర్యాలను వదలుకోవడం అలవఱచు కోవలె. అదే తపస్సు. జరూరు కలిగితే, ఏ సౌకర్యం లేకపోయినా సరిపుచ్చుకోగలట్లు మీ మనశ్శరీరాలను తర్ఫీదుచేసుకోండి. అది మీ కెంతో బలం చేకూర్చుతుంది. ఈ శరీరం ఒక యంత్రంవంటిది. ఇష్టమైన మార్గాలలో దానిని సరిపఱచుకోవచ్చు. అట్లు సరిపఱచు

కునే సామర్థ్యం యోగమార్గానుసారికి అత్యావశ్యకం.

యోగి అంతర్ముఖతను అలవరచుకోవాలి. మనం సాధారణంగా సంక్షోభానికి కారణమును వెలుపల వెతుకతాం. లోపలనుండి దాన్ని అదుపులో ఉంచడానికి ప్రయత్నం చేయము. యోగి తన అంతఃప్రకృతియందు అక్కఱ వహిస్తాడు. ప్రతిపనిలోను ఆత్మ నిగ్రహం పాటించాలి. శీలం బలపడే రీతిలో, మనశ్శరీరాలను తర్ఫీదుచేయండి. ఆధ్యాత్మిక బలం పెంపొందడానికి కొంతకాలం పై వేషం విషయంలో నిరాదరం గలిగి ఉండండి. పరిహాసాలను ఓర్చుకోండి. మాటలాడే విషయంలోనూ ఎంతో క్రమశిక్షణ అవసరం. "ఎదుటివారిని నొప్పించే మాట ఒక్కటికూడా మన నోటినుండి వెలువడకూడదు." ఈ నియమాన్ని ఆరునెలలకాలం పాటించండి. ఎప్పుడైనా నియమం తప్పితే, మిమ్మల్ని మీరే దండించుకోండి. వాక్కును అదుపులో ఉంచుకోవడం యోగవిద్యార్థికి ముఖ్యం. వారాని కొక్క దినం మౌనవ్రతం పాటించడానికి ప్రయత్నించండి. ఐనా, మౌనంగా ఉండేదినాలు ఏడుగా ఉండనీయండి. సదా వాగుతుండడంవల్ల ఇతర భావావిష్కరణమార్గాలు మూసుకుపోతాయి.

సంభాషణను అదుపులో ఉంచడం ఎంత కష్టమో, పూర్తి మౌనం పాటించడం అంత కష్టం కాదు. మనస్సు సూక్ష్మం అయ్యేకొద్దీ, సంక్షోభకసంచలనాలకు మరింతగా గురి అవుతుంది. అన్నివైపుల పనులలోను యోగికి తపస్సు చాల అవసరం.

తొమ్మిదవ సాధన స్వాధ్యాయం, అంటే కాలమును క్రమమును తప్పని చదువు, అభ్యాసం. దినాని కొకక్రమం ఏర్పరచుకొని దానిని తప్పకుండా సాగించండి. మనకు లోపల సర్వమూ క్రమబద్ధంగా సాగుతుంది. క్రమబద్ధతను బుద్ధిపూర్వకంగా పాటించినయెడల అల్ప క్రమతో అనల్పకార్యాలు నెరవేరుతాయి. క్రమబద్ధతయే సాధనలో మిమ్మల్ని ముందుకు తీసుకుపోతుంది. చదువులో కాలము క్రమము తప్పకుండు నాటుకచే అత్యధిక ప్రతిఘటనశక్తి మీకు కలుగుతుంది. క్రమబద్ధత, నిలుకడ, పట్టుదల మీకు లేకపోతే, ఒక చిన్నయిబ్బంది కల్గినంతమాత్రమునకు మీరు క్షోభిల్లితే, ఒక పిల్లగాలి మిమ్మల్ని దారితప్పించగలిగితే, మీరు ఎప్పుడుకానీ, ఏ ఘనకార్యమునుకానీ సాధింపజాలరు. గాలి వీచిన వంక కెల్ల తిరుగు వాయుసూచివలె, మాటిమాటికి మారకండి. అసౌకర్యాలను, అడ్డాలను చిక్కులను ఎదిరించి నిలవండి వాటితో చెప్పండి:— "మీరు చుట్టుముట్టినా నాస్థానంనుండి నన్ను ఒక్క అంగుళమైనా కదల్పజాలరు. లోకమంతా ఎదిరించినా, నా సాధనను ఆపడం వాళ్ళ తరం కాదు." అని మీకు వీరసంకల్పం ఉండాలి. ఈ పట్టుదల లేనందువల్లనే చాలమందికి వారు కోరినవి సిద్ధించడం లేదు. మీ శీలంలో భాగంగా అమరిపొయ్యేవి, మీరు చేసే పనులు కావు, వానిని చేయడంలో మీరు పాటించే సక్రమత.

సాధనలో సడలని పట్టుదలకు నేను చూచిన శ్రేష్ఠములైన లక్ష్యాలలో ఒకటి వారణాశిలోని తొంబదేండ్ల మగువ. నలువదేండ్ల కాలం ప్రతిదినం ప్రొద్దున ఆమె భగవద్గీతను బిగ్గరగ చదువుతూ వచ్చినది. ఈ నిత్యపారాయణానికి ఒక్కవిఘ్నమువైనను రానీయ లేదు. ఆమె యోగినియూ కాదు, విదుషియూ కాదు 'లోకంలో నేనొక సామాన్య వనితను' అనియే ఆమె చెప్పుకుంటుంది, కాని ఆమెలో నేను గుర్తించిన సుగుణాలు ఏ యోగినిలో ఉన్నా,

ఆ యోగిని గర్వించవచ్చు. (ఇటీవల ఒక సంభవం విన్నాను. వారణాశిలో కోతు లెక్కువ. కోతుల పోకిరితనమూ ఎక్కువ. ఒక కోతి ఆవృద్ధురాలి కంటిఅద్దాలజోడును అపహరించి కొనిపోయిందిట. పాపం, ఆమె ఎక్కువగా కలత చెందింది. మరొక కంటిఅద్దాలజోడు తాను సంపాదించగలంతవరకు, కొన్నాళ్ళ పాటు భగవద్గీతాపారాయణం ఆగిపోతుం దని ఆమె అనుకుంది. కాని ఏం జరిగిందో వింటే మీరు ఆశ్చర్యపడతారు! అన్నియేండ్లకాలం ప్రతిదినమూ చదువుతూ వచ్చిన కారణంగా, భగవద్గీత ఏడువందల శ్లోకాలు ఆమెకు కంఠ పాఠం అయ్యాయి. కాబట్టి కంటి అద్దాలజోడు లేనికాలంలో పారాయణం విఘ్నితం కాలేదు అట్టిది నిరంతరాభ్యాసమహిమ!

బైబిలు చదువడంలో గానీ, కొరాను చదువడంలో గానీ, ఏ పవిత్రగ్రంథపారాయణంలో గానీ, ప్రార్థనలో గాని జపంలో గానీ, ధ్యానంలో గాని, ఎందులోనైనా గాని అటువంటి నిలుకడ ఉంటే, సిద్ధి కలిగితీరుతుంది. పండ్రెండేండ్లకాలం భగవన్నామము ప్రతిదినం ప్రొద్దున ఐదుపర్యాయములు చెప్పిచూడండి. కాలము క్రమము తప్పక అది సాగితే, దాని ఫలితం మీరే చూస్తారు.

సాధనలలో కడపటిది, పదవది, ఈశ్వర ప్రణిధానం, అంటే సాధకుడు తన్ను ఈశ్వరునికి అర్పించుకోవడం. ఒక మహోన్నతశక్తి మిమ్ము ముందుకు తీసుకు వెళుతున్నాడని సదా భావించండి. ఆ శక్తిని దేవు డనండి, లేదా మీకు నచ్చిన ఏపేరుతోనైనా నిర్దేశించండి. ఆశక్తి కృపానుగ్రహముల చేతనే మీరు విహితసాధనలను తపఃక్రమాలను నిర్వహింపగలిగారు రక్షభావం సదా మీకుండనివ్వండి. మీ సాధనలను సాధనల ఫలితాలను కూడా ఆశక్తికి సమర్పించండి. సత్ఫలితాలను మీకే ఉంచుకొన్నారంటే, అవి మీకు బంధనము లవుతాయి. ఉన్న ఫలితాలను సకల ప్రాణులకు అనుభవించ నీయండి. స్వలాభం నిరీక్షించకండి.

మీ సాధనల ఫలితాల నన్నిటిని మీయిష్టదైవానికి అర్పితం చేయండి. మీరు ఏంసాధించి ఉండినా, అది మీసామర్థ్యంగా భావించకండి. మీ పురోగతిని కొలిచిచూసుకునే ప్రయత్నం ఎన్నడూ చేయకండి. తాను నాటిన మొలక పెంపొందడం చూడవలెనని ఒకడు ప్రతిదినం వేరులు అన్నీ త్రవ్వి చూచేవాడుట! ఆ మాదిరి చేయకండి. ఒక సన్న్యాసి తన చిన్ననాటి మిత్రు నొకని కలసికొన్నాడుట. మిత్రుడు సన్న్యాసిని అడిగాడు 'సన్న్యాసిదీక్ష గ్రహించి నందువల్ల, నీకు కలిగిన లాభము లేమి?' అని. సన్న్యాసి బదులు చెప్పాడు, "సోదరా, నేను ఏ మెట్టులో ఉన్నానో నాకు తెలియదు. నేను లెక్క నంతా కూడి కళ్ళు తేల్చుకో లేదు."

యోగకర్షకుడు తన మూడున్నరమూరల భూమిని కాపాడుకునేందుకు పాటించవలసిన యీ పదిరాజయోగసాధనలున్నూ నీతిశాస్త్రానికి మూలభూతములైనవి. మీకు యోగసాధనలో అభిరుచి ఉండినా లేకున్నా, పైని చెప్పిన నియతులను మీ జీవితంలో పాటించితే, ఏ కార్యరంగంలోనైనా మీరు నెగ్గుతారు. వీటిని పాటించకపోతే యోగవిద్యార్థి పురోగమించజాలడు అన్న సంగతిని చెప్ప నక్కఱ లేదు.

రాజయోగాంగాలలో మూడవది నాలుగవది ఆసనం, ప్రాణాయామం, పైసారి ప్రసంగంలో వాటిని గూర్చి ముచ్చటించుకుందాం.

(సశేషము)

# శ్రీ రామకృష్ణుని చమత్కార హాస్యములు

## శ్రీ తుమ్మల పేరారెడ్డిగారు

(1974 అక్టోబరు సంచిక తరువాయి)

బ్రాహ్మసమాజీయులలో డంభము ఎక్కువగా కనబడుచుండెను. ఛలోక్తుల ద్వారా శ్రీరామకృష్ణుడు వారికి బుద్ధికఱప గోరెను. వారి ప్రార్థన విధానము లెట్లుండునో చూతమని శ్రీరామకృష్ణు డొకసారి బ్రాహ్మసమాజమందిరమున కేగెను. ప్రార్థన సల్పించినవాడు భగవంతుని ఐశ్వర్యాశ్చర్యముల కొనియాడి 'ఇక మనము ధ్యానింతముగాక' అనెను. అంతట అందఱును కన్నులు మూసికొనిరి. రెండు నిమిషములైన నైనవో లేవో, వెంటనే అందఱును కన్నులు తెఱచిరి. ఆర్జవమూర్తియైన శ్రీరామకృష్ణుడు దానిని జూచి మిన్నకుండుట కిష్టపడలేదు. సహజచమత్కారముతో ఇట్లనెను "చూడు, కేశవా, మీ ధ్యాన మెట్లున్నదనగా........". ఆయన యభిప్రాయమును వినుటకు కేశవప్రముఖులు ఆత్రపడిరి, ఆయన చెప్పినది - "చెట్లమీద కూర్చున్న కోతుల చెయ్యమును తలంపించునదిగా ఉన్నది. కోతులు ఏదో దీర్ఘాలోచనలో నున్నట్లు కనిపించునే అవి తలంచుచున్నదెల్ల చెట్టలోని సొరకాయలపై గుమ్మడికాయలపై అరటికాయలపై వంకాయలపై దుముకుటకు సమయ మెప్పుడు దొరకునా యని". కేశవాదులు నవ్విరి.

సత్యాన్వేషకుడగు శ్రీరామకృష్ణుడు, ఎవరినిగాని నరేంద్రనాథునికూడ—ఉపేక్షింపడు. నరేంద్రనాథు డొక భక్తిగీతమును పాడుచుండెను. ఆ పాటలోని ఒక గీటున కర్థ మిది: "భగవంతుని నిరంతరముగ ధ్యానింపవలెను" ఆ పాటను పాడుచున్నవానికిగాని వినుచున్నవారికిగాని సదా సర్వకాలము భగవంతుని ధ్యానించుచుండుట శక్యము కాదని శ్రీరామకృష్ణు డెఱుగును. వెంటనే చుఱుకుగను తమాషగను ఆయన అన్నమాట "దైవప్రార్థనమును దినమునకు రెండు పర్యాయములు మాత్రమే చేయుడు". అక్కడ నున్నవారి నవ్వుతో ఇల్లు మ్రోగిపోయెను.

ఎవరు తనకు ప్రీతిపాత్రులో వారితోనే శ్రీరామకృష్ణు డిట్లంతయు ననగలడు. ప్రీతి గలవాడే సరియైన రీతిలో దండించును. శ్రీ చేసినే ఆయన విజయకృష్ణ గోస్వామితో "న త్రి [illegible] సేవించుచుండు ఉన్మత్తావస్థయందుండవు. అందుకు నాకు సంతోషమే. కాని ఇంటి పైకప్పు ఎప్పుడైన కూలునేమో అనియే నా భయము"—అని చెప్పగలిగెను, (విజయుని దేహము లా

గురుదేవుని దర్శించుటకు నరేంద్రనాథుడు దక్షిణేశ్వరమునకు తఱచు వచ్చెడివాడు. కాని అతని కటియొద్ద నున్న ప్రతిబంధములను త్రెంచుకొనుట సులభము కాకుండెను. నరేంద్రుడు సదా తనతోనే ఉండవలెనని గురుదేవుని తలంపు. కాని కొన్నాళ్ళవఱకు అది సాధ్యపడలేదు. అందు కొక తమాష కథను గురుదేవుడు చెప్పెను. ఒకప్పు డొక ప్రేతమునకు ఒంటరితనము గలిగెనట. సంఘముగ నుండ మను కోరిక ప్రేతములకు కూడ కలదు. కావున ఆ ప్రేతము సహచరులకై వెత్తెత్తినదియుం బోలె త్రిప్పట చెందెను. ఎప్పు డెవరు మరణించినను ఆ ప్రేతము తనకు మిత్రముగ నుండ గలదను కొండంత ఆశతో ఈ ప్రేత మచ్చటికి పరుగెత్తుచుండును - కాని దురదృష్టవశమున గంగాస్నానముచేతనో జ్ఞాతులు కావించిన శ్రాద్ధము

చేతనో దానికి ప్రేతత్వము తొలగిపోవును. కావున ఈప్రేత యొంటరిగనే యుండవలసి వచ్చెను, ఆప్రేతమువంటివాడను తా నని శ్రీరామకృష్ణుడు చెప్పుచుండెను.

ఒకొక్కప్పుడు శ్రీరామకృష్ణుడు శిశువు వలె ప్రవర్తించును. ఆప్రవర్తన శిష్యులకు వినోదము గూర్చును. ఆయన ఒకనాడొక బాలుని "నేను నడిప్రాయమువాడనైనను ఉడుపులు ధరించు సామర్థ్యము, బాలునకు లేనట్లే నాకును లేదు. దిగంబరుడవై నీవు సంచరింప గలవా" అని ప్రశ్నించెను. "మీ యెదుట సంచరింప గల" నని బాలుడు చెప్పెను. ఒక రాత్రి శ్రీరామకృష్ణుడు పాన్పునుండి లేచి "పొండి, గట్లొరసికొనుచు పాఱుచున్న నదిని జూడు" డని శిష్యుల నంపెను. శిష్యులు ఇంచుక నాగరకులు. వారు ఉడుపులు ధరించి నది యొద్దకు పోవుసరికి వెల్లువ తగ్గియుండెను. "ఎట్లున్నది ప్రవాహ" మని శ్రీరామకృష్ణుడు శిష్యుల నడిగెను. "తగ్గిపోయిన" దన్నారు వారు. ఆయన ఇట్లు మందలించినారు. "మఱిము లారా, మీరు వచ్చునంతవఱకు ప్రవాహ మాగియుండవలె నందురా? 'ఏల మీరు నావలె ఉడుపులు తొడిగికొనక పోయియుండ రాదు?"

మఱొకప్పుడు శ్రీరామకృష్ణు డిట్లనెను— "చాతకము వాననీటిపైనే ఆధారపడియుండునట్లు భక్తుడు భగవంతునిపైనే ఆధారపడియుండును." నరేంద్రనాథుడు "చాతకము వాననీటినిమాత్రమే త్రాగు ననుట వట్టి కవికల్పన" అనెను. నరేంద్రుని యీమాట ఆయనను యోచింపబూంచెను. ఒకనాడు నరేంద్రు డేటినీటిని త్రాగుచున్న గిబ్బలమును జూపెను. [illegible]డు నవ్వి "ఇది చాతకము కాదు. నీ మాటలలో నమ్మకము నాకును లే"దనెను.

ష్ణునకు మానని కంఠవ్రణ మేర్పడెను. డాక్టరు మహేంద్రసర్కారు వైద్యము చేయుచుండెను. ఒకనాడు అక్కడి వారు గురుదేవుని వ్యాధి ముదిరిన దని డాక్టరుకు చెప్పిరి. "ఈదిన మేమేమి భుజించితి" రని డాక్టరడిగెను. "ఉర్లగడ్డలు, పచ్చి అరటిపండ్లు, వంకాయలు, కోసుపువ్వు ముక్కలు కొన్ని" అని శ్రీరామకృష్ణుడు చెప్పెను.

దీన్ని సమర్థించుకొనుటకై డాక్టరు "అయ్యయ్యో! కోసుముక్కలు భుజించితిరా! ఎన్ని భుజించితి రేమి?" అని అఱచెను.

"ఒక్కటికూడ తినలే" దనెను శ్రీరామకృష్ణుడు. "కోసుపూరసమే మీ వ్యాధి ముదురుటకు కారణ" మని డాక్టరు గంభీరముగ తీర్మానించెను. తన తీర్మానమునకు ఉపపాదకముగా తన జీవితము నుండియే ఒక కథను చెప్పెను. ఒకనాడు ఆయనకు రొమ్ముపడిసెము గల్గినది. అది ఏమందునను లొంగక 'మొండికి వేసికొన్నది. విచారింపగా అప్పుడు విశేషముగ 'మసాల్కారై' పప్పును తినిపించుచుండినా రని అతనికి తెలిసినది. ఆ పప్పు జలుబును కలిగించునది. డాక్టరు ఆ ఆవుపాలనే త్రాగెను, అందుచే రొమ్ముపడిసెము వచ్చినది.

శ్రీరామకృష్ణుడు ఇంతమాత్రమునకు వెనుక తగ్గువాడు కాడు. చింతచెట్టు ప్రక్కన నడిచినంతమాత్రమునకు అజీర్ణవ్యాధి కగ్గమైన యొకనికథను ఆయన చెప్పెను.

ఒకప్పుడు అధరసేను డను మఱొక భక్తుడు తన మిత్రు డగు బంకించంద్రఛటర్జిని శ్రీరామకృష్ణునకు పరిచయపఱచెను. శ్రీరామకృష్ణుడు యమకాలంకార యుక్తముగా 'బంకిము బంకిము ( = మేనివంపు గలవాడు)' అనెను. బంకిము గురుదేవుని తమ గ్రామమునకు రమ్మని పిలిచెను. అందుకు జవాబుగా శ్రీరామకృష్ణ

డొక కథను వాక్రుచ్చెను. "మా గ్రామములో ప్రజలు తఱచు దైవప్రార్థనము చేయుచుందురు" రనెను బంకిము. శ్రీరామకృష్ణుడిట్లనెను :— ఒకడు కొన్ని నగ లమ్ముటకై కొందఱు మిత్రులతో కలిసి కంసాలి యంగడికి వెళ్ళెను. కంసాలియు నతనిమిత్రులును వైష్ణవులవలె కనబడిరి. వారు వచ్చి నాతనిని మిత్రులను హృదయపూర్వకముగ ఆదరించిరి. కంసాలిపనివాండ్లలో ఒకడు భక్తితో "కేశవ కేశవ అనెను. అతడు శ్రీకృష్ణుని నామమును స్మరించుచున్నాడనుట స్పష్టము. కృష్ణుని సహస్రనామములలో 'కేశవు' డనున దొకటి. కమసాలి పెద్దయు ఆపాటిభక్తితోనే 'గోపాల గోపాల' అని అఱచెను. మఱొక అనుచరుడు ఉద్రిక్తభావముతో 'హరి హరి' అనెను. మూడవ అనుచరుడు 'హర హర' అనెను. నిజమునకు కమసాలియు అతని అనుచరులును వంచకులు. మొదటి అనుచరుడు అనుభవపరుడైన కమసాలిని "ఈ వచ్చిన బేరగాం డ్రెట్టివా" రని అడిగెను. వంగభాషలో 'కేశవ' అనగా "వా రెవరు" అని అర్థము. వయోఽనుభవవృద్ధుడగు కంసాలి "గోపాల" అనెను. "వచ్చినవారు వట్టిగొడ్లు, సులభముగా మోసపోవుదు" రని యర్థము. రెండవ అనుచరుడు చెప్పిన 'హరిహరి" అను మాటలకు "వీరిని దోచుకొనుట కనుమతి ని" మ్మని యర్థము, కమసాలి పెద్దపఱముగా కడపటి అనుచరుడు చెప్పిన 'హరహర' అను మాటలకు "వీరిని దోచెదము గాక" అని యర్థము.

శ్రీరామకృష్ణుడు నరేంద్రునితో "అంత దూరము పోకు" మనెను. శ్రీరామకృష్ణుడతని నిట్లడిగెను, "ప్రియనరేన్, ఐహికపరులగు మానవులు తఱచు నిన్ను పరిహాసించుచుందురు. అప్పుడు నీ వేమి చేయుదువు?"

"వారు కుక్కలనియు మొఱుగుచున్నారనియు తలంతు" ననెను నరేంద్రుడు. నవ్వుచు శ్రీరామకృష్ణుడు "అంత దూరము పోకు" మనెను.

శ్రీరామకృష్ణునకు ఆంగ్లభాషలో ఎబిసి లైనను తెలియని తొలిదినాలలో నరేంద్రుడు ఆయనను అజ్ఞశిరోమణి అని సైతమనెను. ఆ కఠినవాని నోటి దురుసుతనము శ్రీరామకృష్ణునకు ప్రీతిని కూర్చెను. "నరేంద్రుడు తలచినంత అజ్ఞశిఖామణిని కాను, నేను. ఇంగ్లీషు అక్షరములు నేర్చుకొనను" ననెను ఆయన. అనంతరకాలమున ఆయన నరేంద్రుని నొకసారి 'ఇంకేమి చదువవలెనను నను కోరిక నీ కున్నదా" అని అడిగెను. "ఇంతవఱకు నేను చదివినదాని నంతయు మఱచిపోవలె ననుటే నాకోరిక" అనెను సంస్కారమొందిన నరేంద్రుడు.

తెలిసినవా రందఱికంటె ఎంతో ఎక్కువగ తెలిసినవాడగు శ్రీరామకృష్ణుడు ఆంగ్లభాషాభిజ్ఞులనుగూర్చి ఏమైనను చెప్పి హృదయపూర్వకముగ నవ్వుట కలదు. కొన్ని విషయాలను ఇంగ్లీషులో చర్చింపు డని నరేంద్రుని మహేంద్రుని ఆయన తఱచు గోరుచుండెడివాడు. నరేంద్రు డింటికి పోబోవుచున్నప్పుడు శ్రీరామకృష్ణుడు "క్రొత్త పెండ్లికొడుకవు, తఱచు వచ్చుచుండుము" అనెను. నరేంద్రుని విశిష్టతనుగూర్చిన గురుదేవుని అంచనా గమనార్హము. తోకలను తాకితిమేని కొన్ని ఆవులు చప్పున పండుకొనును, మఱికొన్ని గంతులు వేసి చిందులు త్రొక్కును. అవి చాల ఉద్రేకపూరితములు. నరేంద్రుడు అటువంటివాడు" ఇది స్ఫుటమును నచమత్కారమునైన ప్రతిపాదనము.

# అమెరికనులను గూర్చిన తెలివిడి

శ్రీరంగనాథానందస్వామి

ప్రశ్న : వర్గమును వర్గముతో పోల్చి చూచినచో, శ్రుతిభాగమందుకూడ కొంత భేద ముండదా?

జవాబు : ఉండదు, ఉండకు. శ్రుతిభాగములో భేద ముండదు. ఉదాహరణము హృదయపవిత్రతావశ్యకత "పవిత్ర హృదయులు ధన్యులు, వారికి భగవద్దర్శనము కల్గు" నని జీససు చెప్పెను. అదొక శ్రుతివాక్యము. హృదయపవిత్రతను గడించు టెట్లు? అది మన చేతులలో ఉన్నది. నానామార్గములున్నవి భక్తి జ్ఞానము కర్మము మున్నగు మార్గము లన్నియు నున్నవి అదే సిద్ధాంతభాగములోని శ్రుతిభాగ స్పృహణీయత! అన్నిటికిని దారి ఒక్కటే అనుట లేదు. శ్రుతిభాగము స్థిరము, మార్పుపాటు లేనిది. కలహములు గల్గుటకు కారణ మదే.

ప్రశ్న : భారతదేశములోని సంపదకంటె అమెరికాలోని పేదఱికము క్రూరతర మైనదా?

జవాబు: భారతదేశములో సంపద ఉన్నది. అమెరికాలో పేదఱికమున్న దందు మేని, అమెరికావారే పెక్కుండ్రు నమ్ముట లేదు. అమెరికనులు అనుపేక్ష్యమైన రీతిలో ఈ సత్యమును గుర్తించినది ఈ దశాబ్దిలోనే. క్రిందటి సంవత్సరము పెక్కు వార్తాపత్రికలు అమెరికాలోని పేదఱికమును బొమ్మలతో సహా ప్రకటించినవి. వాస్తవమైన పేదఱికమును కష్టానుభావాలును అమెరికాలో ఉన్నవి. అమెరికనుల మొత్తము జనాభాలో ఒక నాల్గవ వంతువారు, నిజముగా పేదవారు. అయినను ఒకచోటికి పేదఱిక మైనది మఱొకచోటికి పేదఱికము కానేరదు. అమెరికాలో జీవితము గడుపుటకు అగు వ్యయమతిమాత్రము. కాబట్టి రెండువేలనూటయేబదిరూపాయలు సాలాదాయము వచ్చువాడు అమెరికాలో పేదవాడే. అమెరికాలో అందఱికంటె పేదవానికి నెలకు రెండు వేల నూటయేబది రూపాయలాదాయము వచ్చును మౌలభూతములైన జీవితావశ్యకాలకు ఆ వసుమానము చాలదు. అక్కడ వారికి ప్రభుత్వము వారి సాహాయ్యమున్నది. భారత దేశములోని కూలీలు చాల తక్కువ ఇటీవలి లెక్కల ప్రకారము భారతదేశములో అందఱికంటెను సగటున ఒక వ్యక్తి సగటు ఆదాయము 62 రూపాయ లుంటే. అందువల్ల ఇక్కడి పేదఱికము అతి మారకమైనది. మనలో సంపన్నులును ఉన్నారు. కాని ధనికులకును దరిద్రులకును చదువుకొన్నవారికి నిరక్షరాస్యులకును మన దేశమం దున్నంత అంతరము వేఱు ఏదేశమును లేదని నా యభిప్రాయము.

అమెరికాలో దారిద్ర్యసమస్య ఉన్నది. ప్రజలకు ఆర్థికావకాశములను ఇతోధికముగ కల్గింప ప్రభుత్వమువారు శ్రమింతురేని దారిద్ర్యమును తొలగింప వీలగును. అచ్చటి బీదలలో అత్యధికసంఖ్యాకులు శ్వేతేతరజాతివారు శ్వేతజాతిప్రజలలోను కొందఱు పేదవారున్నారు. సంపన్నులమధ్య పేదవారు నుండుటకు అమెరికాలో ఇదే మొదలు.

ఇండియాలో ఈకథ చాల ప్రాతది. ఇక్కడ ధనికులకును దరిద్రులకును అంతరమపారము. పేదలను సముద్ధరించి ఆ అంతరమును పూడ్చుటే మన సమస్య లన్నిటిలో చాల పెద్దది. కనీసము ఆరోగ్య-విద్యా-సుఖజీవితావశ్యకముల నైనను సమకూర్పవలెను.

మన సమస్య చాల తీవ్ర మైనది. ఏల యన కోట్లకొలది ప్రజలు కదా ఇచట పేదవారుగా నున్నారు! ఏబదినాల్గుకోట్ల జనాభాలో నూటికి ... మంది బీదవారు. కాబట్టి మన సమస్య చాల పెద్దదే.

అమెరికాలో అంతటి క్లిష్టపరిస్థితి లేదు. వియత్నాము యుద్ధమునకై వ్యయమగుచున్న ధనము, ప్రజలకు పారిశ్రామిక వకాశముల కల్గించి వారి పేదఱికమును తొలగింప వినియుక్తమైనచో ఈ సమస్య తీఱును. కావుననే విద్యార్థుల ఖండనప్రసంగములలో సదా దీనినే ఎత్తి చూపుచుందురు. కోట్లకొలదిగా ధనము అందుకై దుబారుగా వ్యయింపబడుచున్నది. మన దేశములోను ఎంతో పేదఱిక మున్నదే. ఏల ఆ ధనము నిటు రానీయరాదు? అమెరికాలో ఖండన ప్రసంగములు చేయువారడుగు అతిముఖ్యప్రశ్నలలో ఇదొక్కటి.

ప్రశ్న : అమెరికాలోని శ్వేతేతరజాతుల వారికి ''ఐక్యమునకై శ్రమపడుటకంటె మనలో గర్భితముగ నుండు దివ్యత నావిష్కరింప పాటుపడుట మేలు'' అను ఆశయమును స్ఫురింపజేసినచో 'వేదాంతము' వారి కెంత గనో ఉపకరించును కదా?

జవాబు: అమెరికా శ్వేతేతర ప్రజలు ప్రస్తుత మొక అనుపేక్ష్యదశలో విప్లవదశలో ఉన్నారు. తాము మానవుల మనెడి కనువిప్పు ఇదంప్రథమముగావారికిప్పుడు కలుగుచున్నది. నిన్న మొన్నటివఱకు వారిని 'మంది'గా 'మూక'గా గణించుచుండిరి. కాని రెండవ ప్రపంచయుద్ధమప్పటినుండి అమెరికా శ్వేతేతర ప్రజలతో ఒకగొప్ప ప్రబోధ మేర్పడినది. శ్వేతప్రజలననుకరించుచువారిచేతనిమ్నవర్గము వారుగా గణింపబడుట వీరి కిష్టము లేదు. శ్వేతేతరులుగనే వా రుండ గోరుచున్నారు. శ్వేతేతరుల మని తమ చరిత్రయు సముదాచారములును శ్వేతేతరములని వారు గర్వించుచున్నారు. శ్వేతేతరపురుషులుగను శ్వేతేతర మహిళలుగాను తాము పెంపొందవలె ననుట వారి కోరిక. ఒక పదేండ్లలో ఈ యభినివేశము వారిలో అత్యంతబలోత్సాహములను వర్ధిల్ల జేసినది.

వారి బలమును ఆధారశక్తులను విశ్వాసమును గన్న ఆశ్చర్యము గలుగును. శ్రీ వివేకానందస్వాముల వేదాంతసందేశమును వారి కెవరును బోధింప లేదు కాని ఆ సందేశము వారిలో స్ఫుటముగ వ్యక్తమగుచున్నది. 'ఆత్మవిశ్వాసము ఉండవలెను.' ఇది వేదాంతము బోధించు మొదటిపాఠము. శ్వేతేతర మానవులలో మగవారికి మగువలకు ఇప్పుడు ఆత్మవిశ్వాస మున్నది. శ్వేతేతరసంఘనూతన పురోగతికి బీజము అదే.

తుద కొకనాడు 'నల్ల' 'తెల్ల' వర్ణాలవారందఱు ఒకటేసంఘముగా కలిసిపోవుదురు. అందు నాకు పూర్తి నమ్మక మున్నది. మొదట మొదట 'మేము ఫలానా' అని నిరూపించుకొనుటకు వలసిన పెంపులను శ్వేతేతరులు సాధించుకొనుచున్నారు. నల్లవారికి తోడ్పడ గోరు తెల్లవారెందఱో గలరు. కాని నల్లవారిలో అధికసంఖ్యాకులు ఎవరి తోడ్పాటును మాకక్కఱ లేదనువారే. మాకాళ్ళపై మేము నిలుతు మనుచున్నారు వారు. వేదాంతము ఏమి బోధించునో అది అక్కడ అమలులో ఉన్నది, ప్రారంభదశలో ఉన్నది. మానవుని లోని సారము 'ఆత్మయే'. అదే పరమార్థము. అది మొదట ఎవరిమీదను ఆధారపడకుండు ఆత్మవిశ్వాసరూపములో ఆవిష్కృత మగును,

ఈ పరిణామము శ్వేతేతర ప్రజలలో ప్రస్తుతము ప్రస్ఫుటముగా గలుగుచున్నది, వారి గ్రంథములు నేను చదివినాను. మాల్కాఁ ఎక్సు స్వీయచరిత్ర అను గ్రంథము ప్రత్యేకముగా నాకు నచ్చినది. 'నల్లవర్ణము' వారి ఆత్మవిశ్వాసము అందుప్రతిపాదితమై ఉన్నది. శ్వేతవర్ణమువారిమీది ప్రబల ద్వేషమును అందు కలదు. శ్వేతవర్ణమువాడు దానిని చదివినచో భయపడును. అక్కడ వారు వాడి యుండు మాట లిట్టివి.—"తెల్లవారు ఇంగ్లాండునుండి వచ్చినారు, ప్లిమత్తుశిలవద్ద నావ దిగినారు. నల వారు ఆఫ్రికానుండి బానిసలుగా తేబడ్డారు, ప్లిమతుశిల వారితలపె నెలకొన్నది" ఈ మాటలు భయముగొలుపుటకు కారణము అవి నిజ మగుటే.

కాబట్టి ప్రస్తుతము అమెరికాలో మానవుల ద్వేషములు ఒత్తిడులు అగ్నిపర్వతము వలె రాజుచున్నవి. వీనికి ప్రతిక్రియ చేసి ఏకసంఘమును రూపొందించుకొను శక్తివివేకములు అమెరికనులకు కలవు. కాని ఆ పర్యవసానమున కింక నెంతో కాలము పట్టును.

టెక్సాసురాష్ట్రములో దల్లాసు అనుచోట బిషపుకాలేజి అను ఒక నీగ్రోకళాశాలలో నే నుపన్యసించితిని. కొన్ని నెలలకు ముం దుపన్యసించియుండినాను. రెండవసారి ఉపన్యాసము చేయింప వారు నిశ్చయించిరి. అక్కడ ఉన్న మిత్రులు భారతీయులు అమెరికనులు కళాశాల విద్యార్థులకు కొన్నిగ్రంథముల బహూకరింప గోరిరి. అమెరికా అధ్యక్షుడు కెన్నెడి హత్య కావింపబడినచోటే దల్లాసు. ఆ కళాశాల విద్యార్థులకు మేము బహూకరించిన పుస్తకాలు దస్ స్పేక్ వివేకానంద (వివేకానందవాణి) ది రామకృష్ణ మూవ్మెంటు ఇట్స్ ఐడియల్స్ అండ్ ఆక్టివిటీస్ (రామకృష్ణోద్యమము. దాని ఆదర్శములు కార్యక్రమములు.)

అక్కడ కావించిన ఉపన్యాసములో వేదాంతాశయమును ప్రతిపాదించి స్వామిజి యాశయముల నుదాహరించితిని—పౌరుషము, బలము, స్వశక్తిపైనే ఆధారపడియుండుట మొదలైనవి. ఆ యుపన్యాసము వారి కెంతో ఉత్సాహకరముగ నుండెను. ప్రసక్తములైన ప్రశ్నలను వారు ఆస్థతో నడిగిరి. అది కేవలము ప్రారంభమాత్రమే.

అమెరికాలో మన వేదాంతసొసైటిలలో పూజ లప్పుడు శ్వేతేతరప్రజలు కొందఱు వచ్చిరి. వేదాంతసందేశపరిజ్ఞానము వారికి కలిగినచో కాలక్రమమున వా రింకను అధిక సంఖ్యలలో తప్పక వత్తురు. క్రొత్తవెలుతురును సమున్నతజీవితమును గోరు వారిని శ్రీ వివేకానందస్వాముల విశిష్టవ్యక్తిత్వమును గొప్ప తత్త్వశాస్త్రమును ఆకర్షింపక తప్పవు. ఆ తత్త్వశాస్త్రములో అంతటి బలదాయక మహిమ విశుద్ధిప్రదప్రభావ మున్నది. కాలక్రమమున వారు ఈ సమున్నత తత్త్వశాస్త్ర స్థాయికి రాగలరు. అప్పుడు వారు ఈ క్షుద్ర ద్వేషాలను అతిక్రమించి అందఱితో మన కున్న ఐక్యమును గుర్తింప గలరు. సమైక్యమునకై ఒకనాటికి ఆ పరిణతివచ్చి తీరవలెను.

❖❖

# దేహి

శ్రీ అల్లంరాజు లక్ష్మీపతిగారు

నరములు, కండరములు, స్వేదము, కేశములు, నఖములు, శల్యములు, మూత్రపురీషములు గలది దేహము. బాల్యము, యౌవనము, వార్ధక్యము దీని అవస్థలు. దీనికి జననమరణములు కలవు. ఇది పుట్టునప్పుడు పంచభూతములతో వృద్ధినొంది గిట్టునప్పుడు పంచభూతములలో లీనమగుటఁజేసి పంచభూతాత్మకము. దీని నావరించుకొని యుండునది జీవాత్మ; అనగా దేహి.

జీవాత్మ అణురూపమైనది. ఇది గాలిలో విహరించును. ఇది వర్ష సాహాయ్యమున నుత్పన్నములగు ధాన్యాది బీజంబులందుఁ గ్రమముగాఁ బ్రవేశించును. ధాన్యాదులను బురుషులు భక్షింపఁగా వాని బీజములందలి సారము వారి రేతస్సునఁజేరి సంయోగంబున స్త్రీ గర్భాశయరక్తమం దైక్యమొందును. తదాదిగా నుండవలసినన్నినాళ్లు గర్భంబున నుండి జాతిరూపలావణ్యములతో బహిరతమై స్త్రీ పురుషవిభేదంబునఁ దోఁచును.

ప్రపంచము పంచభూత ప్రవృద్ధము. ఇదియే ప్రకృతి. ప్రకృతి సంబంధమగు సాంసారిక జీవిక ననుభవింపఁగోరి జీవాత్మ దేహము ధరించును. ఇంద్రియముల తోడ్పాటుతో నా యా దేహముల కా యా విషయ విషమ వాంఛలు రేకెత్తించునది యిదియే. వాంఛలు కూర్చి హతమార్చునది యిదియే. గూటిలోని పిట్టవలె దేహములోనికి వచ్చుట, పోవుట దీని పని. చేసికొన్న కర్మఫల మనుభవించుట కిది దేహమును ధరించును. సుకృతయోగ్యమై కర్మ ఫలించినచో పునర్జన్మ మొందదు; కానిచోఁ గర్మము ఫలించుదాఁక నట్లే అవతారము లెత్తును.

ఛాయవలె, జీవాత్మకుఁ బరమాత్మ యండగా నుండును. తాను ధరించుకొన్న దేహమును అదుపులోఁ బెట్టుకొని తన్మూలమున సుకృతము లాచరించుటకు మనస్సును త్రిప్పి మెప్పువడసి దేహము వీడునప్పుడే జీవాత్మ పరమాత్మలోఁ గలసిపోవును; అనగా మోక్షమొందును. మోక్షమనఁగాఁ బునర్జన్మములేక దైవసన్నిధిని గాలక్షేపమొనర్చుట.

మనస్సుగలవాఁడు మానవుఁడు. అతఁడింద్రియనిగ్రహశక్తితో సత్కర్మము లాచరింపఁగలఁడు. పలువురు ధీమంతులు సూపిన మార్గముల నేఁగియో, లేక సద్గ్రంథములఁ బఠించియో యోగ్యాచారముల నలవఱచుకోఁగలఁడు. ''సత్యమ్ వద, ధర్మమ్ చర''—నీతివాక్యముల ననుసరించి పోఁగలఁడు. నీతిబాహ్యప్రవర్తనము ప్రాణహాని. మానవులకుఁదక్క అజ్ఞానదశనుండు తదితర జీవులకు నీతి యక్కఱ లేదు. మానవుఁడు తన యవస్థల ననుసరించి యెట్లు పోవుచున్నను దైవచింత యాతని పరమావధి.

మ॥ ఇఱుకై, పంకిలమై, యమోమయమునై,
హేయంబునై, రోఁతయై
నరకంపుందెరవై, తలంచుకోలఁదిన్
నానారసాభాసమై,
దురితంపుం గుఱుతై, దురుద్ధరరుజాదుర్గంధ
భూయిష్ఠమై
మఱుఁగున్ దొడ్డిగనుండు దీనినిఁక
సంపాదించుకో నెప్పుడున్.

(పూర్వహరిశ్చంద్రచరిత్రములోనిది)

ఇట్లు సంసారము నేవగించుకొని ''నారాయణ చరణారవిందసేవనంబు గర్తవ్యంబు'' — అని దైవమునుద్దేశించి పాటుపడి సుకృతమూలమునఁ దనజన్మమును దరింపఁజేసికొనుట దేహి కర్తవ్యము.

# జ్యోతి

## శ్రీమతి వి. సత్యరత్నమ్మగారు

జ్యోతి అనగా ఒక వెలుగు. బాహ్యాచక్షువులచే కనలేని అనంతప్రకాశము. దృష్టిపథమునకు అందని ఆకాశ కుసుమము. అనంత ప్రేమరాజ్యములో ఆరని దీపకళిక. కోటి సూర్యుల కాంతి తన ఒక్కరూపులో మలచుకొన్న అసమాన రూపరాశి. అజ్ఞానహృదయాలకు అగోచరమయినది. మాయా మోహితులకు అతీతమయినది. భక్తి తత్పరులకు దివ్య జ్యోతి. జ్ఞానులకు, యోగులకు జ్ఞానజ్యోతి. ఆత్మోపాసనలో నిరాశ చెందే హృదయాలకు ్యోతి. అజ్ఞానాంధకారులకు కనిపింపని ఆకాశదీపము. సర్వం జ్యోతిర్మయం. సృష్టిస్థితిలయకారకుడైన పరమాత్మయే జ్యోతిస్వరూపుడు. సచ్చిదానందస్వరూపుడు పరమాత్మ. పరమాత్ముని ఆనందరూపమే జగత్తు. పరమాత్మవిలాసమే ప్రపంచం. జ్యోతిస్వరూపుడైన పరమాత్మనుండి జన్యమయినది ప్రకృతి. ఆవిరినీళ్లుగాను, మంచుగానైనట్లు పరమాత్మ శక్తియే ప్రకృతిగాను, జీవుడుగాను మారుచున్నది. ప్రకృతి అచేతనము. జీవుడు చేతనము. చేతనాచేతనములందు పిపీలికాది బ్రహ్మపర్యంతము జ్యోతిః ప్రకాశ కిరణములే నిండియున్నవి. జడచేతనము లయిన అన్ని ప్రాణులందు పరమాత్మ కాంతిపుంజములే వెలుగొందుచున్నవి. ఏనాడు పరమాత్మ తన వినోదపు ఆటను చాలించ దలచుకుంటాడో ఆనాడు నీరంతా మంచుగడ్డగా మారినట్లు అన్ని ప్రాణులలో వ్యాపించి యున్న ప్రకాశమంతా చేరి భూమ్యాకాశము నంటిన ఏకరూపముగా, విరాటస్వరూపముగ అనంతప్రకాశముగా భాసిల్లును. అందుకే "జగత్ మిథ్యా సత్యం బ్రహ్మ" అన్నారు శంకరాచార్యులవారు. జ్యోతిస్వరూపుడైన పరమాత్మ వెలుగు జడ – చేతనముల ఎట్లయితే ఇమిడి ఉన్నవో అట్లే చీకటి వెలుగునందు నిండి ఉన్నది. అందుకే ఉపనిషత్తులు "అసతోమా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ" అని చెప్పినవి. అజ్ఞానులలోను జ్యోతి వెలుగుచున్నది. జ్ఞానులలోను జ్యోతి వెలుగుచున్నది. నవ్వులో ండి విరిసే జ్యోతి పరంజ్యోతి. దాని చిద్రూప మిట్టిదని నుడువ నశక్యము. త్యాగరాజ, జయదేవాదులు నృత్యగీత సంచలన మాత్రము పరమాత్మానుభూతి జన్యరసానుభూతిని పొందిరి. జ్ఞాని త్య స్వ రూ ప ము న దానిని గాంచి ర మా నం ద భ రి తు డగును. ఆ అనంత సౌందర్యరాశిని చూచిన కంట ఈ తుచ్ఛలోకాన్ని చూచుటకు ఇచ్చగించదు. కాని అజ్ఞాని తనలో ఒక వెలుగున్నదన్న మాటకూడ తలపడు. కాని జీవుని పూర్వజన్మ సంస్కారము ననుసరించి అతని కర్మఫలము అనుభవించుట జరుగును. "గహనా కర్మణో గతిః" కర్మగతి ప్రబలమయినది. జీవుడు మొదటే కర్మబద్ధుడు. అస్వతంత్రుడు. మాయా మోహితుడు. అతనికి బాధ్యతల బోనులో బంధించి, "నీవు మాయతెరను తొలిగించి వెలుతురుచూడు" అంటే సాధ్యమా? జీవుని పూర్వజన్మ పుణ్యఫలము మించినదైతే కర్మ మనే సంకెలలను త్రుంచి మాయబోనును ఛేధించి ఆత్మజ్యోతిని కనగలడు. ఆత్మప్రకాశము కన్నప్పుడే జీవుడు జీవాత్ముడగుచున్నాడు. మాయారూపుడైన జీవుడు మాయను వీడి ఆత్మప్రబోధము నాలకించి అంతర్ముఖుడై ఆత్మజ్యోతిని దర్శించినపుడే దాని వెలుగు నీడలలో పండువెన్నెల కాంతికల్గి బ్రహ్మానాళమందు శోభిల్లు జ్యోతి అనంతకోటిప్రకాశాన్ని చూడగలడు. పరమాత్మ జీవాత్మల అవిన

భావసంబంధానికి ఆధారము జ్యోతియే. దీని వలన జీవుడు మరల పరమాత్మను కలియు చున్నాడు.

జ్యోతీ రూపములు అనంతములు. దాని ప్రకాశము హద్దులేనిది, చూడజాలనిది. దాని సౌందర్యము అవర్ణనీయము, అనుభవైక వేద్యము. జననమరణముల కతీతమయినది. కాంతిహీనుడైన సూర్యుడు జ్యోతిర్భూతుడై అసమాన తేజోరాశిగా వెలుగుచున్నాడు. జ్యోతిలో లయమైన చంద్రుడు తన శ్వేతశీతల కాంతులతో అన్నిప్రాణులకు హాయిగొలుపు చున్నాడు. జ్యోతితో కలిసిన వాయువు తన ప్రచండశక్తితోవీచి సర్వప్రాణులకు ప్రాణ దానము చేయుచున్నాడు. నింగిపై మెరసేటి తారలు జ్యోతి రూపములే. పరమాత్ముని అనంతశక్తియే జ్యోతి. అనంత జ్యోతి రూపములే పరమాత్మ.

# పరిప్రశ్నము

## [జిజ్ఞాసువుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానందస్వాముల జవాబు]

ప్రశ్న : పరిపూర్ణధ్యానదశలో దేహస్మృతి ఉండకూడదు కదా. సాకారదైవమును ఏదో ఒకరూపంలో ధ్యానించేటప్పుడు దేహస్మృతి మనకు స్థిరపడదా? దేహంతోటి రూపంలో కాక వేఱు ఏరూపంలోనైనా ధ్యానించడం సాధ్యం అవుతుందా?

జవాబు ధ్యానసమయంలో మనం ధ్యేయంలో నిమగ్నులం కావాలి. మన దేహస్మరణం మనకు బొత్తిగా ఉండకూడదు. మనం సాధించవలసింది అదే. నిజమైన యేకాగ్రత కుదిరితే, ఈ దేహస్మరణ తొలగడం తనంతట కలుగుతుంది. బాహ్యవస్తువులలో ఒకదానిలో మన మనస్సు ప్రగాఢంగా నిమగ్నమై ఉన్నప్పుడు, ఏదైనా పుస్తకాన్ని తదేకతానంగా చదువుతున్నప్పుడు, మనలను మనం మఱచి పోతాం. దేన్ని గమనిస్తున్నామో అందులో లీనులమై ఉంటాం. కాబట్టి సాకార దైవధ్యానమునకున్నూ, ధ్యానదశలో దేహస్మృతి నాశమునకున్నూ పరస్పరం పొసగనితనం ఏమీ లేదు. వచ్చిన చిక్కేమి టంటే, ఏకాగ్రత కుదరనంతవఱకు మన మనస్సు ధ్యేయాన్ని స్మరించినంతకంటె ఎక్కువగా మనలను గూర్చియే స్మరిస్తుంటుంది.

సాకారదైవమునకు మానవరూపమే ఉండవలె అనడం లేదు. సాకారదైవం అంటే సగుణ బ్రహ్మం, గుణవిశిష్టమైన పరతత్వ అని అర్థం. పరతత్త్వానికి సాకరతయూ ఉంది, నిరాకారతయూ ఉంది, మానవునికి తెలిసినంతలో మూర్తిమత్త్వమునకు పైది లేదు. కాబట్టి మనకు తెలిసిన పదజాలంలో చెప్పగోరినప్పుడు దైవమును మూర్తి అంటున్నాము. ఆలాగు అన్నప్పుడు దైవ మొక వ్యక్తి అనుట మన ఆశయం కాదు. దైవం సచ్చిదానందరూపమైన సాన్నిధ్యం. ఆ సచ్చిదానందసాన్నిధ్యం మనలను ఎఱుగును, మనం పిలిస్తే పలుకుతుంది, మనప్రేమకు లక్ష్యం ఔతుంది. ఒకవ్యక్తి, తానుతానుగా ఉండగలుగునే కాని వేఱొకటుగా కాజాలదు. సగుణబ్రహ్మము ఏవ్యక్తిగానైనా తన్ను ఆవిష్కరించుకో గలదు. ఆ ఆవిష్కృతులనే మనం మూర్తులని అవతారము

లని పేర్కొంటున్నాం. మనకు కనబడుతున్న సృష్టి అసంఖ్యాకములైన వ్యష్టిరూపాలు. ఒక్కొక్కదానికి, దాని ప్రత్యేకత ఉంది. అద్భుతావహములైన దేవుని ఈ నానారూపములకు ప్రభవమై భక్తులకు ధ్యానంలో వారి యిష్టరూపంలో దర్శన మిచ్చే మూలరూపం బీజరూపం ఒకటి ఎందు కుండ గూడదు? సచ్చిదానందసాగరంలో భక్తిశీతలతచే ఘనీభవించిన భాగాలే ఈదివ్యమూర్తు లని శ్రీరామకృష్ణుడు వాక్రుచ్చాడు. లోతుగా ఆలోచించి, మనసులలోని భావసంఘర్షణలను అణచుకొని, ధ్యానించే వారికి లక్ష్యంగా ఒక దివ్యరూపం ఉంటే ధ్యానం సుకరం అవుతుంది. 'రూపం' ఇష్టం లేనివారు దేవుని విశ్వవ్యాప్తమైన సచ్చిదానంద సాన్నిధ్యంగా భావించి, దానితో తమ హృదయాంతరములో బాంధవ్యం నెఱపవచ్చు.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమఠం, మద్రాసు-600004

### శ్రీరామనవమి

ఈ బహిరంగోత్సవం 15-4-73 వ తేది నాడు జరిగింది. శ్రీమత్తపస్యానందస్వాములు సభాధ్యక్ష్యం వహించారు.

వివేకానందకళాశాల తమిళభాషాచార్యులైన శ్రీ చదలవాడ బాలగురునాథంగారు శ్రీరాముని మహిమనుగూర్చి తమిళంలో ఉపన్యసించారు. ముఖ్యంగా కంబరామాయణంలో ప్రతిపాదితమైన రీతిలో చిత్రించారు. ఉపన్యాస సంక్షేపం: "శ్రీరాముడు సకల కల్యాణగుణాలకు నిధానం. సర్వకాలాలవారు నేర్చుకోవలసిన పాఠాలు ఆయనచరిత్రంలో ఎన్నో ఉన్నాయి. రాముడే కాదు, ఆయన సహచరులలో ప్రతిఒక్కరూ విశ్వోపజీవ్యములైన శుభగుణాలు కలవారే. ఉన్నతిని ఉదాత్తతను ప్రసాదించే సాటిలేని ప్రభావం రామనామానికే కలదు. చక్రవర్తితనూజుడైనప్పటికి శ్రీరాము డొకమహాయోగి.చూడండి. ఆకస్మికంగా తాను అడవికిపోవలసిన సందర్భం వాసగినప్పుడు శ్రీరాముడు విషాదం చెంద లేదు, ఆశ్చర్యపడ లేదు, సంతోషంగా వెళ్ళాడు".

మదరాసు హైకోర్టు మాజీన్యాయమూర్తులు శ్రీ పి. రామకృష్ణన్ (ఐ. సి. ఎస్.) గారు ఆంగ్లంలో ఉపన్యసించారు. ఆయన ఉపన్యాస సారం: భారతీయ సంస్కృతిలో సార్వకాలికములైన విలువలు పెక్కు లున్నాయి. మానాటి ఆచారాలు ఎంత మారినా ఈ విలువలు మారవు. జగత్తునంతా రంజింపజేసే మహాపురుషుడు శ్రీరాముడు. సనాతనధర్మము సత్యమూ శ్రీరామునిలో రూపొందాయి. శ్రీరాముని స్మరించినప్పుడు సీతయూ స్మరణకు తోసుకువస్తుంది. ఆయన పురుషోత్తముడు, ఆమె నారీమణులలో ఉత్తమురాలు.

నిగమనోపన్యాసంలో సభాధ్యక్షులు శ్రీమత్తపస్యానందస్వాములు ఇట్లు వాక్రుచ్చారు:— శ్రీరామావతారంమీద సకల జీవులకు గల మోజు త్రికాలాబాధితం. శ్రీరాము డెదుర్కొనవలసివచ్చిన చిక్కులు నానావిధాలు, నానావిధాల వ్యక్తులతో ఆయనకు సమాగమం సమకూడింది. ప్రతిసందర్భంలోను ఆయన శుభగుణగరిష్ఠత మహోజ్జ్వలంగా వెలుగొందింది. అఖండాదర్శమానవత్వంలో ఆయన ఆధ్యాత్మికపు విలువలను ఇముడ్చుకున్నాడు. ఆయన

చేసిన ప్రతిపనికి — ఉత్తరకాండములోని సీతా పరిత్యాగానికి సైతం — గంభీరమైన ప్రాముఖ్యం ఉంది. సీతను పరిత్యజించడంలో రాజధర్మమును ధీరంగా నిర్వర్తించాడు. పరిత్యాగం చేత సీతకు ఎంతో దుఃఖం కలిగిందనడం వాస్తవమే. కాని శ్రీరాముడు తనకు కలిగించుకొన్న దుఃఖం అందుకు తీసిపోదు. భారతజాతికి శ్రీరాముని ఆదర్శత్వం సర్వతోముఖం.

# గ్రంథపరిచయం

## భగవన్నామమహిమ

[భగవన్నామకౌముదిసంక్షేపసారము]

**మూలము :** అనంతశ్రీ అఖండానందసరస్వతీసాములవారు. **అనువాదము :** శ్రీరామకృష్ణానందస్వాములవారు. **ప్రకాశకులు :** సాధనగ్రంథమండలి, తెనాలి. పుటలు 63. వెల 75 పైసలు.

'భగవన్నామకౌముది' శ్రీ లక్ష్మీధరపండితుని కృతి, దానికి శ్రీ అనంతదేవులు 'ప్రకాశ' మను పేర టీక వ్రాశారు. అందలి ముఖ్య సిద్ధాంతములను సంకలించి అనంతశ్రీఅఖండానందసరస్వతీస్వాములవారు హిందీలో రచించిన సారసంక్షేపగ్రంథాని కిది చక్కని ఆంధ్రానువాదం 29 శీర్షికలుగా విభజించి ఉపాదేయ విషయమును లఘువ్యాసాలుగా రంజకధోరణిలో అందజేయుచు సాధకభక్తలోకానికి భోగ్యమైన ఈ గ్రంథానికి స్వాగతం.

## - శక్తి - జ్ఞానము

గ్రంథకర్త : శ్రీశ్రీశ్రీ శివానందసరస్వతీస్వామి మహారాజులవారు. అనువక్త : శ్రీ దేవానందచిన్నస్వాములవారు. ప్రాప్తిస్థానం : శ్రీ కృష్ణానందసరస్వతీస్వామివారు, దివ్య జీవన సంఘం శివానందనగరం, హిమాలయములు, ఉత్తరప్రదేశ్. చిన్నసైజు పుటలు 192, వెల రు. 1-50.

జీవితంలో ఆధ్యాత్మికజ్యోతిని ఆధ్యాత్మిక శక్తిని ఆధ్యాత్మికజ్ఞానమును పెంపొందించుకొనుటకు ఎంతయు అనువైన అమృతోపదేశము లీ గ్రంథంలో గలవు.

ప్రభాకర్

**శ్రీరామకృష్ణానందస్వాముల 111 వ జయంతి తిథిపూజ శనివారం 28-7-73**
**బహిరంగోత్సవం ఆదివారం 29-7-73.**

నీవు జపమునకును ధ్యానమునకును వినియోగించు కాలము ఎంతైన గావచ్చును, పది పదునైదు నిమిషములే కావచ్చును. కాని అప్పుడు నీ హృదయమునకు ధ్యానమున ఏకాగ్రత ఉండవలయును. అంతర్యామిగ నున్నవాడును, అన్నిటికిని ప్రవర్తకుడును పరమాత్మ, ఆయన నీ హృదయము నెఱుగును. ఎంతసేపు ధ్యానింతువు, ఎన్నిసార్లు జపింతువనుట కాదతని మానము, నీలోని భగవత్తృష్ణయే అతని మానము.

—శ్రీ విరజానందస్వామి.

## రామకృష్ణ మిషను

# త్రిపురలో వరదబాధితులకై సాహాయ్యకార్యక్రమం

## విన్నపం

ఇటీవల త్రిపురలో వరదలవల్ల పాటిల్లిన పెనునష్టం మహాజను లందరూ ఎరిగిందే. ఎందరో ప్రాణాలను కోల్పోయ్యారు. వేలాది ప్రజలు తమ సర్వస్వం పోగొట్టుకొని నిలువ నీడ లేని వా రయ్యారు. వరదలచే విధ్వస్తములైన ప్రాంతాలలో ప్రజలకు అన్నం - వస్త్రం - నిలువ నీడ - ఔషధములు మొదలగునవి జరూరుగా సరఫరా చేయవలసి ఉన్నది.

బాంగ్లా దేశకష్టనివారణ, గుజరాతమహారాష్ట్ర ప్రాంతాలలో వరపుకాటకాలచేత పీడితులైన ప్రజలకు సాహాయ్యకార్యక్రమం అనెడి దుర్వహబాధ్యతలను నిర్వహిస్తున్న రామకృష్ణమిషనువారు త్రిపురలో వరదబాధితులకు ఆదుకోవలసిన జరూరావశ్యకతయు ఏర్పడింది.

త్రిపురలో వరదబాధితులకై శ్రీరామకృష్ణమిషనువారు సాహాయ్యకార్యక్రమాన్ని 26-5-1973 వ తేదినాడు ఆరంభించారు. సోనామూర - కంక్రబోను ప్రాంతాలలో 14 గ్రామాలలో 352 కుటుంబాలవారికి, 1,580 మంది వ్యక్తులకు 12-6-1973 వ తేదివరకు ఈ క్రింద చూపబడిన లెక్కప్రకారం వస్తువులు పంచిపెట్టబడ్డాయి.

బియ్యం 1331½ కిలోలు; పప్పు 255 కిలోలు, పాలపొడి 116 కిలోలు; శిశువుల ఆహారం 15½ కిలోలు; అనాసపండ్లు 135, దోవతులు 120 చాపులు, చీరలు 311, లుంగీలు 134, పిల్లలదుస్తులు 468, పాతదుస్తులు 69, బ్లీచింగుపొడరు 93 కిలోలు, ఫినైలు 16 లీటర్లు.

ఇక్కడ ప్రజలకు అన్నం వస్త్రాలు మందులు వసించుటకు చోట్లు మొదలయినవి ఇంకా జరూరుగా కావలసి ఉన్నవి. ఐవీజు చాలనందువల్ల కార్యప్రణాళికను తప్పనిసరిగా తగ్గించుకోవలసి వస్తున్నది. ఇంకను చాల ఊళ్ళవారికి సాహాయ్యం అందజేయవలసి ఉంది.

ఈ సాహాయ్యకార్యక్రమాన్ని మేము చురుకుగా నెరవేర్ప గలందులకై మాకు తోడ్పడవలసిం దని ఉదారమహాజనులను ప్రార్థిస్తున్నాం. విరాళాలను వస్తురూపంగా గాని రొక్కరూపంగా గాని ఈ క్రింది కేంద్రాలకు అందజేస్తే కృతజ్ఞతతో స్వీకరించి రసీదు అంద జేస్తాం.

1. రామకృష్ణమిషను, బేలూరుమఠము, 711-202 హౌరా, పశ్చిమబెంగాలు.
2. అద్వైతాశ్రమం, 5 డేహి ఎన్టాలిరోడ్డు, కల్కత్తా 700-014
3. ఉద్బోధన ఆఫీసు, 1, ఉద్బోధన లేన్, కల్కత్తా 700-003
4. రామకృష్ణమిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్, గోల్పార్కు, కల్కత్తా 700-029
5. రామకృష్ణమిషను సేవాప్రతిష్ఠానం, 99 శరత్బోసు రోడ్డు, కల్కత్తా 700-026

బేలూరు మఠం
మే 15, 1973

గంభీరానందస్వామి
జెనరల్ సెక్రెటరి

# శారదా ప్రసంగములు

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీ రామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శయోగినియు, ఆదర్శమాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేటతెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 3-00

# అనుష్ఠాన వేదాంతము

**అనువాదకులు : కీ॥ శే॥ తత్త్వానందస్వాములవారు**

ప్రపంచమున వివిధరంగములందు విహరించువారికి వేదాంతమెటుల అనుష్ఠానయోగ్యమో కండ్లకుగట్టినటుల శ్రీ వివేకానందస్వాములవారీ యుపన్యాసములందు స్పష్టీకరించి యున్నారు.

(129+6 పుటలు) తృతీయ ముద్రణము వెల : రూ. 1-25

నూతన ముద్రణము! ఇప్పుడే వెలువడినది!!

# "భారత యువ జనులారా!"

అనువాదకులు :

కీ. శే. తత్త్వానందస్వాములవారు

భారతయువజనులను ప్రబోధించి శ్రీ వివేకానందస్వాములవారొసగిన ఉపన్యాసముల సంపుటీకరణము! ఒక్కొక్క ఉపన్యాసము భావగాంభీర్యము గలిగి యలరారుచున్నది.

274 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! వెల : రూ. 3-00

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహము హృదయ సన్నిహితమునైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందఱికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-50 | శ్రీ కృష్ణవాణి | 0-50 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-50 | బుద్ధ ఉవాచ | 0-50 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-50 | క్రైస్తు సూక్తిమాల | 0-50 |

మహమ్మదు సూక్తిమంజరి 0-50

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీ దేవీకృపాకటాక్ష వీక్షణాప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ ౧౯౭౩ - ఆగస్టు : ప్రమాదీచ - శ్రావణము సంచిక ౮

విషయ సూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయకంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుంటే
ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో 6 రూపాయలు; సింహళములో 8 రూపాయలు.
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయకంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే
తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను $6\frac{1}{4}\%$ తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కమ్మలు కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపీ కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల: రూ. 7-50**

---

# ప్రబోధరత్నాకరము

**అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు**

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

**232 పుటలు** మూడవ కూర్పు **వెల: 2-50**

---

ఇట్లు వ్రాయుడు: **మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**




'అఖిలవిభు శరణొందుము, యా శుణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ } ౧౯౭౩ – ఆగస్టు : : ప్రమాదీచ – శ్రావణము { సంచిక ౨


శ్రీః

## కనకధారాస్తవము

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నామాచార్య

ముగ్ధా ముహు ర్విదధతీ వదనే మురారేః ప్రేమత్రపాప్రణిహితాని గతాగతాని
మాలా దృశో ర్మధుక రీవ మహోత్పలే యా సా మే శ్రియం దిశతు సాగరసమ్భవాయాః. ౨

| | |
|---|---|
| మహా+ఉత్పలే | పద్మమందు |
| మధుకరీ+ఇవ | తుమ్మెదవలె |
| ముగ్ధా | చక్కనిదగు |
| యా | ఏది (ఏచూపులపరంపర) |
| మురారేఃవదనే | విష్ణుదేవుని నెమ్మొగమున |
| ప్రేమత్రపాప్రణిహితాని | ప్రేమచేతనులజ్జచేతను ప్రేరితములయిన |
| గతానిఆగతాని | నిగుడుటలును మగుడుటలును |
| విదధతీ | కలిగియుండునో |
| సాగరసమ్భవాయాః | సముద్రరాజతనయయగు లక్ష్మీదేవియొక్క |
| సాదృశఃమాలా | ఆచూపులపరంపర |
| మే | నాకు |
| శ్రియందిశతు | సంపదనిచ్చుగాక. |

''లోకజననియైన పరాశక్తినే మనము శరణు జొర వలయును. మాయాశృంఖలలతో మనలను బంధించినది ఆమెయే. ఆ సంకెలలు తెగిననే భగవత్సాక్షాత్కారము శక్యమగును.''

—శ్రీరామకృష్ణుడు.

# శ్రీ గురు సూక్తి సుధ

ఒక భక్తుడు : మానవు డహంకారము నెట్లు దులిపివేసికొనగలడు ?

శ్రీరామకృష్ణుడు: భగవత్సాక్షాత్కారము కలుగనంతవఱకు నీవు అహంకారమును తొలగించుకోలేవు. అహంకారగంధమైనను లేని మానవుడు నీకు కనిపించినచో, అతడు భగవత్సాక్షాత్కారము పడసినవాడే అని నీవు గట్టిగా నమ్మ వచ్చు.

భక్తుడు : మహాశయా, భగవత్సాక్షాత్కారము పడిసినందుకు గుర్తు లేవి ?

శ్రీరామకృష్ణుడు : ఔను, అందుకు గుర్తులున్నవి. భాగవతములో చెప్పబడియున్నవి. భగవంతుని సాక్షాత్కరించుకొన్నవాడు ఒక్కొక్కప్పుడు శిశువువలె, ఒక్కొక్కప్పుడు దయ్యమువలె, ఒక్కొక్కప్పుడు అచేతనమువలె, ఒక్కొక్కప్పుడు వెఱ్ఱివానివలె ప్రవర్తించు నట!

భగవంతుని సాక్షాత్కరించుకొన్నవాడు శిశువువంటివా డగును. అతడు త్రిగుణాతీతుడు. ఏ గుణమందును అతనికి సంగ ముండదు. అతని ప్రవర్తనము దయ్యపునడవడివలె నుండును. ఏల యన శుభాశుభములపట్ల అతని వైఖరి ఏకరీతిగ నుండును. వెఱ్ఱివానివలె అత డొకప్పుడు నవ్వుచుండును, ఒకప్పుడు విలపించుచుండును. ఒకప్పుడు 'షోకిలా'లాగ చిత్రాంబరములు ధరించును. మఱుక్షణమున వస్త్రఖండమును చంక నుంచుకొని దిగంబరుడుగ పర్యటించును. కావున వెఱ్ఱివానివలె కనిపించును. ఒక్కొక్కప్పు డతడు జడపదార్థమువలె కదలక మెదలక కూర్చుండును.

భక్తుడు : భగవత్సాక్షాత్కారానంతరము అహంకారము పూర్తిగా అంతరించునా?

శ్రీరామకృష్ణుడు : అంతరించును. భగవంతుడు తనభక్తుని యహంకారము నొక్కొక్కప్పుడు పూర్తిగా తుడిచివేయును. సమాధి దశలో అహంకారము బొత్తిగా ఉండదు కదా. కాని పలువురకు దేవుడు అహంకారపుజాడను ఉండ నిచ్చును. ఆ యహంకార మెవ్వరికిని బాధాకరము కాదు. అది శిశువు నహంకారమువంటిది. ఐదేళ్ళశిశువు 'నేను' 'నేను' అనుచుండును. అందుకు సందేహము లేదు. కాని అది ఎవరికిని బాధాకరము కాదు. పరుసవేది అంటినంతనే ఇనుము బంగారముగ మారిపోవును. ఇనుపకత్తి బంగారుకత్తి యగును. బంగారుకత్తికి కత్తిరూప మున్నదనుట నిజమే, కాని అది ఎవరిని గాయపఱుపజాలదు. బంగారుకత్తితో ఎవరుకాని దేనిని కాని నఱుకజాలరు.

పండితుడు : మన ప్రార్థనలను దేవుడు వినునా ?

శ్రీరామకృష్ణుడు : దేవుడు కల్పవృక్షము. దేవుని నడిగి దేనినైన బడయవచ్చును. కల్పవృక్షముచెంత నిలబడి నీవు ప్రార్థింపవలయును. అప్పుడే నీ ప్రార్థనము సఫల మగును. మఱొక విషయమును నీవు జ్ఞప్తియం దుంచుకోవలయును. మన అంతర్గతమును దేవు డెఱుగును. సాధన సాగించుచున్నప్పుడు సాధకుని కోరికలు ఫలించును. అనుకొన్నరీతిలో సిద్ధి కలుగును. ఇంద్రజాలికు డొకడు రాజునెదుట మాయలను ప్రదర్శించుచుండెను. అప్పుడప్పు డతడు ''రావే మాయా, రావే శాంబరీ, రాజా నాకు ధన మిమ్ము, వస్త్రము లిమ్ము'' అనుచుండెను. తటాలున అతని నాలుక పైకి లేచి నోటిలోపలి పైకప్పుకు అంటుకొనిపోయెను. అతనికి కుంభకము అనుభూత మయ్యెను. మాటను శబ్దము

నత దుచ్చరింపలేకపోయెను, స్తంభించిపోయెను. అతడు మరణించె నని ప్రజలు తలంచిరి. ఇటుక రాళ్ళతో నేలమాళిగ నిర్మించి వా రతని నందు ఉన్నతీరుననే పాతిపెట్టిరి. వేయిసంవత్సరములు గడచినవి. ఎవడో ఒకడు ఆ నేలను త్రవ్వెను. భూగర్భగృహములో సమాధినిమగ్నుడై కూర్చుండియున్న మానవు డగపడెను. ఎవరో యోగిపుంగవు డనుకొని, అందఱును అతని నారాధించిరి. వారి ఊపునకు నోటిలోని పైకప్పునకు అంటుకొనిపోయి యుండిన అతని నాలుక అంటు వీడెను. ఇంద్రజాలికునకు బాహ్యాలోకస్మృతి కలిగినది. వేయేండ్లకు ముందు పల్కుచుండినట్లే "రావే మాయా, రావే శాంబరీ, రాజా, నాకు ధన మిమ్ము వస్త్రముల నిమ్ము" అని పలుకజొచ్చెను.

"అమ్మా, అదెట్లు ఇదెట్లు అని వాదించు నా ప్రవణతను నీ వజ్రాయుధముతో ధ్వంస మొనర్పు" మనుచు నేను విలపించుచు లోకజనని ప్రార్థించెడివాడను.

పండితుడు : ఎటువంటిభక్తి యున్న భగవత్సాక్షాత్కారము గల్గును?

శ్రీరామకృష్ణుడు : మానవప్రకృతి కనుగుణముగా భక్తిలో ముప్విధము లున్నవి-సాత్త్వికభక్తి, రాజసభక్తి, తామసభక్తి.

సాత్త్వికభక్తి భగవదేకవేద్యమై యుండును. దానికి వెలి యాడంబరము లుండవు. సాత్త్వికభక్తిగల వానికి ఏకాంతత ప్రియముగ నుండును. దోమతెరమఱుగున ఎవరికిని తాను కనబడకుండు సమయమున అతడు తనధ్యానమును కొనసాగించుకొనునేమో. ఇటువంటి భక్తి ఎవనిలో ప్రబుద్ధమగునో అతడు భగవత్సాక్షాత్కారమునకు చిరకాలము వేచియుండవలసిన ఆవశ్యకత లేదు. తూరుపు తెల్లవాఱుట, వెంటనే సూర్యు డుదయింపనుండుటకు సూచకము కదా.

రాజసభక్తిగల వానికి తనభక్తిని అందఱి యెదుట ప్రకటించుకోవలె అను ఆత్రముండును. అతడు పట్టువస్త్రముధరించి, రత్నసువర్ణాంతరితమైన రుద్రాక్షమాలను మెడలో వేసికొని, గుడిలో ప్రవేశించి దేవునికి షోడశోపచార సంపన్నముగా ఆరాధనమును నిర్వర్తించును.

తామసభక్తిగలవానిలో దారిదోపిడిగాని ధైర్యమువంటి ధైర్యము, కలకలమువంటి కలకలము ఉండును. దారిదోపిడిగాడు 'చంపుడు' 'దోచుకొనుడు' అను బొబ్బరింతలతో దోపిడి పనికి బాహాటముగా చనును. పోలీసుఇన్స్పెక్టర్లు ఎనమండుగురు ఉన్నను అతనికి భయము లేదు. తామసభక్తుడు కూడ వెఱ్ఱివానివలె 'హర' 'హర' 'వ్యోమ్' 'వ్యో ' 'కాళికి జై' అను కేకలు పెట్టును. మనోబలమును విశ్వాసతీక్ష్ణతయు అతని కున్నవి.

శాక్తున కట్టి విశ్వాస మున్నది. "కాళినామమును దుర్గనామమును నేను ఒకసారి ఉచ్చరించితినే. రామనామము నొకసారి పల్కితినే. నాలో పాప మెట్లుండ గలదు?" అని అత డనుచుండును.

వైష్ణవునిలో వినయమును స్వనైచ్యానుసంధానమును ఎక్కువగ నుండును. అతడు జపమాలతో జపము సాగించుచు "కృష్ణా, కనికరింపుము. మేము దీనులము పాపులము" అని గొణుగుచు గుసగుసలాడుచు నుండును.

"దేవుని నామము నుచ్చరించిన పిమ్మట కూడ నేను పాపిగ నుండుట ఎట్లు పొసగును" అనిపించునంతటి భక్త్యుద్వేగ ముండవలెను. ఒకవంక రేయుంబవళ్లు హరినామమును కీర్తించుచునే వేఱొకవంక 'నేను పాపిని' అనిన నెట్లుండునో యోచింపుడు.

# వివేకానంద సింహగర్జనము

ఇది మంచిచెడుగులు కలిసి ఉన్న జగత్తు. మంచి ఉన్నచోట దానివెంబడే చెడుగును ఉన్నది. ఈ ఆవిష్కృతుల కన్నిటికిని ద్వంద్వముల కన్నిటికిని మఱుగున, వీని యన్నింటి కవ్వల వేదాంతము 'ఏకము'ను సాక్షాత్కరించుకొనుచున్నది. పుణ్యమును పాపమును రెంటిని వీడు డని వేదాంతము చెప్పుచున్నది. అప్పు డేమి మిగులును? ఈ మంచిచెడుగులకు మఱుగున, ప్రతి చెడుగునకును అవ్వల, ప్రతిమంచికిని అవ్వల, ఏమి ఉన్నదో అదే నీది, నిజమున కదే నీవు, ఈ మంచిగను చెడుగుగను త న్నావిష్కరించుకొనుచున్న దదే. మొదట దాని నెఱుగుము, ఎఱిగిన తర్వాతనే నీవు నిజముగ 'ఔ నని పనియెంచు; ఔ నన భువి మించు' ననెడి విశ్వాసము గలవాడ వగుదువు. ఏల యన అప్పుడు సమస్తమును నీ యదుపులో ఉంచుకోగలవు. ఈ యావిష్కృతులను నీ యదుపులోనికి తెచ్చుకో, అప్పుడు నిజమైన 'నిన్ను' నిర్నిరోధముగ ఆవిష్కరించుకొనగలిగియుందువు. మొదట నిన్ను నీ అదుపులో నిలుపుకో, నిలబడు, స్వతంత్రుడవుగ ఉండు. ఈ చట్టముల ఆవరణమును దాటిపో. ఈ చట్టములు నీ జీవితమున కంగమాత్రములే కాని, ని న్నివి నిరంకుశముగ శాసించెడివి కావు. మొదట నీవు గుర్తింపవలసిన విషయ మిది, ప్రకృతికి నీవు బానిసవు కావు. బానిసవుగా నీ విప్పుడు లేవు, ఇంతకు ముం దుండినవాడవు కావు, ఇకముందును నుండ బోవు. ఈ ప్రకృతి అనంత మని నీవు అనుకోవచ్చు కాని, నిజమున కది సాంతమే. సముద్రములో అ దొక చుక్క. నీ ఆత్మయే సముద్రము. నక్షత్రములను చంద్ర సూర్యులను అతిక్రమించినవాడవు నీవు. అపారమైన నీ సత్తతో పోల్చి చూచిన అవి వట్టి బుడగలపాటివి. ఇది నీ వెఱుగులేటడవుగ మంచిచెడుగులకు రెంటికిని నియంత వగుదువు. దృశ్యము పూర్తి మార్పు చెందున దప్పుడే. అప్పుడు నీవు లేచి నిలబడి ''మంచి ఎంతచక్కనిది! చెడుగెంత బాగున్నది!'' అని వక్కాణింతువు!''

---

# శివానంద లేఖావళి

**116**

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
8 ఆగస్టు 1922

ప్రియశ్రీమన్—

నీ జాబుద్వారా అన్ని సంగతులును తెలిసినవి. అక్కడ నున్న మీ రందఱును ఆధ్యాత్మికసాధనలందు శ్రద్ధ వహింతురు గాక, ఆ కేంద్రపుపనులను చాల మెలకువతో నిర్వహించుచుందురు గాక. ఆధ్యాత్మికసాధనయు సేవాకార్యమును కూడ సాగవలెను, ఏ సేవాకార్యమైనను యథార్థాధ్యాత్మికసాధనయే నట ప్రతియొక్కడును క్షుణ్ణముగ తెలిసికొనవలయును. సేవాకార్యమునకును తపస్సాధనకును పొత్తు కుదురదనుట కేవల మపోహ. ఆధ్యాత్మికసాధనలకనియే ఊరు విడిచిపోవువారు, పేరుకు సన్న్యాసులై, ప్రాతఃప్రదోషకాలములలో కొలిచినట్లుగా జపధ్యానాదులు చేయుచు, భిక్షాటనమును వృత్తిగా అవలంబించి, తక్కినప్పుడెల్ల సోమరిసల్లాపములు సాగించుచు కాలమును వ్యర్థపఱతు రని నే నెఱుగుదును. ఎంతో అనుభవము మీదనే శ్రీవివేకానందస్వామి ''ఇదే తపస్సాధన'' యను భావముతో సేవాకార్యమును నిర్వర్తింపవలసిన దని విధించెను. శ్రీగురుదేవుని సంకల్పానుసారమే అట్లు విధించుట జరిగినది.

ఆయన ప్రతిపాదించిన మార్గములోనే మేము ముందు కేగుచున్నాము. తపస్సాధన వేఱు, సేవా కార్యము వేఱు అను నిట్టి తలంపులు మీకు లేకుండును గాక. ఆ రెంటిని సమన్వయించి పురోగమింతురేని మీరు భగవద్రాజ్యమును చేరుకొనగలరు. ప్రతిదినము శ్రీ వివేకానంద స్వామి ప్రణీతములగు కర్మయోగము భక్తియోగము శ్రీ రామకృష్ణ లీలాప్రసంగము శ్రీ రామకృష్ణ కథామృతము మున్నగు గ్రంథములలో కొంత పారాయణము చేయవలయును. దానితోబాటు తపస్సాధనలనుగూడ నిర్వర్తింపవలెను. క్రొత్తగ మంత్రోపదేశము పొందిన కుఱ్ఱవాండ్ర అధికసముత్సాహమును విన్నంతనే మంచి ధైర్యము గలుగుచున్నది. తపస్సాధనలప్పుడు కూర్చుండవలసిన తీరు ఎట్లు అని వారిలో అనేకు లడుగుచున్నా రని వ్రాసి యుంటివి. వారికి నీవు చెప్పిన సమాధానము సరియైనదే. గురుదేవుడు కూర్చుండియున్నతీరే సరియైనది.

పాశ్చాత్యదేశాలలో నీవు చాల దూరము పర్యటించి వచ్చి, ఎంతో కాలము కాలేదు. కాబట్టి ఇప్పుడు మరల అటు పోవలసిన ఆవశ్యకత నీకు లేదు. నారాయణ్గంజి కేంద్రమును దర్శించు అవకాశము నాకు కలిగినది. ఆచోటు చాల రమ్యము. ఆధ్యాత్మికసాధనల కెంతయు అనుకూలము. కావున అక్కడే ఉండి నీ సాధనల సాగింపుము. గురుదేవు ననుగ్రహమున నీకు మనశ్శాంతి అక్కడే కలుగును. నీవు బృందావనమును దర్శింప నక్కఱ లేదు. నీ హృదయాభిలాషను నీవున్నచోటనే గురుదేవుడు సఫల మొనర్పగలడనుట నిజము. ఆయన దయామయుడు మనఃపూర్వకముగా ఆయనను ప్రార్థించుటయు ఆయన సేవచేయుటయునే తపస్సు. అకారణముగా మనస్సును కలవరపఱచుకొనకు. ఇక్కడి కక్కడికి తిరుగుచుందమని కోరుకొలదియు నీ యేకాగ్రత చెడును. తుద కిక్కడ గాని అక్కడ గాని నీ వేమియు సాధింపజాలక పోదువు కాబట్టి నీకు నాసలహా ఇది—నీ యాధ్యాత్మికసాధనలను అక్కడే నిర్వర్తించుకో. గురుదేవుని పనులను యథాశక్తి పర్యవేక్షింపుము. క్రొత్తగ చేరిన కుఱ్ఱవాండ్రకు విషయములను తెలియజెప్పి వారిని సరియైనదారిలో నడపుము. మగువలకు సదా దూరముగా నుండుము. వారితోడి సాన్నిహిత్యము ఎప్పుడును కూడదు. వారిపట్ల మాతృభావన చేయుము. అన్ని తపస్సాధనల కదే పరిపాకము.

ఆధ్యాత్మికసాధనలు బొత్తిగా చేయక, దినమునకు మూడు పర్యాయములు మాత్రము గురుదేవుని గుడికి పోయి దండము సమర్పించి తక్కినప్పుడెల్ల ఏవో పనులు చేసికొనుచుండు వారికి నామాట—గుడికి పోయినప్పుడు వారు గురుదేవు నిట్లు ప్రార్థింతురు గాక ''దేవా, మమ్ము కనికరింపుము. నీ శ్రీచరణములందు మాకు భక్తిశ్రద్ధల ప్రసాదింపుము, విశుద్ధపథమునకు మమ్ము జేర్పుమా. అమోఘమైన నీ మాయచే మమ్ము వంచింపకు.'' గురుదేవునికి మ్రొక్కటకేగినప్పుడు వారు పూర్వోక్త ప్రార్థనమును ముమ్మారు పల్కి తక్కినకాలమున గురుసేవాకార్యములనిర్వహించుచుందురుగాక.

నీకు నాహృదయపూర్వకాశీస్సులు. అక్కడ ఉన్న భక్తులకు కుఱ్ఱవాండ్రకు అందఱికి నా ఆశీస్సుల నందజేయుము. నీ శ్రేయోభిలాషి,

శివానంద.

అనుబంధము — ఢాకా కేంద్రములో 'శ్రీ రామనామమును' అచ్చువేయించిరి. అక్కడ మీరు రామనామసంకీర్తనము కావించుటకలదా? మీలో ఈ యాచారము లేదేని, ఢాకా కేంద్రమునుండి మీరు దీనిని నేర్చుకొందురు గాక.

# మీగడత  కలు

ప్రాణుల కందఱికీ ప్రాణం చాల ప్రియం. జీవిస్తూనే ఉండాలి అనడం సకల ప్రాణుల మూలాభిలాష. జీవికి ప్రస్తుతపు జన్మం మీద ఎంత ఆశ అంటే; ఇంతకంటె పైమెట్టుదైన జన్మానికి మాఱడం గూడ అతని కిష్టంగా ఉండదు. విష్ణుదేవుని గూర్చిన ఒక కథాంశం శ్రీ రామకృష్ణుడు చెబుతుండేవాడు—

హిరణ్యాక్షుని వధించడానికై శ్రీ మహావిషువు వరాహమూరిగా అవతరించాడు. రాక్షసుని వధించిన తర్వాతకూడ వరాహం తనపిల్లలతో హాయిగా ఉంటూ వచ్చింది; తన యథార్థస్వరూపం విస్మరించి, పరమసంతుష్టితో పిల్లలను పోషించుకుంటుండినది. నాకనివాసులైన వేల్పులు 'ఈ మృగరూపం విడువు, దివ్యధామం చేరిపో' అని ఆ వరాహానికి నచ్చజెప్ప లేకపొయ్యారు. మృగదేహం వల్ల కలిగే సుఖానుభవాలలో ఆయన నిమగ్నుడై ఉండినాడు. వేల్పులు తమలో కలియబలికికొని, వరాహమూర్తివద్దకు శివుణ్ణి పంపారు. 'నీ స్వరూపాన్ని ఎందుకు మఱచిపొయ్యావు' అని శివు డడిగాడు. ''నాకేం కొదువ ? నే నిక్కడ సుఖంగా ఉన్నాను'' అని విష్ణుదేవుడు జవాబు చెప్పాడు, అంతట శివదేవుడు త్రిశూలంతో ఆ పందిదేహాన్ని ఒక్కపొడువు పొడిచే సరికి అది రూపుమాసిపోయింది. విష్ణుదేవుడు దేవలోకం చేరి పొయ్యాడు.

ప్రాణంమీద ఈలాంటి మరులు ప్రతిఒక్కరికి ఉంది. ఐనా తమ ప్రాణాన్ని అప్రధానంగాను ఉదారాశయాలు ఉన్నతప్రయోజనాలు ప్రధానాలుగాను భావించిన మహాపురుషులు కూడ చరిత్రలో కొందఱున్నారు. పరమహంసదేవుడే ఆలాంటి మహాపురుషులకు ఉత్తమోదాహరణము. యువకుడుగ ఉండినకాలంలో ఆయనకు దేవిని చూడవలె అనే ఆత్రం ముదిరింది. లోకమాతృవియోగం భరించలేక ఆయన ఆత్మహత్య చేసుకోవడానికి కృతనిశ్చయుడై కాళిగుడిలో ఉన్న ఖడ్గమును అందుకొన్నాడు. ఆ దృఢసంకల్పం సద్యఃఫలప్రదమైనది. ఆయనకు దేవిసాక్షాత్కారం గలిగింది. ప్రాణం అందఱికీ ప్రియమైంది కదా. ఒక ఉదాత్తలక్ష్యానికై ప్రాణం అర్పింపబూనుకొన్నవానిని వీరు డని తృణీకృతమరణుడని పేర్కొంటారు. అట్టివారిలో కొందఱుమాత్రమే చరిత్రలో ప్రస్తుతి కన్నారు. ప్రారంభదశలో నీరు పోసి, కంచె కట్టి కాపాడిన వనపాలకుడు గతించిన సుదీర్ఘకాలానికి ఆ అంకురాలు మహావృక్షాలై అసంఖ్యాకులకు నీడను చలువను పండ్లను ప్రసాదిస్తుంటాయి. అందఱు ఆ నీడను ఆ చలువను ఆ పండ్లను అనుభవిస్తారు కాని, గతించిన వనపాలకు నెఱుగరు. అట్లే అనంతరకాలంలో ప్రాణికోటి అనుభవస్తున్న శ్రేయస్సుకై ఆదికాలంలో తమ సర్వస్వమును ప్రాణమును త్యాగం చేసిన మహాత్ములను లోకం ఎఱుగదు. వారి త్యాగం అనంత సత్ఫలమును ప్రసాదించడానికి సుదీర్ఘకాలంముందే ఆ త్యాగమూర్తులు అస్తమించారు. పేరుప్రతిష్ఠలనుగాని వేఱు ఏ లాభాన్ని కాని సొంతమునకు కోరని లోకకల్యాణసాధకులు వారు. అత్యద్భుతములైన తన బలపరాక్రమాలకు ఆశ్చర్యపరవశులైనవారితో హనుమంతు డీ లాగు అన్నాడుట.

మత్తః ప్రత్యవరః కశ్చి
న్నాస్తి సుగ్రీవ సన్నిధౌ.

నా బలపరాక్రమాల కింత ఆశ్చర్యపడుతున్నారు! సుగ్రీవునిసన్నిధిలో ఉన్న వానరులలో నాకంటె తక్కువతరగతివాడు మఱొకడు లేడు. ఇక ఆ వానరుల బలపరాక్రమాలకు మీరిం కెంత ఆశ్చర్యపడతారో- -అని ఆయన

చెప్పాడు. చరిత్రలో ప్రస్తుతి కన్న అత్యల్ప సంఖ్యాకులగు త్యాగమూర్తుల గొప్పతనానికే మనం విస్తుపోతున్నాం. చరిత్ర కందక గతించిన అనల్పసంఖ్యాకులగు త్యాగమూర్తుల గొప్పతనాని కే మనగలం? వారి గొప్పతనానికి వారనుభవించిన కష్టాలు కారణాలు కావు. ఏ లక్ష్యసాధనకై వారు పాటుపడ్డారో అదే వారి గొప్పతనానికి కారణం. వారి గొప్పతనానికి వారు చేసిన మహాత్యాగం కారణం కాదు, వారి అధ్యవసాయం, వారి లక్ష్యోదాత్తత— ఇవే వారి గొప్పతనానికి కారణాలు. ఇవి అమోఘములు.

ఆత్మార్పణం సర్వస్వార్పణం చేసిన వారి జీవితాలే చరిత్రగ్రంథంలో మహోజ్జ్వలములైన అధ్యాయాలు. చిక్కులను వారు ప్రతిఘటించిన విధం, ప్రభువులు మతాధికారులు పెట్టిన క్రూరహింసలను ఎదురు తన్ని వారు నిలబడ్డ రీతి, పరిభవపరివాదాలను వారిచే సహింపించిన వారి మహావిశ్వాసం, శిరఃఖండనం విషపానం ఉద్బంధనం అగ్నిప్రవేశం మొదలయిన వానికి దరహాసంతో వారు సంసిద్ధులయిన ప్రకారం— ఇవి భీరులను ధీరులనుగా చంచలమతులను దృఢమతులనుగా మార్పొందించగల ప్రభావం కలవి.

విశ్వచరిత్రాకాశంలో అలాగు మెఱిసే జ్యోతు లెన్నో ఉన్నాయి. ఇద్దిఱిని గుఱించి మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాము. వారిలో ఒకడు బుద్ధుడు అతని విశిష్టతను సోదరినివేదిత మాటలలో చిత్తగించండి— "శ్రీవివేకానంద స్వామి కుండిన ఉద్రిక్తభావాలలో బుద్ధదేవుని పట్ల గౌరవోద్రేకం ఒకటి. బుద్ధుని జీవితం చారిత్రకప్రమాణప్రచితం కావడం చేత కాబోలు స్వామిజికి ఆయన అంటే అంతటి ఆనందం. స్వామిజి తఱచు ఈలాగు చెబుతుండేవాడు—"శత్రువులు మిత్రులు కలిగి ఉండే భాగ్యం బుద్ధునికిని మహమ్మదునకును మాత్రమే ఉండింది. కాబట్టి మతాచార్యులలో ఆ యిద్దఱిని గుఱించిన విషయాలు మాత్రమే మనకు గట్టిగా తెలుసు." యుక్తివాదానికి నిలిచే విషయాలనుమాత్రమే బుద్ధు డామోదించేవా డనే విషయాన్ని స్వామిజి మాటిమాటికి చెబుతుండేవాడు ఆయన అభిప్రాయం ఇది—ఆర్యులలో చాల గొప్పవాడు బుద్ధుడు; అంతే కాదు, ప్రపంచంలో పుట్టిన వారిలో పూర్తిగా అనుస్మత్తుడు ఆయన ఒక్కడే. ఆయన మానవ మాత్రుడు కాడు, సాక్షాత్కృత పరమార్థుడు. ఆయన వినయమున్నూ స్వాతంత్ర్యమున్నూ అపారములు. వేశ్య అంబాపాలి సమర్పించిన విందును ఆయన ఆరగించాడు. తుద కొక పంచముని ంట భుజించిన భోజన మాయనకు ప్రాణాంతకం ఐంది. ఆలా గవుతుం దని తెలిసే భోంచేశాడు, అత్యంతనిమ్నునితోడి సంశ్లేషం తన జీవితపరిసమాప్తి మంగళకార్యం కావాలి అని ఆయన అభిలషించాడు. తన మహాపరినిర్వాణానికి హేతుభూతుడైన ఆ మాలవానికి ఆయన సప్రశ్రయమును అభినందనపరమునైన చరమ సందేశాన్ని అందజేశాడు. యుక్తివాదపరతలో ఎంత అఖండుడో జీవకారుణ్యంలోను ఆయన కనీసం ఆ పాటి అద్భుత మహనీయుడే. రాజగృహంలో బలియియ్యబడబోతున్న మేకలను రక్షించేందుకై తన ప్రాణం ఇయ్య బూనుకొన్నాడు. ఒకప్పు డొక వ్యాఘ్రికి ఆకలి తీర్చేందుకు తన దేహాన్ని అర్పింప ముందు కుఱికాడు. ఇతరులకై ఐదువందల జన్మాలను అర్పించిన త్యాగపుటావంలో నిలవరమైన దయ ఆయనను బుద్ధునిగా రూపొందించింది.

శ్రీ వివేకానందస్వామి తన ప్రసంగాలలో రణశూరులను తలదన్నే ఆధ్యాత్మిక ధీరులను

ఇద్దఱిని గుఱించి చెబుతుండేవాడు. చాలకాలం క్రిందట ఒక చక్రవర్తి భారతదేశంమీద దండయాత్ర చేశాడట. "భారతదేశం మహర్షులదేశంగా ప్రసిద్ధం. అక్కడికి పోయినప్పుడు అటువంటివారిని కొందఱి నైనా చూచి రా" అని ఆ చక్రవర్తికి అతని గురువు చెప్పియుండినాడు. కాబట్టి చక్రవర్తి భారతదేశంలో ఎవరినైనా ఒక మహర్షిని చూడాలని అన్వేషించాడు. ఎంతోకాలం వెదకివేసారగా చాల వృద్ధుడైన ఒక మహర్షిని చూడ గలిగాడు. ఆ మహర్షి ఒక శిలావితర్ది మీద కూచొని ఉన్నాడు. చక్రవర్తికిని అతనికిని కొంతసేపు సంభాషణ సాగింది. ఆ మునీంద్రుని వివేకం చక్రవర్తి మెప్పు పొందింది. 'మీరు నాతో మా దేశానికి విచ్చేయండి' అని చక్రవర్తి మునీంద్రుని ప్రార్థించాడు. "నేనున్న అడవి నాకు చాలు, నేను ఎక్కడికీ రా" నన్నాడు ముని. "నేను సార్వభౌముణ్ణి, నీకు ధనం పదవి సకలసంపదలు ఇస్తా" నని చక్రవర్తి ఆశ చూపాడు. 'అవన్నీ నేను లక్షించేవి కావు' అన్నాడు ముని. ఇక చక్రవర్తి బెదరించడానికి ప్రయత్నించాడు "నీవు రాకపోతే నిన్ను చంపేస్తా" నన్నాడు. నిర్మలమందహాసంతో చక్రవర్తికి ముని చెప్పిన జవాబు — "సార్వభౌమా ఇంతకంటె అవివేకప్రసంగం నీజన్మలో నీవు చేసి ఉండవు. నన్ను చంపడం నీ తరం కాదు. సూర్యుడు నన్నెండించ లేడు, అగ్ని నన్ను కాల్చ లేదు, కత్తి నన్ను చంపజాలదు, ఎందుచేత అంటావా, నేను ఆత్మను. ఆత్మకు జననం లేదు మరణం లేదు. ఆత్మ నిత్యం, సర్వశక్తి, సర్వజ్ఞుడు." ఆధ్యాత్మికధీరత అంటే ఈలా గుంటుంది. ఇది సింహశార్దూలాల ధైర్యానికంటె విలక్షణ మైంది.

ప్రాచీనభారతంలోని యీ సంభవానికి దీటు వచ్చే మఱొక సంభవం నవభారతంలో — 1857 వ సంవత్సరంలో సిపాయిలకలహం జరిగింది కదా. ఒక మహమ్మదీయసిపాయి వృద్ధుడు మహాత్ముడు అయిన యొక యోగిని కత్తితో పొడిచాడు. హిందుసిపాయిలు పలువురు ఏకమై ఆ ముస్లిముసిపాయిని కట్టి తీసుకు వచ్చి "వీణ్ణి మేం చంపుతాం" అన్నారు యోగితో. యోగి ప్రశాంతచిత్తంతో మొగ మెత్తి చూచి "సోదరా, అతడు నీవు ఒక్కరే, అతడు నీవు ఒక్కరే" అంటూ ప్రాణం విడిచాడు. శ్రీవివేకానందస్వామి ప్రణీతమైన యతిగీతంలోని యీ పంక్తులిట సముదాహరణార్హాలు:-

అన్నిటం గల్గు ఒక్కడే ఆత్మ; వేఱు
లేనెలే దేదియును భువిఁ, గాన నింక
మిత్రుఁ డెవరికి ఎవరికి శత్రుఁ డతఁడు?

---

గాడిద యెఱుఁగదు గంధంబువాసన, లేదూడఁబండికి లీల రోఁత,
వాడకోడికి నాదివారంబు వలవదు, గ్రోఁతికి మఱి తాళిగోణ మేల?
చిఱుతని కేటికి శీలవంతుల యున్కి, యెద్దుకులచవి యెఱుఁగ లేదు;
వరుసతోఁ గుక్క దేవరబోన మెఱుఁగదు, మొసలికిఁ బడిసెంబు మొదల లేదు;
సహజమూర్ఖులు నిటువంటిజాడవారె
వారిగుణములు దిద్దంగ వలవ దెపుడు,
కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ,
విమలరవికోటిసంకాశ, వేంకటేశ.

—తాళ్ళపాక పెదతిరుమలయ్య.

# దక్షిణభారతమందలి వీరశైవము

అనాదికాలముగా భారతీయుల దృక్పథము ఆధ్యాత్మికము. భారతజాతీయలక్ష్యములను పెద్దలు ముచ్చటగా రెండుమాటలలో ఇమిడ్చినారు—(1) ఆత్మనో మోక్షాయ (2) జగద్ధితాయచ. అనగా ప్రతిజీవియు తనకు మోక్షమును కోరుకోవలెను, జగత్తుకు హితము కోరవలెను. ఈ లక్ష్యములు భారతీయుల వివిధ భాషాసారస్వతములలో ప్రతిఫలించుచుండుట సహజమే. ముఖ్యముగ భక్తిసారస్వత మనగానే బమ్మెరపోతరాజు మన మనస్సులలో స్ఫురించును. భాగవతమును ఆంధ్రీకరించుచు ఆయన మోక్షమును జగద్ధితమును ప్రయోజనములుగ పరిగణించినాడు.

దీనిం దెనిఁగించి నా
జననంబుం సఫలంబుఁ జేసెదఁ బున
ర్జన్మంబు లేకుండఁగన్.

అని మోక్షమును లక్ష్యముగా నిర్దేశించినాడు.

సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు
భాగవతంబు జగద్ధితంబుగన్.

అని జగద్ధితమును ఫలముగా పేర్కొనినాడు.

మోక్ష మనెడి యుత్తమపురుషార్థమును పొందుటకు ప్రతిపాదితములైన మార్గములకు యోగము లని పేరు. కర్మయోగము జ్ఞానయోగము భక్తియోగము ప్రపత్తియోగము అను పేరులతో అవి ప్రసిద్ధి పొంది యున్నవి. ప్రజలలో అత్యధికసంఖ్యాకులకు ఎక్కువ అందుబాటులో నుండునదియు, హృదయాహ్లాదకరమైనదియు, సులభమైనదియు భక్తిమార్గము. జ్ఞానమార్గవిధాతలైన శ్రీ జగద్గురు ఆదిశంకర భగవత్పాదులు "మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" మోక్షసాధనసామగ్రిలో భక్తియే వరిష్ఠ మని వాక్రుచ్చినారు.

జీవునిభక్తికి లక్ష్యము దేవుడు. మన సారస్వతములో ముప్పదిమూడుకోట్ల వేల్పుల ప్రస్తావ మున్నను, వారిలో సర్వప్రధానులు, త్రిమూర్తులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు. ఈ ముగ్గురిలో అధికు డెవ్వరు అను ప్రశ్నను లేపుకొని అందుకు మహాకవికులగురువగు కాళిదాసు ఈలాగు సమాధానము చెప్పినాడు, కుమారసంభవ కావ్యములో—

ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధా సా,
సామాన్య మేషాం ప్రథమావరత్వమ్,
విష్ణో ర్హర, స్తస్య హరిః కదాచిత్,
వేధా స్తయో, స్తా వపి ధాతు రాద్యౌ.

మొదటిమూర్తి ఒక్కటే. అది ముమ్మూర్తులుగా భేదిల్లినది. ఈ త్రిమూర్తులకు గొప్పతనమును తక్కువతనమును సమానమే. ఒకప్పుడు విష్ణువుకంటె హరుడు గొప్ప, ఒకప్పుడు హరునికంటె విష్ణువు గొప్ప, ఒకప్పుడు ఆ యిద్దఱికంటె బ్రహ్మ గొప్ప, ఒకప్పుడు బ్రహ్మకంటె వారిద్దఱును గొప్పవారు.

భూయాసుః పురుషోత్త
మామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.

త్రిమూర్తులు శ్రేయఃప్రదాత లగుదురు గాక అను ఆశంసను సకలభాషావాగనుశాసనుడైన నన్నయభట్టారకుడు తనభారతభాగప్రారంభములో పొందుపఱచినాడు. హరికిని హరునికిని హరిహరనాథు డనెడి యేకమూర్తిలో ఐక్యమును సంభావించి సాక్షాత్కరించుకొని,

ప్రమొక్కి, ఆ దేవున కంకితముగా కవిబ్రహ్మ తిక్కనసోమయాజి తనభారతభాగమును నిర్వ హించినాడు.

ఐనను, ఇవి సమన్వయవాదములు. ఇట్టి వాదములు రుచింపని రసికులు బహుళముగ నున్నారు, వారిలో నొక్కొక్కవర్గమువారు త్రిమూర్తులలో ఒక్కొక్కరిని నిస్సమునిగాను సర్వాధికునిగానుఅనుసంధించుచు ఉపాసింతురు. ఐనప్పటికిని, బ్రహ్మను పరాత్పరునిగాను శివ కేశవులను బ్రహ్మకు లొంగిన వారినిగను భావించువారు అగపడుట లేదు. విష్ణుదేవుని పరదైవముగా అధ్యవసించు శ్రీవైష్ణవమును, పరమశివుని పరంధామునిగా అధ్యవసించు శైవమతమును, శక్తిని పరదేవతగా భజించు శాక్తమతమును ఆసేతు శీతాచల పరివ్యాప్త ములై యున్నవి. శివుడు హిమాచలములో గౌరీశంకరుడు, రామేశ్వరములో రామలింగే శ్వరుడు, కాశ్మీరములో మహాదేవుడు, మధు రలో సుందరేశ్వరుడు, కాశీలో విశ్వేశ్వరుడు, సౌరాష్ట్రములో సోమనాథుడు, శ్రీశైలములో మల్లికార్జునుడు. శివాలయములు దేశవ్యాప్త ములై శైవమతవ్యాప్తిని సూచించుచున్నవి.

శాక్తము వైష్ణవము శైవము అను వీనిలో నొక్కొక్కదానిలోను కాలక్రమమున స్వమత దురభిమాన పరమతాసహన ద్వేషములు పొడసూపినవి. విష్ణుదేవునితో మఱొక దేవుడు సమానుడు అని భావించుటే మహాపాపము అన్నాడు ఆముక్తమాల్యదకావ్యములో మాల దాసరి. అది విష్ణుభక్తి అధిరోహించిన తల పోలము.

ఇంతకంటె ఎంతో తీవ్రతరస్థాయులకు ఎగ బ్రాకినది శివభక్తి. శివమతము తాల్చిన యా తీవ్రతరరూపమే వీరశైవము. వీరశైవమును సిద్ధాంతశిఖామణి యను గ్రంథములో తత్కర్త ఈలాగు నిర్వచించినాడు—

శివేన సహ సమ్బన్ధా
చ్ఛైవ మి త్యావృతం బుధైః
ఉభయో స్సమ్పుటీభావా
ద్వీరశైవ మితి స్మృతమ్
వీశబ్దే నోచ్యతే విద్యా
శివజీవైక్యబోధికా
తస్యాం రమన్తే యే శైవా
వీరశైవా స్తు తే స్మృతాః
స్వయం లిఙ్గాఙ్గసమ్బన్ధీ
శివ ఏవ న చాపరః.

శివునితోడి సంబంధమువలన బుధులు శైవ మని ఆదరింతురు. ఇద్దఱి యైక్యము కారణ ముగా వీరశైవమను పేరేర్పడినది. వీ అనగా శివజీవైక్యబోధకయగు విద్య. అందు రమించు శైవులే వీరశైవులు. లింగధారి సాక్షాచ్ఛివుడే.

వీరశైవములో దర్శనభాగమును ఉన్నది, మతభాగమును ఉన్నది. అన్ని మతములలోవలె ఇందులోను దార్శనికసత్యములను ఆధార ములుగా జేసికొని మతానుష్ఠానప్రక్రియలు రూపొందింపబడినవి. దార్శనికముగావీరశైవము ఈశ్వరాద్వైత మన్నారు కొందఱు. ద్వైతా ద్వైత మని విశేషాద్వైత మని కొంద అన్నారు, శివవిశిష్టాద్వైత మన్నారు కొందఱు. ఈ భిన్నాభిప్రాయముల నన్నిటిని మన విజ్ఞాన సర్వస్వసంపుటములలోనే చూడవచ్చు. ఈశ్వ రునికిని జీవునికిని అపృథక్సిద్ధమైన శక్తిద్వారా అవినాభావసంబంధ మున్నది. శక్తి, కళగాను భక్తిగాను చీలును. కళ శివునికి చెందును, భక్తి జీవునికి చెందును. పరశివుడైన యీశ్వ రుడు ప్రపంచమునకు మూలకారణము, ఆయన శక్తి ఉపాదానకారణమై ప్రపంచభేదప్రతి

భాసను కలిగించును. జీవుని శివునొద్దకు చేర్చునది భక్తి. ఈ దర్శనములో 'స్థలము' 'లింగము' 'అంగము' అను పదములు చాల ముఖ్యములు. పరశివునికి సాంకేతిక నామము 'స్థలము.' ఆరాధ్యారాధక భావములో నున్న 'శివుడు' 'జీవుడు' అను రెండు తత్త్వములే 'లింగము' 'అంగము' అను పేళ్ళతో వ్యవహరింపబడుచున్నవి. అగ్నినుండి రవలు లేచినట్లుగా బ్రహ్మమునుండి జీవులు ఉద్భవించుచున్నారు. అనాదిగా సుఖదుఃఖరూపమగు కర్మఫలము ననుభవించుచున్నారు. క్లేశకర్మాదులు బ్రహ్మమునకు లేవు. శివుడు సదా శుద్ధుడే. శివజ్ఞానముచేత ముక్తులైన జీవులు, నదులు సముద్రములో లయించినట్లుగా శివునిలో ఐక్య మగుదురు. ఇది వీరశైవమతసంక్షేపము.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోను తంజావూరు సరస్వతీ మహాలు పుస్తకభాండాగారములోను వీరశైవప్రతిపాదక గ్రంథములు నూటికిపైనే ఉన్నవి. ఆ పుస్తకములపట్టీని డాక్టరు చిలుకూరు నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రోపోద్ఘాతములో నిచ్చియున్నారు. వానిలో పురాణములున్నవి, స్థలమాహాత్మ్యము లున్నవి, యక్షగానము లున్నవి, ప్రబంధము లున్నవి, కథలును స్తుతిశతకములును ఉన్నవి. 'శివతత్త్వసారము' మల్లికార్జునపండితారాధ్యుడు రచించినది; బసవపురాణపండితారాధ్యచరిత్రములు పాల్కురికి సోమనాథుని కృతులలో సుప్రసిద్ధములు, 'దీక్షాబోధ' పిడుపర్తి సోమనాథప్రణీతము. వీరశైవమునుగూర్చి తెలిసికోవలసిన విషయములు బహుతరముగా ఈ గ్రంథములలో సువ్యక్తము చేయబడినవి. తక్కిన గ్రంథములలో చెప్పబడిన యంశములలో వీనిలో లేనివి లేవు. కాబట్టి వీని ననుసరించి ఒక ఆఱు ముఖ్యాంశములను విన్నవించెదము.

శివుడే దేవాధిదేవుడు అనుట మొదటి యంశము. ధర్మగుప్తాభ్యుదయ మనుగ్రంథములో కాశీనాథుని వీరారాధ్యుడు ప్రతిపాదించుచున్నాడు, వినుడు—

శివుఁడే దైవము ధరలో
శివభక్తులె సత్కులీనసిద్ధాంతపరుల్
శివమంత్రమె మనురాజము
శివుని ప్రసాదంబె భోగ శేఖర మరయన్.

నిప్పును గుడ్డలో మూటగట్టి ఈ రాద్ధాంతమును శ్రీపతిపండితుఁడు నిరూపించె నని మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్త్వసారములో తెలుపుచున్నాడు—

ఒక్కఁడె దైవము శివుఁ డని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా.

పండితారాధ్యచరిత్ర వాదప్రకరణములో పాల్కురికి సోమనాథుడు పదిలపఱచిన పండితారాధ్యుని వీరాలాపము లివిగో—

కావున నేనును గౌరీశు మీఁద
దైవంబు లేఁ డని తల యిచ్చి పడయు
దును, మంటఁ బట్టుదుఁ, దొడరిన గెలుతుఁ
బనుగొన వాదజల్పవితండములను,
దెలఁగి యట్లునుగాక శివుమీఁద నొకఁడు
కలఁ డన్న నాయఱకాలెత్తి వాని
నడుదలఁ దన్నుదు, నాదు ప్రతిజ్ఞ!

శివునకంటె శివభక్తు డెక్కువ పూజార్హుడనుట రెండవ యంశము.

శివభక్తిపరులఁ బూజింప కేప్రొద్దు
శివపూజ లోకకోటి చేసిన వృథయ

శివభక్తి పరులఁబూజించినఁ జాలు
శివపూజ లొకకోటి చేసినయట్లు!

బండారుబసవన్న విషమును త్రాగి జీర్ణించు కొని 'శివభక్తుడు అసమశ్రేష్ఠుఁ' డని నిరూపించినాఁడట :

అసమేక్షణ, శివభక్తుం
డసమశ్రేష్ఠుఁ డని పల్కి యన్యులతోడన్
బొసపోరై బండారువు
బసవన విస మెత్తి త్రాగి బ్రదుకడె, రుద్రా!

శివభక్తుని స్మరణచే శివభక్తుని కెటువంటి యావేశము గలుగునో బసవేశ్వరుని స్మరణము చేత పాల్కురికి సోమనాథునికి గలిగిన ఆవేశములో చూడవచ్చు :

బసవపురాణప్రబంధ మన్పేరి
బసవగోత్రుండను బసవనికరుణ
బసవేశు శ్రీపాదపద్మసేవకుఁడ
బసవన్నఁ బొగడఁ బొల్పడు కవీంద్రుఁడను
బసవన్నఁ బొగడఁ బొల్పడు పాఠకుండ,
బసవన్నదూత, నే బసవన్న బంట,
బసవన్న లెంక, నే బసవన్న లెంగి,
బసవన్న యిలు పుట్టు బానిసకొడుక.

వీరశైవులకు శివునికంటె గురు వెక్కువ పూజార్హుఁ డనుట మూఁడవయంశము. ఇది శివుని మల్లికార్జున పండితారాధ్యుని జోడించి పాల్కురికి సోమన సాగించిన యీ ప్రశస్తిలో స్పష్టము :

చిరతమోగుణపరిస్ఫీతుండు శివుఁడు
వరసత్త్వగుణవికస్వరుఁడు పండితుఁడు
అరయనచరలింగ మాలింగమూ రి
అరయఁగాఁ జరలింగ మా పండితయ్య
అసమలోకాధీశు డంబికాధవుఁడు
అసమలోకారాధ్యుఁ డా పండితయ్య;
అఖిలలోకమయుండు హైమవతీశుఁ
డఖిలలోకాతీతుఁ డా పండితయ్య;
లోకానుసారి త్రిలోచనుం, డిల న
లోకానుసారశీలుఁడు పండితయ్య
అరుదగు లోకసంహారుండు శూలి
కరుణమై లోకోపకారి పండితుఁడు
అసితకంఠుండు దా నసమలోచనుఁడు
భసితకంఠుండు శ్రీపండితేంద్రుండు
ఊర్ధ్వైకలోచనుఁ డుడురాజమౌళి
ఊర్ధ్వద్విలోచనుం డొగి పండితయ్య;
భక్తైకదేహుండు పరమేశ్వరుండు
భక్తసత్ప్రాణుండు పండితస్వామి;
మల్లికార్జుననామి మల్లికార్జునుఁడు
మల్లికార్జునకీర్తి మల్లికార్జునుఁడు
మహిలోనఁ బండితమల్లికార్జునుని
మహిమలు వర్ణింప మనుజుల తరమె?

శివభక్తులకు జాతిభేదములును జాతినిబట్టి యెక్కువతక్కువలును లేవనుట నాలుగవ యంశము. దీక్షాబోధలో పిడువర్తి సోమనాథుడు ఈ విషయమును వివరించుచున్నాడు—

అమరంగ నటుగాక యఖిలమర్త్యులకు
సమము ధాతువులును, సమము పిండములు,
సమము సూతకములు, సమము జన్మములు,
సమము నిద్రాహారసంగకృత్యములు
సమము మోహాభయాభిమంగలోభములు
సమ మింద్రియవిషయసముదాయములును
సమము లీ భూతపంచకములు నవయ
వములును సుఖదుఃఖవాసనల్ సమము,
లది గాక ధర యేక మఖిలజీవులకు
తుద నాకసంబు పొత్తు సమస్తమునకు
తోయ మొక్కటి జగత్తునకుఁ బ్రాపింప
నై యుండ, కల భేద మైన లా గెట్లు?

శివభక్తులు కానివారికి 'భవులు' అని పేరు. శివభక్తులందలి భక్తి భవులమీద ప్రబల ద్వేషముగా పరిణమించుట గమనార్హమైన అయిదవయంశము. పాల్కురికి సోమనాథుడు తన వ్రతము నీరీతిగ వివరించినాడు—

భవిజనదర్శనస్పర్శనాలాప
వివిధదానాదానవిషయదూరగుడ.

ఈ వాక్యార్థమునకు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి ఘనమైన వివరణ మిదిగో—

పాల్కురికి సోమనాథుడు భవులు కంట బడితే కళ్లు మూసుకుంటాడు. భవులు తన్ను తాకితే మైల పోయిందాకా తోముకుంటాడు, వారి మాటలు వినబడతా యేమో నని చెవిలో దూది పెట్టుకుంటాడు. భవులకు తానేమీ ఇవ్వడు, వాళ్లు ఇస్తే పుచ్చుకోడు.''

ఇక నాఱవయంశము లింగధారణము. ఇది వీరశైవుల కతిముఖ్యము. ఆ లింగమునకు ప్రాణలింగమనియు ఇష్టలింగమనియు పేర్లు. అది నష్టమైన, మెడను కత్తిరించుకొని చావవలసిందే. కాని ఇక బ్రతికియుండకూడదు. విష్ణుబ్రహ్మాదిదేవతలందఱును లింగధారణము చేతనే తమ తమ పదవులను అధిరోహించినారట. లింగధారణము కారణముగా వీరశైవులకు లింగాయతులను పేరుగూడ గలిగినది. విభూతిరుద్రాక్షమాలలధారణము పంచాక్షరీ మంత్రానుసంధానముకూడ ముఖ్యలక్షణములే. అన్నిటికంటె ప్రత్యేకలక్షణము లింగపసాయత మనెడి శస్త్రమును ధరించుట. ఆ శస్త్రముతో వారు జైనులను బౌద్ధులను శివద్రోహులక్రింద లెక్కగట్టి అతిఘోరముగ చంపినారు. ఆలాగు చంపవలసినదని సంగమేశ్వరదేవుడే బసవేశ్వరుని శాసించె నట.

భక్తుడు భగవంతుని తండ్రినిగానో స్వామినిగానో మిత్రునిగానో శిశువునుగానో ప్రియునిగానో భావించి ప్రేమింపవచ్చు. భగవంతుని తండ్రినిగా భావించుట శాంతభావము, స్వామినిగా భావించుట దాస్యభావము, మిత్రునిగా భావించుట సఖ్యభావము, శిశువునుగా భావించుట వాత్సల్యభావము, ప్రియునిగా భావించుట మధురభావము. బెజ్జమహాదేవి అను భక్తమహిళ శివునికి తల్లి లేనందుకు చింతించి తానే తల్లియై శివుని తనయునిగా చేసికొనినది. ఆమె భావములను పాల్కురికి సోమనాథుడు బసవపురాణములో ఈలాగు చిత్రించినాడు—

తల్లి గల్గిన నేల తపసి కానిచ్చు!
తల్లి గల్గిన నేల తల జడ ల్గట్టు?
తల్లి యున్న విషంబు ద్రావ నేలిచ్చు?
తల్లి యుండిన తోళ్ళు దాల్ప నేలిచ్చు?
తల్లి పాముల నేల ధరియింప నిచ్చు?
తల్లి బూడిద యేల తాఁబూయనిచ్చు?
తల్లి పుచ్చునె భువిఁ దనయునిఁ దిరియ?
తల్లి పుచ్చునె సుతు వల్లకాటికిని?
తల్లి లేకుండిన తనయుండు గాన
ప్రల్లదుఁడై యిన్ని పాట్లకు వచ్చె
చన్నిచ్చి పల్మాఱు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
ఆఁకొనఁగాఁ గడు పరసి పాలిచ్చి
చాకించి పెనుపదే జనని గల్గినను?
తా నింతవాఁ డయ్యెఁ దల్లి లేకయును
తా నెంత పెరుగునో తల్లి గల్గినను

వాత్సల్యభావము నిండి తొనకు పంక్తు లివి.
తక్కిన శాంత - దాస్య - వాత్సల్య - స

మధురభావముల కిది మచ్చుముక్క. సామరస్యమును సమన్వయమును నచ్చినంతగా భారతీయులకు మతవిషయములలో ఖడ్గమార్గము నచ్చదు. ప్రచారమునకు తక్కిన మార్గములతో బాటు ఖడ్గమార్గమునుగూడ నవలంబించిన వీరశైవవ్యాప్తి తాత్కాలికముగ కొంత సాగినను, కాలక్రమమున ఆగిపోయినది. జాతిభేదమును రూపుమాప బూనుకొన్న వీరశైవసంఘము, జాతులజాబితాకు తన పేరును చేర్చి సంఖ్యను పెంచినదే కాని, రూపుమాప జాలక పోయినది.

(ఆకాశవాణి సౌజన్యముతో)

---

వైదిక విజ్ఞానకోశము

# వివేకచూడామ

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

విలక్షణం యథా ధ్వాన్తం లీయతే భానుతేజసి,
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే. 564

వెలుతురునకు విరుద్ధలక్షణము గలది చీకటి. అటువంటి చీకటి ఏ రీతిగా సూర్యతేజమున లీనమైపోవునో అట్లే బ్రహ్మమునకంటె విలక్షణమగు జగత్తు సమస్తమును బ్రహ్మమందు లీనమై పోవును. ౫౬౪

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటమ్
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్. 565

ఘటము నష్టమైనప్పుడు ఆకాశము ఆకాశముగనే యుండును. అట్లే మాయ అవిద్య అను ఉపాధులు నమసినప్పుడు బ్రహ్మవేత్త బ్రహ్మముగనే యుండును. ౫౬౫

క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే, జలం జలే,
సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః. 566

పాలలో పడిన పాలు పాలతో ఐక్యమొందును, నూనెలో పడిన నూనె నూనెతో ఐక్యమొందును, నీటిలో పడిన నీరు నీటితో ఐక్యమొందును. అట్లే బ్రహ్మజ్ఞానియగు ముని బ్రహ్మముతో ఐక్యమొందుచున్నాడు. ౫౬౬

ఏవం విదేహకైవల్యం సన్మాత్రత్వమఖణ్డితమ్
బ్రహ్మభావం ప్రపద్యైష యతిర్నావర్తతే పునః. 567

ఇట్లు పరిపూర్ణమును సద్రూపమాత్రము నగు విదేహకైవల్యమును, బ్రహ్మభావమును బ్రాపించిన యతికి పునరావృత్తి (=సంసారము) ఉండదు. ౫౬౭

సదాత్మైకత్వవిజ్ఞానదగ్ధావిద్యాది వర్ష్మణః
అముష్య బ్రహ్మభూతత్వా ద్బ్రహ్మణః కుత ఉద్భవః. 568

ఆత్మైకత్వవిజ్ఞానముచే అవిద్యాదిదేహములు దగ్ధములై అతడు బ్రహ్మముగ నగుచున్నాడు. బ్రహ్మమునకు పుట్టుక ఎక్కడిది? ౫౬౮

మాయాక్లృప్తౌ బన్ధమోక్షౌ న స్త స్స్వాత్మని వస్తుతః
యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమౌ. 569

బంధమోక్షములు మాయాకల్పితములే కాని నిజమునకు ఆత్మకు బంధమును లేదు మోక్షమును లేదు. త్రాడు నిష్క్రియము. అది త్రాడని మనము గుర్తించినప్పుడును అది త్రాడే, పామని మనము భ్రమించినప్పుడును, అది త్రాడే. సర్పత్వము అందులోనికి రాను లేదు పోను లేదు. ౫౬౯

ఆవృతే స్సదసత్త్వాభ్యాం వక్తవ్యే బన్ధమోక్షణే
నావృతి ర్బ్రహ్మణః కాచి దన్యాభావా దనావృతమ్
య ద్య స్త్యద్వైతహాని స్స్యా ద్ద్వైతం నో సహతే శ్రుతిః. 570

ఆవరణ ముండుటనుబట్టి బంధ మని, లేకుండుటనుబట్టి మోక్ష మని చెప్ప దగియుండును. బ్రహ్మమునకంటె వేఱైన దేదియు లేనందున, బ్రహ్మమునకు ఆవరణ మెప్పుడును లేదు. ఉన్న దందు మేని, అద్వైతము పొసగదు. ద్వైతమో వేదమునకు సహ్యము కానే కాదు. ౫౭౦

బన్ధశ్చ మోక్షశ్చ మృషైవ మూఢా బుద్ధే ర్గుణం వస్తుని కల్పయన్తి
దృగావృతిం మేఘకృతాం యథా రవౌ యతో ఽద్వయాఽసఙ్గచి దేత దక్షరమ్. 571

బంధమును అసత్యమే, మోక్షమును అసత్యమే. మేఘము చూపు నావరింపగా, సూర్యు నావరించినట్లు చెప్పుట కలదు గదా! అట్లే బుద్ధిగుణమును మూఢులు వస్తువున కారోపింతురు. బ్రహ్మము అద్వయము, అసంగము, చిదేకరూపము, అక్షరము. ౫౭౧

అస్తీతి ప్రత్యయో య శ్చ యశ్చ నాస్తీతి వస్తుని
బుద్ధే రేవ గుణా వేతౌ న తు నిత్యస్య వస్తునః. 572

'బంధము ఉన్నది' 'లేదు' అను ప్రతీతులు రెండును బుద్ధిగుణములే కాని, నిత్యవస్తువునకు (బ్రహ్మమునకు) అవి పొసగవు. ౫౭౨

అత స్తౌ మాయయా క్లృప్తౌ బన్ధమోక్షౌ న చాత్మని
నిష్కలే నిష్క్రియే శాన్తే నిరవద్యే నిరఞ్జనే
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవ త్కల్పనా కుతః? 573

బుద్ధి, మాయాకల్పితము. దానిధర్మములు బంధమోక్షములు. కావున అవియు మాయాకల్పితములే. పరతత్త్వము, ఆత్మ, ఆకాశమువలె, నిరవయవము, నిష్క్రియము, శాంతము, నిరవద్యము, నిరంజనము, అద్వితీయము. కావున అందు బద్ధత్వముక్తత్వాది భేదకల్పన మెట్లు పొసగును? ౫౭౩

న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః
న ముముక్షు ర్న వై ముక్త ఇ త్యేషా పరమార్థతా. 574

ఆత్మకు పుట్టుకయు లేదు, చావును లేదు; బంధమును లేదు, మోక్షాభిలాషయు లేదు, ముక్తియు లేదు—ఇదే పరమార్థము. ౫౭౪

సకలనిగమచూడాస్వాన్త సిద్ధాన్తరూపం
పర మిద మతిగుహ్యం దర్శితం తే మ యాద్య
అపగతకలిదోషం కామనిర్ముక్తబుద్ధిం
స్వసుతవ దసకృ త్త్వాం భావయిత్వా ముముక్షుమ్. 575

కలిదోషములును కామములును లేనివాడవును ముముక్షువు నగు నిన్ను నాసుతునిగా భావించి, సమస్త వేదాంతములసారమును ఉత్కృష్టము నగు సిద్ధాంతరహస్యము నిప్పుడు నీకు జూపితిని. ౫౭౫

ఇతి శ్రుత్వా గురో ర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః
స తేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్తబన్ధనః 576

ఇట్లు గురువాక్యము నాలకించి, బంధవిముక్తుడై, వినయముతో గురువునకు ప్రణమిల్లి, సమనుజ్ఞాతుడై, శిష్యుడు తన దారి నేగెను. ౫౭౬

గురు రేష సదానన్దసిన్ధౌ నిర్మగ్నమానసః
పావయ న్వసుధాం సర్వాం విచచార నిరన్తరః. 577

ఇకను ఈ గురువు సదానందసింధువున నిర్మగ్నమైన మనస్సుతో, స్వరూపచ్యుతి లేక, వసుధ నెల్ల పవిత్రీకరించుచు, సంచరించుచుండెను. ౫౭౭

ఇ త్యాచార్యస్య శిష్యస్య సంవాదే నాత్మలక్షణమ్
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే. 578

ఇట్లు ముముక్షువులకు సులభముగ దెలియుటకై ఆత్మలక్షణమును ఆచార్యశిష్య సంవాదరూపమున నిరూపించుట అయినది. ౫౭౮

హిత మిద ముపదేశ మాద్రియన్తాం విహితనిరస్తసమస్తచిత్తదోషాః
భవసుఖవిరతాః ప్రశాన్తచిత్తా శ్రుతిరసికా యతయో ముముక్షవో యే. 579

శ్రుతిరసికులును, విహితరీతులలో సమస్తచిత్తదోషములను నిరసించినవారును, ప్రశాంతచిత్తులును, సంసారసుఖవిరక్తులును మోక్షాభిలాషులు నగు యతులు హితమైన యీ యుపదేశము నాదరింతురు గాక. ౫౭౯

సంసారాధ్వని తాపభానుకిరణప్రోద్భూతదేహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాన్త్యా పరిభ్రామ్యతామ్
అత్యాసన్న సుధామ్బుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
త్యేషా శఙ్కరభారతీ విజయతే నిర్వాణసన్దాయినీ. 580

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజికాచార్యవర్యస్య
శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతిషు
వివేకచూడామణి స్సమాప్తః.

మొదలు తుదలు లేని సంసారమనెడి పెనుబాటలో, తాపత్రయ మనెడి మండు టెండకు (కాళ్ళుకాలుట నెత్తి మాడుట నోరెండుట అనువానిచే) హెచ్చిన దప్పివలన డస్సి, నీళ్ళకై ఎడారిలో త్రిప్పట చెందుచున్నవారికి మిక్కిలి చెంగటనే ఉన్నదియు, అద్వయమును సుఖకరము నగు బ్రహ్మ మనెడి యమృతసాగరమును జూపుచు నిర్వాణమును సమకూర్చునట్టి యీ శంకరవాణికి (వివేకచూడామణికి) జయము!!

ఇది వివేకచూడామణికి అన్నమాచార్యాపరనామధేయ
భరద్వాజభక్తవత్సలప్రణీతమగు నాంధ్రానువాదము
సర్వము సంపూర్ణము.

శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదశఙ్కరం లోకశఙ్కరమ్

అమ్మ దుర్గమ్మకును కాళహస్తిపతికి
శంకరాచార్యవాగ్గుంభసారవిదుల
కెల్లరకు విపులానంద మిడును గాక
భక్తవత్సలు నాంధ్రానువాదసేవ.

# శ్రీ రామకృష్ణానందస్వామి జోహారు

మాన్యశ్రీ చేదిలాల్‌గారు *

శ్రీరామకృష్ణానందస్వామికి జోహారు లర్పించు ఈ యుత్సవమున మీతో కలిసికొన గలిగినందున చరితార్థుడనైనట్లు నా కనిపించుచున్నది. ఈ సదవకాశమును నాకు ప్రసాదించినందుకు శ్రీమత్తపస్యానందస్వామికి నేను కృతజ్ఞుడను. తరుణవయస్సులో పరమహంస శ్రీరామకృష్ణ వివేకానందస్వాముల అమృతవాణిని తనివార గ్రోలినవాడను నేను. దాని సంస్మరణ మిప్పుడు నిర్వృతిదాయకముగ నున్నది. సొంతవిషయమును చెప్పుకొనుచున్నందుకు క్షమింపుడు. మరల ఈ యావరణము లోనికి వచ్చి, కొంచెముసేపైనను ఉండి, ఈ జోహారుల పరంపరలో నా జోహారులను కూడ చేర్ప గలిగినందుకు నా కెంత ఆనందముగ ఉన్నదో చెప్పకుండ లేకున్నాను. శశిమహారాజు గురుదేవున కతిసన్నిహితుడు, గురుదేవుని శ్రీచరణములకు తన దేహమును మనస్సును ఆత్మను అర్పించినవాడు. గురుదేవుడు భౌతిక దేహమును వీడిన పిమ్మటకూడ, శశికి ఆయనసాన్నిధ్యము గుడిలో మఠములో తన మనస్సులో అనుభూతమగుచుండెడిది. గురుదేవుని సమారాధనమే ఆయన జీవితవిధానముగ నయ్యెను అట్టి దీతని గురుపరతంత్రత. రామకృష్ణానందస్వామివంటి ఆధ్యాత్మికదిగ్దంతికి జోహారు లర్పింపగలుగుట మనము గర్వింపదగిన భాగ్యము, ఉదాత్తతావహమైన యనుభూతి.

మనలో రామకృష్ణానందస్వామిని సమక్షమున దర్శించి యుండనివారు, ఆయన నిర్వర్తించి మన కిచ్చిపోయిన ఘనకార్యములను గుర్తించి ప్రశంసింపగలము, అంతే. ఆ ఘన కార్యాలలో మఠ సేవాసంఘాలును వానియాధ్వర్యమున నడపబడుచున్న సంస్థలును గలవు. ఇవిగాక సూక్ష్మతరరూపముల సృష్టులును గలవు. ఇవి కేవలము అనుభవైకగోచరములు, స్థూలదృష్టికి కనిపింపవు, ఏల యన అవి దేశకాలాతీతములు. అమరశిల్పములను మన కిచ్చి చనిన వరిష్ఠకళాకారులను దలంపుడు. అనంతరకాలాలవారు ఆ శిల్పములను బట్టి తత్కర్తల ప్రతిభను లక్షణములను వ్యాఖ్యానింతురు. మైకేలాంగీలో మన కిచ్చిన చిత్తరువులును చెక్కడములును అతని దృక్పథమును, అతని ఆశయాల తీరుతెన్నులను మనకు తెలుపును. శశిమహారాజు విషయమును అట్లే. ఇటికరాళ్ళతో సున్నముతో నిర్మాణములు కావించువాడు కాడు శశిమహారాజు. ఆయన మగువలయు మగవారియు డెందములలో చిరస్థాయులైన విలువలను రూపొందించినాడు. వేలకొలది ప్రజల డెందములలో ఆయన నూతనాదర్శమును నూతనజీవితలక్ష్యమును పాదుకొల్పినాడు. అవి పరమహంస శ్రీరామకృష్ణ శ్రీ వివేకానందస్వాముల జీవితోపదేశాలలో వెలువరింపబడినవే. దక్షిణభారత దేశమునకు ఆయన అందజేసిన నూతనసందేశము గురుదేవుని సందేశ మిదే—

ఆత్మనో మోక్షార్థమ్
జగద్ధితాయ చ.

* పాండిచేరి ఉపరాష్ట్రపతిగారు 29-7-73-వ తేది శశిమహారాజ జయంతి సమావేశమున కావించిన యుపన్యాసము.

"మానవసేవద్వారా ఆత్మహితము". మానవుల లౌకిక నైతిక సాంస్కృతిక పారమార్థిక సంక్షేమమునకైన ఈ తహతహపాటు సర్వ వేదాంతసారము. ఈ యాశయ మున్నచో జీవితమే లౌకికప్రవృత్తులే మతధర్మములుగ నగును. ప్రతిపనియు ఉపాసన మగును. హిత మైన దానిని మహితములైన వానిని అంటి పెట్టుకొనుటే ఎల్లప్పుడు దక్షిణభారతసంప్ర దాయము. కావున శశిమహారాజ ప్రబోధ మున కిచ్చట సర్వామోదము కలిగినది. దాని ఫలితమే మఠమున కింతటి అభివృద్ధివ్యాప్తులు గలుగుట. ఇందువలన శశిమహారాజు ఆధ్యా త్మికముగ అధిరోహించిన శిఖరములు మహో న్నతము లనుటయు నాటిన పునాదు లతిసుదృ ఢము లనుటయు స్పష్టము. నరనారాయణ సేవయే పరమపురుషార్థప్రాప్తికి ఆయన అవ లంబించిన అత్యమోఘసాధనము.

ఆయనకు 'రామకృష్ణానందస్వామి' అను పేరు ఏర్పడుట యాదృచ్ఛికసంభవము కాదు. శ్రీరామకృష్ణుని విశిష్టానుగ్రహఫలమైన ఆనం దము గలవాడు రామకృష్ణానందస్వామి. అహం కారమును మొదలంట తుడిచివేసికొని గురు దేవాంకిత జీవిత సర్వస్వు డగుటే ఆ యానంద మునకు కారణము. గురుదేవునొద్ద ఆయన నేర్చిన మతధర్మము సేవాధర్మమే. గురుదేవుని శ్రీచరణముల నాశ్రయించిన శిష్యులందఱు ఆధ్యాత్మికదిగ్దంతులే. వారిలో సర్వశ్రేష్ఠుడు శ్రీ వివేకానందస్వామి. కాని గురుదేవునికి పరిచర్యచేయుటలో సర్వాధికుడు రామకృష్ణా నందస్వామి. కడపటగురుదేవుడు వ్యాధిగ్రస్తుడై యుండగా ఒకసంవత్సరకాలము శశిమహారాజు ఆయనకు చేసిన పరిచర్య సర్వస్వార్పణము. దానిని గుర్తించియే 'రామకృష్ణానంద' నామ మునకు తనకంటె శశియే అధికసమర్థు డని ఆ నామమును వివేకానందస్వామి ఆయనకు పెట్టెను.

సాక్షాత్కారమార్గమును కబీరు యోగి ఈలాగు పేర్కొనియున్నాడు—

ఘుఙ్ఘట్ కె పట్ ఖోల్ రీ
తో హ్ రామ్ మిలేఙ్గే

(చూపు నడ్డగించుచున్నది యొక తెర
దాని దీయ రాము గనగ గలవు.)

అటువంటి సాధకుడే శశిమహారాజు. ఆయన పారమార్థికసూక్ష్మావబోధశక్తిని సాధించెను. అందుకు అడ్డంకులైన బాహ్యాడంబరములను త్రోసిరాజనెను. ప్రార్థనద్వారా, సంకీర్తన ద్వారా, ధ్యానముద్వారా, సేవద్వారా ఆయన సదా భగవత్సాక్షాత్కారమునే లక్షించెను. ఆయన జీవితమునకును అనుష్ఠాన మునకును ఇదే లక్ష్యము. పనులు చేయుచున్న ప్పుడును, విశ్రమించునప్పుడును, గుడిలో పూజచేయుచున్నప్పుడును, దరిద్రరుగ్ణదీన నారాయణసేవ చేయుచున్నప్పుడును ఈ యన్నింటిద్వారా తాను పరమాత్మనే అన్వే షించుచుండె ననుట ఆయన దృఢాధ్యవ సాయము. ఇం దాయన క్రొత్తదారి నేర్పఱ చెను, ప్రజలచే తమ వర్ణములను విస్మరింప జేసెను. పూజాసమయమున అంద ఱొక్క వర్ణము వారే అనదగినట్లు కలసిపోయెడివారు. తరువాత అనేకసంవత్సరములకు కదా మన రాజ్యాంగ వ్యవస్థ వర్ణమతనిరపేక్షముగా అందఱ సమానత్వమును నిబంధించినది!

మద్రాసులో రామకృష్ణానందస్వామి పనిని అంకురార్పణమునుండి ప్రారంభించెను. పరమ హంస శ్రీరామకృష్ణుని యథార్థశిష్యుడైనందున ఆధ్యాత్మికసాధనకు పూనుకొన్నట్లుగా దక్షిణ భారతదేశమున శ్రీరామకృష్ణ వివేకానందో

ద్యమునకు పునాదులు వేయుటకు పూనుకొనెను. ఆయన ఎన్నో చిక్కులను అనుభవింపవలసివచ్చె ననుట మీ కందఱికిని బాగుగ తెలిసినవిష యమే. కాని ఆయన ధీరముగా, ఉత్సాహ ముతో, కలవరపడని మనస్సుతో అన్ని చిక్కులను ఎదుర్కొనెను. నాటి, మాతృ ప్రేమతో ఆయన పెంచిన మొలక ఇప్పుడు బ్రహ్మాండమైన వృక్షముగా ఎదిగియున్నది. అందు ప్రతిశాఖయు సంఘసేవాకార్యక్రమ కేంద్రమే. అది అనుష్ఠాన వేదాంతమునకు లక్ష్యము. విద్యారంగమున నర్సరిస్కూళ్లు మొదలుకొని ఎమ్. ఏ. ఎమ్. ఎస్. సి. పట్ట ములకు తర్ఫీదు చేయు కళాశాలలవఱకు గల రామకృష్ణ సేవాసంఘమువారి వివిధ కార్యక్రమ ములు ఇంజినీరింగు తరగతులు విద్యార్థులయు విద్యార్థినులయు విడుదులు, ఆరోగ్యరక్షా సేవలు సంఘసేవా కేంద్రములు. వీని యన్నిటను శశి మహారాజు నాదర్శము ముద్రితమై యున్నది. మానవసేవ మాధవసేవయే, జీవసేవ శివ సేవయే అనుతే ఆ యాదర్శము.

ఇంతే కాదు. తాను తర్ఫీదుచేసి మంత్రోప దేశము చేసిన శిష్యులందుగూడ ఆయన తన ముద్రవేసెను. శిల్పినేర్పు శిల్పమున కననగు నట్లుగా రామకృష్ణానందస్వాముల పారమార్థిక జీవితలక్షణములను ఆయనచేత తర్ఫీదుపొందిన శిష్యులలో చూడవచ్చును. అటువంటి ఆయన శిష్యవరేణ్యులలో శర్వానందస్వామి అనెడి ఒకరితోడి పరిచయభాగ్యము నాకు కలిగినది. శర్వానందస్వామి అనంతరకాలమున ఈ మఠ మున అధ్యక్షపదవినిసైత మలంకరించెను. శర్వానందస్వామియే ఇట్లు వాక్రుచ్చెను. "నా పారమార్థిక జీవితమునకు విశిష్టరీతిలో రూపేర్ప ఱచి ఆధ్యాత్మికపు విలువలనుగూర్చిన నా పరిజ్ఞానమును ప్రగాఢ మొనర్చినది శశిమహా రాజే." కావున శశిమహారాజు జోక గొప్ప నిర్మాత. ఈ సంస్థ యనెడి భవనమును పునా దులనుండి నిర్మించుటే కాక తన యాధ్యాత్మి కపు టింద్రజాలముచేత స్వకీయచారణాశ్రితు లైన శిష్యుల శీలములకు రూపుదిద్దెను.

రామకృష్ణానందస్వామినిగూర్చి ఈలాగు నిర్విరామముగా చెప్పుకొనుచునే పోవచ్చు, సంపుటములు సంపుటములుగా గ్రంథములు వ్రాసి పెట్టవచ్చు. నలువదెనిమిదేండ్ల ఆయన జీవితమున విశేషము లంత నిండుగ నున్నవి. ఆయన మానవాళిహృదయములను చూఱ గొన్నవా డనిన చాలును. అటువంటివారిని గూర్చియే వివేకచూడామణిలో శ్రీ శంకరా చార్యులవారు ఇట్లు ప్రస్తుతించిరి :

నిర్ధనోపి సదా తుష్టోఽ
ప్యసహాయో మహాబలః
నిత్యతృప్తో ఽప్యభుఞ్జానోఽ
ప్యసమ స్సమదర్శనః. (543)

"అతడు నిర్ధను డయ్యు సదా సంతుష్టుడు; అసహాయు డయ్యు మహాబలుడు, భుజింపనివా డయ్యు నిత్యతృప్తుడు, అసము డయ్యు సమ దర్శనుడు" అటువంటివాడు శశిమహారాజు.

సన్న్యసించి భక్తిసేవాసంపన్నములును భగవదర్పితములునగు జీవితములు గడపువారికి మనము మహాదరముతో ప్రణమిల్లుదుము. కాని ఈ సేవాసంఘాదర్శముల సాధించుటకై సన్న్యసించి సాధువర్గమున జేరు భాగ్య మంద ఱికి లభింపదు. నిజమునకు పరమహంస శ్రీరామ కృష్ణుడును శ్రీ వివేకానందస్వామియు "జీవిత ములో మీ స్థానముల విడువకుడు మానవ ప్రేమద్వారా వేదాంతలక్ష్యమగు భగవ త్ప్రేమవంకకు మీ జీవితముల నడపు"డని ప్రజలను హెచ్చరించిరి.

కాబట్టి మన పదవి ఏమైనను, మన స్థాన మేమైనను మన చిన్నరంగములలో మనము రామకృష్ణానందస్వాములను లక్ష్యముగ నుంచుకొని అనుకరింపవచ్చు.

ఇట్టి ఉత్సవముల కిందుచేతనే సార్థకత. జాన్ డ్రింక్వాటరు కవీంద్రుని సూక్తి యిట ఉదాహరణార్హము. (అనువాదము)

ధీరసముదాత్తచిత్తుల, వారి దైన
మొక్కవోనట్టి దృష్టి, నమోఘమహిమ
నభినుతించి భజించి కొండాడు మనము
పడయ గందుము నిక్క మాపాటి మహిమ.

శశిమహారాజు జయంతి మహోత్సవము ద్వారా వైరాగ్యముచేతను సభ కిక ప్రజాసేవచేతను పరిపుష్టమైన ఆ శ్రద్ధను, ఆత్మనిగ్రహమును, ఉదాత్తపారమార్థికాదర్శపరతను స్మరింప ప్రయత్నించుచున్నాము. ఆయా దర్శముల సాధింప ఆయన యాశీస్సులే మనలను సమర్థులనుగ జేయును గాక.

శ్రీగురుమహారాజుకు జై.

# దేవతాపూజ

## శ్రీమత్ప్రవ్రాజిక వరదాప్రాణ

పగలంతయు నానావిధ కార్యభారముచే క్లాంతమైన మానవుని మనసు పవిత్ర మగు గోధూళివేళ తనంతకు తానే శాంతమై అంతర్ముఖ మగును. మన పవిత్ర భారతదేశమున ప్రతి యింటిలో దినాంతమున తులసికోటవద్దనో ఇంటి గుమ్మమువద్దనో సంధ్యాప్రదీపము వెలిగించి మనసార భగవంతుని ప్రార్థించుట, భజనచేయుట అనాదినుండి వచ్చుచున్న ప్రథ. ఆ ప్రథయే నేటికిని ప్రపంచపు నలుమూలల అలముకొనియున్న శ్రీరామకృష్ణ మఠ కేంద్రములలో హారతి, భజన ద్వార నడచుచున్నది. ఆ గంభీర ఘంటానాదముతో మధురమైన భజనతో కూడ జరుగు హారతిని సందర్శించిన వారికి అదొక మఱువరాని అనుభూతి. ఎన్నిమార్లు గాంచినను ప్రాతబడని అనుభూతి. రామకృష్ణ మఠమువారి పూజాపర్వములైనను అంతే. ఆ గాంభీర్యము, ఆ పవిత్రత భక్తులహృదయమును స్పృశించి తీరును. సందేహము లేదు. అంతటి సర్వాంగసుందరమైన పూజాపద్ధతిని ప్రారంభించిన దెవరా యని పరికించి చూచినచో శ్రీరామకృష్ణుల శిష్యులలో నొకరైన 'శశిమహారాజు' అని తెలియును. ఆయనే రామకృష్ణానందస్వామి.

చిత్తశుద్ధితో, పరమప్రీతితో దేవతాపూజ గావించినచో మృణ్మయమూర్తి, చిన్మయమూర్తి యగును. సరియైన దేవతాపూజ ఎట్లాచరింపవలయు నని తెలుపుటకు ఈ యుగములో శ్రీశ్రీరామకృష్ణులు కాళికాపూజారులై సాధన ప్రారంభించిరి. వారి శిష్యులును, అతులనీయ గురుభక్తి, గురుసేవద్వార స్వీయగురుభ్రాతల నుండి 'రామకృష్ణానందు' లని నామకరణము పొందినవారునగు శ్రీ శశిమహారాజుగారి పూజా విశిష్టత వేఱుగా తెలుపవలయునా? వారి జీవితములోని ప్రతి చలనము, ఘటనయే నిరంతర దేవతా పూజ.

క్రీ.శ. 1886 సం॥లో శ్రీరామకృష్ణుల అంతర్ధానము తరువాత శశిమహారాజు వారి అస్థిభస్మావశేషమును ఒక పాత్రలో సంగ్రహించి నిత్యసేవ, పూజ చేయ దొడగిరి. శ్రీరామకృష్ణులు తమ అంతర్ధానము తరువాత భౌతిక దేహమును గంగాతీరమున స్థాపింపవలసినదని కోరియుండిరి. ఆ సమయమున ధనాభావమువలనను, గంగాతీరమున తగు ఆస్థానము దొరకనందువలనను తాత్కాలికముగ అస్థికలశము కాశీపుర భవనములోనే ఉంపబడెను. గృహిభక్తుడును వయోజ్యేష్ఠుడును అగు రామచంద్రదత్తు గంగానదికి దూరముగ, కలకత్తా నగరములోని కాంకుర్గాచి అనుచోట ఉన్న భవనములో పై కలశమును స్థాపించుటకు స్థిరపఱచెను. చేతిలో కాసు కాని ఉండుటకు చోటు కాని లేని పసివారగు శ్రీరామకృష్ణుల శిష్యబృందమున కేమియు తోచలేదు. అపుడు శశిమహారాజు రహస్యముగ భస్మాస్థులలోని అధిక భాగమును వేఱొక కలశములో చేర్చి బలరాంబాబు ఇంటికి చేర్చెను—ఆ ద్వితీయ కలశమే 'ఆత్మారాము' డను పేర బహుసంవత్సరముల తరువాత వివేకానంద స్వాములచే గంగాతీర బేలూరుమఠమున స్థాపింపబడి నేటికిని నిత్యపూజలు పొందుచున్నది—

శ్రీరామకృష్ణుల అంతర్ధానము తరువాత కాశీపురభవనమున ఉండుటకు వారిశిష్యులకు వలను కాలేదు. బాడుగ ఎక్కువ. ఆ ధనము నిచ్చువా రెవరు? అటువంటి కష్టసమయములో సురేంద్రనాథమిత్ర అను భక్తుని సహాయముతో దక్షిణేశ్వరమునకు దగ్గరగా ఉన్న 'బరానగర్' (వరాహనగరము) అను చోట నెలకు 10 రూ॥ బాడుగతో ఒక పాత ఇంటిలో స్థావరమేర్పడెను. అది 'భూతముల ఇల్లు' అని ఆ వాడలో ప్రసిద్ధి! అటువంటి ఇంటి వసతి విశేషములు సులభముగనే ఊహించుకొనవచ్చును. ఎన్ని ప్రతికూల పరిస్థితులైనను మహాదేవుని అనుచరులగు భూతగణమువలె నిర్భయులై జగత్తును తుచ్ఛముగ భావించి తరుణసన్యాసులు ఆ పాడుపడిన ఇంటిలోనే పూజ, పాఠము, ధ్యానము, శాస్త్రచర్చ, సంకీర్తన అవిరామముగ జరిపెడువారు.

పూజ జరుపు భారము సంపూర్ణముగ శశిమహారాజులది. ఆ ఇంటిలో వేఱొక గదిలో వేదిపై పటమును, భస్మకలశమును స్థాపించి శశిమహారాజు ఏకాగ్రచిత్తముతో, పరమభక్తితో శ్రీ గురుమహారాజులకు నిత్యపూజ, సేవ చేయ నారంభించిరి. వారి దినకృత్యములో ఏమాత్రము మార్పుగాని ఏమఱపుగాని ఉండెడిది కాదు.

వారు చేయు హారతి, ఒక దేవదుర్లభ దృశ్యము. ఆ హారతిని సందర్శించిన భాగ్యముగల వారి అందఱిలోను భగవద్భావము ఉద్దీపితమయ్యెడిది. గౌరవర్ణమైన వారి ముఖమండలము భావోద్వేగముచే రక్తవర్ణమై చూపరులకు సాక్షా దగ్నిదేవుని వలె కనిపించెడిది.

బరానగర మఠమున భగవత్సేవయందు నిమగ్నులైన శశిమహారాజులకు తీర్థపర్యటన చేయుటకుకూడ ఇచ్ఛ గల్గెడిది కాదు. తన జీవితస్వామి నిత్యసేవకు భంగము కలుగు నని చివరకు తీర్థరాజమైన కాశీక్షేత్రమును కూడ వారు సందర్శింపలేదు. ఆవిధముగా దినములు గడచి దాదాపు దీర్ఘ ద్వాదశవర్షములు కావచ్చెను.

వివేకానందస్వామి క్రీ.శ. 1897 లో భారతదేశమునకు దిగ్విజయులై తిరిగివచ్చిన తరువాత మద్రాసులోని భక్తులతో "మీయొద్దకు ఆచారపరాయణుడైన నా గురుభ్రాతలలో నొకరిని పంపెదను ఆతడు కేవలము నిష్ఠాపరాయణుడే

కాదు. పూజ, జపధ్యానములో, పాండిత్యములో అద్వితీయుడు.'' అని చెప్పియుండిరి. స్వామిజీ యొక్క ఈవిశేష ప్రశంసకు అధికారి మరెవరో కారు. మన శశిమహారాజుగారే!

కలకత్తాలోని మఠప్రాంగణము వదలని వారైనను శశిమహారాజు పరమ శ్రద్ధా ప్రీతిభాజనుడగు స్వామిజీ ఆదేశమును శిరసా ధరించి, కని విని యెఱుంగని దక్షిణభారతదేశపు చెన్నపట్టణమునకు పయనించిరి.

క్రొత్త - పరిసరములలో ఎదుర్కొనవలసిన సమస్యలకు అంతులేదు. ఐస్హౌసులో ఉన్న రోజులు స్వల్పవిరాళముతో ఏదో ఒక విధముగ గడచిపోవుచుండెడివి. కావున వారే పాచకులు, వారే భృత్యులు. ఉదయపు నిత్యకర్మలు, పూజ ముగించిన తరువాత పట్టణములోని వివిధ ప్రాంతములలో ధర్మసంబంధమగు పాఠములు చెప్పవలసి వచ్చెడిది. తిరిగి వచ్చిన తరువాత మరల మఠములోని కార్యక్రమము యథావిధిగ ప్రారంభమయ్యెడిది. అన్ని కష్టముల లోను వారు భగవంతునిపై అచంచల భక్తి విశ్వాసములతో అహంశూన్యులై ఉండువారు. ఎల్లపుడు ఒక అలౌకికాధ్యాత్మిక రాజ్యములో నివసించెడువారు. శ్రీరామకృష్ణులు వారికి కరతలామలకమువలె ప్రత్యక్షముగ గోచరమగుచున్నారని వారి హావభావములలో కార్యకలాపములలో వ్యక్తమయ్యెడిది.

శశిమహారాజులు ఉత్తమాధ్యాత్మికానుభూతిగల మహాపురుషు లయినను ధర్మసాధనయందు అతిసామాన్య విషయమునుకూడ తు. చ. తప్పక పాటించువారు. ఆ జీవనము భగవద్గీత విష్ణుసహస్రనామము పారాయణము చేయనిదే జలపానము చేయరు. శ్రీ గురుమహారాజుల పూజ ముగింపనిదే ప్రసాదాన్నమువినా మరేయన్నము గ్రహింపరు.

సాధారణముగ 'భక్తుడు' అనిన ఛాందసుడు, కాల్పనిక భావోద్రేకుడు, చింతాశీలత లేని వ్యక్తి యని చాలమంది విశ్వాసము. అట్టివారు శ్రీరామకృష్ణానందుల జీవితమును పరీక్షించి చూచినచో, భక్తితోసహా వారు అసాధారణ ధీశక్తి, భారతీయ, పాశ్చాత్యసంస్కృతి సమ్మిళితమగు జ్ఞానము. అగాధ పాండిత్యము, బుద్ధిమత్త, బ్రహ్మజ్ఞానముగల సన్న్యాసప్రవరు లని తెలిసి కొందురు.

వారి పాండిత్యమునకు, ప్రత్యక్షానుభవమునుండి వెలువడుచున్న వాగ్ధాటికి ఎదిర్చి నిలుచుటకు ఆనాటి మహామహా పండితులకు కూడ అసాధ్యముగ నుండెను. క్రైస్తవమతమును గుఱించి వారికి బోధించుటకై వచ్చిన పాదిరీలు జీససుక్రైస్తు త్యాగమునుగూర్చి వారి దగ్గఱ నుండియే నేర్చుకొనవలసి వచ్చెడిది. ఇస్లామును గూర్చి వారి కున్న, జ్ఞానమును తెలిసికొని కొందఱు ముసల్మానులు 'పైగంబర్' అని వారిని పేర్కొనెడి వారు.

బహుముఖప్రతిభావంతమైన వారి జీవితము మానవకోటికి కటికచీకటిలో త్రోవతప్పిన నావికునకు ధ్రువతార వంటిది.

# గణపతి ప్రశంస

## శ్రీ కూరెళ్ల రామనరసింగరావు

అది కైలాసప్రాంతము. అచ్చట రెండు ఏనుగులు మిక్కుటముగు మక్కువతో విహరించుచుండెను. అవి సామాన్యసామజములవలె ఐరావతముగూడ వానికి సరి రాదు. వాని దివ్యకాంతి వెండికొండకే నూత్నశోభ గూర్చుచుండెను. అవి వాస్తవముగ దంతావళములు గావు. పార్వతీపరమేశ్వరు లారూపమున క్రీడించుచుండిరి. ఘటనాఘటనసమర్థులగు ఆ పురాణదంపతులు ఏమి చేయలేరు?

కాలచక్రము తిరిగినది. పార్వతి గర్భవతి నైతి నని గ్రహించెను. అందులకు సంతసించుటకు మారుగ ఆమె ఆందోళన మంద సాగెను. శివుని చెంత కేగెను. వినమితాంగియై యిట్లు విన్నవింప దొడగెను. ''పశుపతీ, జరిగిన దంతయు నీకు దెలియును. జరుగబోవునది నీకు దెలియును. ఈ స్థితియందు నా కొక ఏనుగుపిల్ల పుట్టున ట్లున్నది. పుట్టినబిడ్డను జూచి బంధువులు, స్నేహితులు, మెచ్చుకొనవలెగాని రిచ్చపడి వేళాకోళములు చేసిన నే భరింపలేను. లక్ష్మియు, వాణియు నన్ను జూచి వెక్కిరింతురు. దేవతాకాంతలు పరిహసింతురు. మునిభార్యలు నవ్వుదురు. బ్రహ్మయు, విష్ణువు మిమ్ముగూడ ఎగతాళి చేయుదురు. ప్రమథగణములు, అమరులు వెనుదిరిగి నవ్వుకొందురు. ఇదంతయు ఆలోచింపుడు. నాపై దయ జూడుడు. ఈ చిక్కు తప్పింపుడు. మీరు పూనుకొనిన చేయలేనిది లేదు. ఊరుకొనిన, నే నేమి చేయగలను? ఏమి అనగలను?

సర్వాంతర్యామియగు సర్వేశ్వరుడు సర్వమంగళ వేదనను గ్రహించెను. ''సాధ్వీ, నీవూరక భయపడుచుంటివి. నీబిడ్డ ఏనుగుపిల్లమాత్రము కాదు. కాని విధినిర్ణయమున జేసి, ఆ బాలునకు ఏనుగు మొగముండును. అయిన నేమి? అతడు అఖిలలోకబుద్ధిశాలియు, ప్రభావశాలియు నగును. ముల్లోకములలో నెల్లరచేతను అతడు పూజ లందును. ఏ వ్రతమైన, ఏ క్రతువైన, ఏ శుభకార్యమైన ఆరంభించుటకు ముందు లోకు లాతని నర్చింతురు. నన్ను కాని, నారాయణుని కాని పూజింప నుపక్రమించువారు నీ పుత్రుని తొలుత యథావిధి కొలిచి, తత్ప్రసాదము బడయునటుల నేను శాసించెదను. అట్లు చేయనిచో వారి పూజలు నిష్ఫలము లగును. ఇంకొక విశేషము. ప్రమథగణముల కత డధిపతి యగును. నీకు గలుగు నందను డట్టి జగద్విఖ్యాతమూర్తి యగును. అతని జూచి సకలభువనావాసులు జయ జయ ధ్వాను లొనర్తురు; పుష్పవర్షము గురియింతురు. సంతోషసాగరమున దేలియాడుదురు. అట్టి ప్రతిభావంతునకు నీవు మాతృదేవతవు; నీవు ధన్యురాలవు. అనవసరచింత వదలుము. చూలాలికి విచారము దగదు. నిశ్చలస్వాంతవై యుండుము. నీకు శుభం బగు గాక'' అని హామీ డానతిచ్చునరికి, గిరికుమారి, పరమానందభరిత యయ్యెను.

గజాననుడు జన్మించెను. దినదినప్రవర్ధమాను డగుచుండెను. ప్రతిగృహమున నతని ధ్యానశ్లోకములే; ప్రతిచోట, అతనిపూజలే. ప్రతిదినము అతని అర్చనములే. ప్రతివ్యక్తి అతని భక్తుడే. వినాయకునకు లభించుచున్న గౌరవమును జూచినంత కుమారస్వామి కీర్ష్య పుట్టెను. ''ఏనుగుమొగము, ఎలుకవాహనము గల లంబోదరునకు ఇంత ఆధిక్యమా? ఆరు మొగముల వేల్పు నేను. అతిసుందరముగ నుండు నెమిలి నా వాహనము. దేవసైన్యమునకు నేను

నాయకుడను. వీనిని పాటింపక, అతని తొలుత పూజించి, తరువాత నన్ను పూజింతురా ఎల్లరు? ఈ విపరీతమునకు కారణము నెఱింగెదను. ఇంతే యున్నతస్థాన మెవ్వరితని కిచ్చిరి?'' తద్విషయము సమగ్రముగ తెలియగోరి స్కందుడు తలిదండ్రుల సన్నిధి కేగెను. వారి దగ్గఱ కత డేగుసరికి గణపతి యక్కడే యుండెను. షడాననుని రాకకు కారణము మృడానీశుడు గ్రహించెను. అంత కాలకంధరుడు వినాయకుని జూచుచు నిట్లనెను. ''నీకును, నీ సోదరునకును ఒకపందెము పెట్టెదను. అందు నెగ్గినవారికి నే నొక బహుమతి యిచ్చెదను. మూడులోకములను జుట్టివచ్చుటయే పందెము. ఇది సుముహూర్తము. మీ వాహనముల నాయత్తపఱచి బయలుదేఱుడు. ఎవరు మీలో ముందుగ వత్తురో చూచెదను.'' విభుని పలుకు లాలించి, పార్వతి మందహాస మొనర్చెను ఒకక్షణమైన ఆగక, కుమారుడు మయూరముపై మహోల్లాసమున బయలుదేఱెను. గణేశుడు మూడుసారులు ఉమామహేశ్వరులకు ప్రదక్షిణ మొనర్చి వారి పాదములకు పునఃపునః ప్రణామము లొనర్చి తన యాసనమున హాయిగ గూర్చుండెను. సుబ్రహ్మణ్యుడు అభ్రవీధిని అహోరాత్రములు అదే పనిగ ఏడేండ్లు పయన మొనర్చి కైలాసమునకు తిరిగి వచ్చెను. భవానీ శంకరుల పార్శ్వమున స్థిమితముగ నాసీనుడై యున్న గజాస్యు నతడు జూచి విస్మితు డయ్యెను. పురధ్వంసి తారకధ్వంసిని, జూచి ''నాయనా, నీకీ లోకపర్యటనము ఏడేండ్లు పట్టినది. కాని నీ సోదరుడు ఏడునిమిషములలో ఈ పర్యటనము మూడుసారులు చేసెను. మీ యిరువురిలో ఎవరు ఘనులో నీవే తెల్పుము'' అనెను. అయ్యది అసంభవమని కార్తికేయుడు తలంచుచుండెను. వినాయకు డంత, ''క్రౌంచభేదీ, సకలలోకములు మన మాతాపితరుల లోనే గలవు. నీ వది గుర్తింపక అనవసర ప్రయాస మందితివి. నా కా విషయము తెలియును. వారి చుట్టు దిరిగి నేను కృతకృత్యుడ నైతిని. బహుమతి కెవ్వరు అర్హులో నీవే చెప్పుము'' అని స్మితముఖు డయ్యెను.

మేనల్లుని జూచుటకై విష్ణు వొకసారి హిమగిరి కేతెంచెను. అతని విలాసముల జూచి కేశవు డానందపరవశు డగుచుండెను. ఆ సమయమున హేరంబుడు చటుక్కున చక్రి చేతిలోని చక్రమును దీసి తన నోటిలో బెట్టుకొనెను. అది చక్కని భక్ష్యపదార్థ మనుకొనెను గాబోలు! గోవిందుడు మేనల్లుని బాల్యచేష్టకు నిశ్చేష్టు డయ్యెను. దుష్టభయంకరము, శిష్టశుభంకరము నగు సుదర్శనమును తాకుటకైన నెవ్వరు సాహసింపరు. అట్టి తన కైదువు నా పసివాడు తినివైచు నేమో యని మధుసూదనుడు భయపడెను. ఏ విధముగనో అతని నవ్వించిన, చక్రము బైట పడు నని యూహించి, శ్రీధరుడు గుంజీలు తీయ మొదలుపెట్టెను. అదిచూచి గజాననుడు పకాలున నవ్వెను. చక్రము క్రిందబడెను. త్రివిక్రము డద్దాని గ్రహించెను; ఏకదంతుని మహత్త్వమున కలరి, అతని నాశీర్వదించెను. ఈనాటికిని దక్షిణాపథమున, గణపతికోవెలలో గుంజీలు భక్తులు తీయుచుందురు. ఈ ఆచారమున కాదిపురుషుడు పురుషోత్తముడు.

కాలము ముందుకు సాగినది. రావణుడు త్రినేత్రునిగూర్చి తపము జేసెను. అతనిభక్తికి, దీక్షకు, నిష్ఠకు, తపమునకు, ధవళగిరివాసి సంతసించి, వరముల నీయ, నతనికి ప్రత్యక్షమయ్యెను. వింశతిభుజుడు విరూపాక్షునకు మ్రొక్కి ''మహాదేవా, నీ దర్శనమున ధన్యుడనైతిని. నీ కృపకు నేను కృతజ్ఞుడను. పెక్కు

వరములు నే గోరను. ఒక్కటి చాలును. నాకు మృతి లేకుండ జేయుము.'' ''ఇట్టి వరము నీ వడుగుటయు, నే నిచ్చుటయు యుక్తము కాదు. యుక్తము కానిది ఆర్యులు మెచ్చరు. నా ఆత్మ లింగము నీ కిచ్చెదను. అది నీయొద్ద నున్నంత కాలము, మృత్యువు నిన్ను చేర లేదు. నీ వద్దాని భద్రముగ నీకడ నుంచుకొనుము. నీ కది భద్రము గూర్చును.'' రుద్రు డిట్లు సెలవిచ్చి ఆత్మలింగ మతని కొసంగెను. గర్వస్వాంతుడై, ధ్వాంతచరుడు లంకాభిముఖు డయ్యెను. ఈ యుదంతము దేవత లెరిగిరి; ఉన్న పాళమున ఏకదంతుని చెంత కేగిరి. ''స్వామీ, ప్రపంచమునకు ప్రళయమాసన్నమైన ట్లున్నది. అసలే రావణుడు దుర్వారబలశాలి. ఇప్పుడు వానికడ ఈశ్వరలింగముకూడ నున్నది. వా డింక అవధ్యుడు. వాడు బ్రతికియున్నంత కాలము. సృష్టికి బ్రతుకుటకు వీ లుండదు. ఏ విధముననో ఆ లింగము వానికి లేకుండ జేయ వలెను. ఆ కార్యము నీకుగాక ఇతరులకు సాధ్యము కాదు'' అని విన్నవించిరి. సురలకు సహాయము చేసెద నని కరిముఖుడు వచించెను. గణపతి బ్రహ్మచారివేషము ధరించి దైతేయుని వెంట బయలుదేరెను. కొంతదూరము పోవుసరికి, రావణునకు కాలకృత్యము దీర్ప వలసి వచ్చినది. అతడు విషమస్థితిలో జిక్కెను. ఈశ్వరలింగమును తన కడ నుంచుకొన లేడు. క్రింద నుంచ లేడు. దేహబాధ ఎక్కు వగుచున్నది. ఏమి చేయుదునా యని ఇటు, అటు చూచెను. మాయావటురూపముననున్న మహాకాయు డతని దృష్టిని బడెను. 'బ్రతుకు జీవుడా' యని ''బాబూ, నీ కెంతయు పుణ్యము. ఈ పవిత్రలింగము కొద్దిసేపు చేతబట్టుకొమ్ము. దేహబాధ తీర్చుకొని వచ్చి, దీనిని నేను దీసికొందును. నే వచ్చు వఱకు దీనిని బట్టుకొని యుండుము కాని క్రింద నుంచకుము'' అని వేడెను. వినాయకు డందుల కంగీకరించెను; కాని యొక్కషర తుంచెను. ''మూడు సార్లు నిన్ను పిల్చెదను. ఆలోపున నీవు రావ లెను. ఈ లింగమును గ్రైకొనవలెను. లేనిచో దీని నిచ్చట నుంచి నా దారి నే బోయెదను.'' నక్తంచరుడు కొంచెము దూర మేగెనో లేదో, దంతిముఖుడు 'రావణా, రావణా, రావణా' యని పిల్చి, లింగమును క్రింద నుంచి యంతర్ధాన మందెను. దశాస్యుడు మగిడి వచ్చుసరికి శంభులింగము భూస్థాపిత మయ్యెను. అత డెంత యత్నించిన నయ్యది కదల లేదు. దైవప్రతికూలతకు అతడు దాసోహ మని వికలహృదయముతో నిజపురమున కేగెను. విబుధులు, విఘ్ననాథుని అసాధారణప్రజ్ఞ నభినందించిరి. గోకర్ణ క్షేత్రమునకు ఆవిధంబున ఆఖువాహనుడు కారణభూతు డయ్యెను.

హేరంబునిదీవి శేషంబు దెలుపు నిం కొక ఇతిహాసము. ఈశానుడు 'ఉబ్బు లింగ' డనుట ఎల్లరకు తెలియును. భక్తుల పొగడ్తల కుబ్బిపోయి, ముందువెనుక లరయక, వారి కోర్కెలత డొసంగును. సోమనాథేశ్వరుని ఒక్కపరి దర్శించిన చాలు, వారికి స్వర్గ మొసంగెద నని కపర్ది యనెను. తత్ఫలితముగ, తండోపతండముగ, భూజనులు సోమనాథుని జూచి సురలోకమున కరుగుచుండిరి. కొద్దిదినములలో త్రిదివము మర్త్యులతో కిటకిటలాడుచుండెను. నిర్జరులకు నిలువ నీడ లేకుండెను. మానవులు దేవలోక మాక్రమించిన, విబుధు లెక్కడ తల దాచుకొందురు? వియన్నదీప్రవాహమునుమించి జనసమూహ మచ్చటికి వచ్చుట రోజురోజునకు పెరిగి పోవుచుండెను. ఆ అపాయమునుండి బయటపడు ఉపాయముగూర్చి సుపర్వు లాలోచించిరి. మృత్యుంజయు నిర్దేశము నెదిరించుటకు ఎవరు సమర్థులా యనియు, ఎవరు నడుము

కట్టుకొని ముందుకు వత్తురా యనియు, దీర్ఘముగా విత్కర్షించి 'పుత్రాదిచ్ఛేత్ పరాజయం' అను సూక్తి జ్ఞప్తికి రాగానే, వక్రతుండుని కడ కేగి వారి విపత్తుగూర్చి మొఱ వెట్టిరి. కొలిచెడివారికి కొంగుబంగారమైన గుజ్జువేల్పు వారి కభయహస్త మిచ్చెను. సోమనాథాలయ ముఖద్వారముకడ, గణపతి బాలతపసి వేషం బున నొకయుదయము గూర్చుండెను. ఆలయమునకు వచ్చుచున్న భక్తులతని ముఖకాంతిని జూచి ఆశ్చర్యభరితులై అతనికి నమస్కరింప దొడగిరి. వారల నుపలక్షించి యమ్మహా మహుడు సాదరముగ నిట్లనెను. "మీకు స్వర్గము కదా కావలెను. మరణించినపిదప స్వర్గమో, నరకమో, ఎవరికి దెలియును? పోయి తిరిగివచ్చినవా రెవరును లేరు. బ్రతికియుండగనే సౌఖ్య మనుభవింపవలెను. మృతునకు సుఖ మేల! పదవి యేల! మీ రేది కోరిన అది మీ కొసగెదను. చేరువ నున్న భాగ్యమును వీడి, కన్పడని స్వర్గసౌఖ్యమునకు బరుగెత్తుట యేల?" అందున్న ఒక వృద్ధుని బిలిచి, అత డడుగకుండగనే, అతని నొక యువకుని గావించెను. ఆ విచిత్రము జూచి జను లెల్లరు విఘ్నపతిని వివిధములగు కోర్కెలను గోరిరి. వా రడుగుటయే తడవుగ వారి కది లభించుచుండెను. వాంఛితార్థము లభించిన తోడనే, వారు సంతృప్తులై యిండ్లకు బోవ జొచ్చిరి. సోమనాథ దర్శనమునకై యెవ్వరు పోరైరి. ఈవిధముగ సుపర్వుల అభీష్టమును కుంజరాననుడు ఒనగూర్చెను. వా రతని బహుముఖముల స్తుతించిరి.

గజాస్యుని భక్తరక్షణాపేక్ష దెలుపు నింకొక కథ. ఔవ్వైయారు అను నొక మహాభక్తురా లుండెను. ఆమె యెన్నియో మహాగ్రంథముల రచించి భక్తకోటికి ముక్తిమార్గమును జూపెను. 'వినాయక అహావల్' అను గ్రంథరాజ మాయశస్విని ధీసముద్భూతమే. ఆమె యొకనాడు వినాయకు నర్చించుచుండెను. ఆ సమయమున సుందరమూర్తియు, చేరరాజును కైలాసమునకు కాలకంఠుని దర్శింప నరుగుచుండిరి. వారు ఔవ్వైయారి ఇంటికడ ఆగి తమతో కైలాసమునకు ఆమెనుగూడ రమ్మనిరి. అట్లు వచ్చిన వారివాహనములపై ఆమెను దీసికొని వెళ్లెద మనిరి. కాని ఆమె అంగీకరింప లేదు "విఘ్నపతిపూజకు విఘ్నముగూర్చి విశ్వేశ్వరుని విలోకింప వెడలుట యుక్తము కా" దనెను ఆమె. వా రిరువురు ధవళగిరి కేగిరి. పూజానంతరము, ఔవ్వైయారు ఇంక తా నెటుల నిటలనయనుని పాదసన్నిధి కేగ గలనా యని మథనపడ సాగెను. ఆ సుగుణఖని మనోవేదన మహాకాయుడు గ్రహించెను; తన తొండముతో నామెను పైకెత్తి, ఒకక్షణములో తన జననీ జనకుల చరణపీఠముకడ నామె నునిచెను. సుందరమూర్తియు, చేరరాజు ఇంకను మార్గమధ్యముననే యుండిరి. మోదకప్రియుని మహిమ వాగతీతము.

సర్వవిఘ్నహరం దేవం, సర్వవిఘ్నవివర్జితమ్
సర్వసిద్ధిప్రదాతారం, వందేహం గణనాయకమ్.

# పరిప్రశ్నము

## [జిజ్ఞాసువుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానందస్వాముల జవాబు]

ప్రశ్న : సామాన్యజనులకు తమబిడ్డలయందున్న ఆసక్తికిని రాధునందు మాతృశ్రీ కుండిన ఆసక్తికిని ఏమిభేదము ?

జవాబు : స్పష్టమైన భేదము ఉంది. ఆ ఉభయమునకును, ప్రేమస్వరూపమందు ప్రేమావిస్తారమందు ప్రేమప్రేరకమందు భేదం ఉంది. మాతృశ్రీకి రాధునందు సంగం ఉండినది అనడానికి సందేహం లేదు. కాని ఆ సంగం కారణంగా మాతృశ్రీకి ఇతరులందున్న ప్రేమలోగాని వారి క్షేమమునుగూర్చిన ఆమె అక్కఱలోగాని తగ్గుదల ఇంచుకైనా లేదు. సామాన్యప్రజలకు తమవారియం దెంత అక్కఱ ఉంటుందో ఇతరులయెడ అంత ఉదాసీనత ఉంటుంది. కాని రాధుపై మాతృశ్రీ కుండిన ప్రేమ, ఆమె ప్రేమహ్రదమును ఎండగొట్టలేదు. ఇతరులపైని ఆమె అక్కఱను లవలేశమైనా తగ్గించలేదు. సజ్జనులకు, దుర్జనులకు, ఉన్నతులకు నిమ్నులకు, కలవారికి పేదవారికి– అందఱికి తాను అమ్మననెడి భావం ఆమె భావి జీవితానికి సదా ఆధారంగా ఉండేది. యావజ్జీవం అలాగే ఉండింది. ఆమె నాశ్రయించినట్టి ప్రతి ఒక్కరికీ, ఆమె తనసొంత అమ్మ అనిపించెడిది, వారియం దామెకు అక్కఱయూ అనుతాపమునూ నిండుగా ఉండేవి. ఆమె విశ్వప్రేమకు నిరూపకములైన సంభవాలు ఆమె జీవితచరిత్రంలో సమృద్ధిగా ఉన్నాయి. వానిని అన్నిటిని ఇక్కడ వ్రాయడానికి పత్రికలో చోటు చాలదు. జిజ్ఞాసగల భక్తులు 'శారదాదేవి జీవితచరిత్ర' అనేగ్రంథాన్ని చదివి తెలిసికోవచ్చు.

రాధునందు మాతృశ్రీకి కలిగిన ప్రేమకొక అంతరార్థం ఉంది. సామాన్య జనుల లౌకిక ప్రేమకు అటువంటి అంతరార్థం లేదు. శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరం తాను జీవించియున్నందు కొక ప్రయోజనం అమ్మకు కనిపించ లేదు. ఆమె మనస్సు నానాటికి సంగరహితము అంతర్ముఖము కాజొచ్చింది. ఐహికజీవితం సాగాలంటే దానికి కేంద్రగతంగా ఒక ఆశ ఒక కాంక్ష ఉండాలి. ఏదేనొక బాహ్యవస్తువునందు అక్కఱ ఉండాలి. గురుదేవు డున్నన్ని నాళ్లు ఆయనకు సేవచేయడం అమ్మ జీవితానికి కేంద్రంగా ఉంటూ వచ్చింది. ఆయన నిర్యాణమైన పిమ్మట అతివిసుద్ధమైన అమ్మమనసు కిక అవలంబం లేక పోయింది. కాబట్టి ఆమె మనస్సు క్రమక్రమంగా సమాధిలోనే నిమగ్నమౌతూ దేహత్యాగానికి దారితీయజొచ్చింది. కాని ఆమె నిర్వహించవలసిన అవతార ప్రయోజనం ఒకటి ఉంది. అది నెఱవేఱుటకు ఆమె దేహం ఉండాలి. ఆ దైవనిర్ణయంచేత అమ్మ జీవితచరిత్రలో రాధుకు ప్రవేశం కలిగింది. అమ్మ అక్కఱకొక కేంద్రం అవలంబం లభించింది. అది ఎంతైనా అవసరం. రాధు మాతృశ్రీకి మేనగోడలు. (=తమ్ముని కూతురు). తమ్మునిభార్య పిచ్చిది. కాబట్టి రాధు ఎంతో నిరాదరమునకు కష్టాలకు గుఱి అయింది. ఒక నాటి సాయంకాలం అమ్మ గాఢధ్యానంలో నిమగ్నమై ఉండంగా, శోచనీయమైనరాధు పరిస్థితి ఆమెమనస్సున తటాలున తళుక్కుమని మెఱిసింది. గురుదేవు డామె నిట్లాజ్ఞాపించెను— "ఆమెను అవలంబంగా చేసికో. ఆమె యోగమాయ". (వివరములకు 'శారదాదేవి చరిత్రంలో 13-వ ప్రకరణం చూడండి.) ఈసంగతులు జ్ఞప్తిలో ఉంటే రాధుమీద అమ్మకుండిన

ప్రేమయు సామాన్య లౌకికుల ప్రేమయు ఒక తీరువి అని ఎవ్వరూ అనరు.

మాతృశ్రీ మహాసమాధి కించుకముందే రాధుమీద ఆమె కుండిన ప్రేమయొక్క నిజమైన ప్రత్యేకత స్పష్టమైనది. మాతృశ్రీ రాధును తన పర్యవేక్షణలోనికు తీసుకొని పెక్కు సంవత్సరాలైనాయి. అమ్మ వ్యాధిగ్రస్తయై మంచం పట్టింది. ఆమె మరణంలో పర్యవసింపనున్న వ్యాధి అది. అప్పుడు అమ్మ రాధును గురించి అడగడం మానివేసింది. "జయరాంబటికి పో" అన్నది రాధుతో. రాధు బిడ్డ వచ్చి అమ్మపాన్పుపై కూర్చుంది. అమ్మ "ఎత్తుకొని పొండి ఆ బిడ్డను" అన్నది. రాధుపట్ల ఆకస్మికంగా ఈలాగు మారారే ఎందుచేత అని అడిగితే అమ్మ చెప్పింది: "నా మనస్సును రాధు నుండి ఉపసంహరించుకొన్నాను. ఈ మనసిక ఆమెయందు సక్తం కాజాలదు." ఈ వార్త విని శ్రీశారదానందస్వామి — "ఆమె మనస్సును దేహంవంకకు లాగిపట్టేది ఇక నేమీ లేదు. కాబట్టి అచిరకాలంలో అమ్మ శరీరత్యాగం చేస్తుంది" అన్నారు.

తలంచుకొన్నప్పుడు మనస్సును ఉపసంహరించుకోగల శక్తి అమ్మ ప్రేమకు గల విశిష్ట లక్షణం. లౌకికుల ప్రేమ ఇట్టిదికాదు. "రాధు పట్ల మీకు గల ఈ అక్కఱను వివరించ"మని ఒక శిష్యుడు అమ్మను నిక్కచ్చి చేసి అడుగగా అందు కామె చెప్పిన జవాబు విషయాన్ని స్పష్టతరం చేస్తుంది. ఆమె చెప్పిన జవాబు: "పరతత్త్వాన్ని ధ్యానించే వారి మనస్సు అతి సూక్ష్మమూ అతి పవిత్రమూ అవుతుంది. దేని గురించి తలంచినా వారి తలంపు ప్రగాఢమైనదిగ ఉంటుంది. ఆ తలంపు 'సంగం'గా కనబడుతుంది. మెఱుపుదీగెలు మెఱిసినప్పుడు, ఆ మెఱుపులు అద్దాలలో ప్రతిఫలిస్తాయే కాని కొయ్యతలపులలో ప్రతిఫలించవు" కాబట్టి లోకులసంగమునకున్న అమ్మ సంగమునకున్న కారణాలు వేర్వే అనడం స్పష్టమైంది. సంకల్పిస్తే ఆమె తన మనస్సును రాధునుండి సునాయాసంగా ఉపసంహరించుకో కలిగింది అనడం గుర్తించితే, లౌకిక సంగంగా పైకి కనిపించే ఆమె సంగపు ప్రత్యేకత మనకు సుగ్రహం అవుతుంది.

# వార్తలు - విశేషాలు

## మూడు జయంతులు

శ్రీరామానుజ జయంతికి శ్రీశంకరజయంతికి శ్రీ బుద్ధజయంతికి సంబంధించిన పౌరమహాసభలు మదరాసు శ్రీరామకృష్ణమఠ వివేకానందహాలులో వరుసగా 1973-వ సంవత్సరం మేనెల 6-వ తేదినాడు 13-వ తేదినాడు 20-వ తేదినాడు జరిగాయి. మఠాధ్యక్షులైన శ్రీమత్తపస్యానందస్వాములే మూడు సమావేశాలకున్నూ అధ్యక్షత వహించారు.

6-వ తేదినాడు శ్రీ ఎ. ఎన్. పరశురాంగారు శ్రీరామానుజులవారినిగూర్చి ఆంగ్లంలో ఉపన్యసించారు. ఉపన్యాససంగ్రహం: ఆచా

ర్యులవారి సుదీర్ఘ జీవితకాలం ఉత్తేజకరములైన సంభవాలతో నిండింది. సర్వక్షేత్రాలకు ఆయన కావించిన యాత్ర, విశ్వజనీనమైన ఆయన సందేశము జంకుగొంకులు లేక ఆయన చేసిన గొప్పమార్పులు, నిమ్నజనోద్ధరణమునకై అమోఘముగా ఆయన కావించిన యేర్పాటు, అనాలోచిత విశేషాశేష లోకవాత్సల్యంతో సంతారకములైన అర్థములను ఆయన అందఱికి వెదజల్లిన తీరు, దేవస్థానములను ఆయన సనాతనధర్మప్రచార కేంద్రములుగా దిద్దితీర్చినరీతి, అర్చావతారాల ప్రాముఖ్యమును ఆయన నొక్కి వక్కాణించిన విధము—ఇవన్నియు శ్రీరామానుజులవారు ఆచరణాత్మ సంస్కార విధాత లనన్ని చక్కని నిర్మాత లనిన్ని సూచిస్తాయి. అత్యధికసంఖ్యాకులకు ఉపజీవ్యమైన నీతిశాస్త్రాన్ని తత్త్వశాస్త్రాన్ని దాయధనంగా ఆయన ప్రసాదించాడు. తరువాత శ్రీకుమారవాది ఎస్. రామానుజాచార్యులు తమిళంలో ఉపన్యసిస్తూ శ్రీరామానుజులవారు నిజంగా దయాసముద్రులని, ఆయన చరిత్రలో ఈ విషయాన్ని నిరూపించే సంభవాలు ఎన్నో ఉన్నాయని తెలిపి ఆయన జీవితచరిత్రను సంగ్రహముగా చెప్పి విశిష్టాద్వైతసిద్ధాంతహృదయమును సుగ్రహం చేశారు. శ్రీమత్తపస్యానంద స్వాములు అధ్యక్షోపన్యాసంలో చెప్పిన సంగతులు:- శ్రీరామానుజులవారి ప్రభావం ఈ నాటికిన్నీ సజీవం, హిందువులకు నూతనోత్సాహమును భక్తిసంపదను వారు ప్రసాదించారు. శ్రీవైష్ణవం ఎల్లప్పుడునే యావద్భారతదేశోద్యమం. అది తత్త్వశాస్త్రనిష్ఠకు కావలసిన భావోద్వేగం కలిగిస్తుంటుంది. శ్రీరామానుజులవారు గొప్పమతప్రచారకులు ఆయన స్వానుభవాలను ఇతరులకు చూపలిచ్చి, 'భక్తి' 'ప్రపత్తి' మార్గాలను కలపారు. భక్తిప్రవణులను ఉత్తేజపఱచడంలో రామానుజసంప్రదాయం అమోఘమైనది.

మే నెల 13-వ తేదినాడు శ్రీ వి. హెచ్. సుబ్రహ్మణ్యశాస్త్రులవారు శ్రీ శంకరాచార్యుల సందేశాన్ని గూర్చి మొదట కాసేపు సంస్కృత భాషలో ముచ్చటించి వెంటనే తమిళంలో మహోపన్యాసం చేశారు. ఆ ప్రసంగసంగ్రహం:- శ్రీ శంకరాచార్యులు చేసిన ఘనకార్యాలలో క్రియాశక్తి లీలకంటె జ్ఞానశక్తిలీల ఎక్కువగా కనబడుతుంది. నిర్గుణోపాసనకు అందించే మెట్టు సగుణోపాసన. స్వర్గాదిభోగాలు అశాశ్వతాలు ముముక్షువులు కోరేది నిత్యానందం. కాబట్టి వేదాంతమే అందుకు సాధనమైన మతం. శంకరాచార్యులలో సంకుచితత్వం లేదు. ఆయన షణ్మతస్థాపనాచార్యులు. వేదాంతం అన్ని మతాలను తనలో ఇముడ్చుకొనేదే కాని దేనికిని విరుద్ధమైనది కాదు'', అద్వైతసిద్ధాంతాన్ని వివరిస్తూ డాక్టరు టి. ఎమ్. పి. మహాదేవన్ గారు ఆంగ్లంలో ఉపన్యసించారు. ఈలా గన్నారు—''చరిత్రలో ఒక క్లిష్టకాలంలో శ్రీ శంకరులు హిందుసిద్ధాంతాన్ని కాపాడినారు. వారు అవతరించింది ఎనిమిదో శతాబ్దంలో, దేశం కల్లోలమయంగా ఉండిన కాలం అది. శ్రీ శంకరులు తమ ముప్పైరెండేండ్ల అల్పజీవితకాలంలో హిందూదేశాన్ని సంస్కృతిని నిలబెట్టారు. ఆత్మేతరమును అధఃకరించి, ఆత్మోత్కృష్టతను చాటారు, అద్వైతం అన్ని మతాల సమన్వయమే కాని ప్రత్యేకసంకుచిత మతం కాదు. శ్రీశంకరులు దేన్ని విమర్శించినా దాన్ని శుద్ధిపఱచడానికే కాని నిర్మూలించడానికి కాదు'' శ్రీమత్తపస్యానంద స్వాముల సమాపనోపన్యాస సంక్షేపం :— శ్రీరామకృష్ణుడు ఆదర్శాద్వైతి. ఏ మతం

తోను ఆయనకు విరోధం లేదు. శ్రీశంకరులు అద్వైతసిద్ధాంత ప్రతిపాదకు లగుటే కాక, దేశం నాలుగు మూలలలో నాలుగు మఠాలు స్థాపించి, దేశైక్యమును కూడా సాధించారు. అప్పటి కాలపరిస్థితులలో శ్రీశంకరులు భారత దేశాన్ని అతిక్రమించి వెలుపలికి పోజాలక పోయినా అద్వైత సిద్ధాంతానికి దేశ కాలావధులు లేవు.''

1973-వ సంవత్సరం మే నెల 20-వ తేది నాడు డాక్టరు పి. కె. సుందరంగారు బుద్ధదేవునిగూర్చి తమిళంలో ఉపన్యసించారు. బుద్ధుని సిద్ధాంతాలను సరళరీతిలో వివరించి, బౌద్ధమత చరిత్రను దెలిపి ఈలాగన్నారు—''బుద్ధు నుపదేశాలలో హిందూ సిద్ధాంతానికి విరుద్ధాంశములు లేవు. శ్రీశంకరులు అనంతర కాలబౌద్ధ ప్రతిపాదనలను ఖండించారు కాని, బుద్ధుని దూషింప లేదు. బుద్ధుడు నిరాశావాది కాడు. మానవప్రవృత్తులను ఆకళించుకొని ఆయనచూపిన పరిష్కారాలు నిరాక్షేపాలు'' సభాధ్యక్షులు శ్రీమత్తపస్యానంద స్వాములు ఈలాగు వ్యాఖ్యానించారు—''వైదిక క్రతుకలాపాలకు ప్రజలు తిరుగబడుతుండిన కాలంలో బుద్ధదేవు డవతరించాడు. ఆయన చారిత్రక మహాపురుషు డనడం నిర్వివాదం. ఒక అర్ధ శతాబ్దకాలం ఆయన విశ్వశ్రేయానికై శ్రమించాడు. అన్ని ప్రమాణాలకంటె మానవునికి తన అంతఃకరణం అధిక ప్రమాణం కావాలి అనడం ఆయన అభిప్రాయం. ఆయన ఏం చెప్పినా నచ్చచెప్పేవాడేగాని ఖండన నిరసనలకు పూనుకోడు. బౌద్ధసంఘంలో వర్ణవిభేదం పాటించ బడదు. దేశచరిత్రలో బౌద్ధయుగం అంటూ ఒకటి లేదు. బుద్ధునిప్రభావం దేశ చరిత్ర అంతటా వ్యాపించి ఉన్నది. 'మర్మ' మతాలను బుద్ధుడామోదించడు. సంఘంలో స్త్రీల స్థానాన్నిగూర్చిన ఆయనవైఖరి చాల ఆధునికం. బౌద్ధమతాన్ని ఆమోదించనివారు కూడా బుద్ధదేవుని గౌరవిస్తారనడం విశేషం''.

# గ్రంథ పరిచయం

## శ్రీశంకరభగవత్పాద విరచిత భజగోవిందస్తోత్రము (మోహముద్గరము)

విద్వాన్ కలవకుంట కృష్ణమాచార్యుల అనువాదపద్యాలతో కూడినది. కరీంనగరం జిల్లా మెట్టుపల్లి భక్తియోగసాధనసమితివారి ప్రచురణం. పాకెట్టు సైజు, పుటలు 32, వెల 25 పైసలు. ఎడమవైపుపుటలలో మూలశ్లోకాలును కుడివైపుపుటలలో అనువాదాంధ్రపద్యాలును ముద్రితములై ఉన్నవి. విశ్వజనీనమైన మూలగ్రంథాన్నిగూర్చి అతిశయోక్తిగా ఏం చెప్పగలం? అనువాదం అన్యూనాతిరిక్తంగా హృదయంగమంగా ఉంది. అనుబంధంగా నవగ్రహస్తోత్రమును మూలమును మాత్రము జతపఱచి ప్రకాశకులు ఈ గ్రంథాన్ని స్పృహణీయతరం చేశారు.

## శ్రీమన్నారాయణీయము

### 1 వ భాగము

మూలము : శ్రీనారాయణభట్టాద్రి. అనువాదకులు : శ్రీమాన్ శ్రీభాష్యం వేంకట నృసింహభాష్యకాచార్యులు.

ఇది ఆర్షసాహితీవారి 36 వ ప్రచురణ. మూలగ్రంథప్రాశస్త్యమును దాని ఆవిర్భావ క్రమమును వివరించు శ్రీరంగము వేంకటరమణమూర్తిగారి 'గురువాయూరప్పన్' అను వ్యాసము ఇందుపోద్ఘాతముగా నిబంధింపబడి యున్నది. ఈ ప్రథమభాగంలో ఐదువశకాలు తాత్పర్యసహితములుగా ఉన్నవి. శ్రీ వ్యాస భగవానుని మహాభాగవత గ్రంథమునకు సంక్షిప్తరూపమై వక్తృవిషయ వైలక్షణ్యములచే కేరళదేశంలో మహాభాగవతంతో సమానంగా ఆదరింపబడుతున్న యీ ఉత్కృష్ట గ్రంథరాజమును ఆంధ్రుల అనుభూతి కందించు ఆర్షసాహితివారి సముద్యమమునకు స్వాగతం.

వలయువారు "ఆర్షసాహితి సనాతన ధర్మ ప్రచారసంస్థ, 27-7-18 ఆమంచివారివీధి, విజయనగరం-2." అను విలాసానికి, 30 పైసల పోస్టేజిస్టాంపులు పంపి ఈ గ్రంథమును పడయవచ్చు.

## ప్రాచీన భారతవర్ష మహర్షుల చరిత్రలు

రచయిత : ఆర్షకవిశిరోమణి విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు ఎం.ఏ. ఆంగ్లభాషోపన్యాసకులు, పీఠికాపురరాజ ప్రభుత్వకళాశాల, ప్రకాశకులు బి. వి. అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ. మొదటిభాగము పుటలు 182 వెల రూ. 3/- రెండవభాగము పుటలు 230. వెల రూ. 3/-

మొదటిభాగంలో అగస్త్యుడు, అత్రి, అష్టావక్రుడు, ఋష్యశృంగుడు, కపిలుడు, కశ్యపుడు, గౌతముడు, చ్యవనుడు, జమదగ్ని, దత్తాత్రేయుడు, దధీచి, దుర్వాసుడు అను పన్నిద్దరు ఋషుల కథ లున్నాయి. రెండో భాగంలో నారదుడు, పరాశరుడు, భరద్వాజుడు. భృగువు, మార్కండేయుడు, యాజ్ఞవల్క్యుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, వ్యాసుడు, శుకుడు అను పదుగురు ఋషుల కథ లున్నాయి. మొదటిభాగం ఇప్పటికి ఆరు ముద్రణములను ద్వితీయభాగం ఐదు ముద్రణములను బడసినవి. ఈ ముద్రణముల సంఖ్యయు విద్వచ్ఛ్రేష్ఠుల పలువుర ప్రస్తుతులును ఈ గ్రంథాల విలువకు వీనియందలి ప్రజాదరమునకు తార్కాణములు. ఇంత ప్రసిద్ధినందిన ఈ గ్రంథాల కిప్పుడొక 'పరిచయం' వ్రాయడం, సూర్యుని చూపడానికి దివిటీ ఎత్తడం వంటిదే. ఆర్షవిజ్ఞానఖనియైన భారతదేశంలో భ్రమ ప్రమాదవిప్రలిప్సాది దోషదూషితులగువారి అసాధువాదములచే వంచితులై పెడదారిని పరుగులెత్తుచున్న యీ కాలపు యువకులకు కనువిప్పు కూర్పగల అనర్ఘజీవితగాథల యీ సంపుటీద్వయమునకు మా అభినందనాంజలిని సమర్పిస్తున్నాము. ఈ కథలందలి ధారావాహియైన సుందరమధురాంధ్రగద్యశైలి ప్రత్యేకంగా ప్రశంసార్హం.

ప్రభాకర్

# శారదా పసంగములు

కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీ రామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శయోగినియు, ఆదర్శ మాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేట తెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. [illegible]

# అనుష్ఠాన వేదాంతము

అనువాదకులు : కీ॥ శే॥ తత్త్వానందస్వాములవారు

ప్రపంచమున వివిధరంగములందు విహరించువారికి వేదాంతమెటుల అనుష్ఠాన యోగ్యమో కండ్లకుగట్టినటుల శ్రీ వివేకానందస్వాములవారీ యుపన్యాసములందు స్పష్టీకరించి యున్నారు.

(129+6 పుటలు) తృతీయ ముద్రణము వెల : రూ. 1-25

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది ! !

# "భారత యువ జనులారా!"

అనువాదకులు :

కీ. శే. తత్త్వానందస్వాములవారు

భారతయువజనులను ప్రబోధించి శ్రీ వివేకానందస్వాములవారొసగిన ఉపన్యాసముల సంపుటీకరణము! ఒక్కొక్క ఉపన్యాసము భావగాంభీర్యము గలిగి యలరారుచున్నది.

274 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము ! వెల : రూ. 3-00

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(121+4 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహము హృదయ సన్నిహితమునైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్త్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-50 | శ్రీ కృష్ణవాణి | 0-50 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-50 | బుద్ధ ఉవాచ | 0-50 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-50 | క్రైస్తు సూక్తిమాల | 0-50 |

మహమ్మదు సూక్తిమంజరి 0-50

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

## కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీ దేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు     దివ్యమగు ద్వితీయ ముద్రణము     వెల : రూ. 2-50

---

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్ర పాఠకులకు అమూల్య తరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడి ఉన్నాయి. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుటలు.

* అయిదవ సంపుటము క్యాలికోగాని అట్టబైండుగాని లేదు.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

తొమ్మిది సంపుటాలు విక్రయానికి సిద్ధంగా ఉన్నాయి.

**ఖరీదు :** అట్టబైండు సెట్టు రు. 45-00 లు   క్యాలికోబైండు సెట్టు రు. 58-50 లు.

ఒక్కొక్క సంపుటం :

అట్టబైండు రూ. **5-00**   క్యాలికో రూ. **6-50**

(పోస్టేజి ప్రత్యేకము)

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - **4.**

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ ౧౯౭౩ - సెప్టెంబరు : ప్రమాదీచ - భాద్రపదము సంచిక ౩

## విషయసూచిక

: 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే
ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో 6 రూపాయలు ; సింహళములో 8 రూపాయలు.
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో రూ 5 లు, సింహళములో రూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే
తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో రూ 5 లు, సింహళములో రూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.

2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.

3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను 6$\frac{1}{4}$% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.

4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.

5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.

6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కమ్మల కద్దుకొని ప్రచురిస్తారు.

7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల: రూ. 7-50**

# భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(121+4 పుటలు) ఆఱవ కూర్పు వెల: రూ. 1-50

ఇట్లు వ్రాయుడు: **మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**




'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ } ౧౯౭౩ – సెప్టెంబరు : : ప్రమాదీచ – భాద్రపదము { సంచిక ౩


శ్రీః

# కనకధారాస్తవము


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య


ఆమీలితాక్ష మధిగమ్య ముదా ముకున్ద మానన్దకన్ద మనిమేష మనఙ్గతన్త్రమ్
ఆకేకరస్థితకనీనికపక్ష్మ నేత్రం భూత్యై భవే న్మమ భుజఙ్గశయాఙ్గనాయాః.

| | |
|---|---|
| ఆమీలిత + అక్షం | కన్నులుమూసికొనియున్న |
| ముకున్దం | శ్రీమహావిష్ణువును |
| ముదాఅధిగమ్య | సంతోషముతోచేరి |
| ఆనన్దకన్దం | ఆనందమూలమై |
| అనిమేషం | రెప్పపాటులేనిదై |
| అనఙ్గతన్త్రం | కామపరవశమై |
| ఆకేకరస్థిత | అర్ధనిమీలితదశలోనున్న |
| కనీనికపక్ష్మ | నల్లగ్రుడ్డురెప్పవెండ్రుకలుకలదైయున్న |
| భుజఙ్గశయ + అఙ్గనాయాః | శేషశయనునివల్లభయగుశ్రీమహాలక్ష్మియొక్క |
| నేత్రం | నయనము |
| మమభూత్యైభవతు | నాకుసంపత్ప్రదమగుత |

"తల్లీ అను సంబోధనము బ్రహ్మమునకే. ఏల యన, తల్లి ఆత్యంతికప్రేమకు లక్ష్యము ... అమృతసరసి అమృతసరసియే, అందు మునుగు ప్రాణి చావదు, చావులేనివాడగును."

—శ్రీరామకృష్ణుడు.

# విూ గ డ త ల క లు

పేదతికము సంపన్నత అనేవి నిజమునకు మనోవైఖరులు. పేదతికానికీ సంపన్నతకూ, భౌతికమైన కొలత ఏమీాలేదు.

ఒక కథ వినండి——ఒక డుండే వాడు. సంఘ మానాలనుబట్టి చూస్తే అతడు చాల పేదవాడు. కాని తన్ను ఎవరైనా 'పేదవా' డని అంటే అతడు ఒప్పుకునేవాడు కాదు. ఆలా గనిన వాణ్ణి నోరు మూాయించే జవాబు చెప్పేవాడు. 'నేను పేదవాణ్ణి గాను: అజ్ఞానంచేత విూరు ఆలా గంటున్నారు' అని చెబుతుండెడివాడు. సాదా దుస్తులే ధరించేవాడు, నిరాడంబరంగా భోంచేసేవాడు, ఆత్మకు సంతృప్తికరంగా నిత్య కృత్యములు నెఱవేర్చేవాడు, వేతనం హెచ్చిం చమని ఎప్పుడుకాని తకరారు చేయడు, తనకు లేని వస్తువులు లేనందుకు దుఃఖంచడు. మనకు అది లేదే ఇది లేదే అను తలంపు అతని మన స్సులో ఏన్నడూ లేదు. కాని అదృష్టం అత నికి అంతప్రతికూలంగా ఉన్నందుకు, అంతటి ఆర్జవసంపన్నుని దైవం 'గాజులబేరం భోజనా నికి సరి' అన్న పరిస్థితిలో పెట్టి ఉన్నందుకు ఇత రులు జాలి చెంది 'అయ్యో పాపం' అని అను కునేవారు. పొరుగూరిలో ఒక ప్రసిద్ధ కోటీశ్వరు డుండేవాడు. అతడు ఏ వర్తకం ఏ వ్యాపారం చేసినా, అందువల్ల అపారధనలాభం కలు గుతూ అతని సంపద నానాటికి మఱింతగా హెచ్చిపోతుండినది. కాని అతని లోభం ఉత్కటకోటికం. తనసంపదను ఇంక నింకను వర్థిల్ల జేసుకునేందుకై అతడు సదా తహతహ పడుతూ ధనం గడిస్తుండినాడు. పైని చెప్పిన పేదవాడున్నూ ఈ కోటీశ్వరుడున్నూ ఒకనాడు కలుసుకోవడం తటస్థించింది. సంపదచే కన్ను గానని ఆతనితో ఈ పేదవాడు "ఏమండోయి, విూకంటె నేను అధి సన్నుణ్ణి, తెలుసా' అని అడిగాడు. ఆ కోటీశ్వరుడు "నీ మాటలు వెఱ్ఱిమాటలు. నీవు చెప్ప నెంచినదానిని వివ రించు" అని బదు లడిగాడు. "నాకున్న డబ్బు నాకు చాలు, నీకున్న డబ్బు నీకు చాలదు. ఇది స్పష్టమైన విషయమే కదా" అన్నాడు పేద వాడు.

సంపదకు నిజముగా నున్న విలువను తెలియ జేసే కథ మఱొక టుంది. సంపదలో మునిగి తేలే జమీాందా రొక డుండేవాడు. రత్నకుండ లాలు కనకహారాలు రత్నఖచితములైన మురు గులు ఉంగరాలు మొదలైన నగలను సదా ఒంటినిండుగ ధరించి ప్రేక్షకులచే పొగడించుకో వలె ననడం అతని ఉబలాటం. ఒకనా డాతడు మహాదర్పంతో ఠీవిగా వీధిని నడిచిపోతుండి నాడు. వీధిద్రిమ్మరి యొకడు చెంతకు వచ్చి ఱెప్ప వ్రాల్పక ఆ సంపన్నుని చూచాడు, అత నిని ప్రదక్షిణించి, చూడడమే పనిగా అతని నగల మెఱుగులను కాసేపు చూచి "మహా శయా, నీ ఔదార్యానికి నీ వితరణకు నేను ఎంతయు కృతజ్ఞుణ్ణి" అన్నాడు. 'ఎందుకు నీ కృతజ్ఞత' అని సంపన్ను డడిగాడు, "సొమ్ము లను నగలను ఇంత ధారాళంగా నీ విచ్చినందు' కని ఆ వీధిద్రిమ్మరి చెప్పాడు. "ఏ నగను గాని నీకు నేను ఇవ్వలేదు, ఇవ్వ తలపెట్టను లేదు. ఇకను నీకు నే నిచ్చింది ఏమి ఉంది' అని సంప న్నుడు మరల ప్రశ్నించాడు. వీధిద్రిమ్మరి చెప్పిన జవాబు: "నాకు నగలు అక్కఱ లేదు, నీవు ఇచ్చినా నేను పుచ్చుకోను. ఆ నగల మెఱుగు లను నీవు నన్ను చూడనిచ్చావు. నీవు సైతం చేసేది ఆ నగలను చూచుకోవడమేగా. మాటి మాటికి చూచుకొని మురిసిపోతుంటావు. ఐతే వానిని నీవు చూడగలిగినంతకంటె ఎక్కువ బాగుగా నేను చూడగలిగాను. ముందువైపు నుండి చూచాను, వెనుకవైపునుండి చూచాను, కుడితట్టునుండి చూచాను, ఎడమతట్టునుండి

చూచాను. అంతే కాదు. వాని కాపుదలను గూర్చిన చింత సుంతయైనను లేక చూచాను. నిన్ను సదా కరగదీసేది ఆ చింతేగా! నగలు నీవి; వాని అనుభవం నీకంటె నాకే ఎక్కువ''.

'సన్తోష ఏవ పురుషస్య పరం నిధానమ్'
'తనివియే నరుని మహానిధాన మిలను'

అను సూక్తి ప్రాచీనము, జ్ఞానసంభృతము. మనం ఇచ్చిపెట్టుకున్నంత, దైవం మనకు ఇస్తాడు. అందుకు అసంతృప్తి చెందడం దైవము నెడ మన కృతఘ్నతయే. కోరిందంతా పడయ గాంచడమే జీవితానికి పరమమంగళం అని ఒకానొకడు ఒక యోగితో చెప్పాడుట. ఆ యోగి ఈలా గన్నాడు, ''కోరిందంతా పడయ గాంచడంకంటె, ఏ కోరికయు లేకుండడం అధిక శుభం. 'నాకిది లేదు, అది లేదు, ఇది కావాలి, అది కావాలి' అని కోరకూడదు. మనకు సంతుష్టి నీయగలిగింది మన మనస్సే కాని వెలుపలి వస్తుసంపద కాదు. 'డయోగినీసు'కు తొట్టియే పెద్దదట, అలెక్సాండరుకు సర్వప్రపంచమైనా చిన్నదే నట. ఆస్తి సొంతదారుకు మాత్రమే కాక, ఇతరులకున్నూ లాభదాయకంగా ఉండాలి. ఇతరుల కిది ఎంత లాభదాయకంగా ఉంటే అందుకు అంత గర్వించవచ్చు. పేదఱికానికి కూడా గర్వపడవచ్చు. ఎందుకంటే ఐహికవస్తువులను కాపాడుకునే బాధ్యత నది తగ్గిస్తుంది. నీవు కోరుకునే దానికంటె, దేవుడు తానుగా నీకు ఇచ్చేది నీకు అత్యంత శ్రేయస్కరం. సంతుష్టి స్వతస్సిద్ధమైన సంపద అని, భోగానుభవాలు మనం సృష్టించుకునే దారిద్ర్యమని మహావివేకి సాక్రటీసు వాక్రుచ్చాడుట.

ఆధునిక జీవితంలో మానవుల మనస్సులనుండి సంతుష్టి అపహృతమైనది. ఏది దాన్ని అపహరించిందో చెప్పలేము. సంతుష్టి లేకపోవడమే కటిక పేదఱికం. నష్టమైపోయిన సంతుష్టిని మళ్ళీ కలిగించుకోవడమే మానవునకి తరణోపాయం. శ్రీరామకృష్ణునిజీవితచరిత్రాన్ని మెలకువతో చదివి చూడండి. ఆధునిక మానవునికి దాపురించిన మనోవ్యథలకు అమోఘచికిత్సలను ఆయన అనేకసందర్భాలలో సూచించిఉన్నాడు. అధరచంద్రసేను శ్రీరామకృష్ణుని భక్తులలో ఒకడు. అతడు గురుదేవుని పలుపర్యాయములు కలుసుకొని ఉన్నాడు. స్పృహణీయమైన డిప్యూటి మాజిస్ట్రేటుపదవిలో అత డుంటుండినాడు. గురుదేవుడు అధరసేనునింటి కప్పుడప్పుడు పోవడం కద్దు. గురుదేవు డధరసేనునికి అమూల్యములైన ఉపదేశాలు చేసిఉన్నాడు. ఒకప్పుడు అధరసేనుడు దక్షిణేశ్వరానికి చాలదినాలు రాకుండినాడు. తర్వాత వచ్చినప్పుడు గురుదేవు డతనిని అడిగాడు. ''మునుపు వస్తున్నంత తఱచుగా ఇప్పుడు నీవు రావడం లేదు. కారణమేమి?' బడికి సంబంధించి, ఇతరసంస్థలకు సంబంధించి పెక్కుసమావేశాలకు తాను పోవలసి వచ్చినందువల్ల రాజాలక పొయ్యానని అతడు చెప్పాడు. 'ఓహో, వాటిని గమనిస్తూ మమ్ము పూర్తిగా మఱచిపొయ్యావన్న మాట...... చూడు, ఇవి అన్నీ మాయలే. నీ బడి నీ సమావేశాలు నీ కార్యాలయం ఇవన్నీ నశ్వరాలు. దేవు డొక్కడే సత్యం. తక్కిన సమస్తమూ మిథ్య!'' కల్కత్తాపురపాలకసంఘమునకు ఉపాధ్యక్షపదవిని తా నధిష్ఠించాలి అని అధరుని అభిలాష. వెయ్యిరూపాయల జీతం గల పదవి అది. చాలా ఆత్రంతో అందుకై ఆశపడ్డ వారిలో అధరుడున్నూ ఒకడు. కల్కత్తానగరంలో ఉన్న పలువురు ప్రముఖుల సిఫారసు సంపాదించడానికి అతడు ప్రయత్నించాడు. తనకు సాయపడుమని అతడు శ్రీరామకృష్ణుని

కూడా ప్రార్థించాడు. చాల నిక్కచ్చి చేసి నందున అతనికై శ్రీరామకృష్ణుడు కాళీదేవిని వేడుకొన్నాడు. వేడుకొన్న ప్రకారం ఉన్నత భావగర్భం. ఈలాగు ప్రార్థించాడు పరమ హంసదేవుడు :— "అమ్మా, అధరుడు నీ భక్తుఁడు, నీ కిష్టమైతే, అతనికి ఆ పదవిని లభింపజేయి, జ్ఞానముకై భక్తికై నిన్ను ప్రార్థించక క్షుద్రవిషయాలకై పరుగులువాఱుతున్న అతడు అవివేకి కదా!"

అధరునికి ఆ పదవి లభించలేదు. అటు పిమ్మట అతడు కాళిగుడికి వచ్చినప్పుడు, "ఇంత కాలంగా మాపరిచయం కలిగిఉన్న నీవు, ఆ లౌకికులను దేబిరిస్తూ ఎందుకు పోయ్యావు?" అని శ్రీరామకృష్ణు డడిగాడు. "ప్రపంచము ఉన్నంతవఱకు ఆలాగు ప్రవర్తించక తప్పదు, మీరైనా నన్ను నిరుత్సాహపఱచ లేదుగా" అన్నాడు అధరుడు. అప్పుడు గురుదేవు డతనికి పరమహితమును చెప్పాడు—"భోగతృష్ణను ఉద్దీపింపచేసుకోవడంకంటె అణచుకోవడం మేలు. నేను పూజారినైన తర్వాత, అందఱు నౌకరులవలె గుడిసరాబువద్దకు పోయి సంతకం పెట్టి జీతం తెచ్చుకోమన్నారు. "అది నాకు సాధ్యం కాదు. కావలిస్తే ఆ జీతాన్ని వేఱెవరికైనా ఇచ్చుకోండి. నే నడుగను" అన్నాను. జగదేకప్రభువునకు నేను బంటను. సేవ, మఱెవరికి చేస్తాను? ఒక్కప్రభువును కొలిచియుండుము. యాభైరూపాయలు దొరికితే చాలని, నూఱు రూపాయల జీతం వచ్చే ఉద్యోగం దొరికితే చాలని—ప్రజలు కోరుతుంటారు. నీ వేమో మూడువందల రూపాయల జీతం వచ్చే ఉద్యోగంలో ఉంటున్నావు. అది తక్కువైన ఉద్యోగం కాదు. అందులోనే నీ వెందుకు ఉండకూడదు? అధికారులు చాలమంది ఉంటే, అంతమంది అడుగులకు మడుగులొత్తడం దుష్కరం కదా?

సంతుష్టి పరుసవేదివంటిది. తనతో సంపర్కం పొందిన ప్రతిదాన్ని అది బంగారంగా మార్చివేస్తుంది. సంతుష్టి తఱచు పేదల గుడిసెలలో కనిపిస్తుంది. సంపదలు నిండితొనకు హర్మ్యములలో అది కానరాదు. సంపద చాల చెడ్డది. ఎందుచేతనంటే సంపద హెచ్చే కొద్దీ, ఇంకనింకను సంపద కావాలి అనే ఆశ కూడ వర్ధిల్లుతుంది. ఆరోగ్యమే వరములలో వరిష్ఠ మని, సంతుష్టియే ధనములలో మహాధన మని, నమ్మికయే బాంధవ్యములలో వరిష్ఠ మని నిర్వాణమే సుఖములలో వరిష్ఠ మని — ధమ్మపదం బోధిస్తున్నది.

'హితోపదేశ' మందలి యీ క్రింది శ్లోకం సంతృప్తిమహిమను తెలుపుతున్నది—

సన్తోషామృతతృప్తానాం
యత్సుఖం శాన్తచేతసామ్
కుత స్తద్ధనలుబ్ధానాం
ఇత శ్చేత శ్చ ధావతామ్.

క. సంతోషామృతతృప్తులు
శాంతాత్ములుపొందు సౌఖ్యసారములోనర్ధ
ఎంతయును బరువులిడు ధన
చింతకులకు సుంతయేని చేకుఱదు సుమా.

—∞—

# శ్రీ గురుసూక్తిసుధ

రాఖాలు మాతామహుడు—మహాశయా, గృహస్థజీవితము గడపుచున్నవానికి భగవత్సాక్షాత్కారము శక్యమగునా?

శ్రీరామకృష్ణుడు—ఏల శక్యము కాదు? పంకమత్స్యమువలె, లోకమున నివసింపుము. పంకమున నున్నను పంకమత్స్యమునకు పంక మంటదు. లేదా అంకుటాలివలె, లోకమున వసింపుము.ఆమె ఇంటిపనులను చేయుచుండును గాని మన సేమో సదా మిండగానిమీదే యుండును. మనస్సును దేవునియందు నిలిపి, నీ లౌకికవిధులను నిర్వర్తించుచుండుము. కాని అట్లుండుట చాల కష్టమే. బ్రాహ్మసమాజ సభ్యులతో నే నిట్లంటిని :—"జాడీలనిండుగ ఊరుగాయలు కుంభములనిండ తీర్థము గల గదిలో నొక విషజ్వరగ్రస్తుని ఉంచితి రనుకొనుడు. అతనికి వ్యాధి నయ మగు నని తలంపగలరా? ఊరుగాయల ఘుమఘుమలను తలంచుకొన్నంతనే నోరూరదా?" మానవునకు మహిళ ఆ ఊరుగాయవంటిది. ఐహికములందు మానవునకు గల ఉడుగని వాంఛ, నీరు త్రాగవలె ననెడి ఆరోగివాంఛ వంటిది. ఆ ఆశ కొక ముగియిక లేదు. "బానలోని నీటినంతటిని త్రాగివేయుదు" ననును విషజ్వరగ్రస్తుడు. పరిస్థితి చాల చిక్కైనది. లోకములో ఉన్న అలజడి, ఇంతింత కాదు. ఇటు పోయిన గొడ్డలిపెట్టు, అటుపోయిన పొరకకట్టతాపు, మఱొకవంక పోయిన చెప్పుదెబ్బ! ఏకాంతమున నున్ననే కాని దైవచింత సాధ్యము కాదు. నగలు చేయుటకు కంసాలి బంగారమును కరగించును. మాటిమాటికి కలవరపఱచితిమేని అతడు తనపని నెట్లు చక్కగా చేయగలడు? నీవు బియ్యమునుండి పొట్టు ఏఱివేయుచున్నావనుకో. ఆ పనిని సొంతముగా నీవే చేయవలెను. మాటిమాటికిని నీవు బియ్యమును చేతిలో ఎత్తి పొట్టు లేదు కదా అని చూచుచుండవలయును. నిన్ను మాటిమాటికిని లేపుచుండినచో నీపని నెట్లు చక్కగా చేయగలవు?

ఒక భక్తుడు—అలాగైనచో, మహాశయా, ఇక దారి ఏదీ?

శ్రీరామకృష్ణుడు-దారి ఉన్నది. మానవుడు దృఢవైరాగ్యము నలవఱచుకొనునేని నెగ్గగలడు. అసార మని నీవు గుర్తించినదానిని గట్టిమనసుతో వెంటనే విడిచిపెట్టవలెను. ఒకప్పుడు నాకు చాల జబ్బుచేసినది. నన్ను గంగాప్రసాదసేన్ అను వైద్యునొద్దకు పిలుచుకొనిపోయిరి. ఆయన నాతో "నేను నీ కొక మం దిచ్చెదను. నీవు నీరు బొత్తిగా త్రాగకూడదు. దానిమ్మరసమును త్రాగవచ్చు" అన్నాడు. నీరు త్రాగక నే నెట్లు జీవించియుండగలనో అని అందఱు వెఱగుపడిరి. కాని నీరు త్రాగకుందమని నేను నిశ్చయించుకొంటిని. "నేను పరమహంసనే కాని, బాతును కాను గదా, పాలను త్రాగుదును" అని అనుకొంటిని.

కొంతకాలము నీవు ఏకాంతమున గడపవలయును. దాగుడుమూతలాటలో తల్లిని తాకినపిమ్మట నీకు భద్రమే. ముందు నిన్ను బంగారముగ మార్చుకో. పిమ్మట నీకు నచ్చిన చోట ఉండవచ్చు. ఏకాంతమున దేవుని సాక్షాత్కరించుకొని దివ్యప్రేమను చూఱకొన్నపిమ్మట, మానవుడు లోకమునను జీవితము గడపుచుండవచ్చు. (రాఖాలు తండ్రిగారితో) ఈ యువకులను నాతో నుండు డని నేను కోరుట అందులకే. కొన్నాళ్లిక్కడ నుండిన, వారిలో భగవత్ప్రేమ వర్ధిల్లును.

అటుపిమ్మట వారు గృహస్థజీవితము గడప వచ్చు.

మ—మహాశయా, ఈ సమస్తమునను రూపొందినది దేవుడే అయినచో, మానవుల అనుభూతు లింత విభిన్నములుగ నుండ నేల?

శ్రీరామకృష్ణుడు— సకలప్రాణులందును సర్వాంతర్యామిగా దేవు డున్నా డనుటకు సందేహము లేదు. కాని ఆయన ఆవిష్కృతి వివిధప్రాణులలో వివిధరీతుల నుండును. కొన్ని యెడల ఆయావిష్కృతి జ్ఞానశక్త్యావిష్కృతిగ నుండును, వే తెడల అది అజ్ఞానశక్త్యావిష్కృతిగ నుండును. కొందఱియందుకంటె మఱి కొందఱియందు శక్త్యావిష్కృతి హెచ్చుగ నుండును. శార్దూలస్వభావులగు మానవుల సంగతి అటుండనీ, మానవులలో వంచకులును జూదగాండ్రును నీకు కనిపించుట లేదా? అట్టి వారినిగూర్చి 'వంచకదేవు' డని 'వ్యాఘ్రదేవు' డని నే ననుకొందుచుందును.

మ—(చిఱునవ్వుతో) అట్టివారికి మనము దూరమునుండియే ప్రణమిల్లవలెను, వ్యాఘ్ర దేవుని సమీపించి కౌగిలించుకొంటిమేని, ఆ దేవుడు మనలను మ్రింగివేసినను మ్రింగివేయ వచ్చు.

శ్రీరామకృష్ణుడు—ఉండునదెల్ల అతడును అతనిశక్తియు, బ్రహ్మమును బ్రహ్మశక్తియు. వేఱేమియు లేదు. రాముని స్తుతించుచు నారదు డిట్లనెను—"ఓ రామా, నీవు శివుడవు, సీత భగవతి; నీవు బ్రహ్మవు, సీత బ్రహ్మాణి; నీవు ఇంద్రుడవు, సీత ఇంద్రాణి; నీవు నారాయణు డవు, సీత లక్ష్మి; రామా, సమస్తపౌరుషమున కును సంకేతమవు నీవు, సమస్తస్త్రైణమునకును సంకేతము సీత."

# వివేకానంద సింహగర్జనము

మహోన్నతములైన సత్యములు ఏ ప్రజలసంఘమున అనుష్ఠానమున నుండునో ఆ సంఘమే సర్వశ్రేష్ఠమైనది. అది నా యభిప్రాయము. మహోన్నతసత్యములకు సంఘము సమర్థము కాకున్నచో, దానిని సమర్థము చేయుడు, ఎంత తొందరగ చేసిన అంత మంచిది. సత్యమును నిర్భయముగా నమ్మ వలె, సత్యమును ధైర్యముతో అనుష్ఠానమున నుంచుకో వలె,—ఈ సముత్సాహముతో, ఓ నరనారీమణులారా, లెండి. ధీరతాసమంచితులగు మగ వారును మహిళలును కొన్నివందలమంది జగత్తునకు కావలసియున్నారు. సత్యమును గుర్తించు టకు భయపడనటువంటి, జీవితమునందలి పరమార్థము నెత్తిచూపుటకు వెనుదీయనటువంటి, మృత్యువునెదుట కంప మొందనట్టి, మృత్యువునకు స్వాగత మిచ్చునట్టి, 'ఓ మానవుడా, నీవు ఆత్మవు, నిన్ను జంపగల దేదియు విశ్వమం దెక్కడను లేదు,' అని మానవునకు దెలుపునటు వంటి ధీరతను అలవఱచుకొండి. అలవఱచుకొంటిరేని అప్పుడు మీరు ముక్తులరే! అప్పుడు మీ యాత్మయాథార్థ్యమును మీ రెఱుగుదురు. ఈ ఆత్మయే శ్రోతవ్యము మంతవ్యము నిదిధ్యాసితవ్యము.

కార్యాచరణమునుగూర్చి మితిమీఱి ప్రసంగించు ప్రవణతయు, విమర్శను నిందించు ప్రవణతయు ఈ కాలమున ఎక్కువగ నున్నది. కార్యాచరణము చాల మంచిదే, కాని పనులు

పుట్టువొందునది ఆలోచనలనుండి. వేనిలో కండరముల బలము ఇంచుక కనిపించునో వానిని 'పను' లని పేర్కొనుచున్నారు. కాని ఆలోచన లేనిదే పనియు నుండదు. కాబట్టి మీ బుద్ధులలో ఉన్నతాశయములను ఉన్నతతమాదర్శములను నింపుకొనుడు, రాత్రింబవళ్ళు ఆ యాశయములను ఆదర్శములను ముందుంచుకొనుడు, అందుండి ఘనకార్యములు సముద్భవింపగలవు. అపవిత్రత పేరెత్తకుడు, 'మేము విశుద్ధుల' మని చెప్పుకొనుచుండుడు. మనము అల్పుల మని, చచ్చుచు పుట్టుచు మరల చర్విత చర్వణులగుచుందు మని తలంచుచు సదా భయపడుచుండు నొకమత్తదశలోనికి మనలను మనమే తెచ్చుకొంటిమి.

# శివానందలేఖావళి

## 117

శ్రీరామకృష్ణమఠం, బేలూరు, హౌరా
31 జూలై 1922

ప్రియశ్రీమర్.....

నీజాబు చేరినది, ప్రస్తుతపు మామనఃపరిస్థితిని నీవు చక్కగా ఊహించుకోగలవు. గురుదేవునిసాన్నిధ్యము ఎప్పుడును కలదు. అది నిజము లన్నిటికంటె ఎక్కువైన నిజము. కాకపోయినచో, మే మింతకాలము ఉండగలిగి యుండము. భక్తులు ఈవిధముగా ఈ లోకమును వీడుటయు గురుదేవునందులయించుటయు ఇదంతయు ఈ దినాలలో ఒకక్రీడగా కనిపించుచున్నది. గురుదేవుడు సంకల్పించినప్పుడెల్ల ఈ ఆట ఆడక తప్పదు. నాకును సదా ఈ తలంపే. ఇందులో ఆందోళనపడవలసిన దేమియు లేదు. ఇదొకరకమయిన ఆట. ఇందు మనము అన్వయింపక తప్పదు. ఆయన మమ్ము ఈ లోకమున ఉంచియున్నంతకాలము ఈ భౌతిక దేహమున నుండి ఆయనపనిని సాగించుచుండుట మాకు విధాయకము.

మఠములో సాగుచున్న నీచదువు, ఆధ్యాత్మికసాధనలు ఎంతయు ధైర్యావహములుగ ఉన్నవి. స్కూలు ఏలాగు నడచుచున్నది? నేతపని ఎట్లు సాగుచున్నది? వీనినిగురించి నేను విని చాలదినములైనవి. నీ విప్పుడు చేయుచున్నవాని నిట్లే కొనసాగించుచుండుము.

'శ్రీరామనామము' ముద్రితమైన దనెడి వార్త నాకు ఎంతయు ముదావహము. మహావీరపూజయందు శ్రీమహారాజు (బ్రహ్మానందస్వాముల)వారికి ఉత్సుకత అతిమాత్రమైనది. వంగదేశములో శ్రీరామనామసంకీర్తనమునకు ప్రచారము కల్పింపవలె నను శ్రద్ధయు ఆయనకెక్కువే. శ్రీ వివేకానందస్వామికిని ఆ సంకల్పము దృఢముగ నుండెను. కాబట్టి అది చాల బాగుగ నున్నది. శ్రీ ప్రేమానందస్వాముల లేఖలు ముద్రింపబడుచున్నవని విని ఎంతో సంతోషించితిని. అందుకు నే నొక భూమికను వ్రాసిమఠమునకు పంపియున్నాను, చాల సంగ్రహమైన భూమికే.

అందఱి క్షేమము తెలియనైనది. సంతోషము. అందఱికిని ఆధ్యాత్మికాభివృద్ధిని గురుదేవు డను గ్రహించునుగాక! నీవును ఇంక నింకను పురోగమింతువు గాక. ఇవే మీ కందఱికి నా హృదయపూర్వకాశీస్సులు.

నీ శ్రేయోభిలాషి
శివానంద

# కుంతీదేవికావించిన శ్రీకృష్ణస్తుతి

## బమ్మెరపోతన

మహాభారతయుద్ధము పాండవవిజయమున ముగిసినది. ధర్మరాజు పట్టాభిషిక్తుడయ్యెను. పరీక్షిజ్జననము ఐనది. ద్రోణతనయు నస్త్రము బారినుండి పరీక్షిత్తును రక్షించుటయు నెఱవేఱినది. ద్వారకకై తరలనున్న శ్రీకృష్ణు నొద్దకు వచ్చి కుంతి ఇట్లనెను.

క. పురుషుం డాఢ్యుఁడు ప్రకృతికిఁ బరుఁ డవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా
సురుఁ డనవలోకనీయుఁడుఁ బరమేశ్వరుఁ డైన నీకుఁ బ్రణవములు హరీ.

వ. మఱియు జవనికమఱువున నాట్యంబు సలుపు నటునిచందంబున మాయాయవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచేఁ బరమహంసల నివృత్తరాగద్వేషుల నిర్మలాత్ముల నయనములకు నదృశ్యమానుండవై పరిచ్ఛిన్నుండవు కాని నీవు మూఢదర్శనంబులు దర్శించుకుటుంబవతులగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు? శ్రీకష్ణ, వాసుదేవ, దేవకీనందన, నందగోపకుమార, గోవింద, పంకజనాభ, పద్మమాలికాలంకృత, పద్మలోచన, పద్మసంకాశచరణ, హృషీకేశ, భక్తియోగంబునం జేసి నమస్కరించెద, నవధరింపుము

సీ. తనయులతోడనే దహ్యమానంబగు జతుగృహంబునయందుఁ జావకుండ,
గురురాజు పెట్టించు ఘోరవిషంబున మారుతపుత్త్రుండు మడియకుండ,
ధార్తరాష్ట్రుడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ,
గాంగేయకుంభజకర్ణాది ఘనులచే నాబిడ్డ లనిలోన నలఁగకుండ,

తే. విరటుపుత్త్రిక కడుపులో వెలయు చూలు ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను, నిన్ను నే మని వర్ణింతు నీరజాక్ష ?

మత్త. బల్లిదుండగు కంసుచేతను బాధ నొందుచు నున్న మా
తల్లిఁ గాచినభంగి గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండఁగ దావకీయగుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన, జగత్పతీ ?

క. జననము నైశ్వర్యంబును ధనమును విద్యయును గల మదచ్ఛన్ను లకిం
చనగోచరుఁ డగు నిన్నుఁ వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా.

వ. మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామవిషయుండును నాత్మారాముండును రాగాదిరహితుండును గైవల్యదానసమర్థుండును, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకలభూతనిగ్రహానుగ్రహాకరుం

డను నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద, అవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు, జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవులయందు వరాహాదిరూపంబులను, మనుష్యులందు రామాదిరూపంబులను, ఋషులయందు వామనాదిరూపంబులను, జలచరంబులందు మత్స్యాదిరూపంబులను—నవతరించుట లోకవిడంబనార్థంబు గాని, జన్మకర్మసహితుండ వగుటం గాదు.

ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక త్రాటఁ గట్టిన వికుంచితసాంజనబాష్పతోయధా
రాపరిపూర్ణవక్త్రముఁ గరంబులఁ ద్రాముచు, వెచ్చనూర్చుచుం
బాపఁడవై నటించుట కృపాపర, నామదిఁ జోద్య మయ్యెడిన్.

క. మలయమునఁ జందనముక్రియ వెలయఁగ ధర్మజునికీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదుకులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా.

క. వసుదేవదేవకులు తాపసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం
తసమునఁ బుత్రత నొందితి వసురులమృతి కంచుఁ గొంద ఱండ్రు మహాత్మా.

క. జలరాశినడుమ మునిఁగెడు కలముక్రియన్ భూరిభారకర్శిత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ గలిగితి వని కొంద ఱండ్రు గణనాతీతా.

తే. మఱచి యజ్ఞానకామ్యకర్మములఁ దిరుగు వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ
శ్రవణచింతనవందనార్చనము లిచ్చుకొఱకు నుదయించి తండ్రు నిన్ గొంద ఱభవ.

మ. నినుఁ జింతించుచుఁ బాడుచున్ బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్
వినుచుం జూతురు గాక లోకు లితరాన్వేషంబులం జూతురే
ఘనదుర్జన్మపరంపరాదళనదక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్, విశ్వేశ, విశ్వంభరా?

వ. దేవా, నిరాశ్రయులమై భవదీయచరణారవిందంబు లాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల? నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితులైన పాండవులు జీవుని బాసిన యింద్రియంబులచందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు. కల్యాణలక్షణలక్షితంబు లైన నీ యడుగులచేత నంకితంబయిన మదీయధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కి జనపదంబులు కుసుమఫలభరితంబులై యోషధితరులతాగుల్మ నదనదీసమేతంబులై యుండు,

ఉ. యాదవులందుఁ బాండవులయందు నధీశ్వర నాకు మోహవి
చ్ఛేదము సేయుమయ్య, ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁగదయ్య యీశ్వరా.

శా. శ్రీకృష్ణా, యదుభూషణా, నరసఖా, శృంగారరత్నాకరా,
లోకద్రోహినరేంద్రవంశదహనా, లోకేశ్వరా, దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తిహరణా, నిర్వాణసంధాయకా,
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్, నిత్యానుకంపానిధీ.

## ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# త్రి వి ధ బ ల ము

వివేకానందస్వామి కథలను అతిరంజక రీతిలో చెప్పుటయందు దిట్ట. ఈనేర్పు విశ్వమహాప్రవక్త లందఱికిని గలదు. శ్రీరామకృష్ణ పరమహంసకును గలదని చెప్పవలెనా? ఒక నాడు శ్రద్ధావంతులగు శిష్యులగోష్ఠిలో సహస్రద్వీపారామమున సరళమైనను గంభీరభావగర్భమగు నొకకథను వివేకానందస్వామి వాక్రుచ్చెను. ఇదే ఆ కథ :– ఒకదోమ చాలసేపు ఒకయెద్దుకొమ్ముపై వ్రాలియుండెను; అంతట మనోవ్యథ నొంది యెద్దుతో నిట్లు పలికెను ‘వృషభరాజమా, చాలసేపు నే నిచటఁ గూర్చుండియుంటిని. నీకు బాధ కలిగించితి నేమో! అందుకు చింతించుచున్నాను. ఇదిగో తొలగిపోవుదును.’’ కాని వృషభము ఇట్లు బదులు చెప్పినది: ‘‘లేదు, లేదు, ఎంత మాత్రము బాధ లేదు! నీ కుటుంబమునంతను దీసికొని వచ్చి నా కొమ్ముపై నివసింపుము. నీవు న న్నేమి చేయగలవు?’’

దోమ చాల చిన్నదే ఐనను దాని బరువు దాని కున్నది, బాధపెట్టు సామర్థ్యము దాని కున్నది. తన బరువును బలమును సామర్థ్యమును అది యెఱుగును. కాని ఎద్దుబరువెంతో దాని బలమెంతో భారవహన సామర్థ్యమెంతో దోమ గ్రహింపజాలదు, దాని ఊహకైనను అది అందదు. లోకమున చిక్కులు సమస్యలు ఇక్కట్టులు చెడుగులు కీడులు శోధనలు గల్గినప్పుడు ధీరుడు, వానిని లెక్కింపగూడదు; ఎద్దు తనకొమ్ముపై వ్రాలిన దోమను లక్ష్యపెట్టనట్లు లక్ష్యపెట్టకుండవలయును. ఈ కథకు, స్వామిజి, ఉపోద్ఘాతముగా పల్కిన పల్కులివి :– ‘‘ఒప్పుకొన జూడకు, తప్పించుకొన జూడకు, వచ్చినదానిని రానీ, దేనివలనను బాధితులము గాకుండుటయే స్వాతంత్ర్యము. సహించియున్నంత మాత్రమున జాలదు, అసంగుడవు కమ్ము. ఎద్దు కథను స్మరింపుము.’’

బలములలో మొదటిది దేహబలము. దేహము ఆరోగ్యసంపన్నముగను దృఢముగను వీర్యవంతముగను నుండవలెను. కాని కేవలము కుస్తీవీరులవలె, కసరత్తు చేయు వారివలె, బరువు లెత్తువారివలె, పోటీలలో బహు

మతులకై పోరాడువారివలె నుండవలె ననుట కాదు. ఒకొక్కప్పు డట్టివారిలో కండపుష్టి మాత్రమే ఉండును. వే తేమియు నుండదు. వట్టి కండపుష్టిమాత్రమే మానవ జీవిత లక్ష్య ముగ నుండజాలదు. ప్రజ్ఞాసహాకృతము గాని కండబలము గొడ్డుబలము. స్వామిజి కండబల మును ప్రస్తుతించియున్నా డనుట నిజమే. యువకులకు ఇనుపకండరములు ఉక్కునరము లుండవలెనని ఆయన చెప్పియున్నాడు. గీతా పాఠకునకంటె (ఫుట్బాల్) చరణకందుకక్రీడాభి రతుడు భగవంతున కెక్కువ సన్నిహితు డని నుడివియున్నాడు 'నాయ మాత్మా బలహీనేన లభ్యః' 'బలహీను డాత్మ నధిగమింపజాల' డను ఉపనిషద్వాక్యము నుదాహరించి స్వామిజి "దుర్బల దేహము ఉద్వేగములకు ఉద్రేకము లకులోనై ఆత్మసాక్షాత్కార సాధనముగ నుండ నసర్హ మగును" అని వక్కాణించెను. బలము నకు సాహసమునకు పౌరుషమునకు ఆదర్శమైన వాడు స్వామిజి. పెక్కేండ్లు సాగిన అతిమానుష సాధనలచేతను నియమపాలనములచేతను, ఆత్మ సాక్షాత్కారముచేతను స్వామిజి గడించినవే ఆ బలసాహస పౌరుషములు.

ఆరోగ్యవిధులను పాటించుచు జీవితము గడపువారికి సాధారణముగ ఇనుపకండరము లును ఉక్కునరములును గలుగును. రోగముల నుండి తన్ను కాపాడుకొను సహజశక్తులు దేహమున కున్నవి. కాని నాగరులు సోమరి తనముచే భోగపరతచే చులుకుపుట్టించు మత్తు గలిగించు పదార్థములను సేవించుటచే, దేహ సహజ శక్తులను చెడగొట్టుకొనుచున్నాడు. మహోన్నత జీవితలక్ష్యములను బడయుటకు సాధనము కదా దేహము! ఈ దృక్పథముతో చూతుమేని దేహబలమనగా — కష్టములను లేమిడిని సంతోషముతో భరింపగలశక్తి అని ఏర్పడును. ఇదే భగవద్గీతలో 'సాత్త్వికీధృతి' అని ప్రస్తుతమైయున్నది—

ధృత్యా యయా ధారయతే
మనఃప్రాణేన్ద్రియక్రియాః
యోగే నావ్యభిచారిణ్యా
ధృతి స్సా పార్థ సాత్త్వికీ. (XVIII-33)

స్థిరమైన యేకాగ్రతతో మనఃక్రియలను ప్రాణ క్రియలను ఇంద్రియక్రియలను ఏ ధైర్యము నియమబద్ధములనుగా చేయుచున్నదో ఆ ధైర్యము సాత్త్వికము — అన్నారు. ఈ సాత్త్విక ధైర్యనిధికి 'కొట్టవచ్చిన ట్లగపడు' కండరములు లేకున్నను అతనివీర్యము తఱుగని వీర్యము. అతని దేహము ముదిసినను ఉత్సా హము సడలదు. అతని మరణముకూడ 'బాగుగా పండిన పండు రాలుట'ను బోలి యుండును.

బలములలో రెండవది మనోబలము. 'ఇనుపకండరములును ఉక్కునరములును ఉండ వలె' అను స్వామిజి సూక్తిని తఱచు ఉదాహ రించువారు "బృహత్సంకల్పబల ముండవలె" ననెడి స్వామిజి సూక్తిని మఱచుచుందురు. వినుడు స్వామిజి అడిగిన ప్రశ్నపరంపరను "కొండంత ఆటంకమువచ్చినను దాటి చను సంకల్పము నీ కున్నదా. సర్వ ప్రపంచమును కత్తిదూసికొని నీమీఁదికి వచ్చినను, ధర్మ మని నీవు నమ్మిన పనిని నిర్భయముగ చేయుదువా? నీ భార్యయు బిడ్డలును ప్రతిఘటించినను, నీ సర్వధనము నష్టమైనను, నీ పేరు నశించినను, నీ సంపద మాయమైనను, ధర్మ మని నీవు నమ్మినదాని పట్టు విడువకుందువా? దానిని అనుసరించి, లక్ష్యమువంకకు ముందు కుఱుకు దువా? ఆ సంకల్పదార్ఢ్యము నీ కున్నదా?" ఈ ప్రశ్నలు స్వామిజికుండిన సంకల్పబలమునకు

సూచకములు. ఆ బలముచేతనే ఆయన గురుదేవుడు తన కర్పించిన పనిని మహోజ్జ్వలరీతిలో నిర్వహింపగలిగెను. ఈ సంకల్పబలమును ప్రతిఘటింపగల దేదియు లే దనియు ఇది విశ్వమర్మముల నుద్ఘాటింప గల దనియు, ఈ బలము గలవారు, అవసరము గల్గినచో కడలి యడుగునకైనను పోయి మృత్యువు ను ధిక్కరింతురనియు స్వామిజి వాక్రుచ్చెను. ధృఢమైన మనస్సునుండియే ధృఢసంకల్ప ముద్భవించును. నీతినియమబద్ధతయు ఏకాగ్రతయు విశుద్ధియు స్వార్థత్యాగమును ప్రేమయు ఉన్నచో వానినుండి మనోబల ముద్భవించును. మనోబలమనునది అహంకారరూపమును దాల్చునేని అది ఆత్మవిధ్వంసకముగ పరిణమించును. నిర్మాణాత్మకమును శ్రేయఃపదమునగు మనోబలమే ఇప్పుడు భారతదేశ మందును ఇతరత్రను జరూరుగ కావలసియున్నది. ఎంతగడ్డుసమస్యలు, ఎన్ని మనలను ముట్టడించినను నీతినిష్ఠామహితుని సంకల్పబలము నెదుట అవి నిలువజాలవు. "నవీనభారతము రైతుల గుడిసెలనుండియు, బెస్తల మాలల మాదిగల కుటీరములనుండియు, చిల్లర అంగళ్ళనుండియు, కమ్మరివాండ్ర కొలుముల పజ్జనుండియు, కర్మాగారములనుండియు, బజారులనుండియు, తోపులనుండియు, వనములనుండియు, గుట్టలనుండియు కొండలనుండియు రూపొందును గాక" అన్నారు స్వామిజి ఒకపరి. అది అట్లే మెల్లగ రూపు దాల్చుచున్నది. కాని నీతియందు సత్యమునందు త్యాగమునందు మానవప్రేమయందు హిమవచ్ఛిఖరముల సమున్నతివంటి సమున్నతి గల ప్రజానాయకులు కావలెను. అప్పుడే పురోగతి త్వరగ సాగును. లంచగొండితనమును కక్కూర్తియు ఎల్లెడల ఉన్న దని జనులు గోల పెట్టుచున్నారు. చట్టములు వానిని అరికట్ట జాలవు. జ్ఞానవైరాగ్యవిభూషితులు విశ్వశ్రేయోభిలాషులు అప్రకంప్యనీతినిష్ఠులు ఎల్లెడల ఉండురేని, ఆ దోషములకు నిరోధ మేర్పడి అవి అంతరించును. వ్యాపించు గుణము, అవినీతికున్నట్లే నీతికిని ఉన్నది; ధృఢసంకల్పులగు ధర్మవీరులు ముందుకు వత్తురేని వారి ఆదర్శము ప్రజలలో తప్పక వ్యాపించును. నైతికనిశ్రేణియం దిప్పుడు కననగుచున్న అవరోహణము ఆగి, అధిరోహణము సాగ గలదు.

దేహబలమున కంటెను మనోబలమున కంటెను మేలయినదియు ఆ రెంటి కంతర్గతముగ నుండునదియు బ్రహ్మజ్ఞానప్రభవమగు ఆత్మబలము. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" సత్యమే బ్రహ్మము, జ్ఞానమే బ్రహ్మము, బ్రహ్మ మనంతము. ఏది అనంతమో అది అద్వితీయము ఆనందమహితము భయరహితము. బ్రహ్మమును సాక్షాత్కరించుకొన్న వానికి తాను వే అనెడి తలంపు అంతరించును. అతని దృష్టి సమస్తమును తనలో నిముడ్చుకొనును. అతడు సమస్తమును తానే అగును. మృత్యు వెదురైనను భయపడకుండుటే నిజమైన బలము. మృత్యు వనగా వెలుపలి కోశము మార్పొందుటే. ఆత్మకు జననము లేనందున మరణమును లేదు. ఆత్మ నిత్యము. ఈ జ్ఞానము గలవాడు చిఱునవ్వుతో సిలువ చేయించుకొని, హంతకుల శ్రేయస్సుకై దేవుని ప్రార్థింపగలడు. అతడు భగవంతుని శ్రీచరణము లంటినవాడు కావున మృత్యువు కల్గినప్పుడు శిలాకర్కశుడుగ నుండును. బ్రహ్మజ్ఞానికి మరణ మనగ పరతత్త్వమునకును తనకును భేద మంతరించుట, అది ఆనందసంభవమే. కావుననే దానిని 'మహాసమాధి' 'మహానంద స్థితి' అని పేర్కొందురు.

పరతత్త్వముతో తన యైక్యమును సాక్షాత్కరించుకొన్నవాని దృష్టిలో విశాల పృథివి ఒక రేణువుపాటి దగును. అప్పు డతడు- (వివేకచూడామణి 496)

మయ్యఖణ్డసుఖామ్భోధౌ
బహుధా విశ్వవీచయః
ఉత్పద్యన్తే విలీయన్తే
మాయామారుతవిభ్రమాత్.

'నేను అఖండానందసాగరమను, మాయ అను సుడి గాలికి అలలు లేచినట్లుగా జగము లుప్పతిల్లునది నాలోనే; అల లణగినట్లుగా జగము లణగునది నాలోనే' అని పాడుకొనును. అతనిని విసిగించి కలవరపఱచి భయపెట్టున దేది యుండ గలదు? తన్ను తిట్టినవారికిని కొట్టిన వారికిని గూడ ప్రేమయు కనికరమునే అతని ప్రతిక్రియలు. (పంచదశి VII-288)

అధిక్షిప్త స్తాడితో వా
బాలేన స్వపితా తదా
న క్లిశ్నాతి న కుప్యేత
బాలం ప్రత్యుత లాలయేత్.

"కుమారు డధిక్షేపించినను కొట్టినను తండ్రికి బాధలేదు, కోపము రాదు, పైగా కుమారు నతడు ముద్దాడును" లోకములోని చిక్కులు బాధలు పోటీలు మున్నగున వన్నియు నతనికి — కొమ్ముమీద వాలిన దోమ ఎద్దునకెట్లో — అట్లు అకించిత్కరములు. బంధవిముక్తుడైన బ్రహ్మజ్ఞానికి బద్ధజీవులపట్ల దయయు ప్రేమయు వెల్లివిరియుచుండును. 'ఒక్క మానవునికి సాయపడుటకై ఇరువదివేల దేహములనైన' నతడు త్యజింప సంసిద్ధుడుగ నుండును.

వైదిక విజ్ఞానకోశము

# సాధనపంచకము*

మూలము:
శ్రీ శంకరభగవత్పాదులు

అనువాదకః
విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు
ఎమ్.ఎ. (ట్రిపుల్)

వేదో నిత్య మధీయతాం, తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం,
తే నేశస్య విధీయతా మపచితిః. కామ్యే మతి స్త్యజ్యతామ్,
పాపౌఘః పరిధూయతాం, భవసుఖే దోషో ఽనుసన్ధీయతా
మాత్మేచ్ఛా వ్యవసీయతాం, నిజగృహా త్తూర్ణం వినిర్గమ్యతామ్. 1

నిత్యోజ్జ్వలంబైన నిగమంబు నిష్ఠతో నిరతంబు పఠియించి నెగడవలయు;
వేదోక్తకర్మల విడువక సతతంబు సమధికశ్రద్ధతో జరపవలయు;
నేతదాచరణంబె యీశ్వరార్చన మని భావింపవలయును భవ్యభంగి;
కామ్యకర్మ లొనర్పఁగడఁగక బహువిధపాపచయంబును బాయవలయు;

* దీనికి సోపానపంచక మనియు ఉపదేశపంచక మనియు పంచరత్నమాలిక యనియు నామాంతరములు.

గీ. సారహీనసంసారదోషంబు లెఱిఁగి నిలుపవలయును మది నాత్మనిష్ఠ మిగుల;
నిలిపి భవబంధనిలయమౌ నీ గృహంబు తత్క్షణంబున విడువుము తగుల ముడిగి.

సఙ్గ స్సత్సు విధీయతాం, భగవతో భక్తి ర్దృఢా ధీయతాం,
శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం. కర్మాశు సన్త్యజ్యతామ్,
సద్విద్వా నుపసర్ప్యతాం, ప్రతిదినం తత్పాదుకా సేవ్యతాం,
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్.

సీ. సలలితసాధుసజ్జనసంగతిం గని సద్గోష్ఠిఁ గాలంబు జరపవలయు
పరమపావనభగవద్భక్తి దృఢతర మొనరించుకొని శాంతి నొందవలయును
శాంత్యాదిగుణగణసముపేతతఁ గామ్యకర్మంబులఁ వీడఁగా వలయును
బ్రహ్మజ్ఞగురుపాదపరిచర్య చేయుచుఁ దత్పాదుకల్ తలఁ దాల్పవలయు

గీ. బ్రహ్మపద మిచ్చు నేకాక్షరంబు మహితమంత్ర మోంకారమును నిల్పి మదిని జిహ్వఁ
దమకమున నెప్పు డుపనిషద్వాక్యములను విమలవేదాంతవాక్యముల్ విన వలయును. ౨

వాక్యార్థశ్చ విచార్యతాం, శ్రుతిశిరఃపక్ష స్సమాశ్రీయతాం,
దుస్తర్కా త్సువిరమ్యతాం, శ్రుతిమత స్తర్కో ను సన్ధీయతామ్,
బ్రహ్మై వాస్మి విభావ్యతా మహరహ ర్గర్వః పరిత్యజ్యతాం,
దేహే ఽహమ్మతి రుజ్ఝ్యతాం బుధజనై ర్వాదః పరిత్యజ్యతామ్.

సీ. అమలిన తత్త్వమస్యాది వాక్యంబుల యంతరర్థంబును నరయవలయు
ఆశ్రయింపవలయు నఖిలశ్రుతిశిరఃప్రబలపక్షమైన యద్వైతమతము
త్యజియింపవలయుఁ గుతర్కముల్ సర్వంబు, శ్రుతిమతతర్కమే మదిఁ దలంచి,
భావింపవలె 'నహం బ్రహ్మాస్మి' యని నిరంతరము నానందసంధానముగను

గీ. కలుగనీయగఁ రా దెట్టి గర్వలవంబు, తనువె తా నను బుద్ధిని గనఁగ రాదు,
తత్త్వవిదులైన యట్టి పెద్దల సమక్షమున వితండవాదంబులు పూన రాదు.

క్షుద్వ్యాధి శ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం న తు యాచ్యతాం, విధివశా త్ప్రాప్తేన సన్తుష్యతామ్
శీతోష్ణాది విసహ్యతాం న తు వృథావాక్యం సముచ్చార్యతా
మౌదాసీన్య మభీప్స్యతాం జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతామ్.

సీ. క్షుద్బాధ యను గడ్డు క్రూరరోగమునకుఁ గావింపవలయును ఘనచికిత్స,
ప్రతిదినభిక్షాన్న పరమౌషధంబునే సేవించి యారోగ్యసిద్ధిఁ గనుము,

స్వాద్వన్నమును వేఁడఁజనదు, తనంతట దొరకినదాన సంతుష్టి వలయు
శీతోష్ణసుఖదుఃఖవాతాతపద్వంద్వములను సహింప నౌ మునము మీఱి

గీ. వ్యర్థముగ నొక్కపలుకును బలుకరాదు, శ్రేష్ఠమగు నన్నిటను నుదాసీనబుద్ధి
జనుల కృపగాని వారి రోషమునుగాని పరిగణింపక త్యజియింప వలయు రెండు.

ఏకాన్తే సుఖ మాస్యతాం. పరతరే చేత స్సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగ దిదం తద్బాధితం దృశ్యతామ్
ప్రాక్కర్మప్రవిలాప్యతాం చితి బలా న్నాప్యుత్తరై శ్ శ్లిష్యతాం,
ప్రారబ్ధ న్త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్.

సీ. ఏకాంతవాసమే యెంతయు సుఖ మని యొంటి మౌనమునఁ గూర్చుంట మేలు
చిత్తంబునందునఁ జింతించుచుఁ బరబ్రహ్మంబు మదమునఁ బరగవలయు
భువనంబు నెల్ల సంపూర్ణపరబ్రహ్మమయముగాఁ జూచుచు మహితభంగి
జగ మింక బాధింపఁ జాల దని యెఱింగి గతకర్మసంక్షయస్థితిని గాంచి

గీ. చిద్బలంబున నాగతా శేషకర్మ లన్నియు దహించి ప్రారబ్ధ మనుభవించి
నిత్యమును నిల్వవలయును నిరుపమగతి భవ్య మవ్యయమౌ పరబ్రహ్మమందు. ౫

య శ్శ్లోకపఞ్చక మిదం పఠతే మనుష్య స్సఞ్చిన్తయ త్యనుదినం స్థిరతా ముపేత్య
త స్యాశు సంసృతిదవానలతీవ్రఘోరతాపః ప్రశాన్తి ముపయాతి చితిప్రసాదాత్. ౬

గీ. ప్రత్యహం బెవ్వఁ డీ పద్యపంచకంబుఁ జదివి స్థిరముగ నెఱుఁగుఁ దత్సార మతఁడు
భవభయంకరబహుళతాపప్రశాంతిఁ జిద్బలంబున నందును, జెందు ముక్తి. ౬

---

# శ్రీరామకృష్ణానందస్వామి

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

భగవంతుడగు శ్రీరామకృష్ణదేవుని లీలా సహచరుడగుపూజ్యపాదుడు శ్రీమద్రామకృష్ణానందస్వామి శ్రీరామకృష్ణమఠమున శశిమహారాజను పేరున సుపరిచితులు. శ్రీ ప్రేమానందస్వామి ఒకప్పు డొకసాధువుతో ఈలాగు పల్కిరి- "శశిమహారాజు ఎంతటి కర్మవీరులు! ఆయననే ఆదర్శముగ గైకొని ధన్యుడవు కమ్ము. నీవు చూచుచున్న ఈ మఠము, ఈ దేవాలయము, వీని కెల్ల మూలపురుషు డీ శశిమహారాజు ఒక్కడే సుమా! మీ రాఖాలుమహారాజు (శ్రీ బ్రహ్మానందస్వామి) కాదు, మీ శరత్తు మహారాజు (శారదానందస్వామి) కాదు, బాబురాం మహారాజు (ప్రేమానందస్వామి) కాదు, ఇంతెందుకు స్వామీజీ (వివేకానందస్వామి) కూడ కాదు - శశిమహారాజు ఒక్కడే కారణ మని నేను దృఢస్వరమున బల్లగుద్ది చెప్పగలను. ఆలంబజారు

మఠములో శ్రీ గురుమహారాజుగారి పూజ విషయములో మిగిలిన సాధువులందఱు, స్వామిజితో సహా ఘోరమగు ఆక్షేపణ చేసిరి. శ్రీశశిమహారాజు ఒక్కడే వారిని ప్రతిఘటించి, నిల్చెను. శశిమహారాజు ఆ చింపిచాపపై శ్రీరామకృష్ణుని పట ముంచి పూజ చేసెడివాడు. ఒకదినము స్వామిజీతోపాటు మిగిలిన సోదర శిష్యులు కొందఱు, శ్రీరామకృష్ణుని పూజ ఆపి వేయవలె నని ఘోరతర్కము కావించి, విఫలమనోరథులై కోపముతో మఠము వీడి శ్రీ బలరాం బోసుగారింటికి వెడలిపోయిరి. పాపము శశి మహారాజు ఒక్కడే ఆదినము ఆలంబజారు మఠములో నుండి, యథావిధి పూజను తక్కిన పనులను అన్నిటిని చేసికొనెను. శ్రీబలరాం బాబు, సోదరశిష్యులకెల్ల నయముగ నచ్చ చెప్పి, ఆ మరుచటిదినమే వారల నందఱిని ఆలంబజారు మఠమునకు తిరిగి పంపెను.

చెన్నరాజధానియందు శ్రీ శశిమహారాజు ఖ్యాతి వర్ణింప నలవి కాదు. శశిమహారాజు దక్షిణ దేశదిక్పాలకుడై వెలింగెను. అత్యంతాచారపరాయణులును – నిష్ఠాపరులు అగు దక్షిణ దేశ బ్రాహ్మణులకు సైతము, కడు నిపుణతతో శ్రీరామకృష్ణుని ఆదర్శముల నచ్చ చెప్పి–వారిని శ్రీరామకృష్ణుని అనుచరుల గావించెను. శశి మహారాజుగారి ఆదర్శజీవితమునకు ముగ్ధులై పెక్కురు యువకులు శ్రీరామకృష్ణుని సేవకై తమ జీవితముల ధారవోసిరి.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము, వివేకానందాది శిష్యబృందము, వరాహనగరమఠమందు – జపధ్యానములతో ఎక్కువకాలము గడపెడివారు. వారిలో నూతన వైరాగ్య ప్రభ మధ్యాహ్నసూర్య తేజము బోలె ఉజ్జ్వలమై వెల్గుచుండెను. వారు వేకువనే లేచి, కాలకృత్యముల తీర్చుకొని గుడికి వెళ్ళి ధ్యానమునకు కూర్చుందురు. ధ్యాననిమగ్నులై పోయెడివారు. వారికి బాహ్యప్రపంచ స్పృహయే ఉండదు. కాని శశిమహారాజు 24 గంటలపాటు పని, పూజ మున్నగు కృత్యములతో గడపెడివాడు. ఇంటిలోని తల్లివల్లె మఠమును కాపాడెను. బిక్షాటన చేసియు, విద్యాదానము చేసియు, దైనందిన సామగ్రి సేకరించును. శ్రీ శ్రీ రామకృష్ణభగవానుని చిత్రపటము ప్రతిష్ఠించి, యథావిధి పూజ, నైవేద్యముల జరుపును. నైవేద్యమునకు వలయు సంబారములను సేకరించి తెచ్చును. శరీరస్పృహ వీడి సాధన భజనలతో కాలము గడపుచున్న సోదరులకు ఆహారము తినిపించు భారమును స్వభుజములపై వేసికొనెను. ఒక్కొక్క దినము సాయంకాలము నాలుగైదు గంటలైనను, సోదరశిష్యులు ఆసనము వీడి వచ్చు లక్షణములు కానరానందున పను లన్నియు ముగించుకొని, శశిమహారాజు వచ్చి ఒక్కొక్కరిని బలాత్కారముగ లేవదీసికొని పోయి ఆహారము తినిపించును. ఆహా! శశిమహారాజు ఎంతటి నిష్ఠాపరుడు! భగవత్సేవతోపాటు – సోదరుల సేవయు నిష్ఠతో జరుపుచుండెను. శ్రీరామకృష్ణ సంఘ స్థాపనకై సోదరశిష్యులెల్ల సమష్టిగ కడు పాటుపడిరి— దానిలో ప్రత్యేకముగ వ్యక్తిగత మగు విశేష భాగము శ్రీ శశిమహారాజుగారిదే! వరాహనగరమఠమందు – ప్రారంభదినములలో – శశి మహారాజుగారి విషయము విశేషముగ కొనియాడదగినది. వివేకానందస్వామి ఒకమారు ''శశియొక్క దృఢ మగు నిష్ఠయే మన సంఘమునకు గట్టిపునాది'' అని పల్కెను.

ఆ దినములలో మఠములోని సోదరులు భగవద్దర్శన కాంక్షతో, వ్యాకులచిత్తముతో ఇటు నటు తీర్థాటనకై బయల్వెడలిరి. కొందఱు సుదూర ప్రదేశములలో ఏకాంత తపశ్చర్యకై

బయలు దేఱిరి. అట్టితఱి శశి ఒక్కఁడే తదేక నిష్ఠతో మఠములో దేవతార్చన వ్రతము బూని, వరాహనగరమఠమందే స్థిరనిశ్చలమగు సుమేరు పర్వతముబోలె నిల్చెను. ఒక్క దినముపాటు అయినను, బయటకు వెళ్ళవలెనని కోర్కెయే లేదాయె. వరాహనగరమఠప్రారంభావస్థలో ఆర్థికస్థితి చాల హీనముగ నుండెను. అందుచే సన్న్యాసులు ప్రతిదినము భిక్షాటనకై బయలు దేఱుదురు. ఒక్కొక్కదినము ఏ కొద్దిపాటియో బిక్ష దొరకును, ఒక్కొక్కదినము వట్టి చేతులతో వచ్చుటయు కలదు. ఒకనాడు నల్గురు సాధువులు భిక్షకై బయలుదేఱి రిక్తహస్తములతో తిరిగి వచ్చిరి. అందుచే దినమంతయు వారు భజన సంకీర్తనలతో గడప నిశ్చయించుకొనిరి. నోటి మాటలను చేతలతో చూపిరి. శ్రీభగవానుని నైవేద్యమునకై ఎట్టి ఉపాయము కానరానందున శశిమహారాజుకు శాంతి లేదాయె. మఠసోదరులెల్ల భజనానందమున మునిగియున్నతఱి శశిమహారాజు మఠము వీడి ఎవ్వరికిని తెలుపకుండ—ఆపొరుగుననేయున్న ఒకపరిచితుడగు వ్యక్తి కడకు వెడలెను. వాని ఇంటిలో అతడు తప్ప మిగిలిన వారందఱు మఠ విరోధులు - అతడు శశిమహారాజు చెప్పినది ఆద్యంతము విని - ఇంటి వారి కంట బడకుండ కొంచెము బియ్యము, కొన్ని ఉర్లగడ్డలు, కొంచెము నెయ్యి కిటికీగుండ శశిమహారాజుకు అందించెను. ఆ భిక్షను ఆనందముతో గ్రహించి, మఠమునకు తిరిగి వచ్చి, వంట చేసి - శ్రీగురు మహారాజునకు నివేదనచేసి - ఆప్రసాదమును-ముద్దలుచేసి - భజనపరవశులై యున్న సోదరుల నోటిలో ఒక్కొక్క ముద్దను దూర్చెను. సాధువులు ఆ అన్నమును భక్షించి "సోదరా, నీ వీ అమృతమును ఎచ్చటనుండి సేకరించితివి?" అని ప్రశ్నించిరి—మఠవాసుల యోగక్షేమము లరయుట - వారికి సర్వవిధము లగు వసతుల నేర్పఱచుట - మఠ కార్యము లన్నియు చక్కదిద్దుట - దీని యన్నింటి బాధ్యతను స్వయముగ, సానందముగ, శశిమహారాజు వహించెను.

ఇక దేవతార్చన విషయమో - వర్ణింప నలవికాదు. ఆయనది ఒక అద్భుతమగు పూజ- చూడవలసినదే - అట్టి విచిత్రమగుపూజ కడు నిష్ఠతోడను - ప్రీతిపూర్వకముగను శశిమహారాజు కావించును. రామకృష్ణానందస్వామి భగవత్పూజ విధివత్తుగా చేసి తృప్తినందెడి వాడు కాడు. సాక్షాత్ సజీవమూర్తి జ్ఞానముతో - పూజ చేయును - వేసవికాలమున భగవానునికి వేడి కల్గుచున్నదని - చాల సేపు విసనకఱ్ఱ తీసకొని వీచును - వేకువజామున శ్రీ భగవానుని మేలుకొలిపి - వేపపుల్లను బాగుగ నలుగగొట్టి ఇచ్చును-. ఇటువంటివి ఎన్నియో- ప్రతి చిన్న ఉపచారముల ఎట్టి తుటి లేకుండ జరుగునటుగ - తీక్షణ మగు [illegible] నుంచెడి వాడు.

---

సీ. చెలికాఁడ ర మ్మని చీరు న న్నొకవేళ, మన్నించు నొకవేళ మఱంది యనుచు,
బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనము లిచ్చు,
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు, బోధియై యొకవేళ బుద్ధి సెప్పు,
సారథ్య మొనరించు చన విచ్చి యొకవేళ, గ్రీడించు నొకవేళ గేలి సేయు,
నొక్కశయ్యాసనంబున నుండుఁ గన్నతండ్రికైవడిఁ జేసిన తప్పుఁ గాచు
హాసములు వటి పొత్తున నారగించు, మనుజవల్లభ, మాధవు మఱపు రాదు
(భాగవతము I-369)

# శ్రీరామకృష్ణుని చమత్కార హాస్యములు

## శ్రీ తుమ్మల పేరారెడ్డిగారు

(జూలై సంచిక తరువాయి)

కాళీదేవి ఆవిర్భవించు వివిధరీతులను వర్ణించుచు శ్రీరామకృష్ణుడు కేశవసేనునితో నిట్లనెను. "కాళి ఒక గృహిణి. సృష్టి అంతరించినప్పుడు, సృష్టిబీజములను అమ్మ భద్రపఱచుకొనును. గృహిణి దోసగింజలను గుమ్మడికాయల పొట్లకాయల విత్తనాలను పదిలపఱచుకొనును కదా." ఉపమానములన్నియు ప్రకృతినుండియే కైకొనబడిన వనిపించును. అన్నియు భూలోక వాసనావాసితములే.

"రూప మిచ్చు అద్భుతశక్తి మనస్సునకున్నది. మనస్సుకు ఊదారంగు వేయుడు, అది ఊదావన్నెదిగ నుండును. ఆంగ్లభాష రవంత నేర్చుకొన్నవాడు ఫుట్ ఫట్ ఇట్ మిట్ అని ఆంగ్లభాషలోనే సదా సంభాషించుచుండవలెను. సంస్కృతపండితుడు శ్లోకాలను వల్లించుచుండవలెను" అని శ్రీరామ్మృష్ణుడు వక్కాణించెను; ఇట్లు హాస్యరీతిలో శ్రీరామకృష్ణుడు గొప్ప గుణపాఠము నేర్పినాడు.

స్వర్గలోకమునకు దారి ఋజువైనదే, వంపులు లేవు. ఆధ్యాత్మికవిషయప్రసంగములు కొందఱికి నచ్చవు. వారు దక్షిణేశ్వరమునకు వచ్చుటకు ఇతర కారణము లనేకము లుండును. శ్రీరామకృష్ణుని ప్రసంగములను తమ మిత్రులు తదేకతానమున వినుచుండగా, పాపము! వా రేమి చేయగలరు? ప్రసంగములలో అభిరుచి లేక వారు నౌకలలో విశ్రమింప నిశ్చయించుకొనుటను స్మరించి శ్రీరామకృష్ణుడు, భగవద్విషయమున వారు కేవలము విముఖులుగ నుండుటను గుర్తించి, "అటు పొండి, పోయి, గుడిలోని శిల్పసంపదను గనుడు" అని చెప్పుచుండును,

సమాధి యనునది నిరతిశయోన్నత దశ. అది ఉద్రిక్తభావదశకంటె పైది. దాని నధిగమించిన సాధకున కిక కర్తవ్యము లుండవు. ఈ దశను వివరింప శ్రీరామకృష్ణుడు వినియోగించుకొన్న ఉపమానములు సరియైనవి, హాస్యగర్భములు :—బ్రాహ్మణుల భోజనపంక్తిలో మొదట గలభా ఉండును. లూచీలను కూరలను వడ్డింప దొడగినంతనే సద్దు తగ్గ నారంభించును. పెరుగు వడ్డించినప్పుడు సద్దు బొత్తిగ లేదా అనిపించునంతకు తగ్గును. భోజనము ముగిసినంతనే అందఱును పరుండి నిద్రింతురు, పూర్తి నిశ్శబ్దత యుండును. నిదురవంటిది సమాధి. కోడలు ఇంటిపనులనెల్ల చేయుచుండును. కాని ఆమె గర్భవతి కాగానే అత్తగారును ఆడబిడ్డలును అన్ని పనులను తాము చేయుచు కోడలికి విశ్రాంతిని సమకూర్తురు. కానుపైనంతనే, పనులనుండి తల్లికి పూర్తి విరామమే, ఈ విరామమువంటిది సమాధి.

ఆధ్యాత్మికముగా ఎంతో పురోగతి చెందినవానికే, ధ్యానమున విశ్వాత్మతో యోగమొందినవానికే సమాధి శక్యము. కావుననే 'నాకు సమాధిని కఱపు' డని ఎవరో శ్రీరామకృష్ణు నడిగినప్పుడు శ్రోత లందఱును నవ్విరి. ఆధ్యాత్మికపరులలో సాధారణముగా స్వార్థపరత యుండదు. ఐహికపరులు కేవలము స్వార్థపరు లనెను శ్రీరామకృష్ణుడు. అంగడినుండి మిటాయిని తెమ్మన్నచో వారు ఇష్టము లేక తెచ్చుటే కాదు, తెచ్చునప్పుడు దారిపొడుగునను దానిని త్రుంచి తాము నోట వేసికొనుచు వత్తురు.

దేవునందు ప్రేమ గల వారు క్షుద్రవిషయములకై ఎట్టి కక్కుర్తిని ఆమోదింపరు. తీవ్రవైరాగ్యమును మందవైరాగ్యమును శ్రీ రామకృష్ణుడు ఈ కథద్వారా స్పష్టపఱచినాడు: ఒకానొకప్పుడు మనదేశమున నొక ప్రాంతమున అనావృష్టి కలిగినది. రైతులు పొలములకు నీరు పాఱించుటకై పొడవైన కాలువలు త్రవ్వసాగిరి. వారిలో సడలని పట్టుదల గల రైతొకడుండెను. తన కాలువ తన పొలమును ఏటిని కలుపునంతవఱకును త్రవ్వుటను మానను అని అతడు ప్రతిజ్ఞ చేసెను. త్రవ్వుటకు ఆరంభించెను. స్నానవేళ ఐనది. అతని భార్య తనకూతురిచేత అతనికి నూనె ఇచ్చి పంపినది. 'నాయనా, ఇప్పటికే ఆలస్యమైనది; ఒడలికి నూనె రాచుకొని స్నానము చేయుము' అన్నది అమ్మాయి. ''నాకు ఎంతో పని ఉన్నది. 'నీవు పో, పో'మ్మని కసరినాడు రైతు. మధ్యాహ్నము దాటినది. రైతు ఇంకను తన పొలములో పనిచేయుచునే యుండెను. స్నానము నతడు స్మరింపనైన స్మరింపలేదు. అంత అతని భార్య స్వయముగ వచ్చి ''మీరు ఎందులకు స్నానము చేయకున్నారు? అన్నము చల్లబడి పోవుచున్నదే. కొంచ పనిని రేపు పూర్తి చేసికోవచ్చును. లేదా—ఈ దినమే భోజనము కానిచ్చి పిమ్మట చేసికోవచ్చును'' అన్నది. అతడుగ్రుడయ్యెను. ఆమెను చీవాట్లు పెట్టెను, పాఱను ఎత్తుకొని ఆమెమీది కురవడించెను. ''ఏమీ? నీకు బుద్ధి లేదా? వాన లేదు, పైరు ఎండిపోవుచున్నది, పిల్లలు ఏమి తిందురు? మీ రందఱును పస్తు చత్తురు. నేడు నా పొలమునకు నీరు పాఱించుకొనువఱకును మజ్జన, భోజనములకు తలపెట్టను. అది నా ప్రతిజ్ఞ.' అని గర్జించెను. అతని కోపమును జూచి భార్య గడగడలాడి అక్కడినుండి పరుగెత్తెను. దినమంతయు వెన్నువిఱుగ శ్రమపడి, సాయంకాల మప్పటికి రైతు తన పొలమును ఏటిని కాలువచే కలుపగలిగినాడు. కలిపిన తర్వాత, కూర్చుండి, చరచర మను చప్పుడుతో పొలములోనికి పాఱుచున్న నీటిని జూచినాడు. అతని మనసున శాంతియు ఆనందమును నిండినవి. ఇంటికి పోయినాడు. భార్యను పిలిచినాడు. 'ఇప్పుడు తేవే చమురును, హుక్కాను గూడ సిద్ధము చేయుము' అన్నాడు. ప్రశాంతమైన మనస్సుతో మజ్జనభోజనములను తీర్చుకొన్నాడు, పాన్పుపై పవ్వళించినాడు. తనివితీఱ గుఱ్ఱుపెట్టి నిద్రించినాడు. అతనిలో కననైన పట్టుదలయే తీవ్రవైరాగ్యమున కుదాహరణము. మఱియొక రైతుండినాడు. అతడును తన పొలమునకు నీరు పాఱించుకొనుటకై కాలువను త్రవ్వుచుండినాడు. అతనిభార్యయు పొలమునకు వచ్చి ''చాల ప్రొద్దు పోయినది. ఇంటికి రండి. పని చేసినప్పటికిని ఇట్లు మితియు మేరయు లేక చేయుట అనావశ్యక'' మన్నది. రైతు అంతగా అడ్డు పలుకక, పాఱను ఒకవైపు పడవైచి, భార్యతో 'సరియే. నీవు రమ్మనుచున్నావు గనుక ఇంటికే వత్తును పద'' అన్నాడు. [అందఱును నవ్వుదురు]. అతనికి తన పొలమునకు నీరు పాఱించుకొన సాధ్యము కానే లేదు. ఇది మందవైరాగ్యమున కుదాహరణము.

పనమాటలును కపటతయు శ్రీరామకృష్ణునకు పనికి రావు. అందఱును కాషాయమును కట్టుకొనుట ఆయన కిష్టములేదు. దేనిని కోరుదుమో అందుకు అర్హతను ముందు సంపాదించుకోవలెను. ఒకనాడొకడు భిక్షుకవేషముతో ఆయనయొద్దకు వచ్చినాడు. ఆయన ''మద్దెలకై నేను చండిని త్యజించితి'' నన్నాడు. ఒకప్పుడు చండిశ్లోకములను పాడుచుండిన వాడిప్పుడు మద్దెల వాయించువాడయ్యెను. ఒక

సారి కేశవసేను బృందమువారు, తాము ప్రార్థన నడపుచోటికి శ్రీరామకృష్ణు నాహ్వానించిరి. కేశవుడు వేదికపై ఆసీనుడై "ఓ దేవా, మమ్ము భక్తివాహినిలో మునిగిపోనిమ్ము" అని ప్రార్థించెను. 'భక్తి వాహిని' అనుట అమోఘమైన రూపకాలంకారము. కాని శ్రీరామకృష్ణున కవి వట్టిమాటలే, కేవలము ఘోషమైన భాషయే. కావున తడుముకొనక చులుకుగా హాస్యముగా ఆయన యిట్లన్నాడు:—మీ రందరును ఏల మునిగి పోవలెను? మీరు మునిగి పోయినచో తెరమఱుగున నున్న వారి గతి ఏమి? (తెరమఱుగున నున్నవా రనగా మగువలు). కాబట్టి భక్తి నదిలో మునిగిపోవుట కంటె, మీరు ఒక్క మునుక వేసి గట్టుకు మరలి వచ్చుట మేలు".

బ్రహ్మమును గుఱించి యింకను తెలుపుమని కేశవుడు శ్రీరామకృష్ణు నడిగెను. బ్రహ్మజ్ఞాని సభలను సమావేశాలను నడపజాలడు. కేశవుడు దీనిని గుర్తించుటతోనే శ్రీరామకృష్ణునితో "ఇక దీనిచర్చ వల దనెను. ఈ సంభవమును శ్రీరామకృష్ణు డుద్రేకముతో రుచితో తెలిపెను, గోష్ఠియందుకంటె భక్తియందెక్కువ శ్రద్ధ కలవా రనిన శ్రీరామకృష్ణునకు ప్రేమ. హామిల్టను పండితుని యీ క్రింది సూక్తిని నరేంద్రనాథు డుదాహరించెను "పాండితీసహితమైన అజ్ఞానము తత్త్వశాస్త్రమునకు భరతవాక్యము, ఆస్తిక ధర్మమునకు నాంది". ఏల యన ఆస్తికత అనగా విశ్వాసమే కదా. హామిల్టను వాక్యము ననువదించి చెప్పు మనగా, నరేంద్రనాథుడు వంగ భాషలోని కనువదించి చెప్పెను. ఆంగ్లములో ఏబిసీ లైన నెఱుగని శ్రీరామకృష్ణుడు ఆనంద పరవశుడై ఆంగ్లభాషలో "థాంక్ యూ" అనెను.

మూటలు మోసికొని సంచరించు యోగి విషయమున మెలకువ గలిగి యుండు డని శ్రీరామకృష్ణు డెచ్చరించెను. "అట్టి యోగులను దక్షిణేశ్వరమున నేను చూచి యున్నాను. వారిలో కొందఱు కాయధాన్యములను జల్లించువారు, కొందఱు గుడ్డలకు అతుకులు వేసి కుట్టెడివారు, కొందఱు ఒక సంపన్ను డేలాగు వైభవోపేతముగా యతులను సత్కరించెడివాడో ధాటీ మండితముగా ఉపన్యసించెడివారు. 'మా పరిచర్యకై ఆ సంపన్నుడు ఒక లక్షరూపాయలు ఖర్చుచేసినాడు, అన్ని రకములైన మధుర భక్ష్యాలను మాకు నివేదించినాడు" అన్నారు బైరాగులు.

దేవుని సాక్షాత్కరించుకొనని వారికి, దేవు డెంతటి యానందమునకు ప్రభవమో తెలియదు. అటువంటివారు దూరదర్శిని యంత్రము గుండ పెడమర్లుగా చూచి దేవునిగూర్చి ఊహాగానములు చేయుచుందురు. 'మా మామగారి యింటి కొట్టులో పెక్కు గుఱ్ఱములుండెడి' వని చెప్పినా డట ఒకడు. అతనిని బోలినవారు వీరు. గుఱ్ఱములు లాయములో నుండునే కాని కొట్టులో నుండ వని పాప మతి డెఱుగడు.

మహిమాచరణచక్రవర్తి కాశీపూరులోనే నివసించుచు గురుదేవునొద్దకు తఱచు వచ్చుచుండెడి వాడు. అత డొకపండితమ్మన్యుడు. కాబట్టి అహంకారమును అణచుకొనలేడు. తాను ఉదారుడ నని మతాచారనిష్ఠుడ నని ధర్మకర్త నని ప్రజలకు తెలుపుకొనుటకై అతడు సర్వవిధములుగా పాటుపడెడివాడు. ఆయనయొద్ద చక్కని సంస్కృతాంగ్లగ్రంథము లున్నవి. ఒకనాడు నరేంద్రనాథు డాయనను సమీపించి "చక్రవర్తిమహాశయా, ఈ గ్రంథముల నన్నిటిని నీవు చదివియుందు వనుకొనుచున్నా" ననెను. పాండిత్యవినయముతో

నతడు "ఓ, చదివియున్నానే" అనెను. నరేంద్రుడు కొన్నిపుస్తకముల నందుకొని త్రిప్పి చూచెను. వాని అంచులు సైతము కోయబడి యుండలేదు. నవ్వుకొని, నరేంద్రనాథుడు "వీని పుటల అంచులు కోయబడకున్నవే, అదెట్లు" అని అడిగెను. సమయస్ఫూర్తితో మహిమాచరణుడు చెప్పిన జవాబు :-సోదరా, నీవు తెలిసికోగలవు. పుస్తకములను ఎరవు తీసికొనిపోయినవారిలో అనేకులు ఆ పుస్తకములను తెచ్చియియ్యకపోగా, నేను క్రొంగ్రొంత్తప్రతులను మరల కొనవలసి వచ్చినది." మహిమాచరణుడు శ్రీరామకృష్ణునొద్దకు తఱచు వచ్చుచుండెడివాడు, వచ్చినప్పుడు శార్దూలచర్మము మీద కూర్చుండును. దాని నచ్చటనే వదలి పోవుచుండును. ఎవరిది యీ శార్దూలచర్మాసన మని ఎవరైన నడిగిన శ్రీరామకృష్ణుడు నవ్వుచు "మహిమునిది. అతడు దీని నిక్కడ వదలి యేల పోయెనో తెలియునా, ఇది ఎవరిది అని జనులు అడుగుదురు, మహిమునిది అని నేను చెప్పవలెను, అంతట ఔరా మహిముడెంతటి యోగి అని ప్రతియొక్కరు తెలిసికోవలెను" అని చెప్పుచుండును. అప్పుడప్పుడు శ్రీరామకృష్ణుడు మహిమునితో "నీవు గొప్ప పండితుడవు, ఆధ్యాత్మికవిషయములనుగూర్చి నీవు ఉపన్యసింపవలె" అనుచుండును. గురుదేవుడు లోలోన నవ్వుకొనుచుండు నని అందఱును గ్రహింతురు. ఒకనాడు మహిమాచరణుడు రాగానే శ్రీరామకృష్ణు డతని హృదయపూర్వకముగ స్వాగతోపచారము కావించెను. అక్కడ ఉన్నవారందఱును చమత్కారము నర్థము చేసికొని నవ్విరి. గేలికి లక్ష్యము తానని మహిమాచరణుడు అర్థము చేసికోలేదు. 'ఏమి ఆశ్చర్యము! దోనెలు పడవలు మాత్రమే ఇక్కడికి రాగలవు. ఈనాడు మన నడిమికి బ్రహ్మాండమైన ఓడ వచ్చియున్నది. ఎట్లు ఈ యద్భుతము సంభవింపగలిగెనో! సరి తెలిసినది ఇది జూలై నెల కదా, నదికి వఱద వచ్చి ఉన్నది". కొంతసేపైన తర్వాత శ్రీ రామకృష్ణు డతనితో మరల నిట్లనెను:—ఒకప్పుడు నీవు ప్రముఖులకు సత్కారములు చేయుచుంటివి. ఇప్పుడు నీ వెవ్వరిని ఆహ్వానించుట లేదు. నీ ఆయవ్యయముల అంచన తలక్రిందులయ్యెను కాబోలు." శ్రీ రామకృష్ణుడు చెప్పనెంచిన దిది. మహిమాచరణుడు దాన ధర్మములు చేయుటెల్ల పేరు ప్రతిష్ఠలు కోరియే. పేరు ప్రతిష్ఠలు కలిగిన పిమ్మట, ఇక పైసానైనను వెచ్చింప వలసిన ఆవశ్యకత లేదు. ఇందు దూషణ మేమియు లేదు. వక్రోక్తిని రవంతఘాటుగా వినియోగించుటే

ఒక్కొక్కప్పు డది పెద్ద దెబ్బగాను ఉండును. కేశవచంద్రసేను మరణించిన పిమ్మట, ఆ స్థానమునకు ఎవరు వచ్చుట అనుటనుగూర్చి కొంత అల్లరి లేచినది. ఆవార్త శ్రీరామకృష్ణునకు తెలిసెను. ఆయన ఇట్లనెను: "సరి, ప్రతాపా, అందుంగూర్చి కలహించుచున్నవారు టామ్ము, డిక్కు, హారి. ప్రతాపుడును అమృతుడును గంభీరముగ మ్రోగు శంఖములు. తక్కినవారు మ్రోగజాలని శంఖములు."

ప్రతాపుడు సహచరుల కన్న మిన్నయైనను గర్వము తక్కువైనవాడు కా డనుట శ్రీరామకృష్ణుడు సమ్మతించిన విషయము. ఇది విశదమగుటకై శ్రీరామకృష్ణు డొక హాస్యకథను చెప్పెను. ఒకడు తన కుటీరమును కొండ శిఖరమున నిర్మించుకొనియందు వసించుచుండెను. ఒకనాడు పెనుతుపాను వీవ జొచ్చినది. ఆ కుటీరము ఉఱ్ఱూత లూగుచున్నది. దానిని నిలువుకొనగోరి అతడు వాయుదేవుని ప్రార్థించెను. ఇతని మొఱను వాయుదేవుడు

పెడచెవిని పెట్టెను. అప్పుడతడొక జిత్తును సంకల్పించెను. వాయుదేవుని పుత్రుడు వీర హనుమంతుడు! ఆ యింటివాడు "ఓ వాయుదేవా ఈ యిల్లు నీ కుమారునిది, హనుమంతునిది, కాబట్టి దీనిని పడగొట్టకుమా" అని ప్రార్థించెను. గుడిసె ఏమో మఱింతగా ఊగిపోవుచుండెను. "అది లక్ష్మణుని కుటీరము సుమా" అనెను వాడు. ఆ మాటయు ఉపయోగపడలేదు. "అది సాక్షాత్తు శ్రీరాముని పర్ణశాల" అని యఱచెను వాడు. కుటీరమేమో పెల్లగిలెను. తన ప్రాణమును నిలువుకొనుట ప్రథమ ధర్మము కాబట్టి వాడు గుడిసె వీడి వెలుపలికి వచ్చి 'ధ్వంసము కానీ, బావగారి పాడుకొంప" అన్నాడట.

(సశేషము)

# అమెరికాను గూర్చిన తెలివి

## శ్రీ రంగనాథానందస్వామి

ప్రశ్న : వ్యక్తిస్వేచ్ఛ బొత్తిగా లేని దేశాలలో వ్యాపారసంస్థలకు సమ్మె చేసే హక్కు లేదు. అమెరికాలో కార్మికుల వ్యాపార సంస్థలకు సమ్మె చేసే హక్కు ఉంది. కాబట్టి సర్వ ప్రజాసమానత్వసిద్ధాంతం వరిష్ఠ రూపంలో అక్కడుంది, అంటారే నిజమేనా?

జవాబు : అమెరికావ్యాపారసంస్థలకు సమ్మె చేసే హక్కు ఉంది. అమెరికాలోని కార్మికులకు సాంకేతికనైపుణ్యమూ ఉంది, వారి ఆర్థిక పరిస్థితియూ బాగుంది. ఒక్కొక్కరి వేతనమూ పెద్దమొత్తమే. అందువల్లనే వారు రాజకీయ కార్యరంగంలోకి అడుగు పెట్ట లేదు. సాధారణముగా కార్మికుల ఆర్థిక వైజ్ఞానికపరిస్థితులను మెరుగు పరచుటకై సాగునదే వ్యాపారసంస్థల ఉద్యమాలు. ఇతర రాజకీయశక్తులతో పొత్తు కుదరనిదే వ్యాపారసంస్థకు రాజకీయపదవియూ అధికారమూ లభించవు. సభ్యుల ఆర్థిక వైజ్ఞానికాభివృద్ధియందుమాత్రమే అమెరికను వ్యాపార సంస్థలకు అక్కఱ! రాజకీయరంగమున వానికి ఎక్కువ ఆసక్తిలేదు. కావుననే వానిది కేవలము వ్యాపారోద్యమముగానే ఉంటుంది. కార్మికుల ఉద్యమంగా, వానికి సమ్మె చేసేందుకు ఎక్కువ వేతనాలకై బేరమాడేందుకు హక్కు ఉంది. బేరం ఆడారు కూడా. కాని అదృష్టవశమున, అమెరికాలోని పారిశ్రామికులు తమంతట తామే కార్మికుల వేతనాలను బాగా హెచ్చించారు. ఎందుకంటే కొనగల ఆర్థిక సామర్థ్యం కార్మికులకు హెచ్చించడం పరిశ్రమల అభివృద్ధికి సాధక మవుతుందని వారు గుర్తించారు.

అక్కడి కార్మికుల ఆర్థికసుస్థితియూ సంపదయు చాల హెచ్చు. విరామకాలంలో కార్మికులు మధ్యధరాసముద్రపుటొడ్డులలో యూరపు పర్యటనానికి పోతుంటారు. సామాన్యులగు వడ్రంగులలో సీసపు పనివాండ్రలో తాపీపని వాండ్రలో ఒక్కొక్కనికి వేతనం గంటకు పది పన్నెండు డాలర్లు. వాళ్ళకు విరామకాలం ఉంది. అమెరికను కార్మికుల పరిస్థితి అట్టిది. ఆర్థికంగా వారిది చాల ఉచ్చస్థితి. ఐతే ఆధ్యాత్మికంగా వైజ్ఞానికంగా అభివృద్ధి కలుగవలెనంటే ఆర్థిక పారిశ్రామికాభివృద్ధు లందుకు చాలవు. పారమార్థికపరత కావాలి; ఏదో ఒక

మతంగా సిద్ధాంతంగా ఉంటే చాలదు, మానవునికి ఆధ్యాత్మిక సంపత్ప్రదంగా ఉండాలి. ఈలాంటి పోషణ అక్కడ లేదు. వారి సంపదంతా పానాదులకు దుర్వినియుక్తం అవుతున్నది. కారణం ఇంద్రియరంగమును భౌతిక రంగమును అతిక్రమించినట్టి దేదియు వారెఱుగకపోవుటే.

ఇది ప్రస్తుతం ప్రపంచమందంతటా ఉండే సమస్యే. భారత దేశంలో కూడా ఇది తల యెత్తడాని కారంభిస్తున్నది. కావుననే శ్రీ వివేకానందస్వామి "సామాన్య ప్రజలను ఉద్ధరించండి, వారి పారమార్థికపరతను మాత్రం చెడగొట్టకండి" అన్నాడు. దాన్ని చెడగొట్టితే వారు జంతుస్థాయికి దిగజారుతారు. భారత దేశంలోని కార్మికులు పేదలైనా నిరక్షరాస్యులైనా, సంస్కృతియూ నాగరికతయును గలవారు. వారు త్రాగుబోతులు కారు, దుండగీండ్రు కారు, వారిని అదుపులో ఉంచడానికి వారి విడుదుల వద్ద పోలీసు జవానులను నెలకొల్ప నక్కఱ లేదు. ఇతర దేశాలలో ఆలాగు కాదు, అక్కడ బీదతనం దుండగాలకు ప్రేరకంగా ఉంటూ ఉంటుంది. మన దేశంలో పేదలు పైనిచెప్పిన ట్లుండడానికి కారణం, అనాది కాలంగా మన యోగులు ఋషులు వారికి ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని కలిపి ఉండడమే. వీరి చూపులలో ఉన్న వెలుగు అన్యదేశాల కార్మికుల చూపులలో కానరాదని ప్రొఫెస్సరు గాల్బ్రెత్తు చెప్పారు.

కాబట్టి మన కార్మికుల ఆర్థిక పరిస్థితిని చదువు సంధ్యలను మనం పెంపొందించవచ్చు గాని, వారి వైజ్ఞానికస్థాయిని మేలొందించేది పారమార్థికపరతే అనుటను మనం విస్మరించకుందము గాక.

# లో వెలుగులు

## కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణరావుగారు

### వ్యక్తిగత విశిష్టత

సోదరా, నీకూ విశ్వానికీమధ్య అఖాతం ఉన్నట్లుగ భావిస్తూ ఉన్నావా, నీలో నీవు శుష్కించి కృశించిపోవడం తటస్థిస్తుంది.

విశ్వంలో ఏదీ విడిగ లేదు—అచేతనప్రపంచంలో కూడా వస్తువుకు వస్తువుకూ మధ్య ఆదానప్రదాన (Exchange of Force) లీల నిరంతరం జరుగుతూనే ఉన్నది.

కాని ఈ లీల ఎల్లరకు ఒక టేరీతిగ ఉండదు — ఎవరి లీల వారిదే — నీవు లోతుగ తరచి చూస్తే, ఎల్లరకు సమానంగా జరిగే విశేషలీలా ఉన్నమాట నిశ్చయమే. కాని ప్రత్యేకంగా నీలో జరిగే విశేషలీలా ఉన్నది. నిన్ను నీవు తెలుసుకోవడమంటే, నీలో ఉండే శుద్ధ చైతన్యాన్ని తెలుసుకోవడమే కాదు.

శుద్ధచైతన్యం నీలో ప్రత్యేకమైన ఉపాధులను, చిత్తస్రోతమును, ప్రవణతను, స్వభావస్వధర్మాలను కల్పించుకొని, నిన్ను విశ్వం మధ్య నిలిపి ఉంచింది.

ఆ శుద్ధచైతన్యం నీలో ఎట్టి విశిష్ట లక్షణములతో విరాజిల్లుతున్నదో, నీకూ విశ్వానికీ మధ్య ప్రత్యేకంగా ఎట్టి ఆదానప్రదానలీల

జరుగుతున్నదో తెలుసుకొంటేనే కాని, నీ జీవ స్వరూపం నీకు బోధపడి, నీ సాధన సామగ్రిని సమకూర్చుకోలేవు.

శ్రీ కృష్ణపరమాత్ముడు ఎల్లరగోపికలకూ వల్లభుడే కాని ఆ పరమాత్ముడు ఎల్లరతోనూ ఒకటే విధంగా క్రీడిస్తున్నాడా

ఆ యా గోపికలయొక్క లక్షణాలనుబట్టి, ఆ యా విధంగా సమీపించి క్రీడిస్తున్నాడు. అట్లాగే గోపిక లెల్లరూ పరమాత్ముని ఒకటే విధంగా చూచి ఆనందించడం లేదు.

ఆ పరమాత్ముడు తలచు ఏ హావభావము లతో ఎట్టి నాట్యవిలాసంతో తమను సమీపి స్తున్నదీ తెలుసుకొని, వాని కనుగుణంగానే పరమాత్ముని సమీపిస్తున్నారు.

పరమాత్ముని లీలావిలాసము లనంతము లంటే ఏమిటి? అనంతకోటి జీవరాసులతోను అనంత విధాల అనంతరూపాలలో క్రీడించగల్గే నటనాచతురుడు కనుకనే అతడు జగన్నాటక సూత్రధారుడను బిరుదమును బొందియున్నాడు.

ఈ నాటకరంగంలో, ఆ సూత్రధారుడు నీకు ప్రత్యేకమైన భూమికనిచ్చి నిన్నెట్లా ఆడిస్తు న్నదీ—నీ అనుభవంద్వారా అవగతం చేసుకో లేకపోతే నీ సాధన ఇంకా ప్రారంభం కాలే దన్నమాట.

ఎప్పుడు విశ్వశక్తి సర్వగతమే కాకుండా నీలో ప్రత్యేకంగా గుడి కట్టుకొని ఎట్టి పూజ లను గోరుతూ నీ యిష్టదైవము కానున్నదీ ప్రత్యక్షమైనప్పుడే నీ సాధన వికాసం పొంద గలదు.

నీ జీవనం త్రివేణీసంగమం వంటిది — ఒక స్రవంతి నీది, రెండవది విశ్వానిది, మూడవది శుద్ధచైతన్యానిది. ఈ మూటి భేదాభేదముల మధ్య నీ జీవనలీల విరాజిల్లుచున్నది. ఈ రహ స్యానుభవమే నీ లక్ష్యసిద్ధి.

## వ్యక్తిప్రాముఖ్యం

సోదరా, ఈ బ్రహ్మాండంలో నేనొక నలు సును. అనంతకోటి జీవరాసులలో నేనెక్కడో! ఒక గాలివచ్చి ధూళిధూసరం లేవకొట్టి ఎక్క డికో విసరివేయునట్లు ఈ విశ్వం నన్ను లక్ష్య పెట్టకుండా, తన ఆటను తాను ఆడుకొం టూంటే, నేనుమాత్రం ఈ విశ్వాన్ని ఎందుకు లక్ష్యపెట్టాలె—అని కాదూ నీ సంకోచము?

ఈ విశ్వం కళ్లులేని కబోదివంటి దనుకొం టున్నావు. దానినడక గ్రుడ్డిదని నీ అభిప్రాయం. నీ ఉనికే దానికి తెలియదని నీ ఉద్దేశం. ఎట్టి అజ్ఞానమోయి నీది? ఈ విశ్వానికి వెయ్యికళ్ళు న్నాయి నీకు తెలుసునా? విశ్వంలోని ప్రతివస్తు వును ప్రతి జీవిని కూడా ఆ వెయ్యి కళ్లతోను కనిపెట్టుతూనే ఉన్నది.

విశ్వంయొక్క చూపులో విభాగాలు లేవు. ఆ చూపుకు ప్రతిజీవి కేంద్రము, లక్ష్యం. బ్రహ్మాండాల నన్నిటిని ఎంత సమగ్రంగా చూస్తున్నదో, నిన్నొకరినిగూడ అంత సంపూ ర్ణంగా వేయి కళ్లతోనూ కనిపెట్టుతూనే ఉన్నది.

విశ్వమంటే వస్తువుల కూడిక కాదు — జీవుల లెక్క కాదు. వది ప్రతి అణువునందూ, ప్రతి జీవియందూ, సంపూర్ణమో, అనంతమో, సర్వమునందు కూడా అంత సంపూర్ణము — అనంతము. నీవు విశ్వాన్ని లక్ష్యపెట్టక పోయినా, విశ్వంలోకెల్లా నీ వొక్కడవే అయి నట్లు, విశ్వం నిన్ను సంపూర్ణంగా లక్ష్య పెట్టుతూ, నీ భవితవ్యాన్ని సమాదరణతో నిరూపిస్తూనే ఉన్నది.

ఈ విశ్వంలో ప్రతి అణువుకూ, ప్రతి జీవికి స్థానమున్నది. ప్రాముఖ్యమున్నది. లోక మనుకొనే హెచ్చుతగ్గులు, ఆధిక్యన్యూనతలు కృత్రిమములు. విశ్వదృష్టిలో సర్వము సమానము. జగత్తుకు అగ్ని ఎంత అవసరమో జలం, వాయువు అంత అవసరము — అయినా వాని ధర్మాలు వేఱు.

లోకం చరిచే చప్పట్లనుబట్టి ప్రాముఖ్యములను నీవు నిర్ణయించకు. నీవు విశ్వాన్ని ఎంత వఱకు ఉపలక్షించి, ఎట్టి బలిదానము చేయగల్గుతున్నావో — నీ ప్రాముఖ్యము అంత ప్రమాణాన పెరుగుతూ ఉంటుంది. ఈ లోకమే విశ్వమని భ్రమించక. ఈ లోకం నిన్నాదరించక పోవుగాక. నిన్ను బహిష్కరించి పీడించినను పీడించుగాక. కాని విశ్వజనని నిన్ను విడనాడదు. తల్లి అంకమే నీ రంగభూమి. ఆమె ప్రేమబాహువులనుండి నిన్నెవరు తప్పించగలరు? లోకం గతానుగతికంగా నిర్దేశించే కొలతలను, ప్రమాణాలనుబట్టి, నీ జీవనానికి విలువకట్టుకోవడం సరికాదు. నీ ప్రాముఖ్యం నీది. నీ భవితవ్యం నీది. నీ వొక్కడవు లోపించినా, విశ్వమే తారుమారై ఊరుకొంటుంది. ఇక నీ ప్రాముఖ్యం ఎట్టిదో ఊహించుకో. విశ్వజనని సర్వాంగసుందరి, నీవు తల్లి అంగములలో ఒక అంగమే అగుదువుగాక. ఆ ఒక్క అంగం లేకపోతే, నీ తల్లి వికలాంగి, కురూపి అయినట్లు కాదా? నీ తల్లి పాదనఖములలో నీ వొక నఖాగ్రమై, ఆ నఖం నిండుదీప్తితో ప్రకాశిస్తే, తల్లి ఎంత ఆనందపడుతుంది? వెలుగులు ఎంత మంది దుఃఖులకు శాంతిదాయకములగునో!

## నానాత్వంలోని మాధుర్యం

సోదరా, విశ్వముయొక్క నానాత్వము, మూలంలోనున్న ఐక్యమును మఱుగుపరుస్తున్నదనే తలంపుతో, ఈ విశ్వాన్నుండి దూరం కావడానికి ఆలోచిస్తున్నావు. ఈ తలంపు సరియైనది కాదు సుమీ. నానాత్వం నిజంగా ఐక్యమును మఱుగుపరచటం లేదు. పైగా దానిని శతకంఠాలతో ఉద్ఘాటిస్తున్నది. ఈ నానాత్వమే నీకు గోచరించకపోతే, ఐక్యముయొక్క సుస్వరూపాన్ని నీవు సరిగ అవగతం చేసుకోలేవు. ఐక్యము—నానాత్వం—ఈ రెండూ ఒక వస్తువుయొక్క లక్షణాలే. లక్షణాలను వేఱుగ పేర్కొంటున్నాము కనుక, వస్తువు కూడా లక్షణాలనుబట్టి భిన్నం అనుకొంటున్నావు.

ఇట్లా ఒకమారు తలయెత్తి చూడు— నీ యెదుటనున్న పూవు ఒకటా? రెండా? మూడా? ఒకటని ఎట్లా అంటావు? నీకది ఒకటిగ ఎట్లా గోచరిస్తున్నది? అది ఒకటి కాదు, అయిదు అని నీ వెందుకు అనకూడదు?

నీకు పూవు అనే జ్ఞానం ఎట్లా కలుగుతున్నది? కంటికి గుండ్రంగా, పచ్చగా గనబడుతున్నది. ముక్కుకు సుగంధంగా ఉన్నది. స్పర్శకు మృదువుగ ఉన్నది. రుచికి వగరుగ ఉన్నది. చెవికి నిశ్శబ్దంగా ఉన్నది. ఈ లక్షణాలన్నీ ఒక పుష్పానివే అని నీవు గ్రహించి అది ఒకటే పువ్వు అని అంటున్నావు.

కాబట్టి, భిన్న ఇంద్రియాలద్వారా అనుభవిస్తున్నా, ఆ శబ్దస్పర్శ రూపరసగంధములు ఒక వస్తువు ఇచ్చేవే అని సమీకరణ చేసుకోగల్గుతున్నావు.

ఒక వస్తువును ప్రేమించావంటే— ఒక్క చూపు చాలదు, ఒక్క అనుభవం చాలదు. దానిని ఎన్నో విధాలుగ ఎన్నో రూపాలుగ అనుభవిస్తేనే కాని నీకు సంతృప్తి కలుగదు. తల్లి శిశువును తొట్టిలో పెట్టి చూస్తూ ఊరుకో

కూడదూ? కాని ఊరుకోదు—ఆమె ఎడదలో వాత్సల్యం పొంగిన కొద్దీ, శిశువును ఒడిలోకి తీసుకొంటుంది—ముఖంపై చూపులను గురిపిస్తుంది. ఆ సొట్ట బుగ్గలపై ముద్దుల నొలికిస్తుంది. పలకరించి నవ్విస్తుంది. ఏడిసే ఓదారుస్తూ పాటలు పాడుతుంది.

విశ్వంలోని నానాత్వం కూడా ఇంతే. నీవు విశ్వజననియొక్క బిడ్డవు. తల్లి ఇన్నివిధాల నీతో ఆడుకొంటూంటే, ఈ ఆటలు తల్లిని దూరంచేస్తున్నాయి అంటావా?

ఆ తల్లే నీకు దేహమిచ్చి పాలిస్తున్నది. ప్రాణమొసగి పుష్టినిస్తున్నది. మనస్సును మేల్కొల్పి చిన్నె వన్నెలతో కూడిన నీ క్రీడారంగాన్ని చూపుతోంది. నీకు బుద్ధినిచ్చి, జ్ఞానమహిమను వెల్లడిపఱుస్తున్నది. నీలో ప్రేమ నుబికించి సౌందర్యరసాన్ని చవులూర రుచి చూపుతోంది. సోదరా, నానాత్వము తల్లియొక్క సమృద్ధి, సంపద, ఐశ్వర్యము, విలాసము, నీ తల్లియొక్క అఖండభాగ్య వితరణానికి పొంగిపోక, ఏ ఎడారికో పారిపోతానంటావా?

## జ్ఞానం—ప్రత్యక్షం, పరోక్షం

సోదరా, వెలుగు వెలుగు అంటూంటే—నీ బుద్ధిగతమైన జ్ఞానమని అనుకున్నావా, పెద్ద పొరబాటులో పడ్డావన్నమాట.

బుద్ధిగతజ్ఞానం నిర్మలమైన జ్ఞానం కాదు. బుద్ధికూడా ఒక ఇంద్రియము—జడము—అద్దం ద్వారా ప్రసరించే వెలుగు మసకగా ఉంటుంది కాని నిర్మలంగా ఉండదు.

నీ బుద్ధిలో ఎన్నో కుసంస్కారాలు, శాస్త్రాలు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి. అవి వెలుగును సరిగ ప్రసరించనీయవు. మన చదువుల మూలంగా మనం పరప్రత్యయనేయబుద్ధులం కావడం తటస్థిస్తున్నది. నీ వనుకుంటావు—శాస్త్రాలు నేర్చినకొద్దీ, నీ మేధాశక్తి, పాండిత్యం, జ్ఞానం వృద్ధిపొందుతున్నవని, కాని నీ కవి బయటకు సంతృప్తి ఇచ్చినా, అంతరంగంలో నీ బుద్ధి సత్యానికి దూరమై పోతోందని తెలిసికో.

వైజ్ఞానికులు, ప్రకృతిపరిశోధకులు ఇంద్రియ ప్రత్యక్షంమీద ఆధారపడి, సత్యంయొక్క వాస్తవరూపాన్ని తెలుసుకొంటున్నట్లు నీ వనుకొంటున్నావు. అది వట్టిమాట.

సత్యం మారేది కాదు. అది నిత్యం, నిర్వికల్పం. కాని వైజ్ఞానికుల సిద్ధాంతాలు తఱచు మారుతూ ఉంటాయి. మారేది సత్యమెట్లా అవుతుంది? వారిది ప్రత్యక్షజ్ఞానం అనుకొంటున్నావు కాని, వారిది నిజంగా పరోక్షజ్ఞానం. రోక్షమైన అనుమాన ప్రమాణపూర్వకమైన జ్ఞానం. ఈ రహస్యం వైజ్ఞానికులకు తెలియకపోలేదు. కనుకనే వారు తమ పరిశోధనలను విరమించరు.

బుద్ధి జల్లెడవంటిది. దాని రంధ్రాల్లోనుండి పొల్లుతోబాటు గింజలు కూడా జారిపోతూ ఉంటాయి. అందుకనే వైజ్ఞానికులు తిరిగి తిరిగి జల్లెడపడుతూ ఉంటారు

బుద్ధి నెంత నిర్మలంచేసినా, దాని మసక వదలదు. అది సరాసరి చూడలేక, వక్రంగా నడుస్తూ ఉంటుంది. వారి నడకనుబట్టి వారి సత్యభావనకూడా వక్రిస్తూ ఉంటుంది—సత్యంకోసం తడుముకోవడ మన్న మాట సత్యాన్వేషణమంటే.

మన వేదఋషులు సత్యాన్ని ''ఋతం' అని వర్ణించారు. ఋతం అంటే సరళంగా ఋజుపథంలో [illegible]గ నడిచేది అని అర్థం. బుద్ధికి గోచరించేది ''ఋతం'' కాదు. దాని వికృతం—refraction వల్ల కలిగే వికారం.

బుద్ధిని అతిక్రమించగలిగినప్పుడే—నీ పాండిత్యాలను, శాస్త్రసిద్ధాంతాలను, తర్కమీమాంసలను, నీ నిర్వచనాలను అతిక్రమించగలిగినప్పుడే—సత్యము ఋతమై ఆత్మజ్యోతిగ సాక్షాత్కార మగుతుంది. దానినే పెద్దలు అపరోక్షానుభూతి అంటారు. అది కలిగితే—అంతకు పూర్వము ఆవరణలుగ ఉండే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధికూడా నిర్మలములై తేజోవంతములై, సర్వమూ వెలుగుగ మారుతుంది. అందుకనే "సత్యధర్మాయ దృష్టయే"—సత్యస్వరూపం సాక్షాత్కారంకోసం—నీ బుద్ధిపై మూతగ బడి ఉన్న హిరణ్మయపాత్రను తొలగించుమని ఋషులు ప్రార్థించారు.

## అవాఙ్మానసం

సోదరా, బుద్ధిచూపు మసకగా ఉంటుందని, బుద్ధినే వదిలితే, ఆ మసక చూపు కూడా పోదూ ?

నిజమే బుద్ధిని దాటలేనంతకాలం స్వబుద్ధిమీద ఆధారపడి ఉండక తప్పదు. కాని బుద్ధికి గోచరించేది సత్యంయొక్క అంశం మాత్రమే అని తెలిసికొని ఉంటే, చిక్కుల్లోపడం.

సత్యాన్ని సమగ్రంగా చూడగలశక్తి బుద్ధికి లేదు. బాలుడెట్లా పద్యాన్ని పదచ్ఛేదం చేసుకొంటూ అన్వయం చేసుకొంటాడో, అట్లాగే బుద్ధికూడా సత్యాన్ని ముక్కలు ముక్కలు క్రింద చీల్చి, సత్యాన్ని అనుగమిస్తుంది. ఈ ముక్కలనైనా అది సరిగ కలుపుకోలేదు. ఈ ముక్కల్లో కొన్ని తార్కికబుద్ధికి పరస్పరవిరుద్ధంగా కనబడతాయి. సమన్వయంకోసం కొన్నిటిని వదిలివేస్తాడు— మిగిలిన వాటితో ఒక నిర్వచనం చేస్తాడు. కాబట్టే లోకంలో ఇన్ని నిర్వచనాలు, ఇన్ని మతా లేర్పడి అన్యోన్యం వివాదకారణా లగుతున్నాయి.

సత్యం - అనిర్వచనీయం, అనిర్దేశ్యం, అవాఙ్మానసగోచరం అని శ్రుతు లొక మూలఘోషిస్తున్నా, శ్రుతి ప్రమాణాన్ని నమ్మేవారే సత్యాన్ని తమ నిర్వచనాల్లో బంధింపజూస్తున్నారు.

ఈ నిర్వచనాలన్నీ ఖండసత్యాలు—సత్యం యొక్క భిన్నదిక్కులు. పూర్ణసత్యం వీనిని మించినది—అన్నిటిని అంతర్భూతం చేసుకోగలది. అది స్వరూపతః అఖండం-అపరిచ్ఛేద్యం, బుద్ధిమీద ఆధారపడి ఉండే పండితు లీ రహస్యాన్ని అవగతం చేసుకోక, నా నిర్వచనం, నా మతం, నా సిద్ధాంతం అంటూ అహమహమిక కనబరుస్తారు.

వివేకానంద స్వాములవారన్నారు-మానవు లెంతమంది ఉన్నారో, మతాలు కూడ అన్ని ఉన్నాయని—There are as many theologies as there are human faces. దీనినే రామకృష్ణ పరమహంసుల వా రిట్లా చెప్పారు - అన్ని మతాలు ఖండసత్యాలని.

సత్యం పలుముఖాలు కలది. అది విశ్వతోముఖం. ఎవరి సంస్కారాన్నిబట్టి వారు తమ మతాన్ని నిర్ణయించుకొంటారు. అన్నిమతాలు చివరకు నదులన్నీ సాగరంలో కలియునట్లు పరమతత్వంలో ఇమిడేవే. అందుకనే అరవిందుడు సత్యాన్ని పలుద్వారాలు గల మహాప్రాసాదంతో పోల్చాడు. ఒక ద్వారం పెద్దది కావచ్చు. ఇంకొక ద్వారం చిన్నది కావచ్చు. ఎంత ఇఱుకుసందులో నుండి పోయినా తుదకు ఆ భవనాంతరాళంలోకి పోక తప్పదు. సత్యం అతీతదృష్టికి ఏకం—విశ్వదృష్టికి సర్వం.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణానందస్వాముల జయంతి

శ్రీరామకృష్ణానందస్వామి, పరమహంస శ్రీరామకృష్ణభగవానుని ప్రత్యక్షశిష్యులలో ఒకరు. ఈయనగారి 111 వ జయంతిమహోత్సవాలు మద్రాసు మైలాపూరు శ్రీరామకృష్ణ మఠంలో జూలై 28 వ తేది శనివారము నాడున్నూ 29 వ తేది భానువారంనాడున్నూ భక్త్యుత్సాహాలతో కొనియాడబడ్డాయి.

శనివారంనాడు తిథిపూజ. మఠావరణం తోరణమాలాలంకృతమై ఉత్సవమునకు ద్యోతకమైన ప్రజ్వలతతో ఒప్పారింది. మంగళ నాదస్వరవాద్యంతో వేకువను 5 గంటలప్పుడు మంగళహారతితో నాటి కార్యక్రమం ఆరంభమైంది. వివిధగ్రంథాల పారాయణమూ భజన సంకీర్తనలు, విశేషపూజ, హోమము సమావిష్టమైన భక్తబృందమునకూ దరిద్రనారాయణులకూ అన్నసంతర్పణము ముగిసేటప్పటికి మధ్యాహ్నం దాటింది. నాటి సాయంకాలం ఆరాత్రికం ముగియంగానే మఠమండపంలో భక్తసదస్సు కూడినది. అప్పుడు శ్రీశ్రీరంగానందస్వాములు గురుసేవాంకితమైన శ్రీరామకృష్ణానందస్వాముల జీవితచరిత్రను ఆయనప్రతిభను హృదయవిశాలతను ఈలాగు ప్రస్తుతించారు :— "గురుభక్తియే ఆయనతపస్సారం. గురువే ఆయనకు సర్వం. ఆత్మసాధన శిఖరం గురుసేవే అనే అధ్యవసాయంతో గురుదేవుని జీవితకాలంలో శశి ఆ సేవలో వ్యగ్రుడై ఉండినాడు. గురుదేవుని భౌతిక దేహం పడిపోయిన తర్వాతకూడ, ఆయనసాన్నిధ్యం శశికి సదాను భూతిలో ఉంటూ వచ్చింది. ఆయన గురుభక్తియూ గురుసేవయూ ఈనాటి యువకులకు చక్కని గుణపాఠాలు. సనాతనాచారనిష్ఠకును విశ్వవిశాలదృక్పథమునకున్నూ చక్కని కలయిక ఆయనలో ఉండేది."

ఆంగ్లంలో ఉపన్యసిస్తూ శ్రీమత్తపస్యానంద స్వాములవారు ఈలాగు సెలవిచ్చారు — శ్రీరామకృష్ణానందస్వామిలో అమోఘమైన ప్రతిభకూ అగాధమైన భక్తికి చక్కని కలయిక. పుస్తకాలు చదవడం స్వామికి ప్రియమే ఐనా, భక్తిసాధన అంతకంటే ప్రియం. ఆధ్యాత్మికం కాని దేదైనప్పటికీ, అందుకై ఆయన క్షణకాలంగూడా వినియోగించడు. ఆయన వ్రాసిన గ్రంథాలు ఉన్నాయి. వానిని అర్థం చేసుకోవలెనంటే మెలకువయూ ఆలోచనయూ ఉండాలి. శిష్యులను ఆధ్యాత్మిక జీవిత నియమాలకు కట్టుపఱచడంలో అతికఠినుడు, వారి సంక్షేమాభిలాషలో అతిమృదుహృదయుడు. ఆయన కుండిన నమ్మకం అద్భుతాలకు సాధకం. ఆయనకు గురుదేవునందుండినంత భక్తిప్రపత్తులు శ్రీ మాతృదేవియందునూ శ్రీ వివేకానందస్వామియందును ఉండేవి. శ్రీ రామకృష్ణోద్యమవ్యాప్త్యభివృద్ధులకై ఆయన సాగించిన కృషి అతిముఖ్యమూ అవిస్మరణీయమూ.

ఈ జయంతి బహిరంగోత్సవ కార్యక్రమం 29-7-73 వ తేది భానువారంనాడు వివేకానందహాలులో ఏర్పాటైంది. బ్రహ్మశ్రీ ఉడయలూరు ఎ. రాజగోపాలశర్మగారు మధ్యాహ్నానంతరం 3-30 గంటలనుండి 5-30 గంటల వఱకు విభీషణశరణాగతినిగూర్చి హరికథాకాలక్షేపం వినిపించారు. 5-30 గంటలకు పౌర సభ సమావేశమైనది. పాండిచేరి ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ ఎ. చేదిలాలుగారు సభాధ్యక్ష్యం వహించారు.

సదస్సుకు స్వాగతాశీస్సు లనుగ్రహిస్తూ శ్రీమత్తపస్యానందస్వాములవారు, శ్రీరామకృష్ణోద్యమంతో శ్రీ చేదిలాలుగారి కుండిన సన్నిహిత సంబంధాన్ని ప్రస్తుతించారు.

మదరాసు వివేకానందకళాశాల తమిళ భాషాధ్యాపకులైన ఆచార్య బి. రామర్ గారు తమిళంలో శ్రీ శశిమహారాజుల జీవితచరిత్రను సంక్షేపించి తెలిపారు. "ఆయన చేసిన ప్రతి పని గురుసేవారూపమే. ఆయనకు శ్రీ వివేకానందస్వామి పెట్టిన 'రామకృష్ణానంద' నామం యథార్థాక్షరం. గుడిలోని గురుదేవుని చిత్రపటం ఆయనకు సాక్షాద్గురుదేవుడే కాని కేవల చిత్రపటం గాదు. హిందూసిద్ధాంతనిష్ఠాపరుడైనా, ఆయనకుండిన అన్యమతములనుగూర్చిన పరిజ్ఞానమూ ఆ మతప్రవక్తలపట్ల ఆదరమూ ప్రశంసార్హములు"—అన్నారు.

మదరాసు జైన్కాలేజి ప్రిన్సిపాలు ఆచార్య కె. ఎస్. నాగరాజంగారు ఆంగ్లంలో కావించిన యుపన్యాససారసంక్షేపం:— "శ్రీరామకృష్ణ మతనిర్మాణంలో శశిమహారాజు నిర్వర్తించిన వంతు అనల్పము, కల్పాంతస్థాయి. సన్న్యాస నియమాలను ఆయన 'తు' 'చ' తప్పక పాటించేవాడు. ఎంత చిన్నపనినైనా మిక్కిలి ఆస్థతో చేసేవాడు. ఎంత దుర్గ్రాహ్యవిషయమునైనా అతిసుగ్రహమయ్యేటట్లు వివరించగల శక్తి ఆయనసొమ్ము. క్షుద్రరాజకీయవిషయచర్చలు ఆయనకు గిట్టవు."

తర్వాత మాన్యశ్రీ చేదిలాలుగారు ఉపన్యసించారు. వారి ఉపన్యాసవ్యాసాన్ని ఆంగ్లించి ఆగస్టు (73) సంచికలోనే ప్రచురించి ఉన్నాం.

వివేకానందకాలేజి ప్రిన్సిపాలు డాక్టరు వేంకటసుబ్రహ్మణ్యంగారి వందనోపచారంతో నాటి సభాకార్యక్రమం ముగిసింది.

తర్వాత మఠభజనబృందంవారు శ్రీ వీతమోహానందస్వాముల ఆధ్వర్యంలో గంటన్నర సేపు కాళికీర్తనం చేశారు.

## అశ్రుతర్పణం

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో న్యూయార్కులో రామకృష్ణ వివేకానంద కేంద్రాన్ని నెలకొల్పి దానికి నిర్వాహకులుగా ఉంటూ ఉండిన శ్రీ మన్నిఖిలానందస్వాములు థౌసండైలండ్పార్కులో 1973 వ సంవత్సరం జూలై నెల 21 వ తేదీనాడు బ్రహ్మైక్యం పొందారు. వారికి వయస్సు 78. వారు మాతృశ్రీ శారదాదేవియొద్ద మంత్రోపదేశం పొందారు, 1922 లో ఈ సంఘంలో ప్రవేశించారు. 1924 లో శ్రీ శారదానందస్వాములొద్ద సన్న్యాసదీక్ష స్వీకరించారు. మాయావతి అద్వైతాశ్రమంలో కొంతకాలం పని చేశారు. 'శ్రీరామకృష్ణుని జీవితచరిత్రము'ను వారు వ్రాసిన దప్పుడే. 1931 లో అమెరికాకు పంపబడ్డారు. 1933 లో న్యూయార్కునగరంలో రామకృష్ణవివేకానంద కేంద్రాన్ని స్థాపించారు. తమ నిర్యాణానికి కొన్ని నెలల మునుపటివఱకు ఆ కేంద్రానికి నిర్వాహకులుగా ఉండినారు. గ్రంథరచనరూపంలో ఆయన చేసిన సేవ అపారం. మహేంద్రనాథగుప్త వంగభాషలో శ్రీశ్రీరామకృష్ణకథామృతం అనేపేర వ్రాసిన ఐదు సంపుటాల గ్రంథాన్ని ఈయన "గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ" అను పేర ఆంగ్లభాషలోనికి అనువదించారు. ఖండఖండాంతరాల సకలమానవులకు గురుదేవుని వాగమృతాన్ని ఈ ఉద్గ్రంథం చవిచూపింది. ఇదిగాక "ఉపనిషత్తులు" "భగవద్గీత" "హిందుమతము: ఆత్మవిముక్తి విషయికంగా దానిపరమార్థం" "మాతృశ్రీ జీవితచరిత్ర" "వివేకానందస్వామి జీవితచరిత్ర" మొదలుగా ఎన్నో ఉన్నాయి ఆయన వ్రాసిన గ్రంథాలు. ఆయన నిర్యాణం చేత శ్రీరామకృష్ణసంస్థ ప్రతిభాంచితుడగు విద్వద్వతంసుని కార్యనిర్వహణనిపుణుని కోల్పోయింది. గురుదేవుని శ్రీచరణసన్నిధినిఆయన నిత్యానందమున ఓలలాడుచుందురుగాక.

శ్రీరామకృష్ణ మిషను

# పశ్చిమ బంగాళమున వఱద బాధితులకై సాహాయ్య కార్యక్రమం

## వి న్న ప ం

ఇటీవల వఱదలవల్ల పశ్చిమబంగాళంలోని నాల్గుజిల్లాలు ఎంతటి విధ్వంసానికి గుఱి యైందిన్నీ అందరికీ తెలిసిందే. అక్కడ పాటిల్లిన అపారప్రాణనష్టాన్ని ఆస్తినష్టాన్నిగూర్చిన వార్తలను ప్రతిదినమూ పత్రికలున్నూ రేడియోయూ అన్ని ప్రాంతాలవారికీ అందజేస్తున్నాయి. మిడ్నపూరుజిల్లాలోని ఘటల్విభాగంలో సాహాయ్యకార్యక్రమం ఆరంభించేందుకై రామకృష్ణమిషనువారు కొంత సామగ్రితో కొందఱు సన్న్యాసులను పంపారు. సాధ్యమైతే సాహాయ్యకార్యక్రమాన్ని ఇతరప్రాంతాలకు కూడా విస్తరిల్ల చేయాలి.

ఉదారమహాజనులు తప్పక తోడ్పడగలరన్న విశ్వాసంతోనే మిషనువారు ఈ కార్యక్రమం ప్రారంభించారనడం చెప్పాలా? ధారాళంగాను నిర్నిరోధంగాను వారు అందజేసే విరాళాలు ఈ ప్రణాళికను అమోఘంగా నిర్వర్తింపజేస్తాయని విశ్వసిస్తున్నాము. ఈ క్రింది విలాసాలకు విరాళాలు అందజేస్తే కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించి రసీదులు పంపుతారు. చెక్కులను రామకృష్ణమిషనుపేరట వ్రాసి 'జెనరల్ సెక్రిటరి, రామకృష్ణమిషను, బేలూరు పోస్టు, హౌరాజిల్లా పిన్. 711202'' అను విలాసానికి పంపవచ్చు.

బేలూరుమఠం
తేది 7-9-1973.

గంభీరానందస్వామి
జెనరల్ సెక్రిటరి.

### వి లా సా లు

1. రామకృష్ణమిషను, బేలూరుమఠం - 711202.
2. అద్వైతాశ్రమం, 5 దెహి ఎంటల్లిరోడ్డు, కల్కత్తా - 700014.
3. ఉద్బోధన్ ఆఫీసు, ఉద్బోధన్ లేన్, కల్కత్తా - 700003.
4. రామకృష్ణమిషన్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ కల్చర్, గోల్పార్కు, కల్కత్తా - 700029.
5. రామకృష్ణమిషన్ సేవాప్రతిష్ఠాన, 99 శరత్బోసురోడ్డు, కల్కత్తా - 700026.
6. రామకృష్ణమిషన్, ఖార్, బొంబాయి - 400052.
7. రామకృష్ణమిషన్, రామకృష్ణాశ్రమమార్గము, న్యూఢిల్లీ - 110055.
8. రామకృష్ణమఠం, మైలాపూరు, మద్రాసు - 600004.
9. రామకృష్ణమిషన్ ఆశ్రమం, రామకృష్ణ అవెన్యూ, పాట్నా - 800004.
10. రామకృష్ణమిషన్ ఆశ్రమం, రామకృష్ణనగర్, కాన్పూరు - 208012.
11. రామకృష్ణమిషన్ సేవాశ్రమం, చంద్గంజ్, లక్నో - 226007.
12. రామకృష్ణమిషన్ హోమ్ ఆఫ్ సర్వీసు, లూగ్సా, వారణాశి - 221001.
13. రామకృష్ణాశ్రమం, ధన్టోలి, నాగ్పూరు - 440012.
14. రామకృష్ణమిషను ఆశ్రమం, సెక్టారు 15-బి, చండిగడ్ - 160017.

# గ్రంథ పరిచయం

## భారతజాతికి నాహితవు
## స్వామి వివేకానంద

చిన్నసైజు పుటలు 36, వెల 40 పైసలు, ప్రకాశకులు : శ్రీరామకృష్ణ సేవాసమితి, బాపట్ల, గుంటూరుజిల్లా,

మాయావతి అద్వైతాశ్రమమువారు ప్రచురించిన 'వివేకానంద, హిస్ కాల్ టు ది నేషన్' అను గ్రంథములోని కొన్ని ప్రకరణముల ఆంధ్రానువాదం ఈ గ్రంథం. 'విశ్వాసము' 'మానసికశక్తులు' 'మానవసేవయే మాధవసేవ' అను మూడు ప్రకరణాలున్నూ స్వామిజి జీవితచరిత్ర సంగ్రహమున్నూ ఇందు కలవు. డాక్టరు బొడ్డుపల్లి పురుషోత్తం (ఎమ్. ఎ., పి. హెచ్ డి.) అను వారు ఇందలి రచనను పరిష్కరించియున్నారు. అశాంతి పూరితమైన నేటి వాతావరణంలో ఉత్తేజకరములైన శ్రీ వివేకానందస్వాముల సూక్తులు యువజనులకు అత్యావశ్యకమైన కనువిప్పు సమకూర్చడంలో అత్యమోఘములు. వాని యీ ఆంధ్రానువాదానికి స్వాగతం.

—ప్రభాకర్.

## శ్రీమద్భాగవతము

దశమస్కంధము – పూర్వభాగము.

శ్రీ వ్యాసమహర్షిప్రణీతమైన గీర్వాణమూలము, తత్త్వదర్శిని యను పేర విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు తెలుగులో వ్రాసిన టీకాతాత్పర్యాలు. శ్రీ బమ్మెర పోతరాజుగారి అనువాద పద్యములు – ఇందు గలవు. ప్రకాశకులు : చదలువాడ జయరామ శాస్త్రి అండ్ సన్సు, నెల్లూరు. రాయలుసైజు పుటలు 1103, వెల రు. 40.

భారతీయ ధర్మప్రబోధకములైన గ్రంథములలో శ్రీమద్భాగవతమునకు సాటి శ్రీమద్భాగవతమే. శ్రీ వేదవ్యాసప్రోక్త మగుటచే అది అత్యంత ప్రాచీనగ్రంథమే అయినను క్రీ. శ. 12 వ శతాబ్దిలో భక్తిమతములు దేశమున పెక్కెడల పెంపొందుటతో శ్రీమద్భాగవతమునకు విశేషప్రచార మేర్పడినది. సకల పురాణకర్తయు మహాభారతేతిహాసప్రణేతయు అగు వేదవ్యాసుడు తన పరిణతదశలో రచించిన దిది. కావున నిది ఎంత ప్రాచీనమో అంత నిత్యనూతనమునై యున్నది.

శ్రీమద్భాగవతము క్రీ. శ. నాల్గవశతాబ్దిలోనో ఆఱవశతాబ్దిలోనో రచితమైనట్లు ఇదానీంతన చారిత్రకవిమర్శకులు కొందఱు నిర్ణయించిరి. వారిని మించిన మేధానిధులు మఱికొందఱు క్రీ. శ. 14 వ శతాబ్దిలో బోపదేవు డీ భాగవతమును రచించె ననిరి. ఈ విద్వత్ప్రముఖుల కందఱికిని ప్రణామశతము లర్పించుచునే భారతభాగవతముల వ్యాసకర్తృకతచే నిర్వివాదముగ తేలిన దాని అత్యంత ప్రాచీనతను డాక్టరు ఆర్. డి. రనడేగారు తమ వ్యాసమున చక్కగా నిరూపించి యున్నారు. శ్రీకృష్ణుని లీలలను భక్తుల దివ్యచరిత్రములను ప్రతిపాదించుటే భాగవతప్రణాళిక. 'వేదాంత' 'భక్తి' సిద్ధాంతములకు సమన్వయము భాగవతములో గలదు. "అది జ్ఞాననవనీతమున వేపబడినది, భక్తిరసమున నానినది" అని భాగవతమును గూర్చి శ్రీరామకృష్ణుడు చెప్పుచుండెను.

అష్టాదశపురాణములను మహాభారతమును రచించియు చిత్తశాంతి నొందజాలకున్న వ్యాసమహర్షికి నారదమునీంద్రుడు ప్రత్యక్షమై చతుశ్శ్లోకీభాగవతము నుపదేశించి భాగవతరచనకు బూంచెను. భాగవతమునకు ప్రణేత వ్యాసుడు.

జ్ఞానవైరాగ్యములకు మూర్తీభావమైన శ్రీశుక యోగి దానికి ప్రవర్తకుడు. ఇక సప్తదినము లలో తప్పక మృత్యుముఖమున బడవలసినట్లు శాపమునకు గురియైన పరీక్షిన్మహారాజు సర్వ సంగ పరిత్యాగము చేసి 'బ్రహ్మసాక్షాత్కార మునకు శీఘ్రోపాయమును జూపుమా'' అని శ్రీ శుక యోగి నడిగెను. వ్యాసప్రముఖమహా ర్షుల మహితగోష్ఠిలో శ్రీ శుక యోగి పరీక్షిత్తు నకు భాగవతము నామూలాగ్రము వాక్రు చ్చెను. వివిధావతారములలో ప్రకాశితము లైన భగవంతుని కల్యాణగుణగణములను, విశేషించి శ్రీకృష్ణుని దివ్యలీలలను ప్రహ్లాద ధ్రువాంబరీషకుచేలగజేంద్రప్రముఖ భక్తవరే ణ్యుల పావనచరిత్రములను గోపికల అనన్యా దృశమైన కృష్ణతృష్ణను శ్రోతృజనరంజకముగా శుక యోగి కీర్తించెను

శ్రీమద్భాగవతమునకు శ్రీధర స్వామి (1350-1450) రచించిన వ్యాఖ్యానము భావార్థదీపిక యన ప్రసిద్ధమై యున్నది. పెక్కండ్రు యోగీంద్రుల జీవితములను శ్రీమ ద్భాగవతము తీర్చి దిద్దినది. వారు తమ భాగ వతాభిమానమును తమిళ - తెలుగు - మరాఠీ - హిందీ-ఓఢ్ర - అస్సామీ - గుజరాతీ - ప్రముఖ భాషలలోనికి దాని ననువదించి సంతృప్తిపడు కొనిరి. ఆ కవు లందఱును భాగవతసందేశ మును దేశభాషలద్వారా సర్వప్రజానీకము నకును అందజేసిన మహోపకారులు, భారత దేశమున భక్తికిని పారమార్థికపరమైన జీవిత మునకును పెంపొనగూర్చినవారు. వారిలో బమ్మెరపోతన (15 వ శతాబ్ది) ఒకడు. ఆయన కవులలోను యోగులలోను అగ్రగణ్యుడు, భాగవతమును తెలుగులోని కనువదించెను. అది నాతికఠినమై తఱచుగా శబ్దాలంకారసహి తమై, శ్రావ్యమై కొంతయేనియు విషయ భేదము లేక సంస్కృతమున కొకటీకవలె మిగుల శ్లాఘనీయమై యున్నది. సంస్కృత భాగవతమును ఆంధ్రభాగవతము నొండొక దానికి తీసిపోక చదువరులను ముగ్ధుల నొనర్చు ననుటను నిరూపించు గ్రంథమే ఇప్పు డిట సమీక్షింపబడుచున్నది. భాగవతమూలమును శ్రీధరీయవ్యాఖ్య ననుసరించిన తెలుగుటీకా తాత్పర్యములును, పుటల కడుగున ఆ యా శ్లోకములకు పోతనార్యు ననువాదపద్యములును ఇందు పొందుపఱుపబడియున్న విధ మతి స్పృహణీయము. ఈ ముద్రణకళాసిష్ణాతత్వము శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, M. A. గారి సొమ్ము. శ్రీ జయరామశాస్త్రిగారి టీకాతాత్ప ర్యాలు 12 స్కంధములకును రచితములై యున్నను, ప్రస్తుతము దశమస్కంధపూర్వ భాగము మాత్రమే ఇందు ముద్రితమై యున్నది. గ్రంథశేషమును ఇట్లు సుముద్రితమై ఆంధ్ర మహాజనులకు దక్కవలె నని మా యాశంస. 'వైయాకరణతల్లజుల'యొద్ద ఆంధ్రగీర్వాణ ముల నభ్యసించిన శ్రీ జయరామశాస్త్రిగారు ఇందు మాటిమాటికిని ''ఉండుచున్నాను'' అను క్రియారూపమును ప్రయోగించుచున్నారు. నన్నయోపజ్ఞమైన మధురాంధ్రసారస్వతమున ఈ రూపము దృష్టశ్రుతచరము కాదు. 'ఉన్న శబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపం బగు' (బా. క్రి. 56) 'ఉన్నాడు' అనుట కలదే కాని 'ఉండుచున్నాడు' అనుట లేదు.

-నే. భ.

# శ్రీరామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి; సాధకులు; వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

....ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలచి చేతిలో పెట్టినట్లు ఉంటవి....

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీరామకృష్ణోపనిష

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీచక్రవర్తి రాజగోపాలాచారి గారు తమిళభాషలో రచించిన జనాకర్షకగ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణమఠ ప్ర

| | | |
|---|---|---|
| శ్రీ రామకృష్ణ సూక్తిసుధ | | 50 |
| శ్రీ రామకృష్ణ లీలామృతము | | 00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము (అట్టబైండు) | 4 | 50 |
| ,, క్యాలికో ... | 5 | 50 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 1 | 25 |
| శ్రీ రామకృష్ణపరమహంసభక్తరత్నములు | 1 | 00 |
| గురూపదేశములు | 1 | 00 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు | 0 | 25 |
| నా గురుదేవుడు | 0 | 40 |
| శ్రీ రామకృష్ణ ఆరాత్రికము | 0 | 12 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి. | 0 | 25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 2 | 75 |
| శ్రీ శారదా ప్రసంగములు | 3 | 00 |
| శ్రీ శారదాదేవి | 1 | 25 |
| శ్రీ వివేకానంద జీవితచరిత్ర | 4 | 00 |
| బాలల వివేకానందుడు | 0 | 50 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | | |
| 9 సంపుటముల సెట్టు (సాదా) | 45 | 00 |
| ,, ,, క్యాలికో | 58 | 50 |
| * విడి సంపుటములు ఒక్కొక్కటి సాదా | 5 | 00 |
| ,, ,, క్యాలికో ... | 6 | 50 |
| సందేశ తరంగిణి (మొదటిభాగము) ... | 4 | 00 |
| ,, (రెండవభాగము) ... | 3 | 00 |
| భారత యువజనులారా! ... | 3 | 00 |
| ప్రబోధ రత్నాకరము ... | 2 | 50 |
| రాజయోగము ... | 2 | 50 |
| కర్మయోగము ... | 1 | 50 |
| భక్తియోగము ... | 1 | 50 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2 | 25 |
| ,, (రెండవభాగము) | 1 | 75 |
| హిందూ మతము ... | 1 | 50 |
| వివేక సూర్యోదయము ... | 1 | 50 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 25 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము ... | 1 | 25 |

| | | |
|---|---|---|
| మతము, సంస్కృతి, సామ్యవాదము | 1 | 00 |
| భారతదేశము | 1 | 00 |
| భారతీయ మహిళ | 1 | 00 |
| నా జీవితము, జీవిత కార్యము | 0 | 50 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ: తదాదర్శములు | 0 | 50 |
| నా సంస్కరణ యుద్ధ విధానము | | 37 |
| నవీన భారత దేశము | | 40 |
| పవహారి బాబా | | 25 |
| సర్వం విష్ణుమయం జగత్ | | 19 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | 10 |
| తాపత్రయ చికిత్స | | 25 |
| శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర | | 25 |
| పారమార్థిక సంభాషణలు | | 00 |
| నారద భక్తి సూత్రములు | | 00 |
| శ్రీ మద్భాగవతము_రెండవ సంపుటము | 5 | 50 |
| ,, మూడవ సంపుటము | | 50 |
| దేవీమాహాత్మ్యము ... | | 50 |
| శ్రీ మద్భగవద్గీత | | 00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | | 75 |
| ,, మూలము | | 00 |
| పరతత్త్వ ప్రసంగము | | 00 |
| కఠోపనిషత్తు | | 80 |
| గిరీశచంద్ర | | 75 |
| భక్తిమార్గము | | 60 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | | 50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | | 50 |
| శ్రీ వివేకానంద శంఖారావము | | 50 |
| శ్రీకృష్ణవాణి | | 50 |
| బుద్ధ ఉవాచ | | 50 |
| క్రీస్తు సూక్తిమాల | | 50 |
| మహమ్మదు సూక్తి మంజరి | | 50 |
| అద్భుతానందస్వామి | | 37 |

ఇవియే కాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును
వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణచిత్రములు, తైలచిత్రములు మున్నగునవెన్నియో మాయొద్ద లభింపగలవు.

* అయిదవ సంపుటము క్యాలికోగాని అట్టబైండుగాని లేదు.

ఇట్లు వ్రాయుడు:

## శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ ౧౯౭౩ - అక్టోబరు : ప్రమాదీచ - ఆశ్వయుజము సంచిక ౪

# విషయసూచిక



---

ఫోను : 71231 పోస్టు బాక్సు 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయకంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే
ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో 6 రూపాయలు; సింహళములో 8 రూపాయలు.
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయకంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో ర్ూ 5 లు, సింహళములో ర్ూ 7-50 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే
తెలుగు మాసపత్రిక

సాలు చందా: ఇండియాలో ర్ూ 5 లు, సింహళములో ర్ూ 7-50 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' ఉదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను 6¼% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని సాధనాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపీ కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

‘సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు’ (ఆల్డసు హాక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

‘గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు : తేది 27-7-’58)

‘అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.’
(స్వదేశ్ స్టాండర్డు : తేది 16-2-’58)

‘అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.’ (భారతి : 7-6-’61)

‘చవులూరించు చక్కని రచన.’ 14-2-’బ8 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల : రూ. 7-50**

# ప్రబోధరత్నాకరము

**అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వాములవారు**

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

**232 పుటలు** **మూడవ కూర్పు** **వెల : 2-50**

# శ్రీ శారదాదేవి చరిత్ర

శ్రీరామకృష్ణభగవానుని సతీమణియు, ఆదర్శమాతయు, యోగినియునగు

మహనీయురాలి దివ్యచరిత్ర

రచయిత:

శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథమిది...అమృతకలశము ... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి...

—ఆంధ్రప్రభ

...నారీలోకమున కేకాక, ఆధునిక వాఙ్మయమునకు ఈ గ్రంథము అమూల్యమైన కానుక; పాఠశాలలలో, కళాశాలలలో పాఠ్యగ్రంథముగా నుండదగిన ఉత్తమ గ్రంథము.

—ఆనందవాణి

246 పుటలు (అయిదవ కూర్పు) వెల: రూ. 2-75

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీస్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీస్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుఁగునఁ బ్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుఁగుసేఁత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.




'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ | ౧౯౭౩ - అక్టోబరు ప్రమాదీచ - ఆశ్వయుజము సంచిక ౮


శ్రీః

## శ్రీ జగన్నా ష్టకమ్

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

కదాచి త్కాళిన్దీతట విపినసఙ్గీతకవరో
ముదా గోపీనారీ వదనకమలాస్వాదమధుపః
రమా శమ్భు బ్రహ్మామరపతి గణేశార్చితపదో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే.

జగన్నాథస్వామీ = దేవాధిదేవుడు జగన్నాథుడు, మే = నాయొక్క, నయన పథగామీ = చూపులదారిని అధిగమించినవాడుగ, భవతు = అగునుగాక. (ఆయన ఎట్టివాడనగా), కదాచిత్ = ఒకానొకప్పుడు, కాళిన్దీతటవిపిన = యమునాతీరవనమందు, సఙ్గీతకవరో = వరిష్ఠ (వేణు) గాయకుడుగ నుండినవాడు, ముదా = ఆనందముతో, గోపీనారీ = గొల్ల చెలువల, వదనకమల = మోము దామరల (తావిని), ఆస్వాద = చవిచూచు, మధుపః = భృంగమైనవాడు, రమాశమ్భు = లక్ష్మిదేవిచేతను పరమశివునిచేతను, బ్రహ్మ+అమరపతి = బ్రహ్మదేవునిచేతను దేవేంద్రునిచేతను, గణేశ అర్చితపదః = వినాయకునిచేతను పూజింపబడిన చరణములుగలవాడు

''తల్లి బిడ్డను ఎంత ప్రేమించునో, పతివ్రత భర్తను ఎంత ప్రేమించునో, ఇహాపరులు ధనము నెంత ప్రేమింతురో, ఈ మువ్విధముల ప్రేమశక్తిని ఆకర్షణశక్తిని ఒక్కటిగ జేర్చి ఆ మొత్తమును భగవంతునివైపు మరలింపుము. అప్పుడు నీవు తప్పక భగవంతుని జూడగలవు''
—శ్రీరామకృష్ణుడు.

# మా గడత ఆకలు

అర్హుడైన శిష్యుని రూపొందించేది గ్రంథ పాండిత్యం కాదు, క్రమశిక్షణం. క్రమశిక్షణం అంటే నడతలో ఆర్జవాన్ని అంటిపెట్టుకొని ఉండడం, నీతినియమాల అనుసరణంలో స్ఖలనం తడబాటు సడలుపాటు బొత్తిగా లేకుండడం ప్రజ్ఞాన పదకంటె, ఈ సుగుణాలే విద్యార్థి వ్యక్తిత్వాన్ని రూపొందిస్తాయి. ఆత్మకు పెంపును సమకూర్చేవి నీతిమేలుములే కాని, బుద్ధి మెఱుగులు కావు. కాబట్టి ప్రాచీనవిద్యావిధానంలో అధ్యయనంమీదకంటె ఆచారంమీద ఎక్కువ ఊనిక ఉంటుండేది. ప్రస్తుతకాలంలోను మన యువకులను మంచిరీతిలో రూపొందించాలంటే ఆ క్రమశిక్షణాన్ని మనస్సులో ఉంచుకోవాలి, దాన్ని మరల అమలులోకి తీసుకు రావాలి.

గురువులకూ శిష్యులకూ కూడ మంచి గుణపాఠం నేర్పగల ఒక కథ మహాభారతంలో ఉంది.

అయోదధౌమ్యుడను ఋషి ఒక డుండినాడు. అతని శిష్యులలో ఒకనిపేరు ఉపమన్యువు. ఆశ్రమ గోవులకు మేతపెట్టి పర్యవేక్షించే పని ఉపమన్యువుకు అప్పగింపబడ్డది. విద్యావిధానానికి ఆ దినాలలో కేంద్రాంశం సేవానిష్ఠ, బడినాలుగుగోడలమధ్య నేర్చుకున్నంతకంటె ఎక్కువ చదువు వెలుపల నేర్చుకునేవాడు. ఉపమన్యువు ప్రొద్దున గోవులను బీళ్ళకు తోలుకుపోయి, పగలంతా వానిని మేయనిచ్చి, సూర్యాస్తమయమప్పటికి వానితోబాటు ఇంటికి మరలి చేరుకునేవాడు. సాయంవేళలో గురువునకు ప్రణమిల్లడానికి పొయ్యాడు. ఆరోగ్యం గల్గి జవసత్వములతో ఒప్పారు శిష్యుని గురువు "పగటివేళ భోజనానికి ఏంచేస్తున్నావు?" అని అడిగాడు. ఉపమన్యువు నిజం చెప్పాడు—'భిక్షాన్నం భోంచేస్తున్నా' నన్నాడు. గురుకులంలో చదువుకుంటున్న విద్యార్థి! అన్నసాహాయ్యం చేయవలసిన బాధ్యత సంఘానిదుంది. కాబట్టి విద్యార్థి నాలుగిండ్లలో భిక్షాన్నం అడిగి పెట్టించుకోవడం తప్పు కాదు. ఐనా అతని శీలమునకు మెఱుగులుదిద్ద నుద్దేశించిన గురువు అతని నడతలో ఒకతప్పు ఎత్తి చూపాడు. శిష్యుడు సేకరించిన భిక్షాన్నము నంతటిని ముందుగా గురువున కర్పించి అందుండి ఆయన యిచ్చిన దానిని స్వీకరించడం క్రమం. 'నీవు అలాగు చేయ లేదే' అన్నాడు గురువు. మఱుదినం ఉపమన్యువు తాను సేకరించిన భిక్షాన్నమును పూర్తిగా గురువునకు సమర్పించాడు. గురువు దాన్ని స్వీకరించాడు కాని, శిష్యున కొక్క మెతుకైనా ఇవ్వలేదు. ఉపమన్యువు అందుకు ఇంచుకైనా నొచ్చుకో లేదు. ఎప్పటివలె ఆవులను తోలుకు పొయ్యాడు, సాయంకాలం కుటీరానికి మరలి వచ్చాడు, అతనిలో ఆకలి గుర్తులు బడలికగుర్తులూ ఏవీ లేవు. ఆశ్చర్యపడి గురు వడిగాడు. "నీవు తెచ్చిన భిక్షాన్నంలో నీ కేమి ఇవ్వకుండా పూర్తిగా నేనే తీసుకున్నానే. నీవు ఆకలిబాధ లేకుండా, ఎలాగున్నావు?" "మొదట సేకరించిన భిక్షాన్నాన్ని మీకు సమర్పించాను. మఱొకసారి వెళ్ళి సేకరించిన భిక్షాన్నం నేను తిన్నా" నని ఉపమన్యువు చెప్పాడు. అలాగు చేయడం తనకు అభిమతం కాదు అన్నాడు గురువు. భిక్షమును సేకరించడానికి ఒక్కసారిమాత్రమే పోవచ్చు. రెండోసారి పోవడం లోభకార్యం, ఇతరులకు చెందవలసిన భిక్షాన్ని మనం కాజేసినట్లౌతుంది. భిక్షానికై రెండోమాఱు పోవడం తత్క్షణం మానుకోవలసిందని ఉపమన్యువు నిశ్చయించుకొన్నాడు. అటుపిమ్మట కలుసుకొన్న

ప్పుడు కూడ, ఉపమన్యువు బాగా భోజనం చేసినవానివలె కనిపించాడు. ఆశ్చర్యపడి గురువు 'ఇదెట్లోయీ' అని ప్రశ్నించాడు. ఆవులపాలు త్రాగి ఆకలితీర్చుకున్నా నని ఉపమన్యువు చెప్పాడు. ఆవుపాడి సమృద్ధిగా ఉన్నందువల్ల, అతని ఆహారానికి చాలింది. కాని అయోదధౌమ్యుడు "గురు ననుమతి లేక పాలు త్రాగడం తప్పు" అన్నాడు. ఉపమన్యువు తనతప్పును గుర్తించి ఇక అలాగు చేయరాదని నిశ్చయించుకొన్నాడు. మఱునాటి సాయంకాలం గురువును కలుసుకున్నప్పుడున్నూ ఉపమన్యువు ఎప్పటివలె ఆరోగ్యసంపన్నుడుగా ఉండినాడు. అచ్చెరువొంది గురువు అడిగాడు. "ఉపమన్యూ, నీవు భిక్షాన్నం తినడం లేదు, భిక్షాన్న సేకరణకు రెండోసారి పోవడం లేదు, పాలు త్రాగడం లేదు, ఆకలిబాధ లేకుండా ఏలా గున్నావు?" "ఆవులయొద్ద దూడలు పాలు త్రాగినపుడు వెలువడు నురుగును గ్రోలి ఆకలి తీర్చుకున్నా" నని ఉపమన్యువు చెప్పాడు. అందుకునైతం గురువు కోపించాడు. 'ఉపమన్యూ, నీకు గాను దూడలు సహజంగా వెలువరించేకంటె ఎక్కువ నురుగును వెలువరిస్తున్నాయేమో అని నా అనుమానం. ఇందువల్ల వాటి పోషణ తగ్గుతుంది. నోరులేని జీవాలకట్ల క్రౌర్యం నెరపినవాడవు అవుతావు. ఇట్టి నడత నీకు తగదు" అన్నాడు.

ఇప్పుడు ఉపమన్యువుకు భిక్షాన్నం లేదు, రెండోసారి భిక్షానికి వెళ్ళడం లేదు, పాలు లేదు, నురుగు లేదు. ఐనా, అతడు పశువులను మేపే పనిని శ్రద్ధగా చేస్తూ వచ్చాడు. ఆకలి బాధకు ఆగలేకపోయాడు. గురునియమాన్ని ఉల్లంఘించకూడదనే సంకల్ప మేమో అతనికి దృఢంగా ఉండినది. జిల్లేడు ఆకులను తిన్నాడు. తత్ఫలితంగా అతనికి చూపు పోయింది. కబోది అయ్యాడు. ప్రాకులాడుతూ పోయి ఒక బావిలో పడిపోయాడు. సాయంకాలం అతడు ఆశ్రమానికి రాలేదు. అతడు రాకపోవడం గురువు గుర్తించాడు. ప్రొద్దున ఆవులను తోలుకొని పోయినప్పుడు ఉపమన్యువును అందఱూ చూచారు. తర్వాత అతని కేమయిందో తెలిసినవారూ చెప్పగలవారూ ఒక్కరూ లేరైరి. గురువు విషాదం చెందాడు. "ఉపమన్యువుకు నేను ఎట్టి ఆహారమూ లేకుండ చేశాను, అందుకై చిరాకుపడి ప్రొద్దస్తమించినా అక్కడే ఆగాడు కాబోలు. తక్కిన శిష్యులు నేనూ వెడలి అతని వెతకాలి" అంటూ బయలుదేరాడు.

'ఓ ఉపమన్యూ, ఎక్కడున్నావు?' అను గురువుగారి ఆక్రందనపు ప్రతిధ్వనులతో కాననమంతా నిండిపోయింది. పిలుపు ఉపమన్యువు చెవిని బడింది. "గురుదేవా, ఇది గోండి, ఈ బావిలో పడి ఉన్నా" నని బదులు చెప్పాడు. వ్యధితుడై గురువు "నీవు బావిలో పడడం ఏలాగు సంభవించింది" అని అడిగాడు. ఉపమన్యువు చెప్పాడు. "ఆకలి తీర్చుకోవడానికి నేను జిల్లేడాకులు తిన్నాను, చూపు పోయింది. బాట తప్పి బావిలో పడ్డాను" అని. అందుకమోఘమైన ప్రతిక్రియను అయోదధౌమ్యుడు వెంటనే యోచించాడు. 'సురవైద్యులయిన అశ్వినీదేవతలను స్తుతించవోయి" అని శిష్యునికి హితం చెప్పాడు. ఉపమన్యువు అశ్వినిదేవతలను ఋక్కులతో స్తుతించాడు. స్తుతిసారం:— "అందఱికంటె మొదట పుట్టినవారు కాబట్టి మీరు సృష్టికి పూర్వం నుంచి ఉన్నారు. మీరు స్వర్ణగృధ్రములరు. కాలం మీకు విధేయం. సూర్యదేవుని సృజించింది మీరు, అహోరాత్రము లనెడి తెల్ల నల్ల నూలుపోగులతో దివ్యమైన సంవత్సర మను వస్త్రమును నేయువారు మీరు,

కాలచక్రప్రవర్తకులరు మీరు'' అశ్వినీదేవతలు యథాకాలం ప్రత్యక్షమై ''సంతోషించితిమి. ఇదిగో నీ కొరకు భక్ష్యం. దీన్ని తిను'' అన్నారు. కాని లభించిందాన్ని ముందుగా గురుదేవుని కర్పించక ఉపమన్యువు తాను తినడే! ''ఈలాంటి భక్ష్యం ఒకసారి మీ గురువుగారికి లభించింది. ఆయన దాన్ని తన గురువుకు అర్పింప లేదు, వెంటనే తానే నోట వైచికొన్నాడు'' అని అశ్వినీదేవతలు చెప్పినప్పటికిన్నీ, ఉపమన్యువు భక్ష్యాన్ని గురుదేవున కర్పించక తాను తిన నంగీకరించినాడు కాడు, ఆ అధ్యవసాయానికి ప్రీతులై అశ్వినీదేవత లతనికి కన్నుల నిచ్చి, అభ్యుదయము గల్గునట్లుగ ఆశీర్వదించిరి. ఉపమన్యువు ఆచార్యుని చేరబోయినప్పుడు ఆయనయు ననుగ్రహమును వర్షించెను. ''అశ్వినీదేవత లనుగ్రహించిన సమస్తశ్రేయమును బడయుము, సర్వవేదములు సకలధర్మశాస్త్రములు నీసొమ్ము అగును గాక'' అని దీవించెను. ఇంతకు మించిన ఆచార్యాశీస్సుండునా?

కఠినశోధనలకు గురియైన ఉపమన్యువు వానిలో అఖండవిజయం సాధించాడు. అతని శీలం ఆదర్శరీతిలో రూపొందింది. శీలం ఉన్నచోట విద్యలు అహమహమికతో తమంతట వచ్చి ఆశ్రయిస్తాయి. సక్రమశిక్షణకూ గురుభక్తికీ మహోజ్జ్వలలక్ష్యం ఉపమన్యువు.

శ్రీ వివేకానందస్వామి నలుగురు బ్రహ్మచారులకు సన్న్యాసదీక్షను ఇస్తూ అప్పుడు వారితో పల్కిన హెచ్చరికలు గమనార్హములు. స్వామి వారి నీలాగు ప్రశ్నించాడు— ''పలెతుమాట ఎదురాడక నా ఆజ్ఞలను శిరసా వహింప మీరు సంసిద్ధులుగ ఉన్నారా? శార్దూలాన్ని ఎదుర్కోమంటా ననుకోండి, దారుణవిషసర్పమును ఎదిరించ మంటా ననుకోండి, గంగలో దూకి ఒక మకరమును పట్టుకో మంటా ననుకోండి. ఆస్సాములోని తేయాకుతోటల పెట్టుబడిదారులకు మిమ్ము బానిసలుగా అమ్మివేస్తా ననుకోండి, పస్తుండి ప్రాణం వదల మంటా ననుకోండి, నిదానంగా రాజుతూ ఉండే నిప్పులో మిమ్ము ఉడుక మంటా ననుకోండి. మీ హితం కోరియే చెబుతున్నా నని నమ్మి నా మాటను తత్క్షణమే జరుపుతారా?''

శిష్యాదర్శం అంటే అలాంటిది. అట్టి ఆదర్శ శిష్యునికి వేల్పులు సైతం నీరాజనం ఎత్తుతారు, ఉపమన్యువును అశ్వినీదేవతలు సంభావించినట్లుగా!

## గురుసూక్తిసుధ

పొరుగువాడు: మహాశయా, దేవుని దెలిసికొన్న పిమ్మట, ఈ లోకమున జీవితమును గడపుచుండు డని చెప్పుచుందువే, దేవు నెఱుంగుట నిజముగ సాధ్యమా?

శ్రీరామకృష్ణుడు: ఈ యింద్రియములచేతను ఈ మనస్సుచేతను దేవు నెఱుంగుట శక్యము కాదు. విశుద్ధమైన మనస్సుకు, ఐహిక వాంఛలు లేని మనస్సుకు దేవుడు గోచరించును.

పొరుగువాడు: దేవు నెవ డెఱుంగగలడు?

శ్రీరామకృష్ణుడు: నీవు చెప్పినది సరి. నిజముగ నెవ్వ డెఱుంగ గలడు? కాని మనకు కావలసినంతమట్టుకు దేవు నెట్టిరీతి

కేని, మనవఱకు మన కది చాలు. బావినిండుగ నున్న నీ రంతయు నా కెందుకు? చెంబెడు నీరు ఉన్న, నా కదే కొల్ల. చక్కెరకొండయొద్దకు చీమ పోయిన దట. ఆ కొండయంతయు చీమకు కావలెనా? ఒకటిరెండు రవలు చీమకు కోకొల్లలు.

పోరుగువాడు: మహాశయా, మేము విష జ్వరపీడితులను బోలిన వారము. చెంబెడు నీరు మా కెట్లు సంతృప్తి నీయగలదు? దేవుని సమ గ్రముగ తెలిసికొంద మనుటే మా వాంఛ.

శ్రీరామకృష్ణుడు: అది నిజమే. విషజ్వర మునకు మందున్నది గా!

పోరుగువాడు: ఏది, మహాశయా, ఆ మందు?

శ్రీరామకృష్ణుడు: సాధుసాంగత్యం, భగవ న్నామజపం, గుణసంకీర్తనం, నిరంతర ప్రార్థన ఇదే మందు. లోకజననిని నేను ఈలాగు ప్రార్థించాను "అమ్మా, నేను జ్ఞానం కోరను. ఇదిగో జ్ఞానాన్ని నీవే తీసుకో, అజ్ఞానాన్ని నీవే తీసుకో. నీ చరణారవిందములందు విశుద్ధ భక్తిమాత్రమే నాకు ప్రసాదింపుము." నేను వేఱు దేనినిగాని కోరలేదు. వ్యాధికి తగిన మం దుండాలి. భగవద్గీతలో శ్రీకృష్ణు డిట్లు వాక్రుచ్చాడు. "అర్జునా, సర్వధర్మములను పరిత్యజించి నన్నొక్కనినే శరణు పొందు; నేను నిన్ను అన్ని పాపములనుండి విడిపిస్తాను, శోకించకు." భగవంతుని శ్రీచరణములను ఆశ్ర యించు. ఆయన నీకు చక్కనిబోధ ప్రసా దిస్తాడు. నీ బాధ్యతను పూర్తిగా ఆయన వహి స్తాడు. అప్పుడు విషజ్వరం నిన్ను వదలి పోతుంది. ఈలాంటి మనస్సుతో దేవుణ్ణి తెలిసి కోవడం ఎన్నడైనా శక్య మవుతుందా? ఒక సేరు చెంబులో నాలుగుసేర్ల పాలు ఎవడైనా పట్టించగలడా? భగవంతుడే తన్ను తెలుపు కోనిదే, మనం ఆయన్ను తెలుసుకోవడం ఎన్నటి కైనా సాధ్యం అవుతుందా? కాబట్టి చెబు తున్నాను, భగవంతుణ్ణే శరణుచొరుడని. తనకు చిత్తము వచ్చినట్లు భగవంతుడు చేయునుగాక. ఆయన స్వతంత్రుడు మానవునిలో ఏమిశక్తి ఉంది?

ఒక వైష్ణవభక్తుడు: ఉన్నది బ్రహ్మ మొక్కటే, వేఱేదియు లేదు అనుటను గుర్తించు దశ ఎవనికైనా కలుగుతుందా?

శ్రీరామకృష్ణుడు: భగవంతుని సాక్షాత్క రించు కొననిదే ఆ దశ ఎవనికిని కలుగదు. మానవునికి దేవుని సాక్షాత్కారము కలిగి నందుకు కొన్ని గుర్తు లున్నవి. సాక్షాత్కా రమునొందినమానవుడు ఒక్కొక్కప్పుడు ఉన్మ త్తునివలె ప్రవర్తించును, నవ్వును విలపించును ఆడును, పాడును; ఒక్కొక్కప్పుడు ఐదేండ్ల శిశువువలె నడచుకొనును, అత్యుదారుడుగ నుండును, కపటం ఉండదు, గర్వ ముండదు, సంగ ముండదు, గుణములకు లోబడుట యుండదు, సదానందపూర్ణుడుగ నుండును; ఒక్కొక్కప్పుడు దయ్యమువలె ప్రవర్తించును, శుద్ధాశుద్ధ పూతాపూత విభేదము పాటింపడు, ఒక్కొక్కప్పు డతడు శూన్యదృక్కుల ప్రస రింపజేయుచు జడపదార్థమువలె నుండును, ఏ పనియు చేయజాలడు. దేనికొఱకును కృషి పూనజాలడు.

'నీవు' 'నీది' అను భావము జ్ఞానమునుండి పుట్టుపొందునది. "ఓ దేవా, కర్తవు నీవు, ఉప కరణమును నేను. స్వామీ దేహము. మనస్సు, ఇల్లు, కుటుంబము, ప్రాణులు, విశ్వమూ, సక లమూ నీ సొమ్మే, అంతయు నీదే, నాది ఏదియు లేదు," అని పలికించునది జ్ఞానము.

దేవుడు ఎక్కడనో ఉన్నాడు, అతి దూరాన నున్నాడని అజ్ఞాని పల్కును. దేవుడు ఇక్కడనే ఉన్నాడు, అతి సన్నిహితుడుగ నున్నాడు, హృదయములో ఉన్నాడు, సమస్తముగ రూపొందినది దేవుడే, సమస్తమునకును అంతర్నియంత దేవుడే- -అని ఎఱిగినవాడు జ్ఞాని.

(గదిలో నున్న కొందఱు భక్తులను జూపుచు) వీరు ఎంతో జపము చేయుచున్నారు. ఎన్ని క్షేత్రములకో యాత్రలు చేసినారు. మఱి వీరు ఈలా గెందుకున్నారు? వీరి కేల పురోగమనము లేకున్నది?

వీరి సంవత్సరమునకు పదునెనిమిది నెలలు కాబోలు. ఒకసారి నేను హాలీశునితో ఈలా గన్నాను. "దేవునికై ఉబలాటం లేనివాడు, కాశికి పోయి లాభం లేదు. దేవునికై ఉబలాటం కలిగినవానికి తానుండుచోటే కాశి ఔతుంది."

వీరు అన్నియాత్రలు చేస్తున్నారు. అంత జపంచేస్తున్నారు. వీరికి సాక్షాత్కారం బొత్తిగా కలుగకుండడం ఎందుచేత? దేవునికొఱకు ఉబలాటం వీరిలో లేకపోవడమే అందుకు కారణం. హృదయపూర్వకంగా దేవునికై తహతహ పడితే చాలు, దేవుడు దర్శనం అనుగ్రహిస్తాడు.

పౌరాణిక నాటక ప్రదర్శన ప్రారంభంలో రంగంమీద ఉల్లాసమూ కలవరపాటు కనిపిస్తాయి. అప్పుడు కృష్ణు డెవ్వరికీ కనిపించడు. తర్వాత నారదుడు ప్రవేశిస్తాడు. వీణవాయిస్తూ మహోత్రంతో' గోవింద, దామోదరా, నారాయణ' అని శ్రోతలను కరిగిస్తూ తాను కరిగిపోతూ పాడేటప్పటికి, కృష్ణు డిక క్షణమైనా ఎడసి ఉండ లేడు, గొల్లకుఱ్ఱవాండ్రజట్టుతో సహా ప్రత్యక్షమౌతాడు.

హాలి - భగవత్సాక్షాత్కారము గడించటానికి చాలమందికి అంత సుదీర్ఘ కాలం పట్టడం ఎందుచేతనో?

శ్రీరామకృష్ణుడు : నిజం ఇది, తన అనుభవాలు కర్తవ్యాలు ముగియనిదే మానవునికి దేవునికొఱకై ఉబలాటం పుట్టదు. రోగిని చూపి వైద్యుడు చెప్పుచుండును గదా— కొన్ని దినాలు కానివ్వండి. తర్వాత కొంచెం మందైనా అతనికి మేలు చేస్తుంది"—అని.

రాముని నారదు డడిగాడు "రామా, నీవు అయోధ్యలో కాలం పుచ్చుతుంటే, రావణవధ ఏలాగు నెఱవేఱుతుంది? రావణుని వధించుటకే కదా నీ వీ మానుషజన్మమును ఎత్తినది?

రాముడు ఈలాగు జవాబు చెప్పాడు— నారదా, మొదట సరియైన కాలం రానీ. రావణుని పురాకృతం ఫలించడానికి ఆరంభించాలి. అప్పుడతనివధకు సర్వమూ సిద్ధం చేయబడుతుంది.

౪. వెలకాంత లెందఱైనను గులకాంతకు సాటిరారు కువలయమందున్,
బలు విద్య లెన్ని నేర్చినఁ గులవిద్యకు సాటిరావు, గువ్వలచెన్నా.

# వివేకానంద సింహగర్జనము

తిండి లేక, త్రిప్పటచే కాళ్లు అఱిగిపోయి విసిగి నేను మృత్యుగహ్వరమును డాసిన పర్యాయములు పెక్కులు. దినములతరబడిగా నేను పస్తు లుండినాను. ఒక్క అడు గెత్తి ముందుకు పెట్టలేని పరిస్థితిలో ఉండినాను. ఒక చెట్టు కింద పడిపోదును. ప్రాణము లుత్క్రమించుచున్నవా అనిపించును. నోట మాట వెడలదు. యోచించుశక్తి ఉండదు. తుదకు మనస్సు ఈ క్రింది యాశయములవంకకు మరలినది— "నాకు భయము లేదు, మృత్యువు లేదు, ఆకలి లేదు. దప్పి లేదు. సోఽహం, సోఽహం. ఈ సమస్తప్రకృతియు న న్నణంపజాలదు. అది నాకు బానిస. ఓ దేవాధివా ఓ ఈశ్వరేశ్వరా నీ బలమును ఊను. కోల్పోయిన సామ్రాజ్యమును మరల బడయుము. లే. ముందుకు పద ఆగకు." ఈ యాశయములు తలయెత్తగనే పునరుత్తేజితుడనై లేతును. ఇదిగో ఈనాడును జీవించి యున్నాను. ఈ విధముగా, చీకటి క్రమ్మినప్పుడెల్ల, పరమార్థమును ఊనుకో, ప్రతికూలములైన వెల్ల అంతర్ధాన మగును. ఏల యన అదంతయు స్వప్నమే. కష్టములు పర్వతోన్నతములు కానీ, సమస్తమును భయంకరముగను వ్యసనమయముగను ఉండనీ, అంతయు మాయే. భయమును దూలువుకో, అది పాఱిపోవును. అణచివేయుము, అది మాయ మగును. అడుగుక్రింద దానిని త్రొక్కివేయుము, అది అంతరించును. భయపడకు. పరాజయము ఎన్నిసార్లు గలిగినను లక్ష్యపెట్టకు. కాలము నిరవధి. ముందుకు పద. మాటిమాటికిని నీశక్తిని ఊను. వెలుగు కలిగి తీరును.

---

# శివానంద లేఖావళి

## 118

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
17 ఆగస్టు 1922

అమ్మా,

చాల దినముల క్రిందట నీ జాబొకటి నాకు చేరినది. నీ దేహమనఃపరిస్థితులు బాగున్న వని అనుకొనుచున్నాను. నీ భక్తియు శ్రద్ధయు దయయు నానాటికిని మఱింతగా వర్ధిల్లవలె ననియు నీకు మనశ్శాంతి చేకుఱవలె ననియు మనఃపూర్వకముగా నేను ప్రార్థించుచుందును. గురుదేవుని నీవు ధ్యానించుకొలది, ఆయన సాన్నిధ్యమును నీ కనుభూత మగుచుండును. శాంతి చేకుఱుచుండును. మన గురుదేవుడు అత్యంతదయార్ద్రహృదయుడు. మనఃపూర్వకముగ కావించిన ప్రార్థనలను ఆయన తప్పక చిత్తగించును.

లౌకికులతో వ్యవహరించునప్పుడు మన మనస్సు కళంకిత మగు ననుట నిజమే. ఒక్క విషయమును నీకు ప్రత్యేకముగ విశేషించి చెప్పుచున్నాను. ఇతరుల తప్పొప్పుల నెన్నడును ఎన్నకు. ప్రజలతో మెలగునప్పుడు తప్పొప్పుల నెన్ను పనిని మానుకో. ఇతరులు తప్పు చేయుచుండుట నీ కన్ను దాకినను, మౌనము వహింపుము. నీవు ఆ తప్పు చేయకు. ఈ విషయమున విశేషజాగరూకత గలిగి యుండుము. ఇతరుల తప్పుల నెన్నువానికి గాని దోషోద్ఘాటనమునకు చెవియొగ్గువానికి గాని మనస్సు కళంకిత మగును. పతిత మగును. అతనికి భగవద్భక్తి ఎప్పుడును కలుగదు.

ప్రియజననీ, దేవుని సదా స్మరించుచుండు వాని మనస్సులో భయమున కవకాశము లేనేలేదు. మహారాజుగారు (శ్రీ బ్రహ్మానంద స్వాములు) మరణించిరి. మన కొక్కొక్కరికి కూడ మరణము కల్గు ననుటకు సందేహము లేదు. దేహధారుల కందఱికి మరణము కలిగి తీరును. అయినను దేవు డున్నా డనుటయు, ఆయన కరుణాసాగరు డనుటయు, ప్రేమమయు డనుటయు, భక్తానుగ్రహాకరు డనుటయు ఇది కూడ ఆపాటి సత్యమే.

మరణించిన భక్తులందఱును దివ్యరూపధరులై గురుదేవుని దివ్యధామమున నున్నారు. ధ్యానప్రార్థనములు గురుదేవునకును ఆయన వెంబడియున్న భక్తులకును సంప్రీతికరములయి తీరు నని గట్టిగా తెలిసికో. ఇంతకంటె నీకు నే నేమి వ్రాయుదును? నీకును మీ కందఱికిని నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. గురుదేవు ననుగ్రహముచే నా యారోగ్యము రవంత మిన్నగా నున్నది.

నీ శ్రేయోభిలాషి
శివానంద.

# కనకధారాస్తవము

మూలము:
శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత:
అన్నమాచార్య

బాహ్వాన్తరే మధుజిత శ్శ్రితకౌస్తుభే యా
హారావళీవ హరినీలమయీ విభాతి
కామప్రదా భగవతో ఽపి కటాక్షమాలా
కల్యాణ మావహతు మే కమలాలయాయాః.

యా (కటాక్షమాలా) = ఏ కడకన్నుల చూపుల పరంపర
శ్రితకౌస్తుభే = నెలకొన్న కౌస్తుభమణి గలదగు
మధుజితః = మధుసూదను డగు విష్ణుదేవుని
బాహ్వాన్తరే = వక్షమునందు
హరి నీలమయీ = ఇంద్రనీల రత్నాలు నిండిన
హారావళీ ఇవ = హారముల వరుసవలె,
విభాతి = ప్రకాశించునో
భగవతః అపి = భగవంతుడగు విష్ణుదేవునికి సైతము
కామప్రదా = కోరిక లొసంగునట్టి
కమల + ఆలయాయాః = కమలవాసినియగు లక్ష్మీదేవియొక్క
(సా) కటాక్షమాలా = (ఆ) కడకన్నుల చూపుల వరుస
మే = నాకు

# కనకధారా స్తవము

కల్యాణం = మంగళమును
ఆవహతు = కలిగించును గాక.

కాలామ్బుదాళి లలితోరసి కైటభారేర్
ధారాధరే స్ఫురతి యా తటిదఙ్గ నేవ
మాతు స్సమస్తజగతాం మహనీయ మక్షి
భద్రాణి మే దిశతు భార్గవనన్దనాయాః.

ధారాధరే = నీల మేఘమందు
తటిత్ అఙ్గనా ఇవ = మెఱుపుఁ దీఁగవలె
యా = ఏ లోకజనని
కైటభ + అరేః = కైటభాంతకుడగు విష్ణుదేవుని
కాల + అమ్బుద + ఆళి = నీల మేఘముల బారును బోలి
లలిత - చక్కని దగు
ఉరసి = వక్షమునందు
స్ఫురతి = ప్రకాశించుచుండునో
(తస్యాః) సమస్తజగతాం మాతుః = (ఆ) సర్వలోక జననియగు
భృగునన్దనాయాః = భార్గవియన నొప్పు లక్ష్మీదేవియొక్క
మహనీయం - పూజనీయమగు
అక్షి - కన్ను
మే = నాకు
భద్రాణి = మంగళములను
దిశతు = ఒసగుగాత.

ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావా
న్మాఙ్గల్యభాజి మధుమాథిని మన్మథేన
మయ్యాపతే త్తదిహ మన్థర మీక్షణార్ధం
మన్దాలసాక్షిమకరాకరకన్యకాయాః.

యత్ ప్రభావాత్ = దేని మహిమవలన
మన్మథేన = మన్మథునిచేత
మఙ్గల్యభాజి = మంగళములకు నిలయుడగు
మధుమాథిని = మధుసూదనునందు (శ్రీ మహావిష్ణువునందు)
ప్రథమతః = మొదట
పదం = స్థానము
ప్రాప్తం ఖలు = పొందబడెనో

మన్ద+అలస+అక్షి = కైపుచేతం బోలె సుడియు నేత్రములు గలదగు
మకరాకరకన్యాకాయాః = సముద్రరాజతనయ యగు లక్ష్మీదేవియొక్క
మన్థరం = మెల్లనైన (విరివియైన) దగు
ఈక్షణ+అర్ధం = అరకంటి చూపు
మయి = నాయందు, ఆపతేత్ = వ్రాలునుగాక.

విశ్వామరేన్ద్ర పదవిభ్రమదానదక్ష
మానన్దహేతు రధికం మధువిద్విషోఽపి
ఈష న్నిషీదతు మయి క్షణ వీక్షణార్ధ
మిన్దీవరోదర సహోదర మిన్దిరాయాః.

విశ్వ అమర ఇన్ద్ర = సకల సురలయు వారి ప్రభువులయు
పద = స్థానములకు
విభ్రమదానదక్షం = విశేషశోభ నొడగూర్చుటలో సమర్థమయినదియు
మధువిద్విషః అపి = మధుసూదనుడగు శ్రీ మహావిష్ణువునకు సైతము
అధికం = అత్యంతమైన
ఆనన్దహేతుః = ఆనందమునకు కారణమైనదియు
ఇన్దీవర ఉదర సహోదరం = కలువ లోవైపును బోలినదియు అగు
ఇన్దిరాయాః = శ్రీమహాలక్ష్మియొక్క
ఈక్షణ అర్ధం = అరగంటిచూపు
ఈషత్ = ఇంచుక
మయి = నాయందు,
క్షణం = క్షణకాలము
నిషీదతు = నెలకొనును గాక.

కలశపయోధిపుత్త్రి, యల కాంచనగర్భునిఁగన్నతల్లి, క
ల్వలదొరతోడఁబుట్టు, హరివల్లభ, లేములఁబాపులేమ, సొం
పలరఁగఁ బద్మషండములయందు వసించెడు తన్వి, లచ్చి, నా
కెలిమి సమస్తసంపదల నిచ్చి కృతార్థునిఁ జేయుఁ గావుతన్.

—గోపీనాథం వేంకటకవి.

ఎవ్వనిమూర్తి నార్తి యొకయించుక లేదు, సభాంతరంబులం
దెవ్వఁడు పూజ్యుఁడై మెఱయు, నీ జను లెల్ల సదా విధేయులై
యెవ్వని నాశ్రయింపుదు, రహీనవచోవిభవాభిరాముఁడై
యెవ్వఁడు తేజరిల్లు—నతఁ డెప్పుడు నీకృపవాఁడు భార్గవీ.

—వెన్నెలకంటి సూరయ్య.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# భగవద్గీత సమన్వయోపనిషత్తు

చదువరులలో పరిణతిని కలిగించి జ్ఞాన జ్యోతిని వెలిగించు గ్రంథములలో భగవద్గీత ఒకటి. మధ్యస్థదృష్టితో చూడ గలవారికి అటువంటి గ్రంథములలో భగవద్గీత అగ్రగణ్యముగకూడ కనిపించును. దీనివిలువయు లోతును గ్రంథాంతరములకు లేవు. సమన్వయమే హిందు సిద్ధాంతసారము. ఆసమన్వయము భగవద్గీతలో కననగునంతగా వేరెందును కనరాదు. పురుష ప్రయత్నమునకును దైవానుగ్రహమునకును, కర్మ నిష్ఠకును వైరాగ్యమునకును, భక్తికిని జ్ఞానమునకును, ద్వైతమునకును విశిష్టాద్వైతమునకును, అద్వైతమునకును, అంతర్వ్యాప్తికిని బహిర్వ్యాప్తికిని—చక్కని సమన్వయము భగవద్గీతలో సమకూర్పబడియున్నది. కావుననే భగవద్గీతను కేవలము తమమతమునకుమాత్రమే అనుకూలమైనదానినిగాను అన్యమతములకు ప్రతికూలమైనదానినిగాను వ్యాఖ్యానింప బూనుకొన్న వారికి ఆ ప్రయత్నమును సాగనీయని చిక్కులు కలుగుచుండును. భగవద్గీతలకు వక్త శ్రీకృష్ణుడు, లేఖకుడు శ్రీకృష్ణద్వైపాయనుడు. ఆ యిద్దఱుకూడ సమన్వయమునకు మూర్తీభావములు. ఎన్ని ఆదర్శములకు శ్రీకృష్ణునిలో పొత్తు కుదిరినది! ఆదర్శసుతుడు ఆయనే, ఆదర్శ సఖుడు ఆయనే, ఆదర్శగృహస్థుడు ఆయనే, ఆదర్శపాలకుడు ఆయనే, ఆదర్శకార్యవ్యగ్రుడు ఆయనే, ఆదర్శవిరామరసికుడు ఆయనే.

## పురుషప్రయత్నము : దైవానుగ్రహము

ఈ రెంటిలో ఏది ప్రధానము అనుటను గూర్చిన చర్చ ఈప్రపంచము పుట్టిననాటి నుండి సాగుచునే యున్నది. ఇంకను ఆగ లేదు పురుషప్రయత్నమే ప్రధాన మనుట కొందఱి మతము. దైవానుగ్రహమే ప్రధాన మనుట మఱికొందఱి మతము. 'పురుషప్రయత్నమే ప్రధాన' మను వర్గమువాడు 'నాభవిష్యత్తును రూపొందించుకొనుటో రూపుమాపుకొనుటో నాచేతిలో ఉన్నది'' అనును. ''నీచేత ఏమియు లేదు. దైవసంకల్పము లేనిదే గడ్డిపఱకైనను కదలదు'' అనును ఆ మఱొకవర్గమువాడు. పురుషప్రయత్నమును దైవానుగ్రహమును రెండును ప్రధానములే అనియు తగుపాళ్ళలో ఆ రెండును కలియుటే అమోఘఫలప్రద మనియు భగవద్గీత గుర్తించినది. పురుషప్రయత్నము లేకున్న దైవానుగ్రహము కలుగదు; దైవానుగ్రహము లేకున్న పురుషప్రయత్నము నిష్ఫలము.

గీత ఉపదిష్టమైనది కురుక్షేత్రకదనరంగమునగదా, తదనుగుణముగా అది పురుషప్రయత్నమును పౌరుషముతో పోరాడుటనే కఱవుచున్నది. 'అర్జునా, కాతరతను బొందకుము. ఇది నీకు తగదు, శత్రుతాపనా తుచ్ఛమగు హృదయదౌర్బల్యమును త్యజించి లెమ్ము'— మరణము తప్పనప్పుడు, దానికి కదనరంగమున స్వాగత మిచ్చుట లగ్గు. రణమున గెల్చిన పృథ్వీరాజ్యము, రణమున చచ్చిన, వీర స్వర్గము. రణమున గెల్చుటో చచ్చుటో రెండే వరణీయములు. రణమునుండి పరారి యగుట ఎప్పుడును కూడదు.' అర్జునునివలె మనలో ఒక్కొక్కడుకూడ కదనరంగమున— నైతిక కదనరంగమున — ఉన్నాడు. 'లే, పోరాడు' అని అర్జునునకు నేర్పబడిన పాఠమునే మన మందఱముకూడ నేర్చుకోవలసియున్నది. మానవుడు తన్ను తానే పైమెట్టున కెక్కించు

కోవలెను, ఎన్నడును తన్ను దుర్బలునిగ నొనర్చుకోగూడదు. ఏల యన ఆత్మకు బంధువు ఆత్మయే. ఆత్మకు రిపువు ఆత్మయే.

గీతలో పదునొకండవ యధ్యాయమును పరికింపుడు. శ్రీకృష్ణు డర్జునునకు తనవిశ్వరూప మును జూపెను. ఆ విశ్వరూపుని వక్త్రమున ధృతరాష్ట్రసుతులును భీష్మద్రోణులును కర్ణ డును స్వపక్షీయులగు ధృష్టద్యుమ్నాది వీరులును ప్రవేశించుచుండుట వారి శిరములు చూర్ణితము లగుట అర్జునునకు కనబడెను. 'నీవు పోరాడ కున్నను వీరు జీవించియుండరు. నాచే వీరు మునుపే చచ్చిరి. నీవు నిమిత్తమాత్రుడవుగ నుండుము. శత్రువులను తెగటార్చి నిష్కంటక మగు రాజ్యమును బడయుము'' అని శ్రీకృష్ణు డతనికి తెల్పెను. ఇక్కడ సమస్తమునకును కర్త విధాత సర్వేశ్వరుడే అనుట స్పష్ట మగు చున్నది. అంతర్యామియగు నారాయణుడు సర్వజీవుల హృదయము నధిష్ఠించి రంకుల రాట్నము త్రిప్పినట్లుగా, తన మాయచే వారిని త్రిప్పుచుండును. ఈ ఘట్టమున పురుష ప్రయత్న మకించిత్కర మనియు ఈశ్వరసంక ల్పమే సర్వమునకును సాధక మనియు చెప్పిన ట్లర్థమగుచున్నది.

'పురుషప్రయత్నము' 'దైవానుగ్రహము' అను రెంటిలో నొక్కొక్కదాని ప్రాముఖ్య మును నొక్కి చెప్పుచునే భగవద్గీత రెంటికిని సమన్వయమును అతిసమర్థతతో సమకూర్చు చున్నది. 'మా మనుస్మర యుధ్య చ' నన్ను స్మరించుచుండుము యుద్ధమును చేయుచుం డుము'' అను వాక్యము పై సమన్వయపు కమానుకు నడిమిరాయి. ఏమియు చేయక చేతులు కట్టుకొని కూర్చుండి సదా దేవునే స్మరించుచుండుటయు వ్యర్థమే. కార్యశూర త్వము గల్గి భగవదున్ముఖత బొత్తిగా లేకుండు టయు నిష్ఫలమే. ''సమస్త కర్మలను ఈశ్వరా ర్పితములనుగ జేసి, నేను కర్త అను తలంపు వదలుకొని; కామమును మమకారమును శోక మును లేక పోరాడు'' మని శ్రీకృష్ణు డర్జునునికి కఱపినాడు. ఈసమన్వయమే తుదిశ్లోకమునను వ్యంజితమైనది—

యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతి
ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

యోగేశ్వరుడగు కృష్ణుడును ధనుర్ధరుడగు పార్థుడు నున్నచో — అనగా దైవానుగ్రహ మును పురుషప్రయత్నమును రెండు నున్న చోట — సిరియు గెలుపును చెఱగని అభ్యు దయమును నీతియు గలుగు ననుట నా సుదృఢ విశ్వాసము.

## అంతర్వ్యాప్తి బహిర్వ్యాప్తి

భగవంతునకు ఉండునది అంతర్వ్యాప్తి మాత్రమా, లేక, బహిర్వ్యాప్తిమాత్రమా? ఈప్రశ్నకు నిష్కృష్టమైన జవాబును వైదుష్య మార్గమున చెప్పుట ఎప్పుడును సాధ్యము కాదు. పెడమరలుగా నిలబడి బుద్ధీంద్రియా దులగుండ జూచి పరమార్థమును గూర్చి తీర్పు చెప్పుట వ్యర్థము. బుద్ధియైనను ఇంద్రియములు చనినంత దూరమే, చన గలదు, లేదా, పిచ్చి యూహాల వలయములో సుడియుచుండ గలదు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పుట వైదుష్య విలసితము కాదు. ఆయన చెప్పినది పరమా ర్థము, ఆయనే పరమార్థము. మూలమును ఈశ్వరుడే, అందుద్భవించి విస్తరిల్లిన జగమును ఈశ్వరుడే అని భగవద్గీత తెల్పుచున్నది.

ఊర్ధ్వమూల మధశ్శాఖ
మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని
య సం వేద స వేదవిత్. XV–1

ఈ సంసార మొకవృక్షము, అశ్వత్థవృక్షము, 'న శ్వోపి స్థాస్య తీతి అశ్వత్థః' ఱేపటివఱకైనను ఉండనిది, క్షణప్రధ్వంసి అనుట అశ్వత్థ శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. దీనికి మూలము ఊర్ధ్వము = మాయాంశజనిత బ్రహ్మమే. శాఖలు మహదహంకారములు, ఆకులు వేదములు, మాయ అనాది కాబట్టి మాయామయమైన సంసారమును అనాదియే అందురు, ఈవృక్షము నెఱిగిన వాడు వేదార్థముల నెఱిగినవాడు. భగవంతుని వ్యాపి ఎంత, జగద్వైశాల్య మెంత అను ప్రశ్నకు భగవద్గీతలో ఆయనే చెప్పిన జవాబు

విష్ట భ్యాహ మహం కృత్స్న
మేకాం శేన స్థితో జగత్.

'నా అంశ మొక్కటే యీ సర్వజగత్తును వ్యాపించి ధరించి యున్నది.'' భగవద్గీతలోని సప్తమ నవమ దశమ — ఏకాదశాధ్యాయముల సారార్థము: ఉన్నది భగవంతు డొక్కడే, వేఱేదియు లేదు'' అనుటే. విశ్వాత్మయే జీవాత్మ. విశాత్మ జీవాత్మగ నెట్లయ్యె ననుట మాత్రము దుర్జ్ఞేయము. ఆ విశ్వరూపుని పాణిపాదములు, అక్షిశిరోముఖములు, శ్రోత్రములు ఎల్లెడల ఉన్నవి. మణిహారములో మణులు సూత్రమునందు గ్రువ్వబడియున్నట్లు సమస్త జగత్తును భగవంతునందు గ్రువ్వబడియున్నది. దేవుడే సర్వమును అయి యుండనిచో జ్ఞాని సర్వమందును దేవుని, దేవునందు సర్వమును ఎట్లు సాక్షాత్కరించుకోగలడు? వెలుపలనున్న దానిని గూర్చి చెప్పదగిన వెల్ల లోపలనున్న దానిని గూర్చికూడ చెప్పవచ్చు. ఏల యన ''అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః'' అనియు ''సర్వస్య చాహం హృది సన్నివిష్టః'' అనియు చెప్పినట్లు సమస్తమునకును ఆత్మగనుండు వాడు భగవంతుడే. కాకున్నచో విద్యావినయసంపన్నుడగు బ్రాహ్మణునందును గోవునందును ఏనుగునందును కుక్కయందును కుక్కమాంసమును తినువానియందును పండితు లెట్లు సమదర్శు లగుదురు? ఈ యద్భుత విధానమున భగవద్గీత బహిర్వ్యాప్తి స్వాంతర్వ్యాప్తులను సమన్వయించినది.

## సర్వమత సమన్వయము

మతము లు పెక్కులైనను అన్నింటి లక్ష్యము ఒక్కడే దేవుడే. ఈ సమన్వయమును లోకమునకు చాటిన ప్రథమాచార్యుడు గీతాచార్యుడే ఈ సమన్వయప్రతిపాదకములైన సూక్తిరత్నములు భగవద్గీతలందు వెదజల్లబడియున్నవి. మచ్చు కొకటి :—

యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః. IV–11

ఎవరు ఏ దారిని నన్ను ఆశ్రయింతురో వారిని ఆ దారినే నేను చేరదీసికొందును. అందఱు అన్ని వైపుల అనుసరించు దారులును నాయొద్దకు చేర్చునవే'' ఇంతకంటె గంభీరమును విశాలమునగు ప్రతిపాదనము ఉండునా? షికాగోనగర విశ్వమతమహాపరిషద్వేదికపై శ్రీ వివేకానంద స్వామి ఈ శ్లోకమునే ఉదాహరించె ననిన అచ్చెరు వేమి?

అన్ని దారులును దేవునిచేర్చునవే ఐనను, ఊరక దారులు మాఱుచుండువారు గంతవ్య

మును చేరజాలరు. ఆర్జవ ముండవలెను, శ్రద్ధ యుండవలెను.

యో యో యాం యాం తనుం భక్త
శ్రద్ధ యార్చితు మిచ్ఛతి
తస్య త స్యాచలాం శ్రద్ధాం
తా మేవ విదధా మ్యహమ్. VII-21

"ఏ భక్తుడు ఏ తనువును శ్రద్ధతో నర్చింప గోరునో ఆ భక్తునకు ఆ తనువునందలి శ్రద్ధనే నేను దృఢమొనర్తును" అనెను శ్రీకృష్ణుడు, ఏల యన

అహం హి సర్వయజ్ఞానాం
భోక్తా చ ప్రభు రేవ చ.

సర్వయజ్ఞములకును భోక్తయు ప్రభువును నేనే" అన్నాడు.

## ద్వైతవిశిష్టాద్వైతాద్వైత సమన్వయము

హిందుమతసర్వస్వమును మూడు శీర్షికల క్రింద ఇమిడ్చివేయవచ్చు—శ్రీ శంకరుల అద్వైతసిద్ధాంతము, శ్రీరామానుజుల విశిష్టాద్వైతసిద్ధాంతము, శ్రీమధ్వాచార్యుల ద్వైతసిద్ధాంతము. ముగ్గురు ఆచార్యులును తమ తమ సిద్ధాంతములకు అనుగుణముగా భగవద్గీతకు భాష్యములు వ్రాసిరి. సమన్వయించుశక్తి 'భగవద్గీత'లో ఉన్నందువలన ముప్విధవ్యాఖ్యలును పొసగినవి. ద్వైతమున కనుకూలములగు ప్రతిపాదనములం దున్నవి. అద్వైతమునకు అనుకూలములగు ప్రతిపాదనములును అందు అనేకము లున్నవి. మచ్చుకి కొన్ని చాలు—

అక్షరం బ్రహ్మపరమం
స్వభావో ఽధ్యాత్మ ముచ్యతే. VIII-3

"వినాశము లేనిది మూలకారణ మగునదే పరమ మగు బ్రహ్మము. ఆ బ్రహ్మము ప్రతి దేహమందును ప్రత్యగాత్మభావమునొందుటే అధ్యాత్మ మనబడుచున్నది"

అనాదిత్వా న్నిర్గుణత్వాత్
పరమా త్మాయ మవ్యయః
శరీరస్థో ఽపి కౌన్తేయ
న కరోతి న లిప్యతే. XIII-31

ఓ కౌంతేయా, ఈ పరమాత్మ అనాది, నిర్గుణము, అవ్యయము కావున శరీరమందున్నను పరమాత్మకు కర్తృత్వమును ఫలసంగమును లేవు.

యదా భూతపృథగ్భావ
మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం,
బ్రహ్మ సంపద్యతే తదా. XIII-30

నానాభూతములకు ఉత్పత్తిస్థానమును ఉనికిపట్టును ఒక్కటే (=బ్రహ్మమే) అని సాక్షాత్కరించుకొన్న యోగి బ్రహ్మస్వరూపుడగును.

"విశుద్ధవిజ్ఞానమునకును భగవద్భక్తికిని సాధకమైన మానవజన్మము ధన్యము. కావుననే నాకనివాసులుకూడ మానవజన్మమును కోరుదురు. ఈలోకమునగాని స్వర్గలోకమున గాని జీవితమును కోరకు. జీవితతృష్ణ మాయ, బ్రతుకు అశాశ్వత మని గుర్తించి, ఈ అజ్ఞాన స్వప్నమునుండి మేలుకో. మృత్యువశమున బడుటకు ముందే జ్ఞానమోక్షముల సంపాదించుటకు పాటుపడు. జననమరణముల నతిక్రమించి అమృతత్వ మనెడి గట్టును జేరుకొనుటే మానవ జీవితలక్ష్యము."

—శ్రీకృష్ణవాణి, పుటలు 95-6.

# బృహదారణ్యకోపనిషత్తు

ముచికుంద

ఓమ్ పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

పూర్ణ మదియును. నిదియును బూర్ణమె యగు, పూర్ణమందుండియే పుట్టు పూర్ణముపటి పూర్ణమందుండి తీసినం బూర్ణము నీక మిగిలియున్నదియుం బూర్ణమే యగుఁ జుఁడి.

శాంతి ఓంశాంతి ఓంశాంతి శాంతి శాంతి.

## ప్రథమాధ్యాయము

### ప్రథమ బ్రాహ్మణము.

ఓమ్. ఉషా వా అశ్వస్య మేధ్యస్య శిరః । సూర్య శ్చక్షుః, వాతః ప్రాణః, వ్యాత్త మగ్ని ర్వైశ్వానరః, సంవత్సర ఆ త్మాశ్వస్య మేధ్యస్య । ద్యౌః పృష్ఠం, అన్తరిక్ష ముదరం, పృథివీ పాజస్యం, దిశః పార్శ్వే, అవా న్తరదిశః పర్శవః, ఋతవో ఽఙ్గాని, మాసాశ్చార్ధమాసా శ్చ పర్వాణి, అహోరాత్రాణి ప్రతిష్ఠాః, నక్షత్రా ణ్యస్థీని, నభో మాంసాని। ఊవధ్యం సికతాః, సిన్ధవో గుదాః, యకృ చ్చ క్లోమాన శ్చ పర్వతాః, ఓషధయ శ్చ వనస్పతయ శ్చ లోమాని, ఉద్యన్ పూర్వార్ధః, నిమ్లోచం జఘనార్ధః, య ద్విజృమ్భతే త ద్విద్యోతతే, య ద్విధూనుతే, తత్ స్తనయతి, య న్మేహతి త ద్వర్షతి వాగేవాస్యవాక్॥ 1

యజ్ఞాశ్వమునకు తల ఉషస్సు. కన్ను సూర్యుడు, ప్రాణము వాయువు, తెఱచుకొని యున్న నోరు వైశ్వానరాగ్ని, దేహము సంవత్సరము, వీపు దివి, కడుపు అంతరిక్షము. పాదపీఠము భువి, పార్శ్వములు దిక్కులు, ప్రక్కటెముకలు విదిక్కులు, అంగములు ఋతువులు, కీళ్లు నెలలును పక్షములును, పాదములు అహోరాత్రములు, అస్థులు నక్షత్రములు, మాంసములు అభ్రము, సగము జీర్ణమైన యన్నము ఇసుక, నాళములు నదులు, ప్లీహకాలిజములు పర్వతములు, రోమములు ఓషధులును వృక్షములును, పూర్వార్ధము పూర్వాహ్ణము, అపరార్ధము అపరాహ్ణము, ఆవులింత మెఱుము, మేనును దులుపుకొనుట ఉఱుము, మూత్రము వర్షము, సకిలింత వాక్కు. ౧

అహర్వా అశ్వం పురస్తా న్మహిమాన్వజాయత, తస్య పూర్వే సముద్రే యోనిః, రాత్రి రేనం పశ్చా న్మహిమాన్వజాయత, త స్యాపరే సముద్రే యోనిః, ఏతౌ వా అశ్వం మహిమానా వభిత స్సమ్బభూవతుః । హయో భూత్వా దేవా నవహత్; వాజీ గన్ధర్వాన్, అ ర్వాసురాన్, అశ్వో మనుష్యాన్, సముద్ర ఏ వాస్య బన్ధుః, సముద్రో యోనిః॥ 2

ఇతి ప్రథమం బ్రాహ్మణమ్.

ఆ యశ్వమునకు ముందటివైపు నెలకొన్న మహిమా అను బంగారుపాత్రము పగలు; అది పుట్టిన చోటు తూర్పుసముద్రము. ఆ యశ్వమునకు వెనుకవైపు నెలకొన్న మహిమా అను వెండిపాత్రము రాత్రి; అది పుట్టిన చోటు పడమటిసముద్రము. మహిమా అను ఈ రెండు పాత్రములును అశ్వమున కిరుపంకల ఉద్భవించినవి. అది హయమై దేవతలను వహించుచున్నది, వాజియై గంధర్వులను వహించుచున్నది, అర్వమై అసురులను వహించుచున్నది, అశ్వమై మనుష్యులను వహించుచున్నది. దానికి లాయము సముద్రము, ఆకరమును సముద్రమే.

ప్రథమ బ్రాహ్మణము ముగిసినది.

ప్రకీర్ణక వ్యాసావళి

# శ్రీ రామకృష్ణదివ్యవాణి ప్రకృతిఫలము

హుగ్గహళ్లి కనకలక్ష్మమ్మ

వివేక సూర్యోదయ మైనది. ఎల్లరు మేల్కొనుడు. మీ అజ్ఞానతిమిరము పటాపంచలైనది. మీ మీ కర్తవ్యకార్యములయందు నిష్కాములై ప్రవేశింపుడు. ఇది మీ జీవిత సరళి. నేను అను అహంకారపు వలువయందు నాదియను గుణమును మూటగట్టి వేయునుణుంగులు భారముకాగా మాయజాలక పరితపించితిరి. ఆ గుణభారమును దులిపివేసితిరి. మూట ఖాళీయైనది. ఇప్పు డేమి చేయుదురు?

అంతయు శాంతిమయమే! స్వర్గము లేదు. నరకము లేదు. దేవత లదృశ్యులైరి. ఇకను మిగులునది మానవులు. సామాన్యమానవులు గారు. సంపూర్ణులు! పరిపూర్ణులు! భూలోకమున నవతరించి, పరలోకముల జూచితిరి. మృత్యువును దిలకించితిరి. జన్మమును గంటిరి. జననమరణముల దప్పించుకొనగోరితిరి. బంధముక్తుల నతిక్రమించితిరి. తిరిగి మానవులైతిరి. దేవతలకు మోక్షము లేదా యనుచున్నారా? లేదు. వారు భగవానుని సామీప్యమునను, సారూప్యమునను విహరించుచుందురు. కాన వారలకు మోక్షము లేదు. సాయుజ్యమును బొందుటకు మానవదేహమే ఆధారము. నిజమునకు దేవత్వము అశాశ్వతము. మీ రాక ఎందులకు? ప్రకృతిని జయించుటకు. మిమ్మును అపహరించిన ప్రకృతినుండి, విడివడుటకు. ప్రకృతికాంత యొడిలోని బిడ్డవగు నీవు జీవమను ఫలమవు. ఆ ఫలము నామె పోషించి, పెంచి తన యిచ్ఛ ననుసరించి, నిన్ను పీడించుకొనుచున్నది. చంపుచున్నది. తిరిగి కనుచున్నది. ముదమార స్తన్యము నిచ్చుచున్నది. ముద్దుబెట్టుకొనుచున్నది. లాలనపాలనముల జేయుచున్నది ఒక్కక్షణమున ఖండఖండముల జేసి సముద్రమున బడవేయుచున్నది. ఇది ఆమె లీలావిహారము. ఆమె లీలావిహారమున నీవు రక్షణను బొందుము. ఎటువలె? ఆమెనే శరణుబొంది ఆమెనుండి విడివడుము. అ దెట్లు సాధ్యము? నిజమే ఆమె ఏమరుపాటులేని నాతి. మఱి మాతృహస్తములనుండిన మేలే గదా యందు వేమో? ఆమె మాయాకాంత. జగద్ధాత్రి! తనపుత్రుని ప్రేమించును. మరియు మృత్యుస్వరూపిణియై త్రుంచును. ఇట్టి ఆమె నుండి తిరిగి రాని శాశ్వతనివాసము నేర్పరచు

కొనుము. అనగా ఆమెయందు సాయుజ్యమను ముక్తిని బొందుము.

మిమ్ములనొక క్షణము పోషించి లాలించి తిరిగి పెను జలధిం బడద్రోయు, ఆమె త్రోపుడుల కేల నిచ్చగింతురు? ఆమె కొలదిచంచల. కాదు కాదు మీ వెన్ను ముదిరినదా లేదా యని దెబ్బల గొట్టుచున్నది. నీదెబ్బ మోతఖంగున మ్రోగినచో ఇక నిన్ను తనచేతి యాటబొమ్మం జేయదు. మఱి అట్లు బాగుగ గాలిన ఘటము కావలె ననిన నేమి చేయవలె ననియా? తన్ను అనగా మాయను దెలిసి మటుమాయము గండు అనుచున్న దాప్! మఱి అట్లు ఖాళీ యగుటకు భగవానుని అనంత కృప వలదా? వేఱు భగవానుడేడ నున్నాడు? కాళీమాతయే నిన్ను ఖాళీ చేయగలదు. ఆమెనే శరణు బొందుము. ఆమెయే శ్రీరామకృష్ణుడు. ఆమె దివ్యస్వరూపమే గురుదేవుడు. ఆ గురుదేవు నాశ్రయించి, మీ జన్మకర్మ నివారణోపాయమును బొందుడు. ఆతని ప్రేమింపుడు. ఆతనియందు భక్తి కలుగును. ఆతనియందు భక్తివలన జ్ఞానము కలుగును. జ్ఞానమువలన వైరాగ్యము కలుగును. ఆ వైరాగ్యముచే ఆనందము కలుగును. ఆ యానందమే నీ మాతృహృదయము. అట్టి మాతృమందిరమును జేరి శాశ్వతమోక్షమును బొందుము. తన హృదయ మను ఆత్మనిలయమును జూపవలె ననియే ఆపె తహ, తహ, అందులకే, యీ దూకుళ్ళు, ఫల్టీలు. మఱి ఏ యొక్కరైనను తన నిజనివాసమును, జేర జాలరా యని యాపె ఎల్లప్పు డెదురుచూచుచున్నది. పాపము ఈ పసి నిసుంగులు తమ మాతృరూపమును జూచియే, భీతు లగుచున్నారు. అట్లు పిఱికిపందలగు, తన నిసుంగుల నొక్కత్రుటిలో పిసికి పాఱవేయుచున్నదా వీర విహారిణి! తన జనయిత్రి, ఖడ్గధారిణియైనను ఈ నామమాత్రపురుషులు ఆ చాముండిని జూచి హడలిపోవుచున్నారు. స్త్రీ యన్న నామెయే స్త్రీ! ఆమె శక్తిస్వరూపిణి, విశ్వంభరి, విశ్వరూపధారిణి. అటులు భీరువులు కాబని లేదు. మాతా! యని ముదమార వెళ్ళి ఆపె అంకతలమున గూర్చున్న నామె తన చల్లని అమృతహస్తముచే, మి మ్మాశీర్వదించును. మీ భాగ్యమే భాగ్యము, ఆ జగదేక మోహనమూర్తిని గన్న నేయొక్కరికైనను భయము లేక పోయినను ఆమె సౌందర్యమునకు ముగ్ధులగుదురు. హరి మనంబులు చంచలంబు లగుటయు నిక్కము. వివేకానంద మను నాయుధము మీయొద్ద నున్న మీమాతో ముఖాముఖి నిలిచి, మాటలాడ గలుగుదురు. కొలదిమంది మనసు భ్రమించుచున్నది. ఆమె కాళీమాత! ఆమెను, మీ బాహ్యనేత్రముల జూడ జాలరు. మీ అంతర్నేత్రమును దెఱువుడు. ఆమె పాదముల మీ హృదయ సరసినుండి గలుగు ఆనందమను ధారచే, గడిగి మీ మనో వస్త్రముచే నొత్తుడు. ఇక మీ సంకల్ప వికల్పము లాగుచున్నవి. ఆమెకు ఆ జన్మదాసు లగుచున్నారు. ఇట్లు సద్గురుదేవుని సేవించి, ఆతని నిజరూపును గని, విని, ఆనందించి, అందు లీనుల రగుడు. భయమేల? జీవు డను కసుపిందెను, సద్గురు సంసేవన మను గాలము, కాయగ జేయ, ఆ కాయను వైరాగ్యమను సద్గురుని కృపావృష్టి యను తరుణము, పక్వము చేయుచున్నవి. ఇప్పుడు మీరు వగరుపిందెయై యుండక, తియ్యనిపండుగా పండితిరి. ఇక మాత సంతసించుచున్నది. ఎట్టి గట్టితాడనమునకైనను, భయం బుడిగి, స్థిరచిత్తులై యుండు లెఱింగి,

వీరమాత పుత్రులు మహావీరు లగుట జూచు కొని, యా యాదిమాత మురియుచున్నది. మిమ్ము ఆత్మసామ్రాజ్యపట్టాభిషిక్తుల జేయ నువ్విళ్లూరుచున్నది. ఇంతకాలమునకు తన హస్తము నలంకరించియున్న ఖడ్గమును తుత్తునియలు చేసి, తన్నోడించిన ప్రియతనూజునకు, ఆ మాత, మకుట మిడి ఆత్మసింహాసన మలంకరింప జేయుచున్నది. వివేకసూర్యోదయమైనది. లెండు మేల్కొనుడు. వివేకుని పట్టాభిషేకమును జూడ వేవేగ రండు. ఆ మాతా పుత్రులు దివ్యగాత్రులు. రామకృష్ణ, వివేకానందుల మలికలయిక! మహానందసమ్మిళితము. అద్భుతము. అచంచలము.

బ్రహ్మానందం పరమసుఖదం,
నిశ్చలం, జ్ఞానమూర్తిమ్,

అనునట్లు వారి దివ్యావిర్భావము చెప్పక చెప్పించుచున్నది, ఏల ఊరకున్నారు? మీనోటి మౌన మను సంకెళ్లు విడనడ, స్తోత్రము చేయుడు! దేవతలు దివ్యపుష్పవృష్టిని గురిపించుచున్నారు. గంధర్వులు పాడుచున్నారు. మునిగణము ముదితహృదయమున అరమోడ్పు కన్నుల మాతాపుత్రుల జూచుచున్నారు. దిక్పాలకులు, మతులు పోయి, దిక్కుల జూచుచున్నారు. ఏల యీ యుత్సవము? రామకృష్ణ యను నామసుధనుండి, వివేక దివ్యావిర్భావము, కారణమున, లోకము హర్షించుచున్నది.

# రామకృష్ణుని చమత్కార హాస్యములు

## శ్రీ తుమ్మల పేరారెడ్డిగారు

ఆధ్యాత్మికరంగమున గురువుగ నుండు నర్హత ప్రతియొక్కనికి నుండదు. భగవంతుని సాక్షాత్కరించుకొనకే మతాచార్యకము చేయ బూనినవారికి శ్రీరామకృష్ణుడు విసుగు విరామము లేక ఎచ్చరికలు చేసి యున్నాడు. కోట్ల కొలదిగా ఉన్న ప్రజలలో భగవంతుడే స్వయముగా ఒక రిద్దఱిని, (ఒకరిద్దఱినే,) ఎన్నుకొనును. ఇంచుమించు నిరక్షరాస్యుడైన శ్రీరామకృష్ణుడే అంత గొప్పమతాచార్యుడైనప్పుడు, తా నెందుకు కాగూడదు అని తహసీలుదారు పదవినుండి విరామము చెందిన యొకవృద్ధు డనుకొనె నట! నవ్వుచు శ్రీరామకృష్ణు డొక యైతిహ్యమును జెప్పెడివాడు. కామార్పుకురులో హల్దార్పుకుర్ అను చిన్న సరస్సొకటి కలదు. దాని తీరములను కొందఱు జనులు అశుద్ధపఱచుచుండిరి. అక్కడ స్నానము చేయుటకు వచ్చువారు అశుద్ధపఱచువారిని బిగఱగ తిట్టుచుండెడివారు. కాని మఱునాటి వేకువను ఆ తప్పుపని జరుగుచునే యుండెను. ఆగి పోలేదు. తుదకు పల్లెప్రజలు అధికారులకు తెలుపుకొనిరి. అధికారు లొకపోలీసువానిని బంపిరి. అతడు 'అశుద్ధము చేయరాదు' అని ఒక పలకపై వ్రాసి సరస్తీరమున ఉంచెను. అంతటితో అశుద్ధము చేయువారు అచ్చటికి వచ్చుటను మానుకొనిరి.

ప్రతాపహాజ్రా దాంభికనిష్ఠాపరుడు. తన వైదికాచారపరత నతడు సదా ప్రదర్శించుచుండెడివాడు. 'నాకు కొదువ లే' దనెడి భావ మొక బుడగ. శ్రీరామకృష్ణుడు దాని నణపక మానడు. కావున నిట్లనెను—హాజ్రా హృషీకేశమువఱకు పోయినాడు. నే నంత దూరము

పోజాలనైతిని. గ్రద్దలు రాబందులు ఆకాశమున చాలపై కెగుర గలవు. ఎంత పైకెగిరినను వాని దృష్టి మాత్రము నేలమీది మృతకళేబరముల యందే తగుల్కొని యుండును.'' శ్రీరామకృష్ణుడింకను నిట్లనెను—హాజ్రా ఆధ్యాత్మికముగా చాల పురోగతి చెందియున్నాడు. ఐనను పాప మతనికి ఇంటిచిక్కులు కొన్ని యున్నవి. పిల్లలను విచారించుకొనవలసి యున్నది. అప్పులు తీసియున్నాడు. వానిని తీర్పవలసి యున్నది. ఒక అత్తనుగూర్చి ఆశావాది యగు ఆమె మేనల్లుడిట్లనెనట—''అత్తకు అంతయు బాగుగా నయమైనది. ఏవో కొన్ని బాధలు మాత్రమే ఉన్నవి''. ఆ యత్త పరిస్థితియు హాజ్రాపరిస్థితియు పూర్తిగా నొక్క తెఱగువే. ఈ గుడిలో ఎవనినిగుఱించియైన మనము ప్రసంగింపగోరిన—అట్లు ప్రసంగింపబడు అర్హత హాజ్రా కొక్కనికే కలదు. నే నొక లెక్కలోనివాడను గాను.'' శ్రీరామకృష్ణుడు నవ్వెను. తుపానుగాలికి ఎంగిటాకు కొట్టుకొనిపోయినట్లుగా, హాజ్రా నీచత్వము కొట్టుకొని పోయెను.

గర్వాలును సంగినాచులును శ్రీరామకృష్ణుని అనాగరకు డనిరి. వీరికి కావలసినది నాగరకతే కాని పరమార్థము కాదు. సరియైన కాలము వచ్చినప్పుడే మనకు పరమార్థప్రబోధము కలుగు నని శ్రీరామకృష్ణుడు గుర్తించెను. పరుండబోవుచు బిడ్డ తల్లితో ''అమ్మా. నాకు విరేచనము వచ్చునప్పుడు నన్ను లేపు'' మనెనట. అమ్మ చెప్పినది, 'వత్సా. విరేచనమే నిన్ను లేప గలదు.' కొంత గ్రామీణుడే, ఎవరు కా దందురు ! కాని అయనయొక్క రంజకత ఎంత సూటియైనది, సహజమైనది, అమోఘమైనది !

'భగవంతుడు సర్వశక్తి. ఆయన యెదుట వినయము గల్గి అణగి ఉండు'—ఇదే శ్రీరామకృష్ణుని పల్లవి. కొందఱికి సౌందర్య గర్వము ఉన్నది, కొందఱికి సంపద్గర్వము ఉన్నది, కొందఱికి పదవీగర్వ మున్నది: యశస్సుకై అనుసరింపబడు ప్రతిమార్గము మృత్యువులో పర్యవసించునదే అనుట వారికి స్ఫురింపదు. డు ఒక హెచ్చరిక చేసినాడు. కాని మతాచార్యులు చేయు హెచ్చరికవంటిది కాదది. ఆయన చెప్పిన ఉదాహరణము—ఒక త్రాగుబోతు పూజాపందిరికి వచ్చినాడు, ఉజ్జ్వలముగా సింగారింపబడియున్న దేవిమూర్తి వంక కన్నులు నిల్పి చూచాడు. చూచి ఇట్లు పల్కినాడు :—''అమ్మా, ఎంత పళపళని ఉడుపులు నీవు ధరించిన నేమి ? ఇక రెండుమూడు దినములలో నీవు గంగలో మునిగిపోక తప్పదు.

దేవుని కలిసికోగోరెదవా, ప్రత్యక్షముగ కలిసికో; దేవుని సాక్షాత్కరించుకొన్న వానికి పుస్తకములతో శాస్త్రములతో ప్రమాణగ్రంథములతో పని లేదు. భగవంతుడు 'బడాబాబు', అందఱికిని పై అధికారి (ఆఫీసరు) వంటివాడు. గుమాస్తాలను బంట్రోతులను స్తుతించు టెందుకు ? పైయధికారి పరిచయమును నీవు గడించితివేని, ఈ క్షుద్రాధికారులు నిన్ను ప్రదక్షిణించి నీకు ప్రణమిల్లుచుందురు.

శ్రీరామకృష్ణు డప్పుడప్పుడు తన కేతగులునట్లు తమాషమాట లాడుచుండును. ''మట్టి కంటె బంగారము శ్రేష్ఠమైనది కాదు'' అనుట ఆయన పల్లవి, దానిని నిరూపించుటకై ఆయన పైకమును కూడ ఏటిలో పాఱవేసెను. లక్ష్మీదేవి అపార్థము చేసికొను నేమో అను తలంపు ఆయనకు, పిమ్మట కలిగెను. కావున 'అమ్మా నీవు నా డెందమున నెలకొని యుండు' మని లక్ష్మీదేవిని ప్రార్థించెను. ఎవడో ఒకడు భగవ

తిని ప్రసన్నురాలిగా చేసికొనెనట, "ఏమేని వరము కోరవోయి" అన్నదట దేవి అతనితో. అత డడిగిన వరము "నేను నా మనుమనితో పసిడిపళ్ళెములో భుజించునట్లు ప్రసాదింపుము" ఒక్కవరము చేతనే అతనికి పౌత్రప్రాప్తియు పసిడిసంపదయు గల్గినవట, అతనిని బోలిన వాడను తానని శ్రీరామకృష్ణుడు చెప్పుకొనెను.

మహేంద్రగుప్తకు వినుచుండు ఓపిక ఉన్నది. కాని అతడు నోరుకట్టిపెట్టుకొని యుండును. దీనిని గుర్తించి గిరీశఘోషు ఇట్లనెను— "మన మందఱమును వదరుబోతులము. సరే. మహేంద్రగుప్త ఏల నోరు మూసికొని కూర్చుండవలెను ?"

తన శిష్యుడగు మహేంద్రగుప్తను సమర్థించుచు శ్రీరామకృష్ణుడు ఒకకవిత్వాభాసము నుదాహరించెను. ఆ యుదాహరణ మందఱికిని రంజకముగ నుండెను :— "పలురకాల మానవులపట్ల మనము మెలకువతో వ్యవహరింపవలెను. ఎవ రెవ రనగా — నిర్విరామముగా మాటాడుచుండు వదరుబోతులు, ఎంత వెదకినను తమ మనస్సులోతులలో ఏమి కనరానీక సదా నోరు మూసికొని యుండువారు, దాంభికభక్తితో తులసీదళములను సదా అవతంసించుకొని ఉండువారు, నిజములో వ్యభిచారిణియై మహాపతివ్రతవలె కనిపించుటకు పెద్ద మేలిముసుగు వేసికొని సంచరించు మహిళ, కలుపుమొక్కలు పెరిగి పాఱుదల లేకుండు ముఱుగుడు నీటిగుంట. ఆ గుంటనీటిలో మునిగినవానికి తప్పక విషజ్వరము వచ్చును. మహేంద్రగు మితభాషియే కాని అతనిని జూచి భయపడవలసిన ఆవశ్యకత లేదు.

# విదేశాలను గూర్చిన తెలివి

## శ్రీ రంగనాథానందస్వామి

ప్రశ్న : యూరోపియ దేశాలవారికంటెను ఉత్తరమెరికాప్రజలకంటెను మధ్యదక్షిణమెరికా(లాటిను అమెరికా) జనులకు భారతీయాశయాలు భారతీయవిజ్ఞానం ఎక్కువ సుప్రవేశాలని మీ రనుకుంటున్నారా?

జవాబు : 1969-వ సంవత్సరం ఆగస్టు సెప్టెంబరు నెలలలో నేను లాటిను అమెరికాలోని ఎనిమిది దేశాలలో పర్యటించాను, నేను పర్యటించిన దేశాలలో కమ్యూనిస్టు క్యూబా కూడ ఉంది. ఆ దేశాలవారిది క్యాథోలిక్కు సంప్రదాయం. క్యాథోలిక్కు సంప్రదాయం భక్తిసంప్రదాయమే. కాబట్టి ఆ ప్రజలకు భావోద్రేకా లెక్కువ. ఈనాటి భారతీయాశయాలకు వారు ఎంతయూ సుముఖులే. లాటిను అమెరికాలో జాతిభేదాలపాటింపు లేదు. లాటినుఅమెరికాకును ఉత్తరమెరికాకును గల ముఖ్యభేదం అదొకటి. ఉత్తరమెరికావారిది ఆంగ్లోసాక్సనుసంప్రదాయం. శ్యామగౌరవర్ణజాతులవారికంటె శ్వేతజాతులవారు ఉత్కృష్టులు అనే ఆశయం ఉత్తరమెరికావారి కున్నట్లు కనిపిస్తుంది. స్పెయినుపోర్చుగీసు దేశాలవారి వలసరాజ్యాలు గల లాటినుఅమెరికాలో ప్రజలకు తమజాతి ఉత్కృష్ట మను తలం పున్నట్లు కనిపించదు. అన్నిజాతులూ సమానము లనే

ఉదారాశయమే అక్కడ ప్రచురంగా కనబడుతుంది. మెక్సికో బ్రెజీలు మున్నగు దేశాలలో ప్రజలు అక్కడికి వచ్చువారిని 'మీరెవ' రని అడుగరు. అక్కడ అనేకవర్ణాలవారున్నారు. అందఱూ కలిసి మెలిసి ఉంటారు. అక్కడ జాతిసమస్య లేదు.

వారిది భక్తిసంప్రదాయం అని చెప్పినాను కదా. కాబట్టి ఉద్రిక్తభావసంపద వారిలో ఉంది. పెక్కువిశ్వవిద్యాలయాలలో ప్రజాసమావేశాలలో నాప్రసంగాలను వినడానికి వారు గుంపులుగుంపులుగా వచ్చి క్రిక్కిఱిసేవారు. వారి ప్రేమాదరాలు నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. పశ్చిమార్ధభూగోళంలోని యితర దేశాలలోను, ఆ ప్రేమాదరాలు ఉన్నాయి. ఐనా లాటిను అమెరికాలో హెచ్చుగా ఉన్నాయి. భారతదేశంలోనే కొన్నిరాష్ట్రాలప్రజలలో భావోద్రేకం హెచ్చు. మఱికొన్ని రాష్ట్రాల ప్రజలలో భావోద్రేకం అంతకంటె తక్కువ. ఇలాంటి తారతమ్యం పశ్చిమార్ధభూగోళంలోను ఉంది

ప్రశ్న: బలం యూదుల కుంది. వారి మతాని కుంది. మీ అభిప్రాయంలో వారి బలానికి కీలకం ఏమిటి ?

జవాబు: వారి మతతత్త్వశాస్త్రమే ఆత్మవిశ్వాసాన్ని శ్రమసహనాన్ని కలిగిస్తుంది. వారొక చిన్నవర్గంవారు. మేలేర్చి ఏర్పఱచుకోబడ్డ వర్గం. సాధారణంగా ఇతరులను వారు తమ వర్గంలో కలుపుకోరు. ఇతరులకంటె జాతివిశుద్ధత వీరికి హెచ్చు. తమ ప్రత్యేకతను వారు కాపాడుకుంటూ వస్తున్నారు. వారివర్గబలం పుట్టింది అందునుంచే. ప్రపంచంలో వారికున్న సమస్యయూ అదే. పాశ్చాత్యదేశాలలో నోబెలుబహుమానం గెల్చుకున్నవారు ఈ చిన్నవర్గంలో ఉన్నంతమంది వేఱు ఏవర్గంలోనూ లేరు. అనేకరంగాలలో అగ్రేసరులు వారే. తమ్ము ఆవిష్కరించుకునే అవకాశాలుకూడ ఇటీవలికాలంలో వారికి యథేష్టంగా లభించాయి.

ప్రపంచంలో వివిధప్రాంతాలలో వీరికి సుదీర్ఘకాలంగా ఉండిన నిరోధాలు ఇటీవలి శతాబ్దాలలో తొలగింపబడ్డాయి. తత్ఫలితంగా వీరు ఉచ్చస్థితికి వచ్చారు. 'కష్టపడు, నీలో నీకు విశ్వాసం ఉండనీ' అను పాఠాలను యూదుల తత్త్వశాస్త్రమే యూదులకు నేర్పింది. తమ కొక జీవితకర్తవ్యాన్ని దేవుడే నిర్ణయించియున్నాడని వీరి విశ్వాసం. ఆ విశ్వాసం అనర్గళ జవసత్త్వాలను ఆ వర్గంవారికి ఇస్తున్నది. భగవద్విహితకార్యనిర్వాహకులం తాము అను విశ్వాసం. నైతికోత్సాహం మతం ఇవియూదులకు ప్రగతిశీలమును ప్రసాదించాయి. అన్యజాతులవారు వీరి నెంత ద్వేషించినా, అణచిపెట్టినా వీరి ప్రగతిశీలం ఆవిష్కృతం ఔతూనే ఉంటుంది. వీరిని తలఎత్తనీయకుండా కొట్టేందుకున్నా రూపుమాపేందుకున్నా మాటిమాటికి సాగిన యెన్ని దురుద్యమములకు వీరు గుఱి అయ్యారు! ఐనా వీరు మరల మరల ఉచ్చదశకు వస్తునే ఉండినారు. వీరి బలం తేజం పురోగతి ఇంకా సాగుతూనే ఉన్నాయి, తఱచు ఇతరుల అసూయకు కారణమౌతున్నది. వీరు అనుభవించిన బాధలే వీరికి ప్రగతిశీలమును అలవఱచాయి. అమెరికాలో ఒకమూలలో ఒక చిన్న ఉద్యమం కుడి (రైట్) పక్షంవారి ఉద్యమం అంకురదశలో ఉంది. జాతిదు [illegible] ప్రాంతాలలో ఆ ఉద్యమం నాజీఉద్యమమును బోలినది. వారి ముఖ్యోద్దేశాలలో ఒకటి యూదుల నందఱిని అమెరికానుండి వెడలగొట్టవలె అనడం. అంకురదశలో ఉండే ఈ ఉద్యమానికి

బలం ఎన్నడూ చేకూరకుండును గాక అనడం మన ఆశంస.

ప్రశ్న: అమెరికాలో నడ్డే స్కూళ్లను (భానువార పాఠశాలలను) మీరు చూచారా? భారత దేశంలో ప్రస్తుతం శిశువుల ఆధ్యాత్మిక శిక్షణం ఇండ్లలో నిరాదరింపబడుతున్నది. భానువారపాఠశాలల ప్రణాళికను భారత దేశంలో అవలంబిస్తే భారతీయ శిశువులకు లాభకరంగా ఉంటుం దని మీ రనుకుంటు న్నారా?

జవాబు: భానువార పాఠశాలల వ్యవస్థ చాల బాగుంది. కాని అమెరికా సంయుక్త రాష్ట్రాలలోను ఇతర దేశాలలోను భానువార పాఠశాలలలో నేర్పబడుతున్న విషయాలు నాకు అంతగా ప్రీతికరములుగ లేవు. అన్య మతాలనుగూర్చి తప్పు ఆశయాలు ఆ భాను వారపాఠశాలలలో బోధింపబడుతూ వచ్చాయి. ఇప్పు డది కొంచెం తగ్గింది. బుద్ధిపూర్వకంగా వారు తగ్గించినందువల్ల తగ్గింది కాదు. మత విషయాలలో శ్రద్ధ ఎవ్వరికీ లేనందువల్ల అది తగ్గింది.

సంయుక్తరాష్ట్రాలలో ఒక కాథొలిక్కుల భానువారపాఠశాలకు నన్ను తీసుకు వెళ్ళారు. అమెరికా చర్చిలలో, కాథొలిక్కు చర్చిలలో సైతం, ఆధ్యాత్మిక ప్రవచనాలు నానాటికీ తగ్గిపోతున్నాయి ఈ ప్రవచనాలు ప్రజలకు దుర్భరా లనిపిస్తున్నాయి. చర్చిలలో కూడ సాంఘికసమస్యలు వియత్నాంయుద్ధము మొద లైన విషయాలు ఎక్కువగా చర్చింపబడు తున్నాయి. భానువార విద్యార్థిశిశువుల యెదుట నేను రెండునిమిషాలకాలం మాట్లాడినాను. మానవునిలో అంతర్గతమై ఉన్న దివ్యత్వం, దాన్ని జీవితంలో ఆవిష్కరించుకునే విధము, ఇవి మొదలగు కొన్ని ఆధ్యాత్మికసత్యాలను గూర్చి చెప్పాను. ఈ విషయాలు ఆ శిశువులకు బాగా నచ్చాయి. వారిప్రీతి వారి కన్నుల వెలుగులో కనపొతుండింది. ఈ ఆధ్యాత్మికా శయాలు వారికి నచ్చిన రీతి నన్నక్కడికి పిలుచుకుపోయిన కాథొలిక్కు 'ఫాదరు' డెందంలోనూ ముద్రితమైంది.

భారతదేశంలోనూ అటువంటి భానువార తరగతులను నెలకొల్పి కుఱ్ఱవాండ్రకు ఆత్మ విద్యను కఱపడానికి విశాలావకాశం ఉంది. కల్కత్తా బెంగుళూరు కొలంబో రామ కృష్ణమిషను కేంద్రాలలో కొన్నిటిలో భాను వారతరగతులు ఇప్పటికే ఆరంభింపబడి ఉన్నాయి. కొలొంబో కేంద్రంలో ఆ తరగతికి ఐదువందలమంది పిల్లలు వస్తున్నారు. వారి శీలాన్ని వ్యక్తిత్వాన్ని ఉదారమైనరీతిలో పెంపొందించుటకు తగ్గరీతిలో ఆత్మవిద్యను కఱపు సామర్థ్యము గల ఉపాధ్యాయులు కావాలి. భారతదేశంలో ఆలాటి ఉపాధ్యాయుల సదస్సులలో పెక్కుంట నేను ఉపన్యసించి యున్నాను. ఆ ఉపన్యాసాలలో నేను నొక్కి చెప్పిన విషయం ఇది. వయసున ఎదిగినప్పుడు ఆ శిశువులే ఆక్షేపించదగి ఉండు నటువంటి భావాలను, అవి ఆచారపరంపరాప్రాప్తభావ ములే ఐనా, పిల్లలకు కఱపకూడదు కఱపి నట్లైతే, పెద్దవారైనప్పుడు ఆ పిల్లలు నాస్తి కులుగను విశ్వాసరహితులుగను రూపొందు తారు. పెరిగేకొద్దీ వారికి నిజం మఱింతగా నిరూపితమయ్యే విషయాలే బోధించాలి.

అంటే ఇతిహాసపురాణాశయాలలో ఆధ్యా త్మికపరమార్థానికి లక్ష్యములగువానిని తప్ప తక్కినవానిని పిల్లలకు కఱపకూడ దన్నమాట. ఆధ్యాత్మికపరమార్థానికి లక్ష్యములగు వానిలో

ముఖ్యము లివి—మానవునిలో అంతర్గతంగా ఉన్న దివ్యత, దాన్ని సాక్షాత్కరించుకుందుకు అతనికి గల సహజసామర్థ్యం. దివ్యత ఆవిష్కృతం ఐతే నీతిజ్ఞత, సంఘీభావం, నిస్స్వార్థత, దక్షత అనేవి కలుగుతాయి. ఆధ్యాత్మిక విద్యావిధాన పారతమ్యాంశాలు ఇవే. అవతార మహాపురుషుల ఆదర్శాలద్వారా, ఈ సత్యాలను శిశువుల మనస్సులలో హత్తుకొల్పవచ్చు. ఏతదనుగుణంగా శిశువిద్యావిధానాన్ని మనం రూపొందించుకోవాలి. క్రైస్తవులును తమ భానువారతరగతులలో పాఠ్యక్రమాలను మరల పరిశీలించి నిర్ణయించుకోవలసి ఉంటుంది.

ప్రశ్న: 1945-వ సంవత్సరంలో జపాను దేశం అన్నివిధాలా విధ్వంసం చెందింది మరి ఈనాడో, జపానుదేశం అభ్యుదయంలో పరమోచ్చదశలో ఉంటున్నది. భారతదేశచరిత్ర చూడండి. 1947-వ సంవత్సరంలో భారతదేశం ఉన్నతప్రతిష్ఠను గడించింది. ఈనాడును ఆనాడున్నట్లే ఉన్నది ఈదేశం. ఈ రెండు దేశాల భవితవ్యతలు ఇట్లు భేదిల్లడానికి కారణాలు ఏవి అని మీా తలంపు?

జవాబు: మూడు కారణాలున్నాయి. అవి ప్రజలలోనే ఉన్నాయి. జాపానీయులలో మహోన్నతరీతిలో క్రమశిక్షణమున్నది. కృషియందు పరిశ్రమించుటయందు వారికి అభిరతి ఉన్నది. వారు, చాలా మితభాషులు, భావోద్రేకాలను వెలిగ్రక్కుతూ తమ శక్తులను వారు వెచ్చించరు. వీధులలో వారు జగడమాడడం కాని, ఒకరిపై ఒకరు అఱవడం కాని నేను చూడలేదు. ఇప్పుడు రాజకీయంగా కొన్ని చిక్కులు ద్వేషాలు కొంత వీధిజగడాలు ఏర్పడ్డాయి. కాని, వారిది నిశ్శబ్దంగా పాటుపడే ప్రకృతి. భారతదేశంలో మనం భావోద్రేకాలను అదుపులో ఉంచుకోవడం నేర్చుకోలేదు. ఒకరిమీాద ఒకరు కంఠశోష వెలారుస్తూ మన శక్తులను వ్యర్థపరుస్తుంటాము. ఆ శక్తులను శాంతంగా నిశ్శబ్దంగా ఉపయుక్తమార్గాలలో వినియోగించుకోవడం మనం నేర్చుకోలేదు. ఆ నేర్పునే శ్రీవివేకానందస్వామి వ్యక్తిత్వనైపుణి అని పేర్కొన్నారు ఆ నేర్పు మనకు లేకపోవడం మొదటి కారణం.

రెండోది—మనం నిద్రపోతులంగా తయారయ్యాం. మనం అవలంబించిన తత్త్వశాస్త్రం మనలను అలాగు తయారు చేసినది. నా ఉపన్యాసాలలో నేను ఒకానొక జర్మనుకవి పద్యపంక్తులను ఉదాహరిస్తుండేవాణ్ణి. ఆ కవి చెప్పింది—ఇటీవలి శతాబ్దులలో మన ప్రజల విషయంలో అక్షరాలా నిజంగా నాటుకొంది- ఆ పంక్తుల అనువాదం ఇదిగో—

మధురము నిదుర, మరణము మధురతరము,
మహినిబుట్టకె యుండుట మధురతమము

ఇటువంటిదశనుండి మనల మేల్కొల్పడానికే శ్రీ వివేకానందస్వామి అంతగా శ్రమపడింది. ఆయన శ్రమ ఫలితంగా మనకు మెల్లగా కనువిప్పు కలుగుతున్నది. పౌరుషం బలం కార్యదక్షత మనలో తలయెత్తుతున్నాయి. అవి పాశ్చాత్యదేశీయులకందఱికిన్ని సామాన్యంగా ఉండే లక్షణాలు, జర్మనులకున్నూ జపానీయులకున్నూ ప్రత్యేకంగా ఉండే లక్షణాలు. మనలో ఆ గుణాలు పెంపొందితే, మనం ఎందఱికైనా మించిపోగలం. ఎందుచేతనంటే మనలో మేధాశక్తికి లోటులేదు. ఆ శక్తిని మనం సృజనాత్మకంగా రూపొందించి సంఘంవైపు మళ్ళించాలి, అది నెఱవేఱడానికి చిరకాలం పట్టుతుంది. మనవారు హాలం చేత పట్టి పొలాలలో పనిచేసినా, కలం చేత పట్టి ఆఫీసులలో పనిచేసినా,

అంతసేపూ నిద్రమత్తులోనే ఉంటుంటారు. పాఠశాలలలో కాని ఆఫీసులలో కాని మనం ఎక్కువగా పండించ లేక పోవడానికి కారణ మదే.

జపానీయులలో పసిబాల బాలికలు కూడా చాల కష్టపడి పని చేస్తారు. గలభా చేయరు, వ్యర్థప్రసంగాలు చేయరు. వారి కేకాగ్రమనస్సులున్నాయి. 1958 లో టోక్యోసమీపంలో ఒక మహిళలకళాశాలలో నేను ఉపన్యసించాను. నూర్లకొలదిగా బాలికలు నాయెదుట ఆసీనలై ఉండినారు, జపానీయుల పద్ధతిలోనే కాళ్ళు వెనక్కు మడుచుకొని పిఱుదుల ఊనుకొని కూర్చున్నారు. నా ఉపన్యాసమూ, దాన్ని జపానీయభాషలోనికి అనువదించడమూ ముగియడానికి డెబ్బైఐదునిమిషాలు పట్టినై. అంతసేపున్నూ వాళ్లు కాళ్లను కదల్పనైనా కదల్పలేదు. గమనమును ఇటూ అటూ చెదరనీయక తదేకతానంగా వింటూ ఉండినారు. దేహాలను మనస్సులను అదుపులో ఉంచుకోవడం వారు నేర్చుకొన్నారు. మనస్సుకు తర్బీదును సమకూర్చే విద్యయే విద్య. మనస్సులోనికి విషయాలను గ్రుక్కునటువంటి విద్య విద్య కాదు మన దేశంలో మనం చేస్తుండేది ఇది. చక్కదనమందున్నూ సక్రమతయందున్నూ మోజు గలవారు జపానీయులు

భారతదేశంలో విద్యార్థుల సమితులలో గాని వృద్ధులసదస్సులలోగాని నీవు ఉపన్యసిస్తున్నావనుకో, ఒక పక్షి ఆ వైపు పాటాడినా, శ్రోతలందఱూ ఉపన్యాసం వినడం చాలించి ఆ పక్షివంక చూస్తారు. ఏకాగ్రచిత్తం మనకు లేనే లేదు. జపానులో మనస్సును సుశిక్షితం చేయడమే విద్య. మన దేశంలో మనస్సును విషయాలతో నింపడమే చదువు. వారికీ మనకూ ఉండే ఈ భేదానికి అనుగుణంగానే సాధనలూ సిద్ధులూ కూడా భేదిల్లుతాయి.

మూడోది: రెండో ప్రపంచ యుద్ధమునకు అనంతరం జపాను కొక గొప్ప అనుకూలపరిస్థితి ఏర్పడింది. తమ దేశరక్షణకై ఒక్కపైసా అయినా జపాను వెచ్చింపనక్కఱ లేదు. జపాను దేశరక్షణకై అమెరికావారు కోట్లకొలది పైకం వెచ్చించారు. ఈ అనుకూలపరిస్థితిని సద్వినియోగపఱచుకొని లాభపడ్డారు జపానీయులు. ఐతే ఈ పరిస్థితి ఇప్పుడు మారుతున్నది. తనబాధ్యతలను తానే వహించవలసిన నిర్బంధం జపానుకు తిన్నగా కలుగుతున్నది. పరిశ్రమలో వ్యవసాయంలో జపాను దేశంలో జరిగే ఉత్పత్తి తక్కిన దేశాల ఉత్పత్తిని అతిక్రమించిపోయి ది, నౌకానిర్మాణంలో జపాను అమెరికాను ఇంగ్లండునుకూడా మించిపోయింది. సంవత్సరానికి రెండుకోట్ల టన్నుల నౌకానిర్మాణం జపాను చేస్తున్నది ఇది వారి జాతీయకౌశలమునకు తార్కాణం. వారి తత్త్వశాస్త్రానుగుణంగా ఉంటుంది వారి శీలం.

శ్రీవివేకానందస్వామి మనకు ప్రసాదించిన నూతన తత్త్వశాస్త్రం భారతదేశరంగంలో పరిణామం కలిగిస్తుం దనే విషయంలో నాకు సందేహం లేదు. ఈ నూతనతత్త్వశాస్త్రం మన సనాతనసాంప్రదాయికగీతాతత్త్వశాస్త్ర వికసితరూపమే. ఇది ఫలప్రదం కావడానికి కొంతకాలం పట్టుతుంది. మనం తొలగించుకోవలసిన బరువులు ఎన్నో ఉన్నాయి. అవి తొలగితేనే నూతనాశయాలు వేరులుపాతి ఫలోన్ముఖము లౌతాయి. ఐతే అది తప్పకుండా జరిగి తీరుతుంది. సర్వతోముఖకౌశలం మనకు కలిగించడమే భారతదేశచరిత్రలో ఆధునిక యుగ లక్ష్యం 'మానవులను రూపొందించు విద్యావిధానంమీదను, మానవత్వానికి మెఱుగులు దిద్దు పారమార్థికపరత మీదను' శ్రీవివేకానందస్వామి సదా ఊనిక ఉంచడం కూడ ఇందుకే.

# పరిప్రశ్నము

## [జిజ్ఞాసువుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానందస్వాముల జవాబు]

ప్రశ్న: కౌతస్కుతం తర్కం అగి నమ్మకానికి అవకాశం ఇచ్చేది ఏమెట్టులో ?

జవాబు: తర్కమున్నూ విశ్వాసమునూ కొంతదూరంమాత్రమే కలిసి ప్రయోగమించగలవు, అవి కార్యసాధకములు అయ్యే రంగాలు వేర్వేరు. ఇంద్రియాలు గ్రహించిన విషయాలే తర్కానికి ఆధారాలు. తర్కం రెండువిధాలు. మూలసూత్రాన్ని ఆధారపడచుకొని లక్ష్యాలను నిర్ణయించడం (డిడక్షన్) ఒకవిధం. లక్ష్యాలను ఆధారపడచుకొని మూలసూత్రాన్ని గుర్తించడం(ఇండక్షన్)ఒకవిధం. మొదటివిధంలో మూలసూత్రం ఒకటి నిరాక్షేపంగా అంగీకరింపబడుతుంది. ఆ మూలసూత్రం ఏలాగు సిద్ధించింది అంటే ఇంద్రియగోచరాలైన లక్ష్యాల ఆధారంచేతను పరిశోధించడంచేతను సిద్ధించిందే. కాబట్టి తర్కానికి ఆధారాలు ఇంద్రియములు గ్రహించే విషయాలే. ఆ విషయాల కార్యకారణసంబంధాన్ని గుర్తించి ఉపపన్నములైన సామాన్యసూత్రాల కనుగొనడమున్నూ, వానిచే వ్యంజితములైన అర్థములను తర్కశాస్త్రానుసారం పరిగణించడమున్నూ, ఈరీతిగా ఆ విషయాలను అవగాహనచేసికునే ప్రజ్ఞకు సహకరించడమున్నూ తర్కశాస్త్రప్రయోజనాలు.

ఇంద్రియగోచరాలైన విషయాలను తర్కశాస్త్రం సృజించదు, ఉన్న విషయాలను చూచి సంబంధానుగుణంగా వానిని క్రమపరుస్తుంది. కాబట్టి ఇంద్రియాలు స్వయంగానో యంత్రాల సాహాయ్యంతోనో గుర్తించిన విషయాలు ఉంటేనే తర్కం అమోఘంగా పనివడుతుంది. ఇంద్రియాతీతవిషయాలలో తర్కం విశ్వాసార్హం కాదు, 'అదీ సుసంభవమే ఇదీ సుసంభవమే' అన్నట్లు ఏకాగ్రతా శూన్యమైన తలంపులను వైదుష్యరూపమైన అజ్ఞానాన్ని కలిగిస్తుంది. ఎన్ని ఊహాల కది అవకాశం ఇచ్చినా దేవునిగూర్చి కాని ఆయన స్వరూప స్వభావాలనుగూర్చి కాని, తర్కం మనకు ఎటువంటి విశ్వాసమును కలిగించజాలదు.

ఆధ్యాత్మికరంగం దేశకాలాతీతం ఈ రంగంలో నమ్మదగిన విషయాలను అంతః ప్రబోధం మాత్రమే ఇంద్రియాతీతమైన జ్ఞానం మాత్రమే మన కొసగగలదు. ఈ రంగంలో తర్కం ఉపయోగపడుతుం దనుకోవడం, అసాధ్యమైనదాన్ని నిరీక్షించడమే. అతీంద్రియ జ్ఞానం మనకు కలుగుటకు ముందు, దేశకాల పరిచ్ఛిన్నమైన ప్రస్తుతపు మనపరిస్థితిలో దేవుడున్నా డనే ఆశయంతో మనం ముందంజ వేయడం ఎట్లు సమకూరుతుంది? 'నమ్మకానికి' 'విశ్వాసానికి' అవకాశం ఇప్పుడే

'విశ్వాసం' అంటే, మార్గాంతరాలలో అర్థం చేసుకునేందుకు శక్యం కాని విషయాలను నమ్మకమే ఆధారంగా అంగీకరించడం. నమ్మకానికి యేమి ఆధారం అంటే, శాస్త్రమో గురువచనమో అందుకు ఆధారం. జీవితంలోని క్షుద్రవిషయాల కన్నిటికి, 'మర్మం' 'మర్మం' అంటూ వంచించే వారివంచనలకు - ప్రజలు నమ్మకాన్ని తోడ్పడచుకుంటే, అది దుర్వినియోగం అవుతుంది. తర్కానికి అందని ఇంద్రియాతీతవిషయములకు మాత్రమే ప్రజలు నమ్మకాన్ని తోడ్పడచుకుంటే, అది సద్వినియోగం అవుతుంది. దేవు డున్నాడా? ఎట్టిది ఆయన స్వరూపం? దేహత్యాగానంతరం జీవితం ఒకటి ఉందా? జీవితాని కొక పరమార్థం ఉందా? పరమపురుషార్థం లభించా

లంటే మనం యేలాగు జీవితం గడపాలి? ఈ ప్రశ్నలకు సమాధానములను శాస్త్రములను బట్టి నిర్ణయించవలసిందే. దేవుడు స్వయంగానో (అద్వారకంగానో) పరజ్ఞానసంపన్నులగు జగదాచార్యులద్వారానో (సద్వారకంగానో) తెలిపిన విషయముల పేటికలే శాస్త్రాలు. మన ఇంద్రియములకు ఆ ఉత్కృష్టమూలవిషయాలు గోచరించనంత మాత్రంచేత సదా సంశయాత్ములుగా ఉండడం తప్పు. ఇంద్రియగోచరములైన క్షుద్రవిషయాలలో మన వివేకానికి అందే విషయాలలో కూడ సొంతబుద్ధిని ఉపయోగించుకొనక ఎవరు యేమిచెప్పినా అంగీకరించే గ్రుడ్డినమ్మకం యేలాగు చెడ్డదో ఇంద్రియాతీత తర్కాతీతవిషయాలలో మొండిగా సందేహిస్తుండడం, ఆలాగు చెడ్డది.

తలదాల్చదగిన శాస్త్రాలు యేవి? ప్రామాణికులైన గురువు లెవరు? తలదాల్చదగిన శాస్త్రాలు వేదాలు, అవి అపౌరుషేయములు, నిత్యములు, యుగయుగములుగా తరతరములుగా మానవుల కవి ఉత్సాహప్రదములుగా ఉంటున్నాయి ప్రామాణికులైన జగదాచార్యులు పరజ్ఞానసంపన్నులు అద్భుతప్రభావ సమంచితులు స్వార్థపరత బొత్తిగా లేని విశ్వశ్రేయోభిలాషులు.

శాస్త్రాలను ఆచార్యులను ఎన్నుకోవడంలో ప్రజలకు స్వేచ్ఛ ఉన్నది. వారు వివిధమత సంప్రదాయాలలోజన్మించినవారు. ఈకాలంలో ఎక్కడెక్కడి సంస్కృతులకూ దేశాలకు సాన్నిహిత్యం ఏర్పడింది. కాబట్టి నచ్చిన సంప్రదాయాన్ని అవలంబించి సోత్సాహుడు కావడానికి మనుష్యునికి స్వేచ్ఛ ఉంది. తన జిజ్ఞాసకు ఒక మతంకంటె మరొకమతం సమకూర్చే సమాధానం ఎక్కువ నిర్వృతికరంగా ఉండినప్పుడు ఆ మతాన్ని అవలంబించే హక్కు మానవునికి కలదు. పరిణతప్రజ్ఞుడు మేధానిధి విశ్వసించే చోట—విశ్వాసార్హత ఉండాలి.

విశ్వాసార్హతను ప్రస్తావించాం కాబట్టి, విశ్వాసానికి సముచితస్థానం నిర్ణయించడంలో కూడ తర్కం ఎంతవరకు పనివడుతుందో యోచించాలి. తర్కం ఇంద్రియగోచరవిషయాలలో కార్యకారణాది సంబంధమును గురించి పరిజ్ఞానాన్ని నిర్మించుకుంటుంది కదా, అల్లే ఇంద్రియాతీతానుభూతుల సంబంధాన్ని గురించడంలోను వానికిన్ని ఇంద్రియజగత్తులోని విషయాలకున్నూ గల సంబంధాన్ని గురించడంలోను తర్కం మనకు సహకరించ గలదు. విశ్వాసమునకు లక్ష్యమైన సత్యమునకున్నూ తర్కంవల్ల తేలునటువంటి నిర్ణయమునకున్నూ పరస్పరవిరోధం ఉండ నక్కఱలేదు. ఇంద్రియగ్రాహ్యవిషయాలున్నూ ఇంద్రియాతీతానుభూతులున్నూ ఒకదానితోఒకటి పొసగి ఉంటేనే సమష్టి ప్రపంచపరిజ్ఞానం రూపొందుతుంది. తర్కం మూలంగా వానిని వీనిని పొసగించేందుకు భారతీయ వేదాంతులున్నూ పాశ్చాత్య మతాచార్యవరేణ్యులున్నూ ప్రయత్నించారు. కాని తర్కానికి పరిమితి ఉన్నది. ప్రకృత్యతీతతత్త్వం మన తర్కానికి అందిన లైతే, అది ప్రకృత్యతీతం కాకుండాపోతుంది. ఆత్మతత్త్వం తర్కానికి అందదు అనే జ్ఞప్తి మనకు సదా ఉండకపోతే, తర్కానికి అందని తత్త్వం లేనే లేదని త్రోసివేసే తప్పుకు భాజనుల మౌతాం. తర్కానికి నిలవజాలని విషయాలు వేఱే, తర్కానికి అతీతమైన విషయం వేఱే. తర్కానికి అతీతమైనదాన్ని అంగీకరించే సందర్భంలో తర్కాన్ని త్యజించవలసిందే. మానవుని అవగాహనశక్తియూ తర్కసామర్థ్యమున్నూ పరిమితాలనిన్నీ, ఒక మెట్టుకు పైన అవి ప్రసరింపజాలవనిన్నీ ఒప్పుకొని, దానికి పై మెట్టుదైన ఆత్మ

స్వరూపాదికమును గ్రహించడానికి శాస్త్ర ప్రమాణమును గురూపదేశ ప్రమాణమును మాత్రమే ఆధారపఱచుకోవాలి.

ఉదాహరణార్థం 'దేవుడున్నాడా లేడా' అనే విషయం గ్రహింతాం. జగత్తు అనే కార్యం ఉన్నందువల్ల జగత్కారణమైన దేవుడుండక తప్పదని తర్కం ద్వారా తీర్మానించవచ్చు. దేవుడు సర్వశక్తి అని సర్వజ్ఞుడని కరుణాసాగరుడని అందఱూ అంగీకరిస్తున్నారు. కాని ఆ గుణాలను ఆయనసృష్టికి ప్రక్కన ఉంచి చూస్తే పొత్తు పొసగదు. దేవుడు సర్వశక్తియూ సర్వజ్ఞుడూ కరుణాసాగరుడూ ఐతే ఆయన కావించిన సృష్టి పాపపంకిలముగను దుఃఖబహుళముగనూ ఉంటుందా? సృష్టిలో పాపమూ దుఃఖమూ ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. దేవుడున్నాడనడం తర్కానికి నిలవదు కాబట్టి, దేవుడు లేడని త్వరపడి తీర్మానించవచ్చు. కాని దేవుని ఉనికి మహర్షులయు యోగులయు స్వానుభూతులచే నిరూపితమైయున్నది. కరుణాసాగరుడైన దేవుని ఉనికిని దేవునిసృష్టిలోని దుఃఖబహుళతను ఒకదానితో ఒకదానిని పొసగించేందుకు తర్కం ప్రయత్నిస్తున్నది, కాని నెగ్గజాలకున్నది. ఆ విషయం తర్కమునకు అందని పైమెట్టుది అని మనం గుర్తించక తప్పదు. తర్కమునకు పైమెట్టున పనివడునది, విశ్వాసం, విశ్వాసానికి పైమెట్టున సాక్షాత్కారం, అపరోక్షానుభూతి. ఖండజ్ఞానం విశ్వాసం, అఖండజ్ఞానం సాక్షాత్కారం, ఇంద్రియాతీతరంగంలో మాత్రమే విశ్వాసాన్ని వినియోగించుకోవాలి, తర్కమార్గం అందుకోజాలని రంగం అది.

# లో వె లు గు లు

## కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణరావుగారు

### పార్థక్యం, ఐక్యం

సోదరా, మానవునిబుద్ధి పదునుగల శస్త్రజ్ఞుని కత్తి వంటిది. ఎట్టి గహన విషయాన్నయినా భేదించి, అంగ ప్రత్యంగ పరిశీలన చేయగలదు—బుద్ధి నిజంగా వజ్రభేది. బుద్ధి నిశితమైనకొద్దీ, భేదాల నెక్కువగ తరచి పరీక్షించడంలో ఆసక్తి మెండగుతూ ఉంటుంది. సామాన్యధర్మాలతో తృప్తిపొందక—విశేష ధర్మాలను, ధర్మాల తారతమ్యాలను, విశిష్ట లక్షణాలను వ్యవచ్ఛేదం చేసుకొంటూ పోతుంది.

నేటి జడవైజ్ఞానికులు చూడండి. ఎన్ని క్రొత్తక్రొత్త శాస్త్రాలను శాఖోపశాఖలుగ విస్తరింపజేస్తున్నారంటారు? Specialisation నేటి వైజ్ఞానిక సంపదయొక్క కీలకం. వస్తువులమధ్య పార్థక్యాన్ని పరిశీలించడంవల్ల, భౌతిక విజ్ఞానం అభివృద్ధి పొందుతున్నది ప్రపంచంలోనే కాదు, ఈ బుద్ధి ఇట్లా వ్యవచ్ఛేదనం చేసేది. భావజగత్తులో ఈ అంగ ప్రత్యంగ పరిశీలనం మరింతగ విలసిల్లుతున్నది. మానవ వాఙ్మయం వర్గీకరణాత్మకం కాదూ? వ్యాకరణం అంటే ఏమిటి? గణితశాస్త్రంలో సహజలక్షణంగా ప్రవర్తిల్లే విభజనసూత్రమే మానవవిజ్ఞానాన్నంతా శాసిస్తున్నదని కొంచం పరిశీలిస్తే బోధపడుతుంది. అందుకనే మానవుని బుద్ధిని Divisive consciousness అని ఒక తత్వజ్ఞుడు నిరూపించాడు.

ఈ భేదజ్ఞానాన్ని అనుభూతం చేసుకొంటు న్నప్పుడు పార్థక్యం ఐక్యజ్ఞానానికి సాధన భూతమగుతుంది. శబ్దస్పర్శరూపరసగంధాల్లో ఒక్క-శబ్దాన్ని అనుభవగతం చేసుకొనే నాదో పాసకులను చూడండి.

నాదసుధారస నిమగ్నుడైన గాయకునకు నాదమే సర్వమై, విశ్వరూపవందాల్చినా, నాదం ద్వారా బ్రహ్మ స్పర్శసుఖాన్ననుభవిస్తాడు. అట్లాగే రూపోపాసకుడు సర్వం రూపాత్మకమైన కొద్దీ రూపాన్ని అమృతభాండంగా చిద్విలా సంగా చేసుకొంటాడు. అంశజ్ఞానం అనుభ వంలో అంశంగా నిలవదు. నదులన్నీ మహా సాగరంలో కలియునట్లు ప్రతిఅంశము పూర్ణ త్వానికి దారితీస్తుంది.

గౌతమశాక్యముని లోకంయొక్క దుఃఖం లో లీనమై కరుణరసామృతాన్ని గ్రోలాడు. ఏసునాధుడు జనకజన్య భావంద్వారా, వాత్సల్య రసానుభూతిని పొందాడు. గౌరాంగ స్వామి మధురమహాభావాల్లో ఈదుకొంటూ పోయి, ఆనందవారిధిలో కరిగిపోయినాడు. బుద్ధి కల్పించుకొనే అంశజ్ఞానానికి పరమార్థత ఉన్నది. అనేకం ఏకంలోకి, పార్థక్యం ఐక్యం లోకి, భేదం అభేదంలోకి, సాకారం నిరాకారం లోకి, అవిద్య విద్యలోకి, చీకటి వెలుగులోకి తీసుకొనిపోయే ద్వారాలుకాని అవరోధాలు కావు—ఈ అంశలు.

ఎందుచేత? జ్ఞానం నిజంగా విద్యావిద్యల కతీతం—అనగా జ్ఞానానికి విద్యావిద్యలు రెండూ అంగములు, అంతర్భూతములు. అవిద్యయా మృత్యుంతీర్త్వా, విద్యయా అమృత మశ్నుతే—అనలేదూ మన బ్రహ్మజ్ఞానులు?

## సాంతంలో అనంతం

సోదరా, బుద్ధి స్ఫటికం వంటిది. దానిని నిర్మలం చేసినకొద్దీ స్వచ్ఛమగుతుంది. ఎంత స్వచ్ఛమయినా, తెల్లకిరణాన్ని సప్తవర్ణములుగ చీల్చే గుణం దానికిపోదు.

అట్లాగే నీ చిత్తం ఎంత స్వచ్ఛమైతే ఏమి, దానికి భేదజ్ఞానం వదలదు. భేదాలను కని పెట్టడంలోనే ఉన్నది దాని శబలతా, విలాస మూను.

ఈ భేదజ్ఞానమే లేకపోతే, సృష్టే లేదు. ''సకామో అజాయత బహుస్యాం ప్రజా యేయేతి'' అని కాదూ మన ఋషులు సృష్టి రహస్యాన్ని ఉద్ఘాటించింది?

తన్నుతాను బహు రూపాల్లో చూచుకో వడంలోనే ఆత్మ తన శక్తిని తాను కొలుచు కొంటున్నదన్నమాట.

అదే మాయాశక్తి. మాయ అంటే అలీక కల్పనకాదు. ''మా'' ధాతువుకు కొల్చుకోవడం అని అర్థం. మానం, మాత అనే పదాలు లేవు? అమేయమైన దానిని కొల్చుకోవడమేమిటి అని శంకా? ఆ కొల్చుకోవడానికి ఒక అంతమనేది ఉంటే నీ శంక బాధిస్తుంది. దీనికి తరుగులు పెరుగులు లేవు. అది అక్షయం, అనంతం. ఆత్మ యొక్క మానం బ్రహ్మమానం. దేశకాలా లను మ్రింగివేసేమానం. తన్ను తాను అతిక్ర మించేమానం. అందుకనే అది ''విభక్తమివ'' విభక్తంవలె కనబడుతుంది, కాని నిజంగా అవిభక్తమన్నాడు గీతాకారుడు. మన బుద్ధి కీరహస్యం అగమ్యంగా ఉండవచ్చు. కాని ఇది ప్రత్యక్షంగా గోచరించే సత్యంకూడాను.

ప్రకృతిలో ఏ అణువు విడిగ, ఇతర అణువులతో సంబంధం లేకుండా ఉంటున్నది? ఏ అణువు కా అణువైనా, అన్ని అణువులు ఒక దానిచుట్టూ ఒకటి తిరుగుతూ, కలసి మెలసి క్రీడలో పాల్గొంటున్నాయి.

ఇంకా లోతుగ చూస్తే ప్రతిఅణువూ ప్రక్క అణువును గుర్తిస్తూ ఒక ఆటలో, ఒక పాటలో తెలిసి పాల్గొంటున్నాయా అని తోస్తుంది. ప్రతి అణువు సర్వంలో ఉండడమే కాదు, సర్వమూ ప్రతి అణువులోను ఇమిడి ఉండకపోతే, ఈ కలయిక సంభవంకాదు. ఎక్కడ నానాత్వమున్నదో, దానిమూలంలో ఏకత్వం లేకపోతే, నానాత్వం ఒక కూటంలో, ఒక విశ్వంగా, ఒక ప్రణాళికలో ఎట్లా ఇమిడి ఉంటుంది?

నీ బుద్ధి భేదజ్ఞానంలో వ్యవహరిస్తున్నదంటే, ఆ జ్ఞానం వెనుక అభేదజ్ఞానం కూడా అవినాభావంగా ప్రకాశిస్తున్న దన్నమాట. నీ అంతరంగంలో అభేదజ్ఞానం ప్రకాశించకపోతే, భేదజ్ఞానంకూడా నీకు అనుభూతమయ్యేది కాదు.

కాబట్టి భేదజ్ఞానం అభేదాన్ని నశింపజేయటం లేదు. అభేదము భేదాన్ని నిరాకరించటం లేదు. భేదాభేదములు రెండూ సత్యముయొక్క భిన్న దిక్కులు కావడంవల్ల, ఒక దానిని విడిచి ఇంకొకటి లేదు. సత్యం భేదాభేదములను సమంగా అంతర్భుక్తం చేసుకునే మహాభావం.

# వారలు - విశేషాలు

## శ్రీకృష్ణజయంతి-శ్రీరామకృష్ణమఠము మద్రాసు-4

1973-వ సంవత్సరం ఆగస్టునెల 21-వ తేది మంగళవారంనాడు శ్రీకృష్ణజయంతి మదరాసు శ్రీ రామకృష్ణమఠంలో మహాభక్త్యభినివేశంతో యథావిధిగా కొనియాడబడింది. ప్రొద్దున గుడిలో భగవద్గీత పూర్తిగా గోష్ఠీ పారాయణం చేయబడ్డది. సాయం ఆరాత్రికానంతరం జన్మాష్టమి విశేషపూజ భజనసంకీర్తన సనాథంగా నిశీథంవఱకు సాగింపబడింది. ప్రసాదవినిమయంతో నాటి కార్యక్రమం ముగిసింది.

26-8-73-వ తేది భానువారం శ్రీకృష్ణ జయంతి సందర్భంగా సాయలంకాలం 6గంటలకు వివేకానందహాలులో పౌరమహాసభ సమావేశమైనది. శ్రీ ఎ. ఎన్. పరశురాంగారు శ్రీకృష్ణావతారపు మెఱుగులను మేలుములను గూర్చి తమిళంలో ఉపన్యసించారు. ఉపన్యాససారం: శ్రీకృష్ణుడు జీవించియుండినది పూర్వయుగంలో ఐనా, ఈ యుగంలోను భక్తుల డెందాలలో ఆయనమూర్తి స్పష్టంగా నిజంగా ప్రసక్తంగా ప్రముఖంగా ఉంటున్నది. దుష్టసంహారమును ఆయన సంకల్పమాత్రంచేత అనాయాసంగా నిర్వర్తింపగలిగినా, భువిపై అవతరించిందెందుకు? తన సంశ్లేషానందాన్ని భక్తవత్సులకు ప్రత్యక్షంగా సమకూర్చడానికి. ఆయన కావించిన సంహారాలుకూడా కృపాకార్యాలే. శ్రీకృష్ణునికి ఎవరు దేనిని మనఃపూర్వకంగా సమర్పించినా, వారికి కలిగే ప్రతిఫలం మోక్షం! పూతన కృష్ణునికి మనఃపూర్వకంగా విషం సమర్పించింది. అందుకు ఆమెకు కలిగింది కేవలం

మరణం గాదు పునరావృత్తిరహితమైన మోక్షం. శ్రీకృష్ణుడు నందనుడు (= ఆనందింప జేసేవాడు), దేవకీనందనుడు, గోకులనందనుడు భగవంతుని శాంతి మహోదధివంటిదనిన్నీ మానవుని పాపాచరణసామర్థ్యం తుంపురపాటి దనిన్నీ శ్రీకృష్ణు డనేకపర్యాయములు స్పష్ట మొనర్చియున్నాడు. శ్రీకృష్ణుని ఆటలలో దొంగతనం కూడా ఒకటి. ఐతే ఆయన దొంగిలించినది మగవారియు మగువలయు హృదయాలను. గోకులములో ఉన్న కాలంలో పసివాడుగ ఉండినా, అతిమానుష కార్యములు చేసి ప్రజలను ఆశ్చర్యపటిచాడు. కాళీయుని పడగలపై ఆడిన నర్తనం, యశోదకు తన నోట బ్రహ్మాండమును చూపెట్టడం, గోవర్ధనగిరి నెత్తడం, గొల్లచెలువలతో సలిపిన రాసక్రీడ ఇవన్నీ మహార్థగర్భములు. పాండవులతో డి చుట్టటికం ఆయన జీవితచరిత్రలో మహోజ్జ్వల మైన మఱొక అధ్యాయం. 'గోపీవల్లభుడు' 'గీతాచార్యుడు' అనేవి శ్రీకృష్ణుని మహో యం.'

సభాధ్యక్ష్యం వహించిన శ్రీమత్తపస్యానంద స్వాములు, భక్తితత్త్వాన్ని (భక్తివైవిధ్యాన్ని) విశదీకరించారు, నామమునకును, నామికిని వస్తుభేదం లేదన్నారు, దైవిసంపదను ప్రసాదించడంలో భక్తిసాధన అమోఘం అని వక్కాణించారు.

## వివేకానందకేంద్ర 'శిక్షణవిధానానికి' ప్రారంభ మంగళోత్సవం

వివేకానంద రాక్మెమోరియలు కమిటీవారు సేవాసంఘంగా వివేకానంద కేంద్రాన్ని నెల కొల్పి ఉండినారు కదా. ప్రజాసేవకు తమ జీవితాల నంకితం చేసికొన్నవారికి ఒక ఆఱు మాసాల ప్రాథమిక శిక్షణావిధానం ఏర్పఱచాలని కూడా కమిటీవారు పూనుకున్నారు. ఇందుకై పారంభ మంగళసమావేశం కన్యాకుమరిలో 30-8-1973-వ తేదినాడు జరిగింది. పాండిచేరి ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ చేదిలాలు గారు సభాధ్యక్ష్యం వహించారు. రాజకోట రామకృష్ణ మఠాధ్యక్షులైన శ్రీమదాత్మస్థానంద స్వాములవారు ముఖ్యోపన్యాసకులుగా విచ్చేశారు.

కమిటీనిర్వాహకకార్యదర్శి శ్రీ ఏకనాథ రనెడెగారు సదస్యులకు అధ్యక్షులకు ఉపన్యాసకులకు స్వాగతోపచారం కావించి తమ ప్రసంగంలో ఈలాగు వ్రాక్రుచ్చారు. డెబ్బైమైదు సంవత్సరాలకు ముందు శ్రీ వివేకానందస్వామి ప్రతిపాదించిన లక్ష్యాలకు అనుగుణంగా ప్రజల జీవితాన్ని విశుద్ధమొనర్చి అన్నిరంగాలలో వారి క్రియాకలాపాలను సోత్సాహములనుగా చేయాలనే మహోద్యమంలో ఈ ప్రస్తుతవిధానం ఒకఅంగం. కన్యాకుమారిలో ఆఱుమాసాల ప్రాథమిక శిక్షణం ముగిసిన తర్వాత సంఘసేవలో సమగ్రశిక్షణం పొందడానికై వీరిని అభివృద్ధిలో వెనుకబడిఉన్న ప్రాంతాలకు పంపుతాము. ప్రజాసేవానిర్వాహకులుగా శిక్షణం పొందడానికి అర్జీలు పెట్టుకొన్నవారి సంఖ్య మొత్తం ఏడువందలు. బాగా పరిశోధించి వారిలో మొదటిజట్టుగా పద్నాలుగురినిమాత్రమే వీరి చేర్చుకున్నాం. ఆ పద్నాలుగురిలో ఇద్దఱు మహిళ లున్నారు. వీరు శిక్షణం పొందవలసినకాలం మూడున్నర సంవత్సరాలు. అటుపిమ్మట వారి కిష్టమైతే వివాహం చేసుకోవచ్చు. వారు తమ సర్వకాలమును సర్వశక్తులను ఈ సేవాకార్యానికే వినియోగించ గలిగి ఉండగలందులకై వారికి వేఱు చీకు చింతలు ఏవి లేకుండాడి సంతృప్తి

కరమైన జీవనోపాధి ఉండేటట్లు చూస్తాము. ఏటేటా క్రొత్తజట్లను ఎన్నుకొంటాం. మూడు న్నరసంవత్సరాల శిక్షణం ముగిసిం తర్వాత వారిని వివిధకార్యరంగాలకు పంచిపెట్టుతాం. ఇందుకు మూడుకోట్ల రూపాయలు ఖర్చవుతా యని అంచనా వేయబడింది. ఒక యోగ సంస్కృతి సంస్థను నెలకొల్పాలి; అందులో ఒక చికిత్సాకేంద్రము ఉండాలి. గ్రంథా లయం ఉండాలి. అందులో దేశీయాంతర్దేశీయ ప్రాముఖ్యము గల విషయాలను గూర్చిన గ్రంథరాజము లుండ వలె. వివిధదేశభాష లలో గ్రంథాలు ప్రచురించేందుకొక ముద్రా క్షరశాల ఉండాలి. సేవాకార్యార్థులను చక్కగాతర్ఫీదుచేసే ఐదు కేంద్రాలను దేశంలో వసతులు గలచోట నెలకొల్పవలె. కన్యా కుమారిశిలపై స్మారకభవననిర్మాణానికి తోడ్ప డ్డట్లే ఇందుకు కూడ ఉదారమహాజనులు విరా ళాలిచ్చి సహకరిస్తారని మా విశ్వాసం.''

రాజకోట రామకృష్ణ మఠాధ్యక్షులైన శ్రీమదాత్మస్థానందస్వాములవారు ఈ కేంద్రాన్ని ఆశీర్వదించి, ఇందు తర్ఫీదు చెందుతున్న యువతీ యువకులను శ్రీ వివేకానందస్వాములకు తగిన వారసులుకండని ఉత్సాహపఱిచారు.

సభాధ్యక్షులైన మాన్యశ్రీ చేదిలాలుగారు ఈలా గన్నారు. ''భారతదేశానికి సముజ్జ్వల భవిష్యత్తున్నదని సాక్షాత్కరించుకొన్న శ్రీ వివేకానందస్వాములు దూరదర్శితకు నమో వాకములు. ఈ కేంద్రంవారి లక్ష్యాలతో ఆశ యాలతో ఏకీభవించడం నాకు ముదావహం. మానవసౌభ్రాత్రం మానవులసమానత్వం వివేకానందస్వామి కలిపారు. ఈ లక్ష్యాలు మన రాజ్యాంగవ్యవస్థ (కాన్‌స్టిట్యూషన్)లో పదిలపఱుపబడి ఉన్నాయి. ప్రగతిశీలమైన వివేకానందస్వాములవారి మానవతాసందే శాన్ని ప్రజలలో వ్యాపింప జేయాలి. అందుకు ఈ కేంద్రీయులవంటి సాధకులు కావాలి. శ్రీరనడెగారు ప్రార్థించినట్లు ఉదారమహా జనులు ఈ ఉద్యమానికి తప్పక సహకరిస్తా రని, ఈ కేంద్రానికి గొప్ప భవిష్యత్తుండా లని నా ఆశంస.''

# గ్రంథపరిచయం

## రామాయణములోనున్న నిజములు

అనుకవక్తలు: శారదా - శివం, ప్రకాశ కులు: బాలానందభక్తబృందము, దేవాలయం వీధి, కాకినాడ. పుటలు-48, వెల రూ. 1

గోదావరితీరంలో పాపికొండలమధ్య పేరంట పల్లి అను చోట శ్రీరామకృష్ణమునివాటం అనే ఆశ్రమంలో వెలసిఉన్న శ్రీ బాలానంద స్వామి, పరమహంస శ్రీ రామకృష్ణ శ్రీ వివే కానందస్వాముల ప్రబోధములకు ముగ్ధుడై 'జీవసేవ శివసేవే' 'జీవసేవే శివసేవ' అను అధ్యవసాయాన్ని అమలుపఱచడానికి జీవితం అంకితం చేసుకొన్న మహనీయుడు. తిరువనంత పురమున జరిగిన 'అఖిలభారతరామాయణ సమ్మేళనం'లో శ్రీబాలానందస్వాముల Facts in Ramayana అను విమర్శగ్రంథం ఆంగ్ల భాషలో రచితమైనది ఆవిష్కృతమైనది. దాని ఆంధ్రానువాదమే సమీక్ష్యమాణ మగు నీ గ్రంథం, ఇందు కావింపబడియున్న నిర్ణయ ములనందఱంగీకరించినా అంగీకరింపకపోయినా అందుకు ప్రేరకమైన జిజ్ఞాసయూ సాగింపబడిన పరిశీలనయూ ప్రశంసార్హములు. ఈ గ్రంథ మును అందఱూ తప్పక చదివి ఆ జిజ్ఞాసను పరిశీలనాపథమును అలవఱచుకోవలెనని మా ఆశంస.

## ఆంధ్ర భాగవత సంగ్రహము

శ్రీ నిమ్మగడ్డల లక్ష్మీనరసింహం గారిచే సంకలితము. ప్రాప్తిస్థానము: త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్నం-1, మదరాసు-1. పుటలు-356. వెల రు. 7-50.

భారతీయదివ్యవాఙ్మయప్రపంచంలో శ్రీమద్భాగవతం అలంకరించిన స్థానం మహోన్నతం. శ్రీమద్భాగవతం సాత్త్వతహృదయం సమస్తవేదవేదాంతశాస్త్రసారామృతం, సర్వసాధనాత్మకమైన సంపూర్ణభగవత్తత్త్వశాస్త్రం భక్తిజ్ఞాన, కర్మ వైరాగ్యోపదేశతరంగావృతమైన పరమప్రేమసాగరం, విశ్వసంతారకమైన మహాభక్తిదర్శనం. భాగవతం ప్రస్థానత్రయానికి సాక్షాద్వ్యాసకృతమహాభాష్యమని విబుధ ప్రథ. పరమధర్మమైన భగవద్రతి - మహాభక్తి - భాగవత ముఖంగా ఉద్బోధింపబడింది. దుఃఖనివృత్తికి - పరమానందప్రాప్తికి - మహోపాయాన్ని భాగవతం తెలుపుతున్నది. అసత్యం నుండి సత్యాన్ని తమస్సునుండి వెలుగును మృత్యువునుండి అమృతత్వాన్ని అధిగమించే పథాన్ని భాగవతం చూపుతున్నది. జీవశివైక్య రహస్యమును - నరనారాయణ సంయోగ సూత్రమును - వ్రజభామల కృష్ణతృష్ణాతత్త్వమును, ఆత్మపరమాత్మానుసంధానవిశేషమును భాగవతం నిర్వచిస్తున్నది తృష్ణాపరితప్తులు, అరిషడ్వర్గవశులు, విభ్రాంతులు, సంసార సర్పభీతులు, మృత్యుముఖగ్రస్తులు, దుఃఖభాజనులు ఐన మానవులు - సిద్ధులు, పరితృప్తులు, విముక్తులు, విజ్ఞానులు, అమరులు ఆత్మారాములు ఆనందస్వరూపులూ అగునట్లు చేసే పరమప్రేమస్వరూపమైన భక్తిరసామృతాన్ని భాగవతం వెలిచూపిస్తున్నది. సర్వజీవులు - పశువులు, శిశువులు, స్త్రీలు, చండాలురు, పతితులు రాక్షసులుసైతం - భక్తిమహిమ చేత పరమేశ్వరపరిరంభణానందశ్రీని పొందవచ్చని విశ్వసంజీవనియైన భాగవతం ఆహ్వానిస్తున్నది.

ఇటువంటి మహాభాగవతమును బమ్మెర పోతన ఆంధ్రీకరించడం ఆంధ్రుల మహాదృష్టం. పోతరాజుగారి రచన యథామూలానువాదమైనా స్వతంత్ర కావ్యంవలె అనర్గళ కవితాధారయూ అశాంతిక భావప్రవాహమూ ఔచిత్య నిర్వాహమూ రససంప్లుతి కలిగి దీపిస్తున్నది ప్రపంచమహాకవిమండలిలో అగ్రశ్రేణిలో గణనీయుడు పోతనామాత్యుడు. ఆదిశంకరాచార్యులకృతులయందువలెనే పోతన భాగవతమందును భక్తిజ్ఞానముల సమ్మేళనం పరమోత్కృష్టిని పొందింది. శ్రీశంకరాచార్యులవారు జ్ఞానపరాకాష్ఠయైన అద్వైతసిద్ధాంతానికి సంస్థాపకులైనా, ఆయన స్తుతింపని దైవతం లేదు, ఆయన స్తోత్రాలలో ఉన్న మాధుర్యం అనన్యసాధారణం. అట్లే పోతన భక్తిపరవశుడైనా, తన భాగవతానువాదంలో ఆద్యంతం అద్వైతతత్త్వమునే ప్రతిపాదించాడు. తన భాగవతంలో మూలగ్రంథాన్నే గాక అద్వైతపరమైన శ్రీధరీయవ్యాఖ్యనుండి విశేషభాగాన్ని తెలిగించాడు.

ఆ పోతనభాగవతాన్ని శ్రీనిమ్మగడ్డ లక్ష్మీనరసింహంగారిచే సంక్షేపింపజేసి 'త్రివేణి' గ్రంథప్రచురణ సంస్థ వారు సమీక్ష్యమాణ గ్రంథంగా అందజేస్తున్నారు. పోతన మధురసారస్వతంలో శ్రీ లక్ష్మీనరసింహంగారు ఎంత సమగ్రంగా అవగాహించారో—ఈ సంకలన గ్రంథం వ్యక్తం చేస్తున్నది. బృహద్గ్రంథాలను చదవడానికి వ్యవధి చాలని యీ కాలంలో, ప్రతిఆంధ్రుడు గర్వంతో చదివితీరవలసిన పోతన భాగవతాన్ని సంక్షిప్తరూపంలో అందజేసే యీ జతనం ఎంతయూ సంస్తవనీయం.

ప్రభాకర్.

# శ్రీరామకృష్ణ బోధామృతము

అనువాదకులు:

**శ్రీ చిరంతనానందస్వాములవారు**

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు: సంసారము; మాయ, గ్రంథములు: గ్రంథులు, బాధగురువులు: బోధ గురువులు, లౌకికులు: వారి ధోరణులు, ఆత్మోన్నతి; సాధకులు; వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు: దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

....ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలచి చేతిలో పెట్టినట్లు ఉంటవి....

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము: వెల: అట్టబైండు: రూ. 4-50
క్యాలికో: రూ. 5-50

# శ్రీరామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు:

**శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు**

ఆంధ్రానువాదకులు:

**గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు**

రామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీచక్రవర్తి రాజగోపాలాచారిగారు తమిళభాషలో రచించిన జనాకర్షకగ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల: రూ. 1-25

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# మద్భగవద్గీత

అనువాదకులు:

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

పుటలు : 480 (సర్వాంగసుందరమైన సప్తమ ముద్రణము) వెల : రూ. 4-00

# హిందూమతము

అనువాదకులు:

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీ వివేకానందస్వాములవారు హిందూమతస్వరూపమును పాశ్చాత్యఖండవాసులకు బోధించి, దానికి లోకసన్మానమును, వ్యాప్తిని కలిగించిన దివ్యవాక్కు లిందు సులభసుందరమగుభాషలో విపరింపబడియున్నవి.

(168+18) పుటలు వెల: రూ. 1-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(121+4 పుటలు) ఆరవ కూర్పు వెల: రూ. 1-50

# రాజయోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణముల రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆరవ కూర్పు వెల: రూ. 2-50

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్ర పాఠకులకు అమూల్య తరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడి ఉన్నాయి. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుటలు.

* అయిదవ సంపుటము క్యాలికోగాని అట్టబైండుగాని లేదు.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

తొమ్మిది సంపుటాలు విక్రయానికి సిద్ధంగా ఉన్నాయి.

**ఖరీదు: అట్టబైండు సెట్టు రు. 45-00 లు. క్యాలికోబైండు సెట్టు రు. 58-50 లు.**

ఒక్కొక్క సంపుటం:

**అట్టబైండు రూ. 5-00** **క్యాలికో రూ. 6-50**

(పోస్టేజి ప్రత్యేకము)

ఇట్లు వ్రాయుడు:

**మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.**

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ ౧౯౭౩ - డిసెంబరు : ప్రమాదీచ - మార్గశిరము సంచిక ౯

## విషయసూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

## మా మాసపత్రికలు

# వేదాంత కేసరి

**తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక**

**సాలు చందా : ఇండియాలో 6 రూపాయలు ; సింహళములో 8 రూపాయలు. ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.**

# శ్రీ రామకృష్ణ విజయం

**మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక**

**సాలు చందా : ఇండియాలో రూ 6 లు, సింహళములో రూ 7-50 లు.**

# శ్రీ రామకృష్ణ ప్రభ

**1944-వ సంవత్సరంనుంగి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక**

**సాలు చందా : ఇండియాలో రూ 5 లు, సింహళములో రూ 7-50 లు**

1. **చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.**
2. **పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.**
3. **చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను $6\frac{1}{4}$% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.**
4. **ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.**
5. **సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.**
6. **ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కృతజ్ఞతలు కద్దుకొని ప్రచురిస్తారు.**
7. **పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.**

**ఇంకా వివరాలు కావలసినవారు :**

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

**అనే విలాసానికి వ్రాయండి.**

# కృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హాక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల: రూ. 7-50**

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

**232 పుటలు** మూడవ కూర్పు **వెల: 2-50**

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

శ్రీరామకృష్ణభగవానుని సతీమణియు, ఆదర్శమాతయు, యోగినియునగు
మహనీయురాలి దివ్యచరిత్ర

రచయిత:
శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథమిది...అమృతకలశము ... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి...

—ఆంధ్రప్రభ

...నారీలోకమున కేకాక, ఆధునిక వాఙ్మయమునకు ఈ గ్రంథము అమూల్యమైన కానుక; పాఠశాలలలో, కళాశాలలలో పాఠ్యగ్రంథముగా నుండదగిన ఉత్తమ గ్రంథము.

-ఆనందవాణి

246 పుటలు (అయిదవ కూర్పు) వెల: రూ. 2-75

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుఁగున ప్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుఁగుసేత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.




'అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౦ } ౧౯౭౩ - డిసంబరు : : ప్రమాదీచ - మార్గశిరము { సంచిక ౬

## శ్రీ జగన్నాథాష్టకమ్

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

వా. అన్నమాచార్య

మహామ్భోధే స్తీరే కనకరుచిరే నీలశిఖరే
వసన్ ప్రాసాదా న్త స్సహజబలభద్రేణ బలినా
సుభద్రామధ్యస్థ స్సకలసుర సేవావసరదో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే. 4

సుభద్రామధ్యస్థః = సుభద్రా దేవితో గూడినవాడును, సకలసుర సేవా+అవసరదః = అందఱు వేల్పులును సేవింప నవకాశమిచ్చుచున్నవాడును, మహా+అమ్భోధేఃతీరే = మహా సముద్రతీరమున, కనకరుచిరే = బంగారుకాంతులీనుచున్న, నీలశిఖరే = నీలాచలశిఖరమందు, బలినా = బలవంతుడగు, సహజబలభద్రేణ = సోదరబలరామునితో బాటు, ప్రాసాద+అన్తః = మందిరాంతర్భాగమున, వసన్ = నిత్యవాసముచేయుచున్నవాడును, జగన్నాథస్వామీ = దేవుడు నగు జగన్నాథుడు, మే = నాకు, నయనపథగామీ = నేత్రగోచరుడు, భవతు = అగుత.

''గంగాజలమును సామాన్యమైన నీ రని భావింపరాదు; బృందావనధూళిని సామాన్యమైన ధూళి యని తలంపరాదు; శ్రీ శ్రీ జగన్నాథదేవుని మహాప్రసాదమును అన్నముగా నెంచరాదు. ఇవి యన్నియు సాక్షాత్పరబ్రహ్మస్వరూపములు''—శ్రీరామకృష్ణుడు.

# శ్రీ శారదాస్తవము

శారదమ్మను, శారదచంద్రముఖిని, సుందరశిరోజసంపన్న, శుభ్రవస్త్ర,
నలమహాదేవిశబ్దవాచ్యను, సతతము, భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 1

రామకృష్ణదయితను, సాధ్వీమతల్లిఁ, గరుణామకరందనిర్ఝరకంజనయనఁ,
గటకభూషితహస్తయుగ్మయగుమాత, భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 2

లోకవితతి ననుగ్రహించుకొఱకె భువినవతరించినయట్టి దయాప్రపూర్ణ,
ధర్మమును నెలకొల్పిన ధన్యురాలి, భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 3

తపమె ధనముగ నిష్ఠఁ దనరు పుణ్యమూర్తిని, దరహాసాంచితముఖినిఁ, దరుణ
వయసునం దుండియే మునివ్రతగనున్న భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 4

మనదు భారతాంబ కనిన తనయలందు నుత్తమోత్తమయు, సుశీలయును, పరమప
తివ్రతయును, సురూపవతియునైన భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 5

ఖండఖండాంతరాల నఖండకీర్తిగనిన శ్రీరామకృష్ణసంఘమున కాది
కర్త్రి, భక్తుల నిరుపాధికజనని-యగు, భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 6

సిద్ధవరనరేంద్రాది సంసేవ్యమానమహిత చరణాబ్జయుగ్మను, మంత్రపూజ్య,
నవ్యయానందపూర్ణను, భవ్యమతిని, భువనపావనిఁ, గారుణ్యమూర్తిఁగొల్తు. 7

భక్తకామద-కల్పకవల్లి-సుగుణ-భవభయాపహ-తాపహ-వరకృపాళు-
సచ్చిదానందరూప-ఆచార్యపూజ్య-యైనమాతకు మ్రొక్కెద అహరహంబు. 8

---

సింహాసనము చారుసితపుండరీకంబు, చెలికత్తె జిలువారు పలుకుఁజిలుక,
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు, పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు,
నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు, తళుకుటద్దంబు సత్కవులమనసు,
వేదాదివిద్యలు విహరణస్థలములు, చక్కని రాయంచ యెక్కిరింత,
యెపుడు నేదేవి, కాదేవి, యిందుకుందచంద్రచందన మందారసారవర్ణ,
శారదాదేవి మామకస్వాంతవీధి నిండు వేడుక విహరించుచుండు గాత.

—కవిసార్వభౌమ శ్రీనాథుడు

చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లిచే సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబునం దున్న యెలదేటిరుతి కించిదంచితశ్రుతుల సీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ దుంబీఫలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు లింగిలీకపువింతరంగు లీన
నుపనిషత్తులు బోటులై యోలగింపఁ బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించు వేడక వీణ వాయించు చెలువ నలువరాణి మదాత్మలో వెలయుఁ గాత,

—ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దన

# మీగడ తఱకలు

క్లిష్టపరిస్థితి శీలమున కొక శోధన. మంచి పరిస్థితిలో, చిక్కులు లేనప్పుడు ఎవ డైనా బాగానే నిర్వహించుకుపోతాడు. దశ వక్రించిన నప్పుడు, క్లేశాలనుండి బయటపడుదారి కని పించనప్పుడు, మానవుడు సమర్థుడైనదీ చవట ఐనదీ బయటపడుతుంది.

అయోధధౌమ్యమహర్షి కి శిష్యులుముగ్గురు, వారిలో ఒకడు ఆరుణి. ఆరుణి పాంచాలదేశం వాడు. నియమబద్ధత అతనిలో గాఢంగా నెల కొని ఉంది. విద్యాభ్యాసానికి క్రమశిక్షణ చాల అవసరం కదా. ఆరుణి ఆదర్శవిద్యార్థి. ఒకనాడు గురువు అతని కొక పనిని అప్ప గించాడు-పొలానికి నీరు పాఱు కాలవలో ఒక చోట కట్ట తెగింది. అందువల్ల పొలానికి నీటి పాఱుదల ఆగింది. అక్కడికి పోయి కట్టను సరిచేయు మని గురువు ఆరుణిని పంపాడు. పోయి చూచి, అక్కడ గట్టును నిలపడం సాధ్యం కా దని ఆరుణి గు ర్తించాడు. అందుకు వలసిన మనుష్యులు సామగ్రులు అప్పుడు సమకూర్చుకోవడం సాధ్యం కాదు. గురు నియోగమునేమో నెఱవేర్చి తీరాలి. విస్మితు డైన ఆరుణి కొక తలంపు కలిగింది. కట్టలోని సందును మానవదేహంతో పూడుద్దా మని అతడు నిశ్చయించుకొన్నాడు. సందులోనికి చొచ్చుకొని, తనదేహాన్ని అక్కడ పరుండ బెట్టాడు. నీరు బయటికి పోవడంఆగి, పొలాలకే ప్రవహించ సాగింది. ఎంతసేపటికి ఆరుణి ఆశ్ర మానికి రాకపోవడం గు ర్తించి అయోధ ధౌమ్యుడు ఆశ్చర్యస్తబ్ధుడయ్యాడు. ఇంతకును ఏపనికై తాను ఆరుణి నంపెనో, అది చాలసేపు పట్టు పని కాదు. ఆ పనికై తాను ఆరుణి నంపిన మాటే గురువు మఱచిపొయ్యాడు. ఆయనకు జ్ఞాపకం చేయవలసివచ్చింది. విష ణ్ణుడై ధౌమ్యుడు ఇతరశిష్యులను వెంట నిడు కొని, కాలువకట్ట తెగియుండినచోటికి వెళ్లాడు. బిడ్డకై తల్లి అంగలార్చినట్లుగా, ధౌమ్యుడు "పాంచాలా ఆరుణీ, ఎక్కడ ఉన్నావు? ఇటు రా నాయనా" అని ఆక్రందించాడు. ఆ ప్రేమభరితమధురాహ్వానము విని, ఆరుణి చివు క్కున లేచి గురువున్న చోటికి పరుగున వచ్చి "పగులునుండి నీటిని ఆపడానికి వేఱు దారి లేకపోగా నేనే పగులుకు అడ్డంగా పండుకొని నీటిని ఆపి పెట్టాను. మీ పిలుపు విని లేచి వచ్చాను, నీ రిప్పుడు మరల వెలికి ప్రవ హిస్తుంది. గురుదేవా, నమోవాకములు, ఇక నిప్పుడు నేను ఏమి చెయ్యాలో ఆనతియ్యండి" అన్నాడు.

"నాయనా, నీ సేవకు ఎంతయూ ప్రీతుణ్ణి అయ్యాను. నీవు లేచి రాగానే అక్కడ నీరు వెలికి ఉబికింది కదా. అందుకు సూచకంగా నీకు 'ఉద్దాలకుడు' అని నామకరణం చేస్తు న్నాను. నా మాటను నీవు తలదాల్చినావు. కాబట్టి నీకు ఎడతెంపు లేని మంగళములు కలుగుతాయి, శ్రుతులూ స్మృతులూ నీయందు వెలుగొందుతాయి" అని ధౌమ్యుడు అనుగ్ర హించాడు.

ఆరుణి గురుసేవ ఆలాగు శుభోదర్కం అయింది.

ఇందుకు సమాంతరమైన ఒక కథ-హాలం డులో పీటరు అను బాలు డుండినాడు. అక్కడ సముద్రానికంటె భూమి పల్లంలో ఉంది. సముద్రజలపూరం వచ్చి పడి భూమిని ప్రజలను ముంచివేయకుండా ఉండేందుకై అడ్డంగా గోడలు కట్టబడి ఉన్నాయి. ఆ గోడలో చిల్లి పడితే ప్రజకు జలప్రళయమే. ఆ గోడలసమీ పంలో అంధుడైన వృద్ధు డొకడు నివసిస్తుండి నాడు. అతనికి కొన్ని రొట్టె లిచ్చి ర మ్మని

పీటరుతల్లి పీటరును పంపింది. ఆ ధర్మకార్యం నెఱవేర్చి మరలి వస్తున్న పీటరుకు నీరు స్రవిస్తున్న శబ్దం వినబడింది. సమీపించి చూస్తే సముద్రమునకు అడ్డంగా ఉన్న గోడలో అతని అరచేతిపరిమాణము గల రంధ్రం పడి అందుండి నీరు లోపలికి పడుతుండడం కనిపించింది. రంధ్రం అప్పటికి చిన్నదిగానే ఉండినా, అది పెద్దది కావడానికి చాలసేపు పట్టదు. పెద్దదైతే, దేశం పూర్తిగా మునిగిపోతుంది. పరుగున పోయి పురపాలకసంఘంవారికి నివేదించి రంధ్రమును పూడ్చి వేసే పనివాండ్రను పంపునట్లు చేసేందుకు కూడా వ్యవధి లేకున్నది. కాబట్టి తాను చేయగలిగింది చేయాలి అని అతడు సాహసించాడు. ఆ రంధ్రాన్ని ఇసుకతో మట్టితో పూడ్చినాడు. జలవేగానికి ఇసుకయూ మట్టియు నిలుస్తాయా? కాబట్టి ఆ యిసుకయూ మట్టియూ ఊడిపడిపోకుండా పీటరు తన అరచేతిని ఆ రంధ్రానికి కప్పి అదిమిపెట్టాడు. జలప్రళయాన్ని ఆపడానికి రండోయి అని అతడు కేక వేశాడు. కాని అది ఎవరికీ వినిపించలేదు. అది దుస్సహమైన చలిరాత్రి. కాబట్టి ఎవ్వరూ వెలువలికి రారైరి. పీటరుకు ఆకలి వేస్తున్నది, బలం క్షీణిస్తున్నది, నిద్ర వస్తున్నది, ఐనా అతడు రాత్రి అంతా మేలుకొని ఉండినాడు, బంకతో అంటింపబడ్డట్టుగా అతని చేయి గోడకు అంటుకుపోయియుండింది. సముద్రజలవేగం అతని చిన్నచేతిని నెట్టి వేస్తున్నది. ఐనా చేతిని తీయక చీకటిలో చలిలో రాత్రి అంతా అట్లే ఉండినాడు. చేతికి తిమ్మిరెక్కి నొప్పి మొత్తుతుండినది. ఐనా దృఢసంకల్పుడగు ఆ బాలుడు వరుణునిపోటును ఎదిరించి నిలుచుండినాడు. ఇంతలో వేగుజా మయింది, ప్రజలు వెలికి రాదొడగినారు, వచ్చి చూచుసరికి బాలుడు స్మృతిలేకుండినాడు, ప్రాణంపోలేదు అతని చేయేమో గోడలోని రంధ్రంమీదే ఉండినది.

ఇట్లు ఆ రాత్రి తనదేశప్రజలను పీటరు సాహసం జలప్రళయంనుండి కాపాడింది.

ఇక మూడో నిదర్శనం. అది 1886 వ సంవత్సరం ఆగస్టు నెల. ప్రాణహారకమైన కంఠవ్రణవ్యాధితో బాధపడుతూ శ్రీరామకృష్ణుడు కాశీపూరులో ఉండినాడు. ఆయన మహాసమాధి చెందడానికి ఐదారు దినాలకు ముందు ఆదర్శగృహస్థశిష్యవరేణ్యుడైన నాగమహాశయుడు ఆయన్ను దర్శించడానికి వచ్చాడు. పారమార్థిక గురుభ ఆత్యంతిక వినయానికి నాగమహాశయుడు లోకోత్తర లక్ష్యం అతడు గురుదేవుని సన్నిధానానికి వచ్చియున్నప్పుడు, అక్కడున్న భక్తులతో గురుదేవు డిట్లంటుండినాడు — "ఉసిరికపండు ఇప్పుడు దొరుకుతుందా? నా నాలుకకు రుచి తెలియడం లేదు. ఉసిరికపండు నమిలితే ఈ అరుచి పోతుం దనుకుంటాను". ఒక భక్తుడందుకు ఈలాగు బదులు చెబుతుండినాడు :- "మహాశయా, ఉసిరికపండు దొరికే కాలం కాదే ఇది! ఇప్పుడు దాన్ని ఎక్కణ్ణుంచి తేగలం?" ఈవిషయం అంతతో ఆగిపోయింది. కాని నాగమహాశయు డాలాగు తలంప లేదు. పరమపావనుడైన గురుదేవుడు ఉసిరికపండును పేరు చెప్పి కోరినప్పుడు ప్రపంచంలో అది అప్పుడు దొరికి తీర వలె అని నాగమహాశయునికి అతని అంతరాత్మ చెప్పింది. శ్రీరామకృష్ణుడు దేనిని కోరినను అది ఎట్లో ఒకట్లు ఆయనకు లభించి తీరుతుం దని నాగమహాశయుని నమ్మకం. ఎందుచేతనంటే, ఆయనలో దివ్యత అంత నిబిడంగా ఉంది, దైవమే ఆయనగుండ కార్యసాధకం అవుతుంది, కాబట్టి ఆయనవిషయంలో 'కోరడమూ పడయకపోవ

డమూ' ఉండదు. ఇంతకు ముందు కొన్ని సందర్భాలలో గురుదేవుని గూర్చిన యీ నిజం నాగమహాశయునికి నిరూపితమైంది. ఒకనాడు గురుదేవుడు కమలాపండును భుజింపవలె నను తనఆశను తనశిష్యుడగు లాటుతో చెప్పినాడు ఆసంగతి నాగమహాశయునకు తెలియదు కాని, ఆనాడే కొన్ని కమలాపండ్లను తీసికొని పోయి గురుదేవునికి సమర్పించి ఆయన్ను దర్శించాలను కోరిక అతనికి కలిగి అలాగే చేశాడు. కమలా పండ్లు లభించినందుకు గురుదేవునకు కలిగిన సంతోషాన్ని, అందొకదాన్ని ఆయన చాల ఇష్టంతో ఆరగించడమున్నూ నాగమహాశయుడు చూచి ధన్యుడయ్యాడు. శ్రీరామకృష్ణుడు ఉసిరికపండును కోరడమున్నూ ఇది ఉసిరికపండ్ల కాలం కాదని ఒకరు చెప్పడమున్నూ విన్నంతనే నాగమహాశయుడు తానెక్కడికి పోవుచున్నదీ ఎందుకు పోవుచున్నదీ ఎవ్వరికిన్నీ చెప్పక వెడలిపొయ్యాడు. ఉసిరిక పండ్లను అన్వేషిస్తూ పొయ్యాడు. రెండు రోజులు గడిచాయి. ప్రతితోటలోనికీ ప్రవేశించి చూచాడు. అతనిశ్రమ వ్యర్థం కాలేదు. ఒక్కఉసిరికపండు అతనికి దొరకనే దొరికింది. మూడో రోజు తీసుకు వచ్చి గురుదేవునికి సమర్పించాడు. తాను కోరింది లభించినప్పుడు శిశువు సంతోషించినట్లుగా గురుదేవుడు సంతోషించాడు. ''ఎంత బాగుంది ఈ ఉసిరికపండు! ఈ కాలంలో ఇది నీ కెక్కడ దొరికింది'' అని కృతజ్ఞతతో ప్రశ్నించి ప్రశంసించాడు.

''ఇది ఉసిరికపండు దొరికే కాలం కాదు'' అని చెప్పిన భక్తుడు అసత్యం చెప్ప లేదు అది వృక్షశాస్త్రానుసారం సత్యమే. కాని నాగమహాశయుడు లోకాతీతస్థాయికి అధిరోహించిన వాడు. ఆయన గురుభక్తియు గురుసేవయు ప్రకృతిధర్మాలను కూడ మార్పొందించ గలవు.

విశ్వాసం కొండలను కదల్ప గల దనడం వట్టిమాట కాదు!

# శ్రీ గురు సూక్తి సుధ

ఉపన్యాయమూర్తి: మహాశయా, భగవంతుడు ఒకనిమీదకంటె మఱొక్కనిమీద ఎక్కువ అనుగ్రహము చూపునా? చూపునేని, భగవంతుడు పక్షపాతదోషదూషితు అవును గదా!

శ్రీరామకృష్ణుడు: ఏ మనుచున్నావు? మిణుగురుపురుగు వెలుగు నిచ్చును, చంద మామయు వెలుగు నిచ్చును, కావున చందమామయు మిణుగురుపురుగు ఒక్కటే అందువా? ఈశ్వరవిద్యాసాగారుడు కూడ నన్ను ఈప్రశ్నే అడిగినాడు. 'దేవుడొకనికి ఎక్కువశక్తిని మఱొకనికి తక్కువశక్తిని ఇచ్చు ననుట నిజమా, మహాశయా?'' అని ఆయన అడిగినాడు. అందుకు నేను చెప్పిన జవాబు: ''దేవుడు విశ్వవ్యాప్తమగు ఆత్మగా, ప్రతిప్రాణిలోను ఉన్నాడు. చీమలోను ఉన్నాడు, నాలోను ఉన్నాడు. కాని విభిన్న ప్రాణులలో భగవంతుని శక్త్యావిష్కృతులు భేదిల్లుచుండును. అందఱును ఒక్కటే ఐనచో, నీప్రఖ్యాతిచే ఆకృష్టులమై నిన్ను దర్శించుటకు మే మేల వత్తుము? నీ తలపై రెండుకొమ్ములు మొలచి ఉన్నవా? లేదు. అది కాదు. నీలో

దయ కలదు, పాండిత్య మున్నది, ఈ సుగుణములు ఇతరులలోకంటె నీలో హెచ్చుగా ఉన్నవి. నీ కింత ప్రఖ్యాతి కల్గుట కదే కారణము.'' ఒక్కొక్కరే నూఱుమందిని నిర్జింపగల మానవు లున్నా రనుటను నీవు చూచుచున్నావు కదా. అట్లే ఒకడు మఱొకని జూచినంతనే పాఱిపోవుచుండును. అటువంటివానిని గూడ నీవు చూచుచున్నావు. వివిధప్రాణులలో శక్త్యాభివ్యక్తి భేదిల్లకున్నచో, కేశవసేనుని ప్రజ లంతగా ఏల గౌరవింతురు?

పాండిత్యమునకో పాటకో వక్తృత్వమునకో మఱి దేనికో ఒక్క మానవుని పెక్కండ్రు ఆదరించుచుందురేని అతనిలో విశిష్టదివ్యశక్తి ఉన్న దనుట నిజ మని భగవద్గీతలో చెప్పబడియున్నది,

ఉపన్యాయమూర్తి: మహాశయా, మనకు సన్న్యసించుట తప్పని సరియా?

శ్రీరామకృష్ణుడు: కాదు. నీ వెందుకు సన్న్యసింపవలె? ఇహామం దుండియు మానవుడు దేవుని సాక్షాత్కరించుకోవచ్చు. కాని ప్రారంభదశలో కొన్నాళ్ళతడు ఏకాంతమున నుండ వలెను. ఏకాంతమైన చోట నతడు ఆధ్యాత్మికసాధన చేయవలయును. భోజనమునకుమాత్రము ఇంటికి వచ్చుచుండుట కనువుగా నతడు ఇంటికి దగ్గఱగా ఒకగదిని తీసికోవలెను. కేశవుడు ప్రతాపుడు మున్నగువారు ''మహాశయా, మేము జనకు నాదర్శము ననుసరింతుము'' మని నాతో చెప్పిరి. అందుకు నే నిట్లంటిని:- ''జనకుడు మొదట నేకాంతమున *తలక్రిందుగ నిలబడుట మున్నగు ఎన్ని తపస్సాధనలు చేయవలసియుండెను? ముందు కొంత చేయ వలె, తర్వాత నీవు జనకమహారాజవు కావచ్చు''. ఇంగ్లిషుభాషలో అనర్గళధారతో రచన చేయువానిని చూతువు. మొదటనే అత డట్లు వ్రాయగల్గియుండునా? అతడు పేద తల్లిదండ్రుల కుమారు డేమో! తానే ఒకరింట వంటవాడుగ నుండి జీవిక గడించుచుండె నేమో! చదువు సాగించుటకై చాల కష్టపడె నేమో! అట్లంతయు పాటుపడినపిమ్మట ఇప్పుడు అతడు ఆంగ్లమున అనర్గళరచయిత కాగలిగినాడు.''

కేశవసేనుతో నే నింకను ఇ ట్లంటిని— ఐహికపరుడు ఏకాంతమునకు జనడేని అతని తీవ్రభవరోగము నయ మగు టెట్లు?'' సంసారి సన్నిపాతజ్వరరోగగ్రస్తునివంటివాడు. అట్టిరోగి ఉన్న గదిలో ఊరినచింతకాయ పచ్చడియు నీరును ఉన్న వనుకో. అతనికి ఆజ్వరము నయ మగు నని ఎ ట్లనుకొందువు? ఆ పచ్చడిని పేర్కొన్నమాత్రమునకు నాకు నోరూరుచున్నది (అందఱు నవ్వుదురు). ఆచింతకాయను నా యెదుట పెట్టిన ఏ మగునో నీవు ఊహించుకోవచ్చు. మానవునకు నోరూరించు ఊరగాయ కామినియే, ఉపభోగేచ్ఛ నీరు. భోగానుభవాభిలాషకు పరిసమాప్తియు లేదు, పరిమితియు లేదు. ఆ వస్తువులు రోగి ఉన్నగదిలోనే ఉన్నవి. అలా గున్నచో అతనికి సన్నిపాతజ్వరము నయ మగు నని అనుకోగలవా? రోగిని ఊరగాయలు నీటిబానలు లేని గదికి జేర్చి అచట కొన్నాళ్ళుంపవలెను. అప్పు డతనికి జ్వరము నయ మగును. జ్వరము నయనమైన పిమ్మట, ఆ మునుపటిగదికి అతడు వచ్చిన — భయపడవలసిన దేమియు లేదు. భగవత్సాక్షాత్కారానంతరము ప్రపంచమున నుండు వానికి కామినీకాంచనములవలన నెట్టి హానియు నుండజాలదు. జనకునివలె భువిని నిర్లిప్తుడుగ జీవింప

* హఠయోగమందును యోగసామాన్యమందును విహితమైన యొకక్రమము.

గల సామర్థ్య మతని కప్పుడు కలుగును. అయినను ప్రారంభదశలో అతడు జాగరూకుడై యుండ వలెను. ఏకాంతమం దతడు ఆధ్యాత్మిక సాధన చేయవలెను. రావిచెట్టు మొలకదశలో ఉన్నప్పుడు పశువులు మేసిపోకుండుటకై దాని చుట్టును కంచె ఉండ వలెను. అది చెట్టుగా ఎదిగిన పిమ్మట కంచె అక్కఱ లేదు. ఆ చెట్టుకు ఏనుగును కట్టినను భయము లేదు. ఏకాంతమున ఆధ్యాత్మికసాధన చేసి భగవత్పాదారవిందప్రేమను ఆధ్యాత్మికశక్తిని పెంపొందజేసికొన్న తర్వాత, నీ యింటికి మరలి గృహస్థజీవనము గడపినను కామినీకాంచనముల వలని హాని నీ కించుకైన నుండదు.

పాలను పేరబెట్ట గోరినవాడు దాని నొక ప్రశాంతమైన చోట పెట్టును. అది పెరుగైన తర్వాత, చిలికి అందుండి వెన్నను తీయును. మన స్సనెడి పాలనుండి భక్తిజ్ఞానము లనెడి వెన్నను తీసిన తరువాత, అట్లు మార్పొందిన మనస్సును సంసార మనెడి నీట పెట్టితివేని, దానికి నీ రంటదు. నీటిపై నది తేలును. మనస్సుకు పరిపాకము కలుగుటకు ముందే, అనగా అది పాలవలె ఉండగనే, దానిని నీట నుంచితివేని, పాలు నీరు కలిసిపోవును. అప్పుడు సంసారసక్తి లేక మనస్సు తేలుట అశక్యమగును.

ఈ ప్రపంచములో వసింపుము. కాని భగవంతుని సాక్షాత్కరించుకొనుటకై ఒక చేతితో ఆయన శ్రీచరణకమలములను అవలంబించి, రెండవచేతితో నీ కర్తవ్యముల నిర్వహించుచుండుము. కర్తవ్యములనుండి నీకు విరామము కలిగినప్పుడు రెండు చేతులతోను దేవుని శ్రీచరణకమలములను అవలంబింపుము, ఏకాంతమున నుండుము, దేవధ్యానమును తత్కైంకర్యమును నిరంతరము సాగింపుము.



# వివేకానంద సింహగర్జనము

పుణ్యభూమి అని అనిపించుకొను నర్హత గల దేశము, తమకర్మఫలముల ననుభవింప అందఱును చేరితీరవలసిన దేశము, దేవుని చేరుకొనుటకై పయనించుచున్న ప్రతిఆత్మకు తుది మజిలియైన దేశము, సాధుత్వమందు, ఔదార్యమందు, పవిత్రతయందు, శాంతియందు మానవులు మహోన్నతస్థాయి నధిగమించిన దేశము, అన్నిటికి పైగా అంతర్ముఖతకు ఆధ్యాత్మికతకు నెలవైన దేశము ఒకటి భువియం దుండునేని — అది భారతదేశమే !

పవిత్రమైన మనమాతృదేశము మతమునకు తత్త్వశాస్త్రమునకు స్థానము, ఆధ్యాత్మిక మహాపురుషు లవతరించిన చోటు, వైరాగ్యమునకు నిలయము, అత్యంతప్రాచీనకాలమునుండి అత్యంతాధునికకాలమువఱకు మహోన్నతతమజీవితలక్ష్యము మానవాళికి ప్రాప్యమై ఉన్నట్టి దేశము.

తత్త్వశాస్త్రమునకు, పారమార్థికపరతకు నీతికి మధురతకు సాధుతకు ప్రేమకు — జన్మభూమి ఇది. ఇవి నేటికిని ఉన్నవి. వీనియందు భారతదేశమే దేశము లన్నిటియందును,

ఈనాటికిని ప్రప్రథమగణ్యము అని లోకానుభవముచే సువృఢప్రమాణప్రచితముగ ధీరముగ చెప్పుచున్నాను.

శతాబ్దములకొలదిగా తగిలిన ఆఘాతములను విదేశీయులు నూర్లకొలదిగ చేసిన దండయాత్రలను ఆచారసంప్రదాయములలో నూర్లకొలదిగ ఘటిల్లిన విప్లవములను ఓర్చిన ఆ భారత దేశమే ఇది. ప్రపంచములో నుండు ఏ శిలకంటెను మఱింత అప్రకంప్యముగ నిల్చి అమర తేజముతోను అవినాశ్యజీవితముతోను దీపించుచున్న ఆ దేశమే ఇది. దీని స్వరూపము ఆత్మ స్వరూపమే అనాదినిధనము అమరము. అట్టి దేశమాత బిడ్డలము మనము.

ప్రాచీనకాలముననేమి ఆధునికకాలముననేమి అన్యదేశాల జీవితపుగస్సరత్ప్రవాహములు మహాసత్యబీజములను మహాశక్తిబీజములను సుదూరప్రాంతములకు వెదజల్లినవి, కాని కనుపెట్టి చూడుడు. వెదజల్లుపనిని చేసినప్పుడెల్ల రణభేరులభాంకారములతోను సైనికవళములను నడిపించుటతోను చేసినవి. ఒక్కొక్కయాశయము రక్తప్రవాహమున తడుపబడవలసి వచ్చెడిది. ఒక్కొక్కయాశయము కోట్లకొలది సోదరమానవుల నెత్తుటిలో ఈదులాడుచు ముందు కేగవలసియుండెడిది. ఒక్కొక్కశాసనమును ఎన్నెటి కోట్లకొలది మానవుల మూలుగులును అనాథశిశువుల విలాపములును వినష్టభర్తృకల కన్నీళ్లను ఘటిల్లెడివి, ఇతర దేశాలవారు కఱపినది ప్రాయికముగా ఇదే కాని వేలకొలదిసంవత్సరములుగా శాంతియుత జీవితము గడపినది భారతదేశము!

చరిత్రవ్రాయబడుటకు ముందునుండియు, సంప్రదాయము రూపొందుటకు ముందు నుండియు, ఆ యంధకారయుగమునుండి ఈనాటివఱకు భారతదేశమునుండి ఆశయాల వెంబడి ఆశయాలు వెలి కేగినవి. కాని ప్రతిమాటకును ముందు శాంతియు వెనుక ఆశీస్సు నుండును. ప్రపంచమందలి సకలదేశాలలో దురాక్రమణమునకు ఎన్నడును పూనుకొనని దేశము మనదేశ మొక్కటే. ఆమంచి మన నెత్తిని ఉన్నందున మనము జీవించియున్నాము.

బలసంపన్నులు ఉండుదురు, బలహీనులు ఉండుదురు అనుచు పాశ్చాత్యులు నూతన ప్రతిపాదనలతో అతిప్రసంగము చేయుచుందురు. ప్రపంచములో జీవించి యుండ నర్హులు కండ బలము గలవారే అని వారితలంపు. అది నిజమైనచో ప్రాక్ప్రపంచమున దురాక్రమణము సాగించుచు వచ్చిన రాజ్యాలలో ఒక్కటైన ఈనాడును కీర్తిప్రతిష్ఠలతో ఉండియుండెడిది, ఒక్క దేశమునైనను జాతినైనను ఆక్రమించుకొనని దుర్బలుర మగు మనము హిందువులము, అంతరించియుందుము. కాని మనము ముప్పదికోట్లమంది ఇక్కడ ఉన్నామే!

ఔను, ఇదొక వింతసత్యము. ప్రపంచరంగమున దేశమువెంబడి దేశము వచ్చి, కొంతకాలము తన వంతు చాల చుఱుకుగా నిర్వహించి, కాలసాగరమున ఒకచిట్టికెరటము నైనను గుర్తునైనను నిలుపుకోక అంతరించి పోయినది. కాని ఇక్కడ మనమెహా శాశ్వత జీవితమును జీవించుచున్నాము.

యావత్ప్రపంచచరిత్రను చదువుడు. ఉన్నతాదర్శము మీ కెక్కడ కనిపించినను, ఆ యాదర్శమునకు పుట్టుకచోటు భారతదేశమే. అనాదికాలముగా భారతదేశము మానవ సంఘమునకు అమూల్యాశయాలగనిగా ఉండుచు వచ్చినది. భారతదేశము మహోన్నతాశయ ములను తాను ఈనుటే కాక, ఉచితముగా వానిని లోకమున కంతటికిని వెదజల్లుచు పంచి పెట్టుచు వచ్చినది.

సాగిన మతవిషయికపరిశోధనలు మనకు తెలిపిన నిజ మిది: ఏ దేశములో చక్కని నీతినియమావళీ ఉన్నను అందు కొంత మన దేశమునుండి ఎరవుగ కైకొన్నదిగనే ఉండును. ఆత్మనిత్యత్వమాదిగా గల మంచి ఆశయములు ఏమతములో ఉన్నను, అది సద్వారకముగనో అద్వారకముగనో మనయొద్దనుండి కైకొన్నవే.

యథార్థభారత దేశచరిత్రమును త్రవ్వి తీసినప్పుడు, మతవిషయములలోవలె లలిత కళలందును విశ్వమున కంతటికిని ఆదిగురువు భారతదేశమే అనుట నిరూపిత మగును.

ఏ దేశమున మహారాజులు తమ్ము రాజులసంతతివారు అనుకొనరో, పేదబాటసారులను దోచుకొను దుర్గభవనవాసులగు దోపిడిదొరలసంతతివారు అనుకొనరో, కాననవాసులగు అర్ధ దిగంబరులగు మహర్షులసంతతివార మని చెప్పుకొందురో, ఆ దేశమునుగూర్చి మీ రెప్పుడైన విని యున్నారా? అట్టి దేశమునుగూర్చి మీ రెప్పుడైన విని యున్నారా? ఇదే ఆ దేశము.

# శివానందలేఖావళి

## 120

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
28 అక్టోబరు 1922

ప్రియశ్రీమన్.

నీయొద్దనుండి నాకు వచ్చిన మఱొక్కజాబు నుండి అన్ని సంగతులును తెలిసినవి. నా వ్రాయగలవానిలో అత్యధికభాగమును నీవు గురుదేవు నను గ్రహముచే తప్పక అవగాహన చేసికొనగలవు. చాల ఆత్రముతో అడుగువారు ఉన్ననే తప్ప, ఎవ్వరును తమస్వప్నములను గూర్చి ఇతరుల కేమియు చెప్పగూడదు. ప్రత్యేకముగ నీకు ప్రియులైన వారికిని స్వప్న ములనుగూర్చి వినుటచే భక్తిప్రేమశ్రద్ధలందు అభివృద్ధి నొందుదు రని నీకు తోచినవారికిని నీవు చెప్పవచ్చు.

హృదయమున గురుదేవుని ధ్యానించువిష యమున, లోగడ నీకు నేను కలిపియుండిన విధానము ననుసరింపుము. గురుదేవుని పీఠ మును నీవు సులభముగా కూర్ప వచ్చు. మంచు కప్పిన మహోన్నతపర్వతశిఖరముపైని కాని, పొంగుచున్న కడలికెరటములపైని గాని, జ్యోతిర్మధ్యమున గాని, పద్మముపైని గాని ఆసీనుడై యున్నట్లుగా నీవు గురుదేవుని ధ్యానింపవచ్చు. నిజమున కివేవియు వ్యర్థభావ నలు కావు. నీబుద్ధికి అందనివాని నింకను ఎన్నింటినో నీవు అనంతరకాలమున అనుభ వింపగలవు.

ప్రారంభదశలో జపసంఖ్యను గణించుట చాల తోడ్పడగలదు. జపము ధ్యానముగ పరిణమించినమీదట సంఖ్యాదులు నీకు జ్ఞప్తియం దుండవు. మానసికముగ అవృత్తమైనప్పుడే జపము శ్రేష్ఠ మనుటను జ్ఞప్తియం దుంచుకొనుము. వ్రేళ్ళతో లెక్కించుట మధ్యమము, జపమాలతో లెక్కించుట సర్వసామాన్యము.

జపమునుగూర్చి నీ కింతకుముం దేమి చెప్పియుంటినో దానినే మరల చెప్పుచున్నాను. జపపువిలువను హెచ్చించునది మనఃప్రగాఢతయే కాని జపసంఖ్య కాదు. భగవన్నామమును జపించునప్పుడు మనము గణింపవలసినది ప్రేమను ఆనందమును ఆశను భావావేశమును. సంఖ్య ఎక్కువగ ఉండ వచ్చు, తక్కువగ ఉండ వచ్చు, నామమును త్వరత్వరగ చెప్పినప్పుడు కలుగునంతకంటె మెల్లగ చెప్పినప్పుడు హృదయమున కెక్కువ ఆనందానుభూతి కలుగును. జపమాల లేనిదే జపమున నిష్ఠ కుదుర దనుట సామాన్యనియమము. కాని ఆరంభమున పురోగమించిన అల్పసంఖ్యాకులకు గాని అనల్పసంఖ్యాకులకు గాని దాట రాని నియమ మేమియు లేదు. భగవంతునందు భక్తిప్రేమలు పెంపొందజేసికొన్న వానికి జపమాలాదు లక్కఱ లేదు. జపమాల నీ కెందుకో, నా కర్థమగుట లేదు. యోగి తులసీదాసునుపదేశాలలో ఒకపద్యమున్నది-[అనువాదప్రాయము]

మానసికజపపరుఁడే సమ్మాన్యుఁ డిలను
తనదు వ్రేళ్ళ లెక్కిడు నడితరమువాఁడు
చాల సామాన్యుఁ డలజపమాలవాఁడు.

మానసికజపము సర్వశ్రేష్ఠ మని యర్థము.

నీకు నాహృదయపూర్వాశీస్సులు; భక్తుల కందఱికి నాయాశీస్సుల నందజేయుము.

నీ శ్రేయోభిలాషి
శివానంద

## 121

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
20, అక్టోబరు 1922

ప్రియశ్రీమర్—

నీ పెద్దజాబు చేరినది. సంతోషము. రెండు మూడుదినములకు ముందు నేను వ్రాసిన జాబు నీకును చేరియుండును. భయపడకు. ఆధ్యాత్మిక సాధనలు చదువు మున్నగువానినిగూర్చి ఇప్పుడు చేయుచున్నట్లే చేయుచుండుము.

గురుదేవుని అమృతసూక్తులను వర్గీకరించుటనుగూర్చి నీకు సలహా చెప్పుటకు నాకు హక్కు లేదు. గురుదేవుడు ఎవరితో ఏ సందర్భములో ఏమి చెప్పెనో తెలిసికొనుట సులభము కాదు. కావున ఆయన సూక్తులను అర్థము చేసికొనుట చాలమందికి తఱచు చాల కష్టముగ నుండును. మా వాక్యాలను నీవు ధారాళముగా వర్గీకరింపవచ్చు, సందేహము వచ్చినప్పుడు, నేను జీవించియున్నంతవఱకు నన్నే అడుగవచ్చు. ఉన్నమార్గములు రెండు వివేచనమార్గము, విశ్వాసమార్గము. రెండు మార్గములను అనుసరించుట మంచిది. తన విశ్వాసము బలపడురీతిలోనే మానవుడు వివేచనము చేయవలెను. పెద్దలందు అవిశ్వాసమును గల్గించు వివేచనము వివేచనము కాదు. అది అపసవ్యవివేచన మను సంగతి నర్థము చేసికోవలయును.

నీ కింక నేమి వ్రాయుదును. నాహృదయపూర్వకప్రేమాశీస్సులను నీవు చేకొని భక్తుల కందఱికిని అందజేయుము. నీ వనిన నాకు విశేష ప్రేమ. నా ప్రేమను చెప్పుటకు మాటలుచాలవు. ఈ సంగతిని నీవు జ్ఞప్తియం దుంచుకోవలయును.

నీ శ్రేయోభిలాషి
శివానంద

---

# కనకధారాస్తవము

మూలము :
శ్రీ శంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

కమలే, కమలాక్షవల్లభే, త్వం కరుణాపూరతరఙ్గితై రపాఙ్గైః
అవలోకయ మా మకిఞ్చనానాం ప్రథమం పాత్ర మకృత్రిమం దయాయాః. 15

కమలే = ఓకమలా, కమల+అక్ష వల్లభే = పుండరీకాక్షుడగు విష్ణుదేవునిప్రాణకాంతా, త్వం = నీవు, అకిఞ్చనానాం ప్రథమం = దరిద్రులలో మొదటివాడును, దయాయాః అకృత్రిమం పాత్రం = నీదయకు సహజభాజనుడును అగు, మాం = నన్ను, కరుణాపూరతరఙ్గితైః = కనికరపు వెల్లిపొంగెక్కిన, అపాఙ్గైః = కడకన్నులతో, అవలోకయ = వీక్షింపుమా. ౧౫

శ్రుత్యై నమో ఽస్తు శుభకర్మఫలప్రసూత్యై
రత్యై నమో ఽస్తు రమణీయగుణాశ్రయాయై
శక్త్యై నమో ఽస్తు శతపత్త్రనికేతనాయై
పుష్ట్యై నమో ఽస్తు పురుషోత్తమవల్లభాయై ॥ 16

శుభకర్మఫలప్రసూత్యై = పుణ్యకర్మలకుఫలముల నీను, శ్రుత్యై = వేదస్వరూపిణివగు నీకు, నమఃఅస్తు = నాప్రణామము చెందునుగాత, రమణీయగుణ + ఆశ్రయాయై = మనోహర గుణములకుస్థానమై, రత్యై అనురాగరూపిణివగు నీకు, నమఃఅస్తు = నాప్రణామము చెందును గాత, శతపత్త్రనికేతనాయై = పద్మాలయవై, శక్త్యై = శక్తిస్వరూపిణివగు నీకు, నమఃఅస్తు = నా ప్రణామము చెందునుగాత, పురుషోత్తమవల్లభాయై = విష్ణుదేవునిప్రాణకాంతవై, పుష్ట్యై = సమృద్ధిస్వరూపిణివగు నీకు, నమః అస్తు = నా ప్రణామము చెందునుగాత. ౧౬

నమో ఽస్తు నాళీకనిభాననాయై, నమో ఽస్తు దుగ్ధోదధిజన్మభూమ్యై.
నమో ఽస్తు సోమామృతసోదరాయై, నమో ఽస్తు నారాయణవల్లభాయై. 17

నాళీకనిభ+ఆననాయై పద్మమునుబోలిన మోమ్ముగల లక్ష్మికి, నమః అస్తు ఈప్రణామము చెందుత, దుగ్ధ+ఉదధిజన్మభూమ్యై = పాలకడలి జన్మభూమిగా గల రమాదేవికి, నమః అస్తు = ఈప్రణామము చెందుత, సోమ+అమృతసోదరాయై = చంద్రునకును అమృతమునకును తోబుట్టువగు కమలకు, నమః అస్తు = ఈప్రణామము చెందుత, నారాయణవల్లభాయై = నారాయణుని ప్రాణకాంతయగు పద్మకు, నమః అస్తు = ఈప్రణామము చెందుత. ౧౭

నమో ఽస్తు హేమామ్బుజపీఠికాయై, నమో ఽస్తు భూమణ్డలనాయికాయై,
నమో ఽస్తు దేవాదిదయాపరాయై, నమో ఽస్తు శార్ఙ్గాయుధవల్లభాయై 18

హేమ+అమ్బుజపీఠికాయై = బంగారుతామరపీఠముగా గల శ్రీదేవికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత, భూమణ్డల నాయికాయై = జగన్నాయకియగు ఇందిరకు, నమః అస్తు = ఈప్రణామము చెందుత. దేవ+ఆదిదయాపరాయై = వేల్పులు మొదలుకొని ఎల్లరను కనికరించుటే

ముఖ్యస్వభావముగా గల లోకమాతకు, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. శార్ఙ్గ + ఆయుధవల్లభాయై = శార్ఙ్గము అను విల్లు ఆయుధముగాగల శ్రీమహావిష్ణువునకు ప్రాణకాంత యగు భార్గవికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. ౧౮

నమో ఽస్తు దేవ్యై భృగునన్దనాయై, నమో ఽస్తు విష్ణో రురసి స్థితాయై
నమో ఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై, నమో ఽస్తు దామోదరవల్లభాయై. 19

భృగునన్దనాయై దేవ్యై = భార్గవియగు దేవికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. విష్ణోః = విష్ణుదేవుని, ఉరసి = వక్షఃపీఠమున, స్థితాయై = మోజుపడి అధిష్ఠించియున్న లోకజననికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. కమల+ఆలయాయై = పద్మ మునికిపట్టుగా గల, లక్ష్మ్యై = లక్ష్మికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. దామోదరవల్లభాయై = యశోదచే ఱోటికి కట్టువడిన సౌలభ్యనిధియగు స్వామికి దయితయగు ఇందిరకు, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత. ౧౯

నమో ఽస్తు కాన్త్యై కమలేక్షణాయై, నమో ఽస్తు భూత్యై భువనప్రసూత్యై,
నమో ఽస్తు దేవాదిభిరర్చితాయై, నమో ఽస్తు నన్దాత్మజవల్లభాయై. 20

కమల+ఈక్షణాయై = తమ్మికంటియగు కాన్త్యై = తేజో ఽధిదేవతకు, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత, భువనప్రసూత్యై = లోకమాతయగు, భూత్యై = సంపదధిదేవతకు, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత, దేవ+ఆదిభిః = వేల్పులు మున్నగువారిచే, అర్చితాయై = పూజలందిన దేవికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత, నన్ద+ఆత్మజవల్లభాయై = నందనందనుని ప్రాణేశ్వరికి, నమః అస్తు = ఈ ప్రణామము చెందుత ౨౦

స్తువన్తి యే స్తుతిభి రమూభి రన్వహం
త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్
గుణాధికా గురుధనభాగ్యభాగినో
భవన్తి తే భవమను భావితాశయాః. 21

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతిషు కనకధారా స్తవ స్సమ్పూర్ణః.

త్రయీమయీం = ముప్వేదములరూపమున వెలసియున్నదియు, త్రిభువనమాతరం = ముల్లోకాలకు తల్లియు నగు, రమాం = శ్రీమహాలక్ష్మిని, అమూభిః స్తుతిభిః = ఈనుతులచే, యే = ఎవరు, అన్వహం = ప్రతిదినమును, స్తువన్తి = కొనియాడుదురో, తే = వారు, అనుభవం = ప్రతిజన్మమందును, గుణ+అధికాః = గుణములం దతిశయము కలవారుగను, గురుధనభాగ్య భాగినః = అత్యధిక ధనసంపదకు భాజనులుగను, భావిత+ఆశయాః = సిద్ధినొందింపబడిన సంకల్పములుగలవారుగను, భవన్తి = అగుదురు. ౨౧

ఇది అన్నమాచార్యాపరనామధేయ భారద్వాజభక్తవత్సలవిరచిత మగు
కనకధారా స్తవ వివరణము సమాప్తము.

# బృహదారణ్యకోపనిషత్తు

## ముచికుంద

### ప్రథమాధ్యాయము – తృతీయబ్రాహ్మణము.

ద్వయా హ ప్రాజాపత్యాః, దేవా శ్చాసురాశ్చ। తతః కానీయసా ఏవ దేవాః, జ్యాయసా అసురాః, త ఏషు లోకే ష్వస్పర్ధన్త, తే హ దేవా ఊచుః, హన్తాసురాన్ యజ్ఞ ఉద్గీథే నాత్యయా మేతి॥ 1

ప్రజాపతిసంతతివారు ఇరుతెగలు — దేవతలు, అసురులు. దేవతలు అల్పసంఖ్యాకులు. అసురులు అత్యధికసంఖ్యాకులు, లోకాలప్రభుత్వమునకై దేవతలకు అసురులకు స్పర్ధ కలిగినది. దేవతలు తమలో ఇట్లనుకొనిరి, "యజ్ఞమందు ఉద్గీథముచే అసురులను జయింతము". ౧

తే హ వాచ మూచుః, త్వం న ఉద్గా యేతి; త థేతి తేభ్యో వా గుదగాయత్। యో వాచి భోగ స్తం దేవేభ్య ఆగాయాత్. య త్కల్యాణం వదతి త దాత్మనే। తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్య న్తీతి। త మభిద్రుత్య పాప్మనా విధ్యన్; స య స్స పాప్మా, య దే వేద మప్రతిరూపం వదతి స ఏవ స పాప్మా॥ 2

వారు వాగింద్రియముతో చెప్పిరి "మాకై ఉద్గీథమును పాడుము" అని. అటులే కాని మ్మని వారికై వాగింద్రియము ఉద్గీథమును గానముచేసెను. వాగింద్రియమువలన గలుగు భోగమును అది గానముచే దేవతలకు సమకూర్చెను; సదుచ్చారణప్రయోజనమును సొంతమున కుంచుకొనెను. ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు అతనిపై కురవడించి పాపముతో కొట్టిరి. తప్పు మాటాడినప్పుడు అందు గనవగు దోష మదే. ౨

అథ హ ప్రాణ మూచుః, త్వం న ఉద్గా యేతి; త థేతి తేభ్యః ప్రాణ ఉదగాయత్; యః ప్రాణే భోగ స్తం దేవేభ్య ఆగాయత్, య త్కల్యాణం జిఘ్రతి త దాత్మనే తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్య న్తీతి, త మభిద్రుత్య పాప్మనా విధ్యన్, స య స్స పాప్మా, య దే వేద మప్రతిరూపం జిఘ్రతి స ఏవ స పాప్మా॥ 3

అంతట వారు ఘ్రాణేంద్రియముతో "మాకై ఉద్గీథమును పాడుము" అనిరి. అట్లే కాని మ్మని ఘ్రాణేంద్రియము ఉద్గీథమును పాడెను. ఘ్రాణేంద్రియమువలన గలుగు భోగమును అది గానముచే దేవతలకు సమకూర్చెను. చక్కగా మూర్కొన్నప్రయోజనమును సొంతమున కుంచుకొనెను. ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు అతనిపై కురవడించి పాపముతో కొట్టిరి. తగనిదానిని మూర్కొన్నప్పుడు అందు గనవగు దోషమదే. 3

అథ హ చక్షు రూచుః, త్వం న ఉద్గా యేతి; త థేతి తేభ్య శ్చక్షు రుదగాయత్। య శ్చక్షుషి భోగ స్తం దేవేభ్య ఆగాయత్, య త్కల్యాణం పశ్యతి త దాత్మనే। తే విదు

రనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, త మభిద్రుత్య పాప్మనా విధ్యన్, స యస్స పాప్మా య దే వేద మప్రతిరూపం పశ్యతి స ఏవ స పాప్మా॥ 4

అంతట వారు చక్షురింద్రియముతో 'మాకై ఉద్గీథమును పాడు' మనిరి. అట్లే కానిమ్మని చక్షురింద్రియము ఉద్గీథమును పాడెను. చక్షురింద్రియమువలన గలుగు భోగమును అది గానముచే దేవతలకు సమకూర్చెను. చక్కగా కాంచెడి ప్రయోజనమును సొంతమున కుంచుకొనెను. ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు అతనిపై కురవడించి, పాపముతో కొట్టిరి. తగనిదానిని కనినప్పుడు అందు గననగు దోష మదే. ౪

అథ హ శ్రోత్ర మూచుః, త్వం న ఉద్గా యేతి; త థేతి, తేభ్య శ్శ్రోత్ర ముదగాయత్, యః శ్రోత్రే భోగ స్తం దేవేభ్య ఆగాయత్, య త్కల్యాణం శృణోతి త దాత్మనే। తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, త మభిద్రుత్య పాప్మనా విధ్యన్; స యస్స పాప్మా, య దే వేద మప్రతిరూపం శృణోతి స ఏవ స పాప్మా. 5

అంతట వారు శ్రోత్రేంద్రియముతో 'మాకై ఉద్గీథమును పాడు' మనిరి. అట్లే కానిమ్మని శ్రోత్రేంద్రియము ఉద్గీథమును పాడెను. శ్రోత్రేంద్రియమువలన గలుగు భోగమును అది గానముచే దేవతలకు సమకూర్చెను. చక్కగా విన్న ప్రయోజనమును సొంతమున కుంచుకొనెను. ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు అతనిపై కురవడించి పాపముతో కొట్టిరి. తగనిదానిని విన్నప్పుడు అందు కననగు దోష మదే. ౫

అథ హ మన ఊచుః, త్వం న ఉద్గా యేతి, త థేతి, తేభ్యో మన ఉదగాయత్, యో మనసి భోగ స్తం దేవేభ్య ఆగాయత్, య త్కల్యాణం సఙ్కల్పయతి త దాత్మనే। తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, త మభిద్రుత్య పాప్మనా విధ్యన్; స యస్స పాప్మా య దే వేద మప్రతిరూపం సఙ్కల్పయతి స ఏవ స పాప్మా, ఏవము ఖ ల్వేతా దేవతాః పాప్మభి రుపాసృజన్, ఏవ మేనాః పాప్మనా విధ్యన్. 6

అంతట వారు అంతరింద్రియమగు మనస్సుతో 'మాకై ఉద్గీథము పాడు' మనిరి. అట్లే కానిమ్మని మనఇంద్రియము ఉద్గీథమును పాడెను, మనఇంద్రియమువలన గలుగు భోగమును అది గానముచే దేవతలకు సమకూర్చెను. చక్కగా సంకల్పించుకొన్న ప్రయోజనమును సొంతమునకు ఉంచుకొనెను, ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు అతనిపై కురవడించి పాపముతో కొట్టిరి, తగనిదానిని సంకల్పించినప్పు డందు గననగు దోష మదే. ఇదే మార్గమున వారు త్వగాదింద్రియములకుగూడ పాప మంటగట్టిరి, పాపముతో కొట్టిరి.

అథ హేయ మాసన్యం ప్రాణ మూచుః, త్వం న ఉద్గా యేతి; త థేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్, తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, త మభిద్రుత్య పాప్మనా

వివ్యత్సన్; స యథాశ్మాన మృత్వా లోష్టో విధ్వంసేత ఏవం హైవ విధ్వంసమానా
విష్వఞ్చో వినేశుః; తతో దేవా అభవన్, పరాసురాః, భవ త్యాత్మనా, పరాస్య ద్విష 7
న్భ్రాతృవ్యో భవతి య ఏవం వేద.

అంతట దేవతలు నోట నెలకొనియున్నదగు ప్రాణముతో 'మాకై ఉద్గీథమును పాడు' మనిరి. అట్లే కాని మ్మని ప్రాణము ఉద్గీథమును పాడెను. ఉద్గాతద్వారా దేవతలు తమ్ము జయింతు రని తెలిసికొని అసురులు దానిపై బడి పాపముతో కొట్ట బోయిరి, కాని ఱాయికి వేసి కొట్టుకొన్న మట్టిగడ్డ చిదిగి చెల్లాచెదరైనట్లు, వారు చిదిగి చెల్లాచెదరై నశించిరి. దేవతలు యథాస్థితి నందిరి, అసురులు ఓడిరి. దీనిని తెలిసికొన్నవాడు యథాస్థితి నొందును. అతనిపై ఈసు చెందినవాడు ఓడును. ౭

తే హోచుః, క్వ ను సో ఽభూ ద్యో న ఇత్థ మస క్తేతి, అయ మాస్యే ఽన్త రితి; 8
సో ఽయాస్య ఆఙ్గిరసః, అఙ్గానాం హి రసః.

వారు (దేవతలు) "మనల నిట్లు యథాస్థితి నొందించిన ఆప్రాణ మెక్కడ' 'అనిరి. ఆస్యాంతరమున అత డున్నా డని నిశ్చయించుకొనిరి. కావున ప్రాణమునకు ఆయాస్యాంగిరస మను వ్యవహార మేర్పడెను. ఏలయన అది అంగముల రసము (=సారము), ౮

సా వా ఏషా దేవతా దూ ర్నామ, దూరం హ్యస్యా మృత్యుః; దూరం హ వా అస్మా 9
న్మృత్యు ర్భవతి య ఏవం వేద.

ఆ దేవతకే 'దూ' అని పేరు, ఏల యన దానికి మృత్యువు దూరముగ నున్నది. ఎవడు దీని నెఱుగునో అతనికిని మృత్యువు దూర మగును. ౯

సా వా ఏషా దేవ తైతాసాం దేవతానాం పాప్మానం మృత్యు మపహత్య యత్రాసాం
దిశా మన్త స్తద్గమయాఞ్చకార, త దాసాం పాప్మనో విన్యదధాత్; తస్మా న్న జన మియాత్ 10
నాన్త మియాత్, నేత్పాప్మానం మృత్యు మన్వవాయానీతి.

ఆ దేవతయే ఈ దేవతల పాపమనెడి మృత్యువును హరించి దిక్కులకొనలకు చేర్చెను, అది వీరి పాపముల నచట నిక్షేపించెను. కావున అచటిజనమును చేర రాదు, ఆ దిగంతములకు పోరాదు, పోయిన పాపము అంటును, మృత్యువు సంక్రమించును. ౧౦

సా వా ఏషా దేవ తైతాసాం దేవతానాం పాప్మానం మృత్యు మపహ త్యా థైనా 11
మృత్యు మత్యవహత్.

ఆ దేవతయే ఈ దేవతల పాప మనెడి మృత్యువును హరించి వీరిని మృత్యువును దాటించెను. ౧౧

స వై వాచ మేవ ప్రథమా మత్యవహత్; సా యదా మృత్యు మత్యముచ్యత సో
ఽగ్ని రభవత్; సో ఽయ మగ్నిః పరేణ మృత్యు మతిక్రాన్తో దీప్యతే. 12

ఆ ప్రాణము మొదట వాగింద్రియమును మృత్యువును దాటించెను. మృత్యువును దాటినంతనే అది అగ్నిగా నయ్యెను. ఆయీయగ్ని మృత్యువు నతిక్రమించి ఎంతయు దీపించు చున్నది. ౧౨

అథ ప్రాణ మత్యవహత్; స యదా మృత్యు మత్యముచ్యత స వాయు రభవత్;
సో ఽయం వాయుః పరేణ మృత్యు మతిక్రాన్తః పవతే. 13

అంత నది ఘ్రాణేంద్రియమును మృత్యువును దాటించెను. మృత్యువును దాటినంతనే అది వాయువుగా నయ్యెను. ఆయీవాయువు మృత్యువు నతిక్రమించి ఎంతయు వీచుచున్నది. ౧౩

అథ చక్షు రత్యవహత్; త ద్యదా మృత్యు మత్యముచ్యత స ఆదిత్యో ఽభవత్,
సో ఽసా వాదిత్యః పరేణ మృత్యు మతిక్రాన్త స్తపతి. 14

అంత అది చక్షురింద్రియమును మృత్యువున కవ్వలికి కొనిచనెను. మృత్యువును దాటినంతనే అది ఆదిత్యుడుగ నయ్యెను. ఆయీయాదిత్యుడు మృత్యువు నతిక్రమించి ఎంతయు తపించుచున్నాడు (=ప్రకాశించుచున్నాడు). ౧౪

అథ శ్రోత్ర మత్యవహత్; త ద్యదా మృత్యు మత్యముచ్యత తా దిశో ఽభవన్;
తా ఇమా దిశః పరేణ మృత్యు మతిక్రాన్తాః. 15

అంత నది శ్రోత్రేంద్రియమును మృత్యువున కవ్వలికి చేర్చెను. మృత్యువును దాటి నంతనే అది దిశలుగా నయ్యెను. ఆయీదిశలు మృత్యువున కవ్వల నెలకొనియున్నవి. ౧౫

అథ మనో ఽత్యవహత్; త ద్యదా మృత్యు మత్యముచ్యత స చన్ద్రమా అభవత్;
సో ఽసౌ చన్ద్రః పరేణ మృత్యు మతిక్రాన్తో భాతి. ఏవం హ వా ఏన మేషా దేవతా
మృత్యు మతివహతి య ఏవం వేద. 16

అంత అది మనఇంద్రియమును మృత్యువున కవ్వలికి చేర్చెను. మృత్యువును దాటి నంతనే అది చంద్రుడుగ నయ్యెను. ఆయీచంద్రుడు మృత్యువు నతిక్రమించి ఎంతయు ప్రకాశించుచున్నాడు. ఇట్లే దీని నెఱిగినవానిని ఈ దేవత మృత్యువును దాటించును. ౧౬

# యోగసారబోధిని-12

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

### రాజయోగము-II

యోగికి సంరక్షకమైన ప్రహరీగోడలోని పది స్తంభాలను క్రిందటి ప్రసంగంలో పేర్కొన్నాం. వానిని నిర్మించుకొని దృఢపఱచుకొన్న తర్వాత సాధకుడు ప్రథమ కర్తవ్యాలను గమనిస్తాడు. తనంతటతానే, తన లాభానికే తన క్షేత్రానికిచుట్టూ సంరక్షకమైన ప్రహరీగోడను నిర్మించుకొన్న తర్వాత సాధకుడు ఇక నేలను సిద్ధపఱచుకోవడంలో ఏకాగ్రత వహిస్తాడు.

సేద్యపుటుపమానంతోనే వివరిస్తాం. నేల సరియైన దశలో లేకపోవచ్చు; రాళ్ళమయంగాను చెత్తనిండినదిగాను ఉండవచ్చు. కావలసినంతసారం ఆ మట్టిలో లేకపోవచ్చు. కర్షకుడు విత్తనాలను చల్లడానికి ముందు మొదట రాళ్ళనెత్తివేయవలె, లోతుగా దున్నవలె, మిట్టలను చదిపి పల్లములను పూడ్చివేయాలి. యోగంలో బీజావాపమునకు మునుపటి సంసిద్ధత ఆసనంచేతను ప్రాణాయామంచేతను సిద్ధిసుంది.

అనగా యోగాభ్యాసానికి దేహమును సిద్ధపఱచుకోవలె అన్నమాట. దేహపరిస్థితి తాఱుమాఱుగా ఉండువాడు యోగాభ్యాసానికి సమర్థుడుకాడు. ఈ దశలో యోగవిద్యార్థి ఆసనమును ప్రాణాయామమును అభ్యసించాలి.

ఆసనం అంటే కూర్చుండు తీరు. సరియైన ఆసనం అలవడితే శారీరక మానసికాధ్యాత్మిక లాభాలు సమకూడుతాయి. వంపులేని ఋజురీతిలో కూర్చుంటే, అవయవాలకు వాని వాని స్థానంలో విశ్రాంతియు పనులకు నిర్నిరోధతయు చేకూరుతాయి. కాని వక్రరీతిలో కూర్చుంటే అవయవాలకు ఇఱుకటం ఒరసికోవడం త్రొక్కుట కలుగుతాయి. వానికి హాయి ఉండదు. అవి పరస్పరం సదా కలహించుకుంటుంటాయి. కావున అవి మనలను హాయిగా ఉండనీయవు. చక్కని రీతిలో కూర్చుంటే రక్తప్రసారమును జీర్ణశక్తియు మేలొందుతాయి. కాబట్టి సామాన్యారోగ్యదృక్పథంలో కూడ చక్కని రీతిలో ఆసనం అలవఱచుకోవడం ముఖ్యమే.

ఋజురీతిలో కూర్చుండేవాడు నిలబడేవాడు, లోకాన్ని ఎదుర్కొ-గలవాడు, అన్నిసమయసందర్భాలకు సమర్థుడుగాను సంసిద్ధుడుగాను ఉంటాడు. ఇతరులకున్నంతకంటె ఆత్మవిశ్వాసం అతని కెక్కువగా ఉంటుంది, ఇతరులలో విశ్వాసాన్ని అత డుప్పతిల్ల చేయగలిగి ఉంటాడు. ఉత్సాహభంగమూ విషాదమూ సంభవించినప్పుడు నిగుడుకొని కూర్చోవడం అశక్యమనుటను ఎప్పుడైనను గుర్తించారా? అలాంటప్పుడు మీ దేహం సహజంగానే ముడుచుకుపోతుంది. అప్పుడే సంతోషవార్త ఏదైనా అందితే, ముడిగియుండిన దేహం వెంటనే నిగుడుతుంది. కారణం తెలుసా? ఉత్సాహవార్త చెవిని బడగానే మీలో ఒకప్రవాహం ప్రబోధితమై విషాదాన్ని మీచేత దులిపివేయిస్తుంది. మనసునందలి దీనత తొలగుతున్నప్పుడే దేహానికి నిర్వక్రత చేకూరుతుంది. క్రమమును త్రిప్పించండి. మనస్సును ఉత్సాహనిశ్రేణి నెక్కించాలంటె సరియైన ఆసనం అలవఱచుకుంటే, ఎక్కించగలరు.

వెన్నెముకద్వారంలో కుండలినీశక్తి అను సూక్ష్మశక్తి ఒకటి ఉందని యోగులు చెబు

తారు. వెన్నెముకకు వంపు లేకుండ చేసుకుంటే ఈ శక్తికి నిరోధం ఉండదు. సాధకునికి ఆధ్యాత్మికసమున్నతి కలిగినపుడు, ఉష్ణమితి (థెర్మోమీటరు)లో పాదరసము ౹కి లేచినట్లు, కుండలినీశ క్తి ౹కి లేస్తుంది. లేస్తున్న యీ శక్తి వివిధస్థాయుల నధిగమించినప్పుడు సాధకుని చైతన్యములో వివిధదశలు అనుభూతములౌతాయి. యోగికి ఆసనము చక్కగా కుదిరిన తర్వాతనే వెన్నెముకగుండ కుండలినీ శక్తిని పైపై మెట్లధిరోహింపజేయు సాధనలకు పూనుకోవాలి. కాబట్టి యోగవిద్యార్థికి చక్కని ఆసనం అతిముఖ్యం. నిలబడి ఉన్నప్పుడును వెల్లికిల పండుకొని యున్నప్పుడును వెన్నెముకకు వంపు ఉండకపోయినా, అశాంతి నిద్రమత్తు మొదలైన కలవరపాట్లు పరిధ్యానము కలుగుతాయి. కాబట్టి కూర్చుండియే ధ్యానం చేయాలి అని విధింపబడింది.

యోగాభ్యాసానికి సరియైన ఆసనం — వెన్నెముకకు వంపు కలుగకుండు రీతిలో నిగుడుకొని కూర్చోవడం. భారతదేశంలో కాళ్ళ నొకదానిపై నొకనానిని అడ్డముగ పెట్టుకొని కూర్చుండుట వాడుక. జనులు ఆలాగు గంటలసేపు కూర్చోగలరు. వారి కెట్టి కష్టముండదు. ఐనను పాశ్చాత్యదేశాలలో కాళ్ళను వ్రేలవేసికొని కుర్చీలో కూర్చోవచ్చు. భారతీయులు కూర్చుండు రీతిలో కాసేపైనా కూర్చోవడం పాశ్చాత్యులరైన మీకు చాల ఇబ్బందిగా ఉంటుంది, దేహమునకు కదలిక కలుగనీయక, నెమ్మదితో శాంతముతో సహజసుఖరీతిలో ఉంచుకోవడమే ఆసనమని పతంజలి నిర్వచించాడు. అప్పు డల్ప బలమును వినియోగించి అనల్ప విజయాన్ని సాధించవచ్చు. దేహాని కెటువంటి సంకటమును కలుగకుండు రీతిలో సాధకుడు కూర్చోవాలి. ఏలాగు కూర్చుంటే ఇంచుకయినా సంకటంలేక, చాలసేపు కూర్చోగలరో ఆలాగు కూర్చోవాలి. బిఱ్ఱైన ఆసనం పనికిరాదు. ధ్యానపీఠం చాల కఠినంగాను ఉండకూడదు, చాల మృదువుగాను ఉండకూడదు. నడుము రొమ్ము మెడ తల ఇవి సమరేఖలో ఉండాలి. ఉరమునకు ఉదరమునకు నడిమిస్నాయువు దేహానికి ప్రాపుగా ఉండాలి. కుడి అఱచేతిని పైకి త్రిప్పుకొని ఎడమ అరచేతిపై ఉంచుకోవాలి. ఎడమచేయి ఒడిపై ఉండాలి. చూపు సూటిగా, రవంత అధోముఖంగా ఉండాలి. చూపుకు శ్రమ ఉండకూడదు, తేలికయు సడలుపాటుచు ఉండాలి. చూపు ప్రకారాలను మఱికొన్నిటిని కూడ ఒక్కొక్కప్పుడు విధించడం కద్దు, కాని ప్రారంభకునికి పైని చెప్పిన ప్రకారపు చూపే శ్రేష్ఠము.

వీలైతే, తూర్పుముఖంగానే కూర్చోండి. ఎందుకంటె భూమి తూర్పువైపునకు చుట్టుతూ ఉంటుంది. ఆవైపున కభిముఖంగా కూర్చుంటే సూక్ష్మలాభం సిద్ధిస్తుంది. రైలుబండిలోకాని మఱొక బండిలోకాని, అది ఏతట్టుకుపోతుందో ఆవైపుతిరిగి కూర్చోవడం సహజం. భూమి తూర్పువైపుకు తిరుగుతుంటుంది కాబట్టి ధ్యానానికి పడమటివైపుతిరిగి కూర్చోవడం కంటె తూర్పువైపుతిరిగి కూర్చోవడం మేలు. తూర్పుముఖంగా కూర్చోలేకపోతే ఉత్తరాభిముఖంగా కూర్చోండి. ఉత్తరధ్రువం వంకకు అయస్కాంతశక్తి ప్రవహిస్తుంటుంది. (నావికుల దిక్సూచిలో ముల్లు ఎప్పుడూ ఉత్తరాన్నే సూచిస్తుంటుంది). రైలుబండి పోతున్నవంకకు అభిముఖంగా మీరు పండుకోవడానికి అనువుగా పుల్మను నిర్మించిన శయనయానంలో దిండ్లు అమర్పబడి ఉంటాయి. ఆ మార్గాన్ని అనుసరించండి. అనులోమశక్తిసర్వస్వం ఉత్తర

ధ్రువవంకకు పర్యటిస్తుంది. ఆ శక్తి సూర్ల కొలది చెండ్లరూపంలో దక్షిణంనుండి ఉత్తరానికి విసిరివేయబడుతుందనుకోండి, అవి మీ మొగాన బడకుండ మీ వెనుకవైపునుండి మీ ముందువైపుకు పడుతుండడం ఎక్కువ సౌఖ్యకరం. కాబట్టి ధ్యానించేటప్పుడుగాని నిద్రించేటప్పుడుగాని తూర్పుకైనా తిరగండి, ఉత్తరానికైనా తిరగండి.

పతంజలిసూత్రాలలో రెండవ అధ్యాయంలోని 46, 47, 48 సూత్రాలను భగవద్గీత షష్ఠాధ్యాయంలోని 11, 12, 13 శ్లోకాలతో పోల్చి చూడవచ్చు. రాజయోగాన్ని అధికరించేందుకు శ్రీ వివేకానందస్వాముల 'రాజయోగ' గ్రంథాన్ని పాఠ్యగ్రంథంగా ఉంచుకోండి అని మీకు నా సలహా.

యోగంలో మఱియొక శాఖ ఉంది. దానికి హఠయోగం అని పేరు. అందులో ఆసనాభ్యాసమును గూర్చిన పలువివరాలు పెంపొందజేయబడి ఉన్నాయి. వానికి లక్ష్యం దేహారోగ్యం, దేహంలోని కండరాలను నరాలను వశమందుంచుకోవడం. మనం వినే అనేకాద్భుతకృత్యాలను చేసిన వారు హఠయోగనిష్ణాతులే. రాజయోగవిద్యార్థికి అవి అన్నీ అక్కఱలేదు, అవి మన గమనాన్ని మనస్సుమీద తగ్గించి దేహంమీద హెచ్చిస్తుంది. చిత్తైకాగ్రతను చెఱిచేది దేహస్మృతి. కాబట్టి దేహస్మృతిని తొలగించుకోవడం యోగికి లక్ష్యం. ఏ విధమైన దేహస్మృతియైనా కలవరపరుస్తున్నప్పుడు మనస్సున కేకాగ్రత కుదుర్చుకోవడం సాధ్యం కాదు. దేహం తేలికగా హాయిగా ఉన్నప్పుడు దేహస్మృతి తక్కువగా ఉంటుంది. అప్పుడు మనశ్శక్తులు నిర్నిరోధంగా ఉంటాయి. పైగా ఆధ్యాత్మికజీవితమున మనఃపూర్వకమయిన అక్కఱగల విద్యార్థికి అద్భుతకృత్యములందు శక్తిప్రకటనలందు ఇష్టముండదు.

ప్రాణశక్తిని పూర్తిగా అదుపులో ఉంచుకోవడమే ప్రాణాయామానికి లక్ష్యం. ప్రాణమంటే మానవునిలో ప్రాణశక్తి. యమం అంటే అదుపులో ఉంచుకోవడం. ప్రాణాయామంలో రెండురూపా లున్నాయి: ఆంతరం, బాహ్యం. ఆంతరమైన ప్రాణాయామం అంటే మానవునిలో ఆవిష్కృతమైయున్న ప్రాణాధ్యాత్మికశక్తిని అదుపులో ఉంచుకోవడం. బాహ్యప్రాణాయామం అంటే, బాహ్యప్రకృతిని అదుపులోనికి తెచ్చుకొందుకు లోపలి ప్రాణమును అదుపులో ఉంచుకోవడం. ఆంతరప్రాణాయామంచేత ప్రకృతిసూత్రాలను అదుపులోనికి మనం తెచ్చుకోగలంతవఱకు అవి మన అదుపుకు వెలియై ఉంటాయి.

ప్రాణం అంటే పిండాండంలో ఇమిడిఉండే బ్రహ్మాండశక్తి. భౌతికమానసికాధ్యాత్మికశక్తులలో ఒక్కొక్కదానికి ప్రేరకం అదే. మీ తలంపులగుండ, మీవాక్కుగుండ ఈ యన్నింటిగుండ ప్రకటితమౌతున్నది ప్రాణమే. కాని అది ఏదో ఒకచోటికి పరిమితమై ఉంటుందనుకోకండి, అది ఆదిమం, అభిన్నం, అపరిణతం. ఉన్న జగచ్ఛక్తి ఒక్కటే, అది నిండియుండు పాత్రలలో మానవదేహం గొప్పది. ఆ జగచ్ఛక్తియే ఆకర్షణశక్తి, విద్యుచ్ఛక్తిమున్నగు శక్తులుగా ఆవిష్కృతమౌతుంటుంది. మానవునిలో దేహయంత్రమార్గాలగుండ ఆ శక్తి ప్రవహిస్తుంది. ఆ శక్తిని అదుపులోనికి తెచ్చుకొన్నవానికి అసాధ్యమంటూ ఏదీ ఉండదు. జ్ఞప్తిఉంచుకోండి.మనంవినియోగించుకుంటుండే శక్తి మన శక్తికాదు. జగచ్ఛక్తిని మనలోనికి తీసుకొని దానిని వినియోగించుకుంటున్నాము, ప్రాణమును వినియోగించుకొను సామర్థ్యమే

జీవితం. ప్రాణశక్తిని వెలువరింపజాలనిస్థితియే మరణం, జడత్వం. దాని ఆవిష్కారానుగుణంగా ప్రాణం మార్పొందినట్లు కనబడుతుంది, కాని అది అనంతం, విశ్వవ్యాప్తం.

ప్రాణం అత్యంత స్పర్శగోచరంగా వెలువడు ప్రకారం శ్వాసం. ప్రాణానికి శరీరముఖ్య వృత్తితో సంబంధంఉండినా, ప్రాణం ఊపిరి కాదు. శక్తికి అయ్యే ప్రతివ్యయమూ శ్వాస యంత్రంలో నమోదు అవుతూ ఉంటుంది. కాబట్టి ప్రాణానికి శ్వాసం 'రిజిస్ట్రేషన్ ఆఫీసు' అనవచ్చు. 'కంట్రోలింగుఆఫీసు'ను అదే. ప్రాణమును క్రమపఱచి అదుపులో ఉంచు కొన్న యోగికి దేహంలో పనివడే ప్రాణశక్తి యొక్క యితరరూపాలుకూడ అదుపులోనికి వస్తాయి. ఆ రీతిలో అతడు క్రమంగా ఆంతర ప్రకృతిని అదుపులోనికి తెచ్చుకోగలుగుతాడు. యోగవిద్యార్థి శ్వాసమును క్రమపఱచడం అదుపులో పెట్టడం అందుకే. దానినే ప్రాణాయామం అంటారు.

సాధారణముగా మీ శ్వాసమునుగూర్చి మూడువిషయాలు గుర్తుంచుకోవాలి–గాఢత, లయ, స్వభావం. దేహారోగ్యానికి గాఢంగా ఊపిరిపీల్చుకోవడం ఆవశ్యకమని మన కందఱికి తెలుసు. అది ఊపిరితిత్తులకంతటికి వ్యాయామం కలిగించి మొత్తం దేహానికి చైతన్యం సమకూర్చుతుంది. చైతన్యహానికరములైన శక్తులు ప్రకృతిలో ఎన్నో ఉన్నాయి. వానికి లోను గానీయక, మనలను సుస్థితిలో ఉంచేది, సరియైన శ్వాసవిధానం. ఊపిరిని గాఢంగా పీల్చుకోవడం వల్ల మూడులాభాలు ఉన్నాయి. (i) శారీరకమైన లాభం – ఊపిరితిత్తులకు వ్యాయామం కలుగుతుంది, ప్రాణవాయువు అధికపరిమాణంలో లోపలికి పోతుంది. అందుచే దేహం బలపడుతుంది. పెద్ద బరువు ఎత్తవలసి వచ్చినప్పుడు సహజంగా మనుష్యుడు ఏమి చేస్తాడు? తనబలమును వినియోగించడానికిముందు ఊపిరిని గాఢంగా పీల్చుకొని బిగపట్టుతాడు. ఎంత గాఢంగా ఊపిరిపీల్చుకుంటే అంత బలం అతనికి అందుబాటవుతుంది. బలవంతుని ఊపిరాట గాఢంకానిదిగా ఎప్పుడూ ఉండదు. (ii) మానసికలాభం–మనస్సు కలవరపడుతుండేటప్పుడు నిరుత్సాహంగా ఉండేటప్పుడు గాఢంగా ఊపిరిని పీల్చుకోవడం జరగదు. గాఢంగా ఊపిరి పీల్చుకుంటే నిరుత్సాహం తొలగుతుంది, మన శ్శాంతి కలుగుతుంది. (iii) ఆధ్యాత్మికలాభం–ఊపిరితోకూడ మఱొకటి మన లోపలికి పోతుంది. మన పదజాలంలో దానికి పేరు లేదు. అది ప్రాణశక్తియొక్క సూక్ష్మరూపం. దాన్ని మన శరీరంలో మనస్సులో ప్రత్యవయవంలోకి పీల్చుకుంటాం. మన మన శ్శరీరాత్మలకు ధారకమైన దివ్యశక్తి అని దానిని పేర్కొ వచ్చు గాఢంగా ఊపిరిపీల్చుకోవడమును కొంతకాలం బుద్ధిపూర్వకంగా సాగిస్తే,తర్వాత అది తనంతట సాగుతుంది, గొప్పలాభాలు చేకూరుతాయి.

(సశేషము)

# శ్రీమాతృదేవి ప్రభావమర్మము

మాతృశ్రీ శారదాదేవి చరిత్రను గూర్చిన పరిచయమును, భక్తితో మాతృశ్రీజయంత్యుత్సవములను జరుపుటయు ప్రపంచమున క్రమవృద్ధి గాంచినది.

మాతృదేవిసందేశమందు ఇందఱు ఆసక్తి వహించుచుండుటకు కారణ మేమి? ఆమెజీవిత కాలమున ఆమె చేయుచుండిన పనులలో లోకులను ఆకర్షింపగలవి ఎక్కువగ లేవు. కావున ఇప్పుడు కననగుచున్న యీ సంచలనము మఱింత ఆశ్చర్యము గొలుపుచున్నది. ఆమె గడపినది ప్రశాంతజీవితము, ఏకాంత జీవితము. దక్షిణేశ్వరమున ఆమె ఉండిన తొలి దినాలలో ఆమెను కలసికొను అవకాశము అంతరంగభక్తులకు కొందఱికే ఉండెడిది. అనంతరకాలమున గూడ పరిస్థితులను బట్టి ఆమెను దర్శింపగలవారు అత్యల్ప సంఖ్యాకులుగానే ఉండిరి. అయినను పెక్కుండ్ర జీవితములపై ఆమె ప్రభావము చాల హెచ్చుగ నుండినది. ఆమె నిర్యాణానంతరము ఆ ప్రభావము నానాటికి హెచ్చుచున్నది. ఇందుల కేమి కారణము అనెడి కుతూహలము సహజమే.

ఈ ప్రశ్నకు సమాధానము శ్రీ వివేకానందస్వాముల ప్రసంగములలో ఒకచోట కానవగును. శ్రీవివేకానందస్వామి ఇట్లనెను: మానవులకు బొత్తిగా అందుబాటు కాని సుదూరపర్వతగుహలోనికి పోయి ఒకడు అచట ఉదాత్తములైన తలంపులను తలచునేని, ఆ తలంపులు ఆ గుహగోడలను చీల్చుకొని వెలువడి తమ ప్రభావమును ప్రజలపై ప్రసరింపజేయును. ఆశయములు అమోఘశక్తి సమంచితములు. ఇది గూఢమైన విషయము కాదు, అనుభవసత్యోక్తియే. తమ్ము చేరిన వారిని తమ మౌనము చేతనే ప్రభావితులను జేసి వారిజీవితములను మార్పొందించిన యోగీంద్రు లెందఱో కలరు. మాతృదేవి తనకాలమున తాను జీవించినది. ఆ జీవితప్రభావ మిప్పుడు వికాస మొందుచున్నది. యోగులు ప్రవక్తలు ఆశయైకాగ్రతాసంపన్నములగు జీవితములను గడపుదురు. వారు ఈ ప్రపంచమును వీడి యేగినను వారిజీవితముల ప్రభావము శతాబ్దములకొలది అవిచ్ఛిన్నముగ సాగుటే కాదు నిత్యప్రవర్ధమానముగను ఉండును.

క్రైస్తునకు శిష్యులు పన్నిద్దఱు. వారిలో ఒకడు ఆయనను శత్రువులకు పట్టియిచ్చెను. శోధనల కగ్గమైనప్పుడు తక్కిన వారి విశ్వాసముకూడ ఉఱ్ఱూత లూగినది. కాని ఇప్పుడు కోట్లకొలది ప్రజలకు క్రైస్తుదేవుని జీవితము ధారకముగను బలదాయకముగను నిర్వృతిప్రదముగను ఉన్నది. ప్రవక్తలందఱి సంగతియు అంతే. శ్రీరామకృష్ణు డిట్లని యుండెను: ''రాముని గొప్పతనమును గాని ఏయితరావతారపురుషునిమహిమనుగాని అతని జీవితకాలములోనే గుర్తింపగలిగినవా రెంద ఱుండిరి? అత్యల్పసంఖ్యాకులే''. సామాన్యమానవులు అజ్ఞులు అల్పశక్తులు. యోగులయు ప్రవక్తలయు పెంపును ఎఱుగుట వారి కసాధ్యము. శ్రీరామకృష్ణునిగూర్చిన నిజమును ఇదే కదా! ఆయన జీవితకాలమున భక్తి నెరపిన వారిసంఖ్య తక్కువే, ఆయన నిర్యాణానంతరమే ఆయన జీవితమును సందేశమును విశ్వవ్యాప్తి నందగన్నది.

మాతృదేవి జీవితమునను ఇంతే. ఆమె మహిమను గుర్తించినవారిలో ప్రథముడు శ్రీరామకృష్ణుడే. ఇతరులలో కొందఱు బొత్తిగా ఎఱుగనివారు, కొందఱు సగ మెఱిగిన వారు, లేదా—ఇందఱును నిరర్గళమగు నామె మాతృప్రేమచే మోహితులైన వారే. శ్రీరామకృష్ణుని నిర్యాణమున కెనిమిదేండ్ల పిమ్మట, 1894 లో శ్రీ వివేకానందస్వామి అమెరికాలోనుండి, తన సోదరశిష్యులలో ఒకరికి ఇట్లు వ్రాసెను: మాతృదేవి జీవిత మహాద్భుత ప్రాముఖ్యము నర్థముచేసికొన్నవారు మీలో లేరు, ఒక్కరైనను లేరు. కాని క్రమక్రమముగ మీకది తెలిసివచ్చును...నావఱకు నాకు తండ్రికృపకంటె మాతృకృప లక్ష మడుగులు హెచ్చు. అమ్మకృప అమ్మదీవనలు నాకు సర్వప్రధానములు ... నన్ను క్షమింపుడు .. అమ్మవిషయములో నాకించుక పక్షపాతమే.'

మాతృదేవి జీవితమును పరిశీలింప ప్రియపడువాడు వట్టి ఆశయములకంటె, ఆమె మహిమకు సూచకములైన విషయములనే గుర్తింప గోరును. ఆమెనుగూర్చి ప్రకటితమైయున్న సారస్వతము ఏమంత విపులమైనది కాదు. కారణ మేమనగా ఆమె వ్యక్తిమహిమ ప్రాచ్ఛన్నమగునట్టిది కావున, ఆమెనుగూర్చి వ్రాయు సాహస మెవ్వరికిని సులువుగ గలుగదు. ఇప్పుడిప్పుడే ఆమెనుగూర్చిన గ్రంథములును సంస్మృతులును ముద్రితము లగుచున్నవి. ఇది చాల మంచిదే. మనకు తరువాత రానున్న వారు మనయెడ కృతజ్ఞులై యుందురు. ఆమె జీవితములోని ప్రతిచిన్న సంభవమును సప్రమాణముగ వ్రాసిపెట్టవలెను. అప్పుడు మానవరూపము దాల్చిన దివ్యత, భువిని జీవితపరిస్థితులలో ఎట్లు ప్రవర్తించునో ఎట్లు ప్రతిక్రియ సలుపునో స్పష్టముగ తెలిసికొన వీలగును.

మాతృదేవి జీవితమునుగూర్చి ప్రకటితమైయుండు గ్రంథములను మెలకువతో చదివిన వారికి, ఆమె జీవితసంభవాల మహిమకంటె ఆమెమహిమ అత్యధికతర మనుట తప్పక మనస్సుకు వచ్చును. ఆమె ఒకానొకనిని దీవించె ననుకొనుడు. ఆమె పల్కిన ఆకతిప యాశీర్వచనములు అతని యావజ్జీవము బలదాయకములుగ నుండును, అవి అతని నెడబాయకుండును, ధారకములుగను సంతారకములుగను ఉండును. ఇది అనుభవవిషయమే గాని మాటలలో వర్ణనీయము కాదు. అట్టి మాతృనుగ్రహమునకు భాజనులైనవా రెందఱో కలరు.

మఱొక ప్రకృష్టాంశము : ఆమెమాతృప్రేమ అపారము; దేశకాలజాతి మతాదివిభేదమును బొత్తిగాపాటింపని ప్రేమ ఆమెది. ఆమె ఒక కుగ్రామములో సనాతనాచారనిష్ఠులగు బ్రాహ్మణులకుటుంబమున జన్మించింది. అయినను ప్రపంచములో ఏదేశమువారైన కానిండు ఆమెను సమీపింతురేని ఆమె తమకు నిరుపాధికమాత యను ననుభూతి వారికి కలిగెడిది. బిడ్డలను చేరదీయు నప్పు డామె వర్ణవ్యవస్థను పాటింపదు, సంపదకలవారు లేనివా రను తారతమ్యమును గణింపదు, పావనులు పతితులు అనువానిని జూడదు. ఆమెప్రేమ ఎంతటి యుత్కటము! పండుముదుసలికైనను ఆమె సన్నిధానమున నున్నప్పుడు తాను శిశువు అను ననుభూతి కలుగును. ఒకశిష్యు డిట్లు వ్రాసియున్నాడు :- మాయింట మాఅమ్మపైని నాప్రేమ మిక్కుటమే, నాపై మాఅమ్మ ప్రేమయు మిక్కుటమే. అయినను ఆప్రేమలు, అతిక్రాంతమగు మాతృదేవి కృపాప్రవాహము నెదుట ఏపాటి? కోట్లకొలదిగనే నెత్తిన జన్మలలో ప్రతిదానిలోను నాకు తల్లి మాతృదేవి.

ఆమె నిత్యమాత, నాస్తకు ప్రభవము ఆమెయే.

భౌతికప్రేమ ఎంత విశుద్ధమైనను ఎంత ఉదాత్తమైనను బంధకమే, ఇక మాతృదేవి ప్రేమయో, అజ్ఞానబంధముల కన్నిటికిని విమోచకము! తనబంధములు తన్నువీడిపోవు చుండుట మాతృశ్రీ చరణాశ్రితునికి సొంత యనుభూతి. అనుభవైకగోచరమే అయినను పలువురి యనుభవములు ఒండొకదానికి సరి దాకుచున్నప్పు డది ప్రత్యక్షసత్యమే.

ఈ యనుభవము ఇట్టియనుభవము ఇప్పుడు సైతము ప్రపంచమున ప్రతిచోటను మాటి మాటికిని కననగుచుండును. గ్రంథముల ద్వారామాత్రమే ఆమె నెఱిగిన అమెరికా ప్రముఖ విదేశవాసుల జీవితములపైని గూడ అమోఘమైన మాతృదేవి ప్రభావమును గుర్తింప వచ్చును. అట్టి ప్రగాఢానుభూతి వారి కేల కలుగుచున్నదో ఎట్లు కలుగుచున్నదో హేతువాదముప్రకారము వివరించుట కష్టము. అది ఆమె గడపిన విశుద్ధజీవితప్రభావమే అని మాత్రము మనము చెప్పగలము.

ఆమె కేవలము తన ఆశయాలప్రపంచ ములో నుండిపోయినది కాదు. సకలదీనులకును పర్యాప్తమైన ఆశ్రయము దయావిశాలమైన ఆమెడెందము. దుఃఖితులపట్ల దీనులపట్ల ఆమె కృపాప్రవణత నిరతిశయము. తన సన్నిహితు లకై తన్నుచేరినవారికై ఆమె శ్రమించెడిది, పనులు చేసిపెట్టెడిది, ఇంతంతనరానంత బాధ లను సహించెడిది. కష్టబహుళమైన సంసార ముననుండువారికి ఆమె ఎంతయు నందు బాటులో ప్రాపుగ నుండెడిది. ఆమెసంస్కృతి చాలగొప్పది. అన్ని దేశాలప్రజల చిత్తములను కష్టములను సమస్యలను ఆమె అవలీలగ నర్థముచేసికొనెడిది. ఆమెమనస్సు అధునాతన మైనది. భూతమును వర్తమానమును ప్రాచీన మును నవీనమును కలుపు వంతెనగా అమ్మ పనివడినది.

భారతదేశ చరిత్రలో వేదముల కాలము నుండియు యోగులు వెలసియున్నట్లే యోగి నులును వెలసియుండిరి. అన్యమతసంప్రదాయా లలోకూడ యోగినులున్నారు. ఎన్నియో చిక్కుల నెదుర్కోవలసినవారు మహిళలు. అయినను, ఆధ్యాత్మికముగ మహిళ లెంతటి సమున్నతుల నధిరోహింపగలరో ఈ యుగము వారికి స్వకీయచరితముచే నిరూపించినది మాతృ దేవి. 'తనకు అఖండతను సాధించుకొన్న మహా వ్యక్తి అందఱిని మహిళలను మగువలనుగూడ సముద్ధరించు' నని నిరూపించు అమ్మజీవితము విశ్వమహిళల కందఱికిని పరమాదర్శమైనది.

# శ్రీ రామకృష్ణోద్యమారంభాభివృద్ధులకు విధాత్రి శ్రీ మాతృదేవి

శ్రీ తపస్యానందస్వామి

మాతృశ్రీ శారదాదేవి ప్రశాంతైకాంత జీవితమును గడపినను, ప్రగతిశీలములగు ఆదర్శ ములును కార్యములును ఆమెలో రూపు దాల్చి నవి. పల్లెపరిసరములలో పుట్టి పెరుగుట, ఐదవ యేట పెండ్లాడుట, భర్తకు వండిపెట్టి పరిచర్య చేయుట, యోగులను గురులను పుణ్యక్షేత్ర ములను దర్శించుట. దుర్బలయగు ఒక మేన కోడలిపై తీవ్రప్రేమ గలిగియుండుట అతిథులకు

ఆగంతుకులకు నిర్విరామముగా ఉపచరించుట— ఇవి క్రిందటితరము భారతీయగృహిణి జీవితములో సహజములే. కాని యోగియైన పెనిమిటిచేత లోకజననియొక్క ప్రత్యక్షరూపముగా ఆరాధింపబడుట, ఆయనగారి ఆధ్యాత్మికలక్ష్యములను ఆకళించుకొనుట, ఆ లక్ష్యాల సాధనలో ఆయనతో ఏకీభవించుటయు సహధర్మిణిగ నుండుటయునే గృహిణికి పరమధర్మము లని అతిశీఘ్రముగా గుర్తించుట, దివ్యభర్తకనంతరము ఆయనపనిని చక్కగా తాను నెఱవేర్పగలిగి యుండునట్లు తన్ను తర్ఫీదు చేసికొనుట, సంఘమున వివిధములైన అంతస్తులకు చెందిన అసంఖ్యాక భక్తుల భక్త్యాదరముల చూఱగొనుట, సాధకులు ఏమెట్టులో ఉన్నారనుటను గుర్తించి ఆధ్యాత్మికములైన వారి అక్కఱలకు అనువుగా ఉపదేశించుట, తెచ్చికోలు కానిదియు ఉద్రిక్తము నగు తన మాతృప్రేమను అందఱిడెందములందు ముద్రిత మొనర్చుట, అఖండములైన యోగిన్యాదర్శమును గృహిణ్యాదర్శమును మాత్రాదర్శమును తనలో పొందుపఱచుకొనుట— ఇవి ఎవరినిగాని మహోన్నతి నందించును. ఆస్థాయిలో మానవత్వము దివ్యత్వముగా పరిణమించి భాసించును.

సామాన్యములకు విశేషములకు, మానవగుణములకు దివ్యములైన మేలుములకును మేలైన కలయిక మాతృశ్రీశారదాదేవిలో గలదు.

శ్రీరామకృష్ణుని జీవితకార్యమును పూర్తి నొందించుటలో అమ్మ నిర్వహించిన ప్రధానమైనవంతును ఇంకను యావత్ప్రపంచమును ఆకళించుకోలేదు. శ్రీరామకృష్ణుని శిష్యాగ్రగణ్యుడగు శ్రీవివేకానందస్వామియొక్క పేరును ఆయన సాధించిన ఘనకార్యములును మహోజ్జ్వలములైనందున వాని డాలుచే గురుదేవుని యితరశిష్యులును సహచరులును ఆయన జీవితకార్యమును పూర్తినొందించుటకై సాధించిన గొప్ప పనులు మఱుగువడుచున్నవి. శ్రీరామకృష్ణోద్యమమును పైపైని చదువువారు ఆ యితరుల చరితములను ఒప్పరికించుచున్నారు. ఆ యుద్యమమునకు మఱుగున నున్న యథార్థ మహాశక్తి మాతృదేవియే అనుట అతిశయోక్తి కాదు.

ఆమె అవతరించినది 1853 లో. తన ఐదవయేట గురుదేవునికి వివాహితయైనది. తన జీవితయాత్ర ప్రారంభమందే ఆమెకు గురుదేవుని జీవితములో అంతర్భవించుట కలిగెనన్నమాట. తొలిదినాలలో ఆమె, ఆయనను కొన్ని పర్యాయములు కలసికొన్నది. కాని ఆయనకు వెఱ్ఱిపట్టియున్నది అను వార్త విని, తహతహపడి దక్షిణేశ్వరమున ఆయనయొద్దకు ఆమె మొదటిసారి వచ్చినప్పటినుండి ఇద్దఱి జీవితము లొక్క జీవితముగ నగు క్రమము ఆరంభమైనది. గురుదేవుడామెను హార్దప్రేమతో చేరదీసినను దక్షిణేశ్వరమున తనయొద్దకు వచ్చుటలో ఆమె యుద్దేశ్యము లేవో ఆయనకు గట్టిగా తెలియదేమో. కాబట్టి ఆమె దక్షిణేశ్వరమునకు వచ్చి కుదుటబడినవెంటనే గురుదేవుడు ఆమెను ఇట్లడిగెను :— "నన్ను మాయలోనికి దిగలాగవలెనను ఆశ నీకున్నదా?" తత్క్షణమే ధీరముగా ఆమె పల్కిన యుదాత్తప్రత్యుత్తరము:— "నేనట్లెందులకు చేయవలెను? మీ ధర్మమార్గమున మీకు సహధర్మిణిగ నుండుటకే నేను వచ్చితిని." మఱొకదినమున తన్ను గూర్చిన గురుదేవుని తలంపేమో తెలిసికొను వంతు అమ్మకు సంభవించినది. ఆయనకు పాదసంవాహనము చేయుచు అమ్మ "నన్నుగూర్చిన మీ భావన ఏమి?" అను సూటిప్రశ్నను అడిగినది. నిమిషమైనను వెనుదీయక శ్రీరామ

కృష్ణుడు చెప్పిన జవాబు :-"గుడిలో ఆరాధ్యమానయగుచు వెలసియున్న లోకజననియే, ఇప్పుడు నహబత్తులో వసించుచున్నట్టి నా కన్నతల్లియే, ఇక్కడ నాకు పాదసంవాహనము చేయుచున్నది. నిజముగా మాతృతాస్వరూపిణిగా నా దృష్టికి నీవు గోచరించుచున్నావు."

ఒకరిపట్ల ఒకరివైఖరిని వారిట్లు సుదృఢముగ తెల్పుకొనుటతో ఆ పరమపావనుల మహాద్భుత దాంపత్యజీవిత మారంభమైనది. ఉమ్మడిలక్ష్యము బ్రహ్మసాక్షాత్కారము. ఆ లక్ష్యసాధనలో వారొకరికొకరు హృదయపూర్వకముగా అమోఘసహాయులుగ పనివడిరి ఉభయులును అస్ఖలితబ్రహ్మచర్యమున పరిపూర్ణులుగ నుండిరి.

శ్రీరామకృష్ణుడు ఎన్నుకొన్న మార్గమున శారదమ్మ త్రికరణశుద్ధితో తోడ్పడెను. ఆయన యాధ్యాత్మికజీవితమునకు తోడ్పడుటమాత్రమే కాదు, ఆయన జీవితకార్యమైన ఆధ్యాత్మికధర్మవినూతనోద్ధరణమును నిర్వ్యాఘ్రమొనర్చుటకును ఆమె తోడ్పడెను. ఇట్టి పతివ్రతామతల్లి, ప్రపంచచరిత్రలో మఱొక్కతె లేదు.

పారమార్థికరంగమున వారికి అమరిన యీ సమభాగస్వామ్యము నిరూపిత మగుటకు కాబోలు శ్రీరామకృష్ణుడు షోడశీపూజ యను మహాక్రతువును నడపెను. లోకజననికి సజీవప్రతీకగా మాతృపీఠమున శారదమ్మను నెలకొల్పి, మొక్కవోని పవిత్రత గల ఆ కన్యయందు లోకజననిని ఆవాహనచేసి గురుదేవుడారాధించెను. గురుదేవునిద్వారా తనపనిని నిర్వహించుకొనుచున్న మహాశక్తి సాన్నిధ్యము లోకజనని సాన్నిధ్యము ఈవిధముగా శారదమ్మలోఆవాహితమైనది. శ్రీరామకృష్ణుని జీవితకార్యమున ఆమెముఖ్యాంశభాగినియైనది. ఆ నాటినుండి ఆమె జీవితమున స్వార్థ మనునది లేదు. గురుదేవుని జీవితకార్యనిర్వహణమునకే ఆమె తన్ను పూర్తిగా సమర్పించుకొన్నది.

గురుదేవుడు జీవించియున్నంతవఱకు ఆమె ఇంచుమించు తెరమఱుగున నుండినది. ఆయనకు పరిచర్య చేయుటయు ఆధ్యాత్మిక సాధనలు చేయుటయు ఆమె ముఖ్య కార్యక్రమముగ నుండినది. తన ఆధ్యాత్మికసందేశప్రచారమును ఆమె కొనసాగింపవలసియుండు ననెడి భావిపరిజ్ఞానము గురుదేవునకు దృఢముగ నుండెను. కావున ఆయన ఆమె నందులకు తర్ఫీదుచేయుటే కాక, ఆకార్యమును కొనసాగింపు మని నియమించెను. "చుట్టు నున్న ప్రజలు చీకటిలో క్రిములు జీవించినట్లు జీవించుచున్నారు. వారిని నీవు కాపాడవలెను" అని చెప్పెను. జీవితపరార్ధమున మరల నొకనాడు ఆమెతో ఆయన ఇట్లనెను: 'నీవును ఏమైన చేయవా? అంతయు నేనే చేయవలెనా?'' అందులకు అమ్మ "నేను స్త్రీని, నే నేమి చేయగల" ననెను. "కాదు, కాదు, నీవు చేయవలసినది ఎంతో ఉన్న"దని గురుదేవుడు హెచ్చరించెను. ఇట్లు సాధకులకు మంత్రోపదేశాదికము చేయు సమర్థతను గురుదేవు డామెకు ప్రసాదించెను. ఆయన తన జీవిత కాలములో తన శిష్యులలో నొకనిని మాతృదేవియొద్ద నుపదేశము స్వీకరింపు మని పంచెను.

గురుదేవుని నిర్యాణమునకు కొంతకాలము పిమ్మట మాతృదేవి ఆచార్యకృత్యము నిర్వహింప నారంభించెను. అందుకై కదా గురుదేవు డామెను జాగరూకతతో ఆయత్తపఱచి యుండెను! శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యులకుకూడ చిక్కులు సందేహములు కలిగినప్పుడు ఆమె దారిచూపుచు ఉత్సాహము కూర్చును నుండెను. శ్రీ యోగానందస్వామికి మంత్రోపదేశమును గురుదేవుడు చేయలేదు.

గురుదేవుని నిర్యాణానంతరము యోగానంద స్వామి కొకనాడు స్వప్నములో ఆయన కని పించి మంత్రోపదేశమునకు మాతృదేవి నాశ్ర యింపు'' మని ఆదేశించెను. గురుదేవుడు మాతృదేవికికూడ వరుసగా మూడు దినములు కనిపించి అతనికి మంత్రోపదేశము చేయ ఆజ్ఞా పించెనట. కావున అమ్మ యోగానందస్వామికి మంత్రోపదేశము చేసెను. గురుదేవుడు కర్తవ్య ములను మాతృదేవిచే ఎట్లు నిర్వహింపించు చుండెనో సూచించు నిదర్శన మీ సంభవము.

ఇంతటి ముఖ్యనిదర్శనము శ్రీ వివేకానంద స్వామి చరిత్రలోగూడ గన నగును. పశ్చిమ ఖండమునకు పోవుటయా పోకుండుటయా అను విషయమున వివేకానందస్వామికి మొదట నిశ్చ యము కుదురకుండెను. తాను నిశ్చయించు కొనుటకు ముందు గురుదేవుని సంకల్ప మేమో తెలిసికొనవలె నని ఆయన కోరెను. తన జీవి తములో అతిముఖ్యమైనదియు తనకును ప్రపం చమునకును సర్వాతిశయ పర్యవసానముల సము కూర్చునదియునైన ఆ ముందడుగు వేయుటకు ముందు సందిగ్ధావస్థలో నుండినప్పుడు వివేకా నందస్వామికి తోడ్పడ గల వారు మాతృదేవి వినా మ ఱెవ్వరును లేరు. మహాభారతయుద్ధము ఆరంభము కానున్నప్పటి అర్జునుని మనఃపరి స్థితివంటి మనఃపరిస్థితిలో స్వామిజి ఉండెను. ఆధునికవీరుడగు నితని సంకల్పమును బలపఱ చుటకు శ్రీకృష్ణునివంటి వాడొకడు కావలసి యుండెను. అట్టి మార్గదర్శకత్వమును హితాభి శంసను మాతృదేవినుండి ఆయన పడసెను. 'ఇంచుకయు వెనుదీయక, ముందునకేగుము, గురుదేవుని ఆశీస్సులును రక్షణమును నీకు కల' దని మాతృదేవి స్వామిజికి కఱపెను. గురుదేవుని సందేశప్రచారకుడుగా స్వామిజి నిర్వహింప నున్న మహద్భూమికను మాతృదేవి ఒక దివ్య దృశ్యమున సాక్షాత్కరించుకొనెను. ఆ దృశ్య మున ఆమె కన్నది ఇది — శ్రీరామకృష్ణుడు గంగలో దిగెను. ఆయన మేను ఆ పావనజలము లందు కరగిపోయెను. వివేకానందస్వామి శ్రీరామ కృష్ణునకు జై అని ఘోషించుచు ఆ పావనజల ములను సమృద్ధిగా జనసమూహములపై జల్లుచు నుండెను.

అనంతర సంవత్సరాలలో తాను నిర్వహింప వలసిన భూమిక ఆమెకు మఱింత స్పష్టము కాజొచ్చెను. గురుదేవుని సందేశము వ్యాపించు టతో, ప్రాక్పశ్చిమ దేశములనుండి ఆధ్యాత్మిక సాధకులు మంత్రోపదేశమును సాధనలో శిక్షణమును అపేక్షించుచు నానాటి కధిక సంఖ్యాకులు రా సాగిరి. వివేకానందస్వామి అచిరకాలములోనే దివంగతు డయ్యెను. ప్రథమసర్వసంఘాధ్యక్షుడైన బ్రహ్మానంద స్వామియో మంత్రోపదేశము చేయునప్పుడు గుణదోషపరిశీలనము చాల కచ్చితముగా చేసెడివాడు. శిష్యుల బాధ్యతను గురువు వహింపవలెననియు పరాచారులకు ఆధ్యాత్మిక శీలహీనులకు మంత్రోపదేశము చేసినచో వారి పాపములు గురువును బాధించు ననియు విశ్వాసము అనాదికాలముగ నున్నది. శ్రీరామ కృష్ణుని సన్న్యాసిశిష్యులు మంత్రోపదేశము చేయునప్పుడు అతిమాత్రముగా ఆలోచించి వెనుదీయుట కిదే కారణము. కాని గురుదేవుడు అవ్యాజకృపాసాగరుడు కదా. అర్హానర్హ తలను పాటింపక అందఱిమీదికి ఆ గురుదేవు నవ్యాజకృప మాతృదేవిగుండ ప్రవహించినది. తన్ను ఆశ్రయించినవారి నందఱిని అమ్మ స్వీకరించెడిది. ఇందుల కపవాదము మృగ్యము. అమ్మయాశీస్సు నెవరైనను ఆతురముతో అభిలషించిన చాలు, వారి కామె మంత్రోప దేశము తప్పక చేయును. అమ్మ కాబట్టి,

వారిని చేరదీసినప్పుడు వారి పాపాలవలన తన కేమి సంభవించినను ఆమె వెనుదీయదు. శ్రీరామకృష్ణునంతరంగశిష్యులలో ఒక్కరగు శ్రీ ప్రేమానందస్వామి సాటిలేని అమ్మయనుగ్రహము కొనియాడుచు నొకసారి ఇట్లనెను : ''మేము కొనజాలని విషమును మాతృదేవి యొద్దకు పంపుచున్నాము. ఆమె ప్రతివారికి శరణ మొసగి వారి పాపాలను గ్రహించి జీర్ణించుకొనుచున్నది.''

ఇట్లు నిర్విరామముగ మాతృదేవి సాగించిన ఆచార్యకముచే లెక్కకు మిక్కిలియైన భక్తులకు వినూత్నప్రబోధము కలిగి వారు శ్రీరామకృష్ణోద్యమమున అన్వయించిరి.

కాని ఇంతే కాదు. రామకృష్ణోద్యమమును సర్వదేశములకును వ్యాపింపజేసిన సన్న్యాసి సంస్థను ఆమె పెంపొందించినవిధము ఇంకను అతిముఖ్యమైనది. గురుదేవుని సందేశమును వ్యాపింపజేయుటకు ఆయన ప్రత్యక్షశిష్యులందఱు ఒకసంస్థగ రూపొందుట ఆవశ్యకమనుటను మొదట గుర్తించినదిమాతృదేవియే. ఆమెకు ఈ కాలపు చదువులు లేవు, నిర్మాణ ప్రణాళికల నామె యెఱుగదు. కాని ఆమె మాతృహృదయమును గురుదేవుని జీవితలక్ష్యమునుగూర్చి ఆమెకుండిన పరిజ్ఞానమును ఇవే ఆమెకు దారి చూపినవి. వివేకానందస్వామిగ నైన నరేంద్రుడు గురుదేవుని యువశిష్యుల సందఱిని సమావేశపఱచి ప్రోత్సహించి సన్న్యాసులనుగ చేసెను. కాని యేకలక్ష్యసాధనకై పాటుపడుసంస్థకు తాము చెందిన వారమను భావము వారి కుదయింపలేదు. ఏకాంతప్రదేశములం దుండి తపస్సాధనలు సలుపుటో, యత్రసాయంగృహులుగా పుణ్యక్షేత్రములందు పర్యటించుటో వారి కభిమతముగ నుండెను. ఈ లక్ష్యము అపర్యాప్తమని మొదట గుర్తించినది మాతృదేవి. ''నీ సందేశమును వ్యాపింపజేయు సన్న్యాసిసంస్థగా నీ శిష్యులను రూపొందింపు' మని ఆమె గురుదేవుని ప్రార్థించినది.

ఒక శిష్యునితోడి సంభాషణలో ఈ విషయము నామెయే ఇట్లు వాక్రుచ్చినది—''నా బిడ్డలకై నేను ఎంతగా విలపించితిని, గురుదేవుని ప్రార్థించితిని. గురుదేవు ననుగ్రహముచేత నే ఎల్లెడల మఠములును కేంద్రములును ఏర్పడుచున్నవి. గురుదేవుని నిర్యాణానంతరము ఆయన శిష్యులు సన్న్యసించిరి, తాత్కాలికముగ నొకయునికిపట్టు నాశ్రయించి కొన్నాళ్లు కలిసి యుండిరి. తర్వాత ఒక్కొక్కరుగ చీలిపోయి ఇక్కడి కక్కడికి తిరుగాడుచుండిరి. వారి [illegible] నాకు విషాదకరముగ నుండి నేను గురుదేవు నిట్లు ప్రార్థించితిని. ''దేవా, నీవు మానవరూపమున అవతరించితివి, కొందఱు శిష్యులతో భూలోకజీవితమును గడపితివి. నీ నిర్యాణముతో సమస్తము తుదముట్టెనా? అట్లగుచో నీ వవతరించినదియు అన్నిబాధలు పడినదియు ఎందులకు? బృందావనములోను వారణాశిలోను ఎందఱో సాధువులు చెట్ల నీడలలో వసించుచు భిక్షాన్న మాధారముగ జీవించుచుండుటను నేను కాంచితిని. అటువంటి సన్న్యాసులసంఖ్యకు లోటు లేదు. నీకై తమ సర్వస్వమును త్యజించిన నాబిడ్డలు భిక్షాన్నమునకై అల్లాడుచుండుటను నేను చూచి భరింపజాలను. దేవా, నిన్ను నేను ప్రార్థించున దింతమాత్రమే. నీకై సర్వస్వత్యాగము చేయువారికి అన్నమునకు ముతకబట్టకు లోటు లేకుండవలెను. నాబిడ్డలందఱు కలిసియుండవలెననియు, నిన్ను నీ యుపదేశములను అవలంబించి యుండవలెననియు, సంసారదుఃఖవిదీర్ణులు వారి నాశ్రయించి వారిగుండ నీ

బోధనలను విని మనశ్శాంతి నొందవలెననియు నా కోరిక. నీవు మానవరూపమున అవతరించిన దందులకే కదా!''

మాతృదేవివంటివారి హృదయపూర్వక ప్రార్థనకు అమోఘశక్తి యుండును. శ్రీరామకృష్ణోద్యమమును దాని కాధారమైన సన్న్యాసిసంస్థయు పవిత్రా మోఘమగు మాతృదేవి సంకల్పమునుండి ఉద్భవించినవే. శ్రీరామకృష్ణునాధ్యాత్మికబృహద్భవనమునకు ఆమెయే పునాది, శ్రీరామకృష్ణోద్యమమునకు ఆమెయే కన్నతల్లి.

# వార్తలు - విశేషాలు

## సెయింటు లూయిలో వేదాంతసొసైటి కార్యనివేదిక

### అధ్యక్షులు: శ్రీ సత్ప్రకాశానందస్వామి

వారపూజలు—భానువారములం దుదయమునను మంగళవారములందు సాయంవేళలలోను శ్రీ సత్ప్రకాశానందస్వాములు గుడిమండపంలో పూజాకార్యక్రమం నడిపేవారు. భానువారాలలో స్వామి వివిధతాత్త్వికాధ్యాత్మికవిషయాలను గూర్చి ప్రసంగించేవారు, మంగళవారములలో ధ్యానగోష్ఠీ భగవద్గీతను వివరించి చెప్పేవారు విశేషదినాలలో ఉపన్యాసాలకు కాలక్షేపాలకు తోడు భజనసంకీర్తనలున్నూ జరిగేవి. సమావేశాలకు అందఱూ రావచ్చు. సొసైటిసభ్యులూ మిత్రులునే కాక, వివిధచర్చిలనుండి విశ్వకళాపరిషత్తులు కళాశాలలు స్కూళ్లు మున్నగు విద్యాకేంద్రములనుండి అనేకులు వచ్చేవారు. పూజానంతరం స్వామి విద్యార్థులకు బేటి ప్రసాదించి వారిప్రశ్నలకు సమాధానాలు చెప్పేవారు. ఇతరనగరాలనుండి సైతం మిత్రులు భక్తులు రావడం కద్దు.

స్వాములవారి భానువారమంగళవారప్రసంగాలు టేప్రికార్డు చేయబడ్డాయి. టేప్రికార్డు చేయబడ్డ ప్రసంగాలను సభ్యులున్నూ మిత్రులున్నూ ప్రతిభానువారం ఉదయవేళలోను ప్రతిమంగళవారం సందెవేళలోను వినేవారు. కన్సాసునగరవేదాంతసొసైటివారు కూడ తమ 'వార' 'పక్ష' సమావేశాలలో టేప్రికార్డు చేయబడ్డస్వాములప్రసంగాలను ఆలకించేవారు.

నెల కొక్కసారి, మొదటిగురువారంనాడు, స్వామి 'శ్రీరామకృష్ణకథామృతము'ను చదివి వివరిస్తూ గురుదేవుని ప్రత్యక్షశిష్యులతోడి తమ పరిచయవిశేషాలను గూడ చెప్పేవారు, శ్రోతలడిగిన ప్రశ్నలకు సమాధానాలను చెప్పేవారు.

ప్రతిదినం గుడిలో పూజాకలాపమే కాక పగలు 11 గంటలనుండి 12 గంటలవఱకు ధ్యానగోష్ఠి జరిగెడిది.

### వార్షికోత్సవాలు

శ్రీకృష్ణ - బుద్ధ - శంకర - శ్రీరామకృష్ణ - మాతృశ్రీ - వివేకానంద - బ్రహ్మానంద - ప్రేమానంద - శివానందస్వాముల జయంతులు విశేష పూజాకార్యక్రమముతో నిర్వహింప

బడ్డాయి. శుభశుక్రవారం (గుడ్ ఫ్రైడే) దుర్గాపూజ - క్రిస్త్మస్‌ఈవు మున్నగు ఉత్సవాలును పాటింపబడ్డాయి. శ్రీరామకృష్ణజయంతి సందర్భంలో మాత్రం భానువారసమావేశానంతరం హిందుపద్ధతిలో విందు చేయబడింది. తక్కిన విశేషదినాలలో వచ్చిన భక్తులకందఱికి మధుర భక్ష్యాలు పంచిపెట్టబడ్డాయి.

## కన్సాసు షికాగో నగరాలకు శ్రీసత్ప్రకాశానందస్వాముల ప్రయాణాలు

కన్సాసునగర వేదాంత సొసైటికి ధనపర్యవేక్షకసభ్యుడుగా ఉండిన విల్లియము బెస్టుఫెల్టు మేనెల 3-వ తేది సోమవారంనాడు మరణించాడు. 5-వ తేదినాడు ఆయనకు స్మారకంగా పూజావిధానం నిర్వర్తించడానికై శ్రీసత్ప్రకాశానందస్వామి కన్సాసునగరం వెళ్ళియుండి సాయంకాలానికి సెయింటు లూయీకి మరలినారు.

మేనెల 14-వ తేది శుక్రవారంనాడు స్వామి షికాగోనగరంలో వింటర్మియరు అనుచోట శ్రీరామకృష్ణ వార్షికోత్సవ సమారాధనకై వెళ్లారు. సాన్‌ఫ్రాన్సిస్కోనుండి ప్రబుద్ధానంద స్వాములుకూడ అక్కడికి విచ్చేశారు. అక్కడి సమావేశంలో స్వాము లిద్దఱూ ఉపన్యసించారు. ఇతరులు కొందఱు కూడా ఉపన్యసించారు. మఱుదినం శ్రీ భాష్యానందస్వాములు ఈ స్వాముల నిద్దఱిని మిచిగనులోని వివేకానంద వేదాంతైకాంతమందిరానికి పిలుచుకు పొయ్యారు. అక్కడ మఠభవనం నిర్మించవలసినచోట నేలత్రవ్వకం మనస్వామి జరిపారు, ఆ రాత్రికే సెయింటులూయికి మరలి వచ్చారు.

## అతిథి స్వాములు

మేనెల 16-వ తేది శనివారం మధ్యాహ్నానంతరం షికాగోనుండి శ్రీ ప్రబుద్ధానంద స్వాములు సెయింటులూయీకి విచ్చేశారు. మే 18-వ తేది మంగళవారం సాయంకాలం చావడిలో వారు ఉపన్యసించారు. ఉపన్యాస విషయం : ''నిరంతర భగవత్స్మృతి''. మన స్వామి ఆ స్వామిని సదస్యులకు పరిచయపఱిచారు. సదస్యుల సంఖ్య దాదాపు శతం. మఱునాటి ప్రొద్దునే శ్రీ ప్రబుద్ధానందస్వాములు సాన్‌ఫ్రాన్సిస్కోకు బయలుదేఱి పొయ్యారు. ఇక్కడ ఉన్న మూడురోజులు స్వామికి ఈ ఊళ్లో ఉన్న విశేషాలను చూపడమైనది.

ఆగస్టు నెల 17-వ తేది మంగళవారం నాడు శ్రీమద్రంగనాథస్వాములున్నూ శ్రీ భాష్యానందస్వాములున్నూ సెయింటులూయీకి విచ్చేశారు. సాయంకాలం స్వాము లిద్దఱూ ఉపన్యసించారు. మెట్లు' అనే విషయాన్ని గూర్చి శ్రీ భాష్యానందస్వాములున్నూ 'విజ్ఞానశాస్త్రయుగంలో ఆస్తికధర్మం' అను విషయాన్ని గూర్చి శ్రీరంగనాథానంద స్వాములున్నూ ప్రసంగించారు. ఇద్దఱు స్వాములనుమనస్వామి సదస్యులకు పరిచయ పఱిచారు.

కన్సాసునగర వేదాంత సొసైటిని దర్శించిన తర్వాత శ్రీరంగనాథానందస్వాములు డిసెంబరు 18-వ తేది శనివారం ఉదయం సెయింటు లూయీకి దయచేశారు. మఱుదినం ప్రొద్దున సమావేశానికి ఏర్పాటైనవి. మనస్వామి అతిథి స్వామిని సదస్యులకు పఱిచయపరిచారు. అతిథి స్వామి 'ఆధునికయుగం—యువజనులు' అనే విషయాన్ని గూర్చి ఉపన్యసించారు. నాటి మధ్యాహ్నానంతరం శ్రీ రంగనాథానంద స్వామికై ఒక సన్మానసభ సమావిష్టమైంది.

అక్కడ భక్తులతో మిత్రులతో పత్రికావిలేఖరులతో శ్రీరంగనాథానంద స్వాములు సుదీర్ఘ సంభాషణములు చేశారు. సెయింటులూయీకి ఇది శ్రీరంగనాథానందస్వాములు నాలుగో సారి రావడం.

## అదనపు సమావేశాలు

వివిధ స్కూళ్ళ వారికై చర్చిల వారికై ప్రత్యేకసమావేశాలు ఏర్పాటై జరిగాయి. వాటిలో మూటిని ఈ క్రింద తెలుపుతున్నాం:-

నవంబరు నెల 24-వ తేది బుధవారం నాడు ఇల్లినాయిసు రాష్ట్రంలోని బెల్లవిల్లె అనుచోట నాటర్డాం అకాడెమీకి చెందిన ఎనభైమంది బాలికలు వారి ఉపాధ్యాయినులతో సహా సెయింటులూయికి వచ్చారు. టేప్రికార్డు చేయబడ్డ ప్రసంగాలు వినడంకంటె స్వాములవారితో సమక్షసంభాషణ నెరపాలని వారు కోరారు. వారు తమ ప్రశ్నలను వ్రాసి సమర్పించారు. స్వాములవారు అన్నిటికి సమాధానాలు అనుగ్రహించారు. సమావేశం పగలు 12-30 గంటలనుండి 2 గంటలవఱకు సాగింది.

డిసెంబరు నెల 8-వ తేది బుధవారం నాడు వెబ్‌స్టరుగ్రూవ్సు సీనియరు హైస్కూలు విద్యార్థులు 120 మంది వారి ఉపాధ్యాయులతో గూడి వచ్చారు. టేప్రికార్డు చేయబడ్డ స్వాముల ఉపన్యాసాన్ని విన్నారు, వారు వ్రాసియిచ్చిన ప్రశ్నల కన్నిటికిని స్వాములవారు సమాధానాలు సెలవిచ్చారు.

డిసెంబరు నెల 15-వ తేది బుధవారంనాడు సెయింటులూయి యూనివర్సిటి హైస్కూలు వారు స్వాములవారిని ఆహ్వానించారు. వారి సభామందిరంలో రెండువందలమంది విద్యార్థులు సమావిష్టులై ఉండినారు. వారు వ్రాసి యిచ్చిన ప్రశ్నల కన్నిటికిని, స్వాములవారు సమాధానాలు వ్రాక్రుచ్చారు.

## ఏకాంత సంభాషణలు: ఇతర కార్యక్రమములు

ఆగంతుకులకు ఆధ్యాత్మికోపదేశాభ్యర్థులకు వేలుచిక్కులను విజ్ఞాపించుకో వచ్చిన వారికి దాదాపు మూడువందల యేకాంత సమావేశాలు స్వాములవారు దయచేశారు.

సంయుక్తరాష్ట్రాలలో పెక్కుభాగాలనుండి ఇండియానుండి ఇతరదేశాలనుండి వచ్చిన అతిథుల సేవార్థులసంఖ్య దాదాపు రెండువందలు. వారు అక్కడి పూజాక్రమాలలో పాల్గొన్నారు. స్వాములవారిని ఏకాంతంలో సంధించారు. వారికి విందులు చేయబడ్డాయి. చాలమందికి అల్పాహారవిందులు సమకూర్పబడ్డాయి.

రుసుము చెల్లించినవారికి గ్రంథములు ఎరవిచ్చే గ్రంథాలయం ఒకటి ఉంది. సభ్యులచే మిత్రులచే అది చక్కగా వినియుక్తమైంది.

వేదాంతాన్ని గూర్చిన సచిత్రపత్రాలు చిన్న చిన్న పుస్తకాలు ఉచితంగా పంచిపెట్టబడ్డాయి. కోరినవారికి పోస్టుద్వారా కూడ అందజేయబడ్డాయి.

వెరా మెకచ్చెన్ సెక్రెటరి.

# గ్రంథపరిచయం

## నిర్వచనాంధ్రశ్రీమహాభారతము

రచయిత: విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ. ప్రకాశకులు: బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ, మూడు సంపుటములు. ఒక్కటిగా బైండు చేయబడియున్న మొదటి రెండు సంపుటముల వెల రూ. 25, మూడవ సంపుటము వెల తెలియదు.

మహాభారతపు గొప్పతనాన్ని చెప్పబూనుకుంటే ఆవర్ణనం తానొకమహాభారతమంతటిది ఔతుంది. మహాభారతాన్ని మొదట కవిత్రయంవారు తెలిగించారు. న్యాయస్థానాలలో 'సుప్రీంకోర్టు' స్థానం ఎటువంటిదో బహుళాంధ్రోక్తిమయప్రపంచంలో కవిత్రయస్థానం అటువంటిది. కవిత్రయభారతము ననుసరించి తర్వాత వ్రపదభారత మవతరించింది. ఈ శతాబ్దిలో అవతరించింది శ్రీకృష్ణభారతం. ప.ని పేర్కొన్న భారతానువాదాలు సువిస్తృతములు. నవ్యులు సంక్షేపరసికులు. బృహద్గ్రంథాలు చదవడానికి వారికి బద్ధకం. ఈ అభిరుచి కనుగుణంగా అర్ష కవిశిరోమణి విద్వాన్ బులుసువేంకటేశ్వరులు ఎమ్. ఏ. (ట్రిబిల్) కాకినాడ శ్రీపీఠికాపురరాజ ప్రభుత్వకళాశాలలో ఆంగ్లభాషోపన్యాసకులు భారతాన్ని సంక్షేపించి పదకొండువేలకంటె ఇంచుకే తక్కువైన పద్యాలలో సంతరించి సమర్పించారు. ''సులభము సుందరంబయిన చొప్పున సంగ్రహభంగి నెల్లరున్ దెలిసి పఠించునట్లుగను దేటతెనుంగున వ్రాయఁబూనితిన్'' అనెడి స్వప్రతిజ్ఞను వీ రిందు చక్కగా పాటించారు.

బహుగ్రంథరచయితలు బృహద్గ్రంథరచయితలు అయిన వీరి పద్యరచనాభ్యాసం అతివిస్తారం. ఐతే అంతటి అభ్యాసానికి నేరిమి ఓరిమి ఆవశ్యకాలు. వీరికి నేరిమికి కొదువ ఎప్పుడూ లేదు, ఓరిమికిమాత్రం అక్కడక్కడ రవంత హ్రాసం కనిపిస్తుంటుంది. పద్యం కుదిరిన రీతి అర్థానికి అత్యనర్థకరంగా ఉండినా సరిపెట్టే ఓరిమి వహించక అట్లే వదలిపెట్టుతుంటారు. 'ఏకోదర' 'సోదర' 'తోబుట్టు' శబ్దములు అన్నలకు తమ్ములకు ఉమ్మడివాచకాలుగా చెల్లుతాయి. 'అగ్ర' 'జానుజ' శబ్దములు అట్లు కావు. అగ్రజశబ్దం అన్నకే కాని తమ్మునికి వాచకం కాదు; అనుజశబ్దం తమ్మునికే కాని అన్నకు వాచకం కాదు. కీచకుడు తమ్ముడు, విరాటునిభార్య, కీచకునికి అక్క. ఆమెతో కీచకుడు చెప్పే వాక్యం బులుసువిరాటపర్వం పుట 243, (పద్యసంఖ్య 2534) ''పాసెద ప్రాణము లొండుమాట లో యనుజ సహింప లేను''. 'న'ప్రాసనిర్బంధకారణంగా 'అక్క'ను కీచకునిచే 'అనుజ' అనిపించారు. మఱొక్క ఉదాహరణం. వాసుకికి జరత్కారువు చెల్లెలు. అతనిని జరత్కారువునగ్రజుడు అనవలెను. కాని బులుసుగారు 'న'ప్రాస నిర్బంధంచేత 'జరత్కారువునసుజుడు వాసుకి' (స్వర్గారోహణపర్వం 133వ పద్యం) అన్నారు. గ్రంథాంతరోదాహరణం — వేణీసంహారంలో కర్ణుని గూర్చి గాంధారీధృతరాష్ట్రులతో దుర్యోధనుడు పలికే వాక్యం ''పుత్రస్తవామ్బ, తవ తాత నయైకశిష్యః''. దీని కర్థం ''అమ్మా, నీ పుత్రుడు, నాయనా నయంలో (=నీతిలో) నీ ముఖ్యశిష్యుడు'', ఈ గీటుకు వడ్డాది సుబ్బరాయడుగారి అనువాదం ''తల్లి, నీ కుమారుఁ, దండ్రి. నీ నయశిష్యు'', బులుసు తెలిగింపు: ''మాత భవత్సుతుఁ, డోయి తండ్రి నీ గదకును గూర్మిశిష్యుఁడు''. ఇది ''ద''ప్రాసపరవశతచేత కుదిరిన వక్కణం. నాసహాధ్యాయి శ్రీ మొసలి

కంటి శ్రీనివాసశరచ్చంద్రకుమారుడు, పరీక్షకు పాఠ్యంగా ఉండిన యీ నాటకం చదువుతూ "నీగదకునుగూర్మిశిష్యు" డంటే అర్థ మే మని బులుసుగారికే ఉత్తరం వ్రాశారు. "ధృతరాష్ట్రుడు కర్ణునికి గదాయుద్ధం నేర్పాడు" అని బులుసుగారు సమాధానం వ్రాశారు ఇది కుంటి సమాధానం అని గుర్తించిన మా శరత్తు "ధృతరాష్ట్రుడు పదివేలమదపుటేనుగులబలం కలవాడైనా, అంధు డవడంచేత ఆయుధవ్యవహారం భారతంలో అతనికి చెప్పబడలేదు. పైగా అతడు ప్రభువు. గదాయుద్ధం నేర్చుకుందుకు తనకుమారుడైన దుర్యోధనుని బలరామయ్య ఇన్‌స్టిట్యూట్టులో చేర్చి. తనకారు డ్రైవరు కుమారుడైన కర్ణునికి గదాయుద్ధం తాను నేర్పాడా? ఒకవేళ నేర్పినా, కర్ణుడు ధృతరాష్ట్రుడికి శిష్యు డౌతాడే కాని గదకు శిష్యు డౌతాడా" — అని తత్త్వనిరూపకమైన ప్రత్యుత్తరం వ్రాసి ఊరకున్నాడు. పీఠికలో గ్రంథకర్తగారు 6 వ పుట 9 వ పంక్తిలో 'ఛందోక్లేశ' మను మాటను ప్రయోగించారు. 'ఛందఃక్లేశ' మనుట సాధురూపము. కఖపఫల ముందు విసర్గం లుప్తం కాజాలదు.

విరామచిహ్నముల వినియోగాన్ని గురించి ఒక్కమాట — వాక్యపూర్తిని తెలిపే గుర్తు చుక్క (ఫుల్‌స్టాప్) వాక్యం ముగిసింతర్వాత పెట్టవలసింది. ఆ వాక్యం ప్రశ్నార్థక మైతే, చుక్కస్థానంలో ప్రశ్నార్థకచిహ్నం ఉంచాలి. మధ్యలో ప్రశ్నార్థకచిహ్నం ఉంచరు. ఈ విరామచిహ్నల వినియోగం ఆంగ్లవిద్యాదుపజ్ఞం. అనధిగతాంగ్లసంప్రదాయులు (అ) "రాముఁ డెవరి? కుమారుడు." అని వ్రాస్తారు. అధిగత తత్సంప్రదాయులు (ఆ) "రాముఁ డెవరికుమారుఁడు?" అని వ్రాస్తారు. ఆంగ్ల భాషోపన్యాసకుల ద్రోణపర్వంలో (పుటలు 114-6; పద్యములు 329-345). హోడరాజచరిత్ర ప్రతిపాదకపద్యములలో పైని (అ) అని గుర్తిడబడినవాక్యము ననుసరించి ప్రశ్నార్థకచిహ్నమిడబడి ఉన్నది. ఈలాంటి 'బాహ్యాలు' పోతే, ఆంతరమైన విషయం విశ్వోపజీవ్యం. ఈనిర్వచనాంధ్ర శ్రీమహాభారతాన్ని అందఱూ చదివి పరమనిర్వృతి నందవలె నని మా ఆశంస.

## అద్భుతరామాయణము

కర్త: కవిహంస వేదుల వేంకటశాస్త్రి గారు, ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. పుటలు 298. వెల రూ. 5-00.

శ్రీమద్వాల్మీకికృతముగా ప్రశస్తమైన అద్భుతరామాయణానికి గద్యపద్యాత్మకమైన ఆంధ్రానువాదం ఇది. చతుర్వింశతిసహస్రశ్లోకపరిమితమై భూలోకమున ప్రచారములోనున్న రామాయణములో లేనివియు శతకోటివిస్తృతమై బ్రహ్మలోకమున ప్రచారములో నున్న రామాయణములో నున్నవియు నగు పెక్కుకథాంశము లాశ్చర్యకరము లిందు పొందుపడి దీని 'యద్భుత' విశేషణమును సార్థకం చేస్తున్నాయి. సహస్రకంఠరావణుని సంహరించిన సీతాదేవీమహిమయు ఆమె స్తోత్రాలును ఈ రామాయణంలోని ప్రకృష్టాంశములు. శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారి అనువాదవిధానం శ్లాఘ్యంగా ఉన్నది. రామసారస్వతానికి మహోజ్జ్వలాలంకారమైన యీ రామాయణానికి స్వాగతం.

ప్రభాకర్.

14-1-'74 సోమవారము శ్రీ వివేకానందస్వామి జన్మదినోత్సవము.
భజరంగోత్సవము ఆదివారము 20-1-74.

# శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీ రామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శయోగినియు, ఆదర్శమాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేటతెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 3-00

# అనుష్ఠాన వేదాంతము

అనువాదకులు : కీ॥ శే॥ తత్త్వానందస్వాములవారు

ప్రపంచమున వివిధరంగములందు విహరించువారికి వేదాంతమెటుల అనుష్ఠానయోగ్యమో కండ్లకుగట్టినటుల శ్రీ వివేకానందస్వాములవారీ యుపన్యాసములందు స్పష్టీకరించి యున్నారు.

(129+6 పుటలు) తృతీయ ముద్రణము వెల : రూ. 1-25

# "భారతయువజనులారా!"

అనువాదకులు :

కీ. శే. తత్త్వానందస్వాములవారు

భారతయువజనులను ప్రబోధించి శ్రీ వివేకానందస్వాములవారొసగిన ఉపన్యాసముల సంపుటీకరణము! ఒక్కొక్క ఉపన్యాసము భావగాంభీర్యము గలిగి యలరారుచున్నది.

274 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము : వెల : రూ. 3-00

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(121+4 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

**నేడే కొనండి** **పదే పదే చదవండి !!**

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహము హృదయ సన్నిహితమునైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందఱికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-50 | శ్రీ కృష్ణవాణి | 0-50 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-50 | బుద్ధ ఉవాచ | 0-50 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-50 | క్రైస్తు సూక్తిమాల | 0-50 |

మహమ్మదు సూక్తిమంజరి 0-50

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీ వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు,

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ సోంటూరి భక్త
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు)